# కథాసరిత్సాగర - బృహత్కథా మంజరీ బృహత్కథా శ్లోక సంగ్రహాలలో కథావిషయాది పరిశీలనము

## ద్వితీయ భాగము





డా॥ కె. సూర్యనారాయణ రెడ్డి

# కథాసరిత్సాగర - బృహత్కథా మంజరీ
# బృహత్కథా శ్లోక సంగ్రహాలలో
# కథావిషయాది పరిశీలనము

## ద్వితీయ భాగము




డా॥ కె. సూర్యనారాయణరెడ్డి

ప్రథమ ముద్రణము : 1995

ప్రతులు : 1000

వెల : రూ. 50-00




స్వాతి పబ్లికేషన్స్
18-1-546, భవానీ నగర్
తిరుపతి




This book is published with the financial assistance of Tirumala - Tirupati Devasthanams undertheir Scheme "Aid to Publish ReligiousBook

Printed at :
**Sri Satya Sai Printers**
TIRUPATI

ఆచార్య కె. సర్వోత్తమరావు
తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

## దీపిక

డా॥ కె. సూర్యనారాయణరెడ్డి నేనూ శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల, తిరుపతిలో 1968-74 దాకా సహోపాధ్యాయులం 1974 లో నేను శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకునిగా చేరడం 1075-76 లో కె. సూర్యనారాయణ రెడ్డి ఆర్ట్సు కళాశాలకు బదిలీకావడం కాకతాళీయం. మేము ఔద్యోగికంగా భిన్న కళాశాలలో ఉన్నా తరచూ కలుసుకోవడం, ముచ్చటించు కోవడం 27 ఏళ్ళ నుండి సాగుతున్న వ్యవహారమే. ఆ పరిచయంతో, స్నేహంతో డా॥ సూర్యనారాయణరెడ్డి సిద్ధాంత గ్రంథానికి నాలుగు మాటలు వ్రాయాలనిపించింది.

శ్రీ రెడ్డిగారు "కథాసరిత్సాగర - బృహత్కథామంజరీ - బృహత్కథా శ్లోక సంగ్రహాలలో కథావిషయాది పరిశీలనము అనే అంశాన్ని పిహెచ్.డి. పట్టాకోసం ఎన్నుకున్నప్పుడు డిగ్రీ సాధిస్తారని నాకు నమ్మకం వుండేది. ఆ నమ్మకం కలగాక నిజం కావడం విశేషం.

సంస్కృతంలోనూ, తెలుగులోనూ కథాకావ్యాలెన్నో ఉన్నాయి వాటిలో బృహత్కథ, ఈమ్మమ్మ మర్రిమాను లాంటిది. ఈ గ్రంథం ఎన్నో గ్రంథాలకు ప్రేరకం, ఎన్నో గ్రంథాలకు ఆధారం, ఎన్నో కథల ఊడల ఊతం. ఈ గ్రంథ పరిశీలన చేయడం చాలా కష్టమైన అంశం. అయినా రెడ్డి కృతకృత్యులయ్యారు. కేవలం బృహత్కథనే కాకుండా కథా సరిత్సాగరం, బృహత్కథా మంజరి బృహత్కథా శ్లోక సంగ్రహం అనే గ్రంథాలను కూడా స్వీకరించి కావ్యత్రయాన్ని పరిశీలించడం ప్రశంసాహర్హమైన అంశాలు.

సిద్ధాంత గ్రంథాలు అనేక రకాలు. ఒకప్పటి సిద్ధాంతత గ్రంథాలలు విషయ సేకరణకే ప్రాధాన్యముండేది. మరికొన్ని సిద్ధాంత గ్రంథాలు అన్నింకంటే అదరువు లెక్కువ' అనే రకంగా వుంటాయి యింకా కొన్ని ఖూరుగవత్తి మూట లాంటివి. కొన్ని విషయానికి సిద్ధాంతానికి సమాన ప్రాధాన్య మిచ్చేవి. డా॥ రెడ్డిగారి సిద్ధాంత వ్యాసం ఈ కోవకు చేరిందని నా అభిప్రాయం.

ఒకే కథను భిన్న వ్యక్తులు వ్రాసినప్పుడు భేదాలు రావడానికి కారణాలను రెడ్డిగారు చాలా బాగా వింగడించారు. మత, రాజకీయ, సాంఘిక, సంస్కృతీ భేదాలు, కాలభేదంకూడా కారణమని విశ్లేషించి నిరూపించారు. ప్రత్యేకించి కవి దృక్పథం కారణమని స్పష్టంగా నిర్దేశించారు.

పురాణాలు కానివ్వండి. ఇతిహాసాలు కానివ్వండి, కథా కావ్యాలు కానివ్వండి, ఇవ్వన్నీ మన ప్రాచీన హైందవ సంస్కృతిని యథావిధిలో ప్రతిఫలించేవి. ఈరోజుల్లో సాంస్కృతిక అధ్యయనం, విద్యాభ్యాసముతో ప్రత్యేకంగా పరిశీలించే అంశం. ఈకారణంగానే తిరుమల తిరుపతి దేవస్థానంవారు రెడ్డిగారి సిద్ధాంత గ్రంథానికి ఆర్థికసహాయం అందజేశారు కూడా.

ఈ గ్రంథం వెలుగులోకి రావాలని పండితులు, పరిశోధకులు మెచ్చుకోవాలని ఆకాంక్ష. కేవలం సంస్కృతి సాహిత్య పరిశీలకులకే గాకుండా అందరికి అమూల్య కథాంశాలను ప్రసాదించే దీపిక,

కె. సర్వోత్తమరావు.

డి. నాగసిద్ధారెడ్డి
రిటైర్డ్ ప్రిన్సిపాల్, యస్.వి.ఓ. కాలేజ్,
18-1-83, కె.టి. రోడ్, తిరుపతి-517 507.

## పరిచయము

కథాకావ్యాలు అనగానే ప్రప్రథమంగా స్మతికి తగిలేది బృహత్కథ ప్రాకృతి భాషాభేదమైన పైశాచిలో గుణాఢ్య పండితునిచేత వ్రాయబడిన ఈ గ్రంథం పంస్కృతములోని బేతాళ పంచ వింశతి పంచతంత్రాది అనేక కథాకావ్యాలకు కన్నతల్లి మాళవికాగ్ని మిత్రం అభిజ్ఞానశాకుంతలం, స్వప్నవాసవదత్త, కాదంబరి మున్నగు నాటక కావ్యమూలపై దీని ప్రభావం అధికంగా కనబడుతుంది. శాతవాహన చక్రవర్తులలో ఒకడైన హాలుని (క్రీ॥ శ॥ ప్రథమ శతాబ్దం) కాలం నాటివాడని అధిక సంఖ్యాక సాహిత్య విమర్శకులచే నిర్ణయించబడిన ఈ బృహత్కథ అలభ్యం కావడం జాతిచేసికొన్న దురదృష్టం దీనిని బృహత్కథాశ్లోకసంగ్రహం (28 సర్గలు 4524 శ్లో) అనేపేరుతో క్రీ॥శ॥ 8 వ శతాబ్ది వాడైన బుదస్వామి బృహత్కథామంజరి అను పేరుతో (11వ శతాబ్దం) క్షేమేంద్రుడు కథాసరిత్సాగరము అనుపేరుతో (18లంబకములు 124 తరంగాలు 22000 శ్లో) సోమదేవుడు (క్రీ॥శ॥ 1080) పంస్కృతములోని కనువదించారు.

ఈ మూడు పుస్తకాల్ని సమీకరించి డా॥ కె. సూర్యనారాయణ రెడ్డి, పిహెచ్.డి. పట్టాకోసం కథాసరిత్సాగర - బృహత్కథామంజరి బృహత్కథాశ్లోక సంగ్రహాలలో కథావిషయాది పరిశీలనము అనే సిద్ధాంత వ్యాసాన్ని తులనాత్మక పద్ధతిలో రచించి డాక్టరేట్ పట్టాను

పొందారు. కథావిషయాదుల మీద కావ్యలక్షణా దృష్టితో మూడు పుస్తకాల్ని సమతుల్యంగా పరిశీలించిన గ్రంథం ఇది తప్ప వేరొకటి కన్పడదు. సంస్కృత వాఙ్మయంలో కథాసాహిత్య చరిత్ర, కథా వస్తువులో కన్పడే సామాన్య వైషమ్యాల పరిశీలనం, కవితా వైశిష్ట్యం రసాలంకార పాత్రపోషణ, సామాజిక సాంస్కృతిక దృష్టి, వర్ణనా వైశద్యం, సూక్తి విన్యాస పరిశీలన మున్నగు విషయాల్ని మాత్రమే కాక కథానిర్వచనం, కథకు ఆఖ్యాయికకు గల భేదం, కథా సాహిత్య వికాస పరిణామాలు మున్నగునవి సైతం సునిశిత పరిశీలనా దృక్పథంతో చర్చింపబడ్డాయి. పండితుల మధ్య ఏకాభిప్రాయం లేని గుణాఢ్య పండితుని కాల జన్మనివాస స్థానాదుల్ని నిర్ణయించడంలోను బృహత్కథను పరిచయం చేస్తూ గుణాఢ్య పండితుని పాత్ర పోషణ నైపుణ్యాన్ని వివరించడంలోను బుధస్వామి, క్షేమేంద్ర, సోమదేవుల కాలంనాటి సామాజిక పరిస్థితుల్ని దృశ్యమానం చేయడంలోను రచయిత పరిశీలనాదక్షత ప్రస్ఫుటమవుతుంది. పై కవుల కాలంనాటి రాజకీయ ఆర్థిక సాంఘిక చరిత్రను సోదాహరణంగా వివరించడమేకాక పై గ్రంథాల్ని సాహిత్యపరంగా విశ్లేషించిన పద్ధతి మిక్కిలి ప్రశంసార్హం. ఒకమాటలో చెప్పాలంటే ఈ గ్రంథం ద్వారా పాఠకుడు గుణాఢ్యాదుల కాలంనాటి సమాజాన్ని అన్ని కోణాల్లోను తిలకించవచ్చు. డా॥ కె. సూర్యనారాయణ రెడ్డికి గల ప్రతిభావ్యుత్పత్తులు ఈ గ్రంథములో చక్కగా ప్రస్ఫుటమవుతాయి. నాకు అత్యంత ప్రీతిపాత్రుడు శిష్య మిత్రుడైన డా॥ రెడ్డి చక్కని గ్రంథాన్ని సాహితీలోకానికందించడం నాకెంతో గర్వకారణం. ఈ గ్రంథాన్ని గూర్చి పరిచయంచేసే అవకాశం నాకు కల్గించినందుకు సంతోషిస్తున్నాను.

— డి. నాగసిద్ధారెడ్డి

## —: క్షేమేంద్రముని ప్రార్థనా శ్లోకములు :—

——::——

ఉమా ప్రణామ సంక్రాంత చరణాలక్తకః శశీ ।
సంధ్యారుణ ఇవాభాతి యస్యపా యత్సవః శివః ॥

సానంద నంది హతపుష్కర నిర్భరాణి
హేరంబకంఠహసి తాని చిరంజయన్తి ।
కుర్వంతియాని ఘనశంకి కుమారబర్హి
స్మైత్త్రైర్వి చిత్రరుచి భాంజి దిగంతర రాణి ॥

లలాటలోచన చనం పాయాత్వ దీప్తంత్రిపురద్విషః ।
కుమార రక్షాసిం దూరం వితరన్కిరణైరివ ॥

త్వంగదంగ ముదంచదిందు శకలం వేల్లత్కపాలా కులం
పాయాద్వపిశ్వ సదంగదోరుభుజగం చండీపతేస్తాండవమ్,
యస్యోద్భ్రాంత భుజప్రబంధవల నాతోత్పలసత్సాగర
స్ఫారాంభః పటలైః పురం పటమివాసక్తం సమాతన్వత ॥

దేవోభవః సభవతాంభవతాద్వి భూత్యై
యాస్యావహంత్యసితభూషణ భోగిభోగః ।
నేత్రనలా కలితకాలక లేబరోత్థ
పర్యత్సుధూమపటలీవలనా వినోదమ్॥

భ్రూలేఖాధనురానతం విచలితోలీలా కటాక్షఃశరో
హాసస్తత్యితపుంఖ పక్షరచనా మౌర్వీచనామౌర్వీచపక్షభవిః ।
క్రేంకారః కలపంచ మాత్రయివచో యస్యోత్థమానూత్ర్యతే
జైవం శత్రమనారతం యువతిభిః కామాయ తస్మైనమః

హేతవే సర్వసిద్ధీనాం కల్మష క్షయ కేతవే
భవనాబ్ధిసేతవే తుభ్యం నమోస్తు వృషకేతవే॥

సువర్ణగిరి కర్ణకే కరలతారకా కేసరే
చలజ్జల దషట్పదే స్ఫుటదిగంత పత్రాస్త్రృతే।

సవః ప్రమథనాయకః ప్రదిశతు శ్రియం యత్కరః
కరోతి జగదంబుజే చలితతాలలీలోయితమ్॥
గౌర్యాద్యూత జలానీతా కర్ణే కేతశేతకిపత్రతాం।
శాంభవీవః శశికళా భూయాదానంద సంపదే॥

అనంగేనాబలా సంగాజ్జితా యేన జగత్రయీ।
సచిత్రచరితః కామః సర్వకామ ప్రదోస్తువః॥

జాన్హవీ ధూర్జటి జటాకుంద మాలాపునాతువః।
రాజహంస శ్రియంధత్తే యేద్వారీవలయే శశీ॥

వల్గత్కాళీ కటాక్షావలి కలిత భవస్ఫారహారాహిరాజ
స్ఫూర్జద్దంష్ట్రాగ్రధూమభ్రమ మలిన భవత్ర్యంబకస్యైకకంఠః॥

భూత్యైవః క్షిప్తకర్ణం ప్రణయికర ధృతః కేకిపిచ్ఛాభిరామై
ర్గౌరీ లీలా కిరాతీభవతి పునరేవ ప్రేషి భిర్యన్మయూఖైః।
నమోస్తుభావనా మాత్రనానావర్ణ విధాయినే
త్రభువిచిత్రకృతే లక్ష్మత్రైలోకాశ్చర్య కారిణే॥

పాయాద్వోదయితా కేలికోపే శంభోః ప్రణామనః।
చంద్రరేఖానిషక్తేవత్ప్రసాద స్మితచ్ఛటా॥

అనంగీకృత కామాయ నమో వామార్ధధారిణే।
శివాయాశ్చర్య రూపాయ నిష్కళాపాయ కళాభృతే॥

నవకుచకాంచన కలశాః ప్రోటీ సింహాసనాః స్మితఛత్రాః ।
అభిషేకాయ తరుణ్యోయస్యన మకరధ్వజోయతి ॥

సుభగావిభ్రమమోదాన్తంత భ్రూవిలాసచలాః శ్రియః
ఆకల్పం స్థిరతాం యాంతియద్వరాత్సశివోస్తువః ॥

సరస్వతీ విభ్రమ దర్పణానాం సూక్తామృతక్షీరమహోద ధీనాం।
సన్మానసోల్లాస సుధాకరణాం కవీశ్వరాణాం కవీశ్వరాణాం
జయతి ప్రకర్షః ॥

—⁂—

# కృతజ్ఞతలు

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ సంస్కృత శాఖలో పరిశోధన చేయుటకు అనుమతించి నాకభీష్టమైన పరిశోధనాంశమును సూచించి నా ప్రార్థనపై పర్యవేక్షకులుగా నుండుటకు అంగీకరించి పరిశోధన విషయంలో ఆద్యంతము తగిన సలహాలనిచ్చి సిద్ధాంతవ్యాస నిర్మాణ మునకు సంపూర్తిగా సహకరించిన సంస్కృత శాఖాధ్యక్షులు ప్రొఫెసర్ శ్రీ వి. ఆంజనేయశర్మగారికి పరిప్రధమముగా హార్ధిక కృతజ్ఞతాంజలిని సమర్పించుకొనుచున్నాను.

అడిగిన వెంటనే నాపై ఆదరాభిమానములతో ఈ గ్రంథముపై అభిప్రాయమును వ్రాసియిచ్చిన తెలుగు అధ్యయన శాఖలోని మిత్ర వర్యులు ప్రొఫెసర్ కే. సర్వోత్తమన్‌గారికి గురువరేణ్యులు శ్రీ డి. నాగసిద్ధారెడ్డి (రిటైర్డు ప్రిన్సిపాల్, ఎస్. వి. ఓ. సి.) గారికి కృతజ్ఞతా సుమాంజలులు.

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం అందించిన తిరుమల-తిరుపతి దేవస్థానము యాజమాన్యమునకు విశేషించి టి. టి. డి. బోర్డు చైర్మన్ పూజ్యులు శ్రీ ఎ. చెంగల్‌రెడ్డిగారికి, రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠము వైస్‌ఛాన్సిలర్ ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్యులు గారికి ఫ్యాకల్టీ డీన్ ప్రొఫెసర్ జి. నాగేశ్వరరావు గారికి నా కృతజ్ఞతాభివందనములు.

ఈ పరిశోధనా వ్యాసంగములో, పుస్తక ప్రచురణలో నాకు తోడ్పడిన పరిశోధక విద్యార్థులు, మిత్రులు, టి. చంద్రయ్య, సి. శివ శేఖర్‌రెడ్డికి పుస్తకమును సకాలములో ముద్రించి యిచ్చిన శ్రీ సత్య సాయి ప్రింటర్సు వారికి నా కృతజ్ఞతలు.

— కె. సూర్యనారాయణ రెడ్డి

—: విషయసూచిక :—


4.3.2. కథాసరిత్సాగరములో సామాజిక జీవనము 1

4.3.3. వివాహమహత్వ స్వరూపములు 23

4.3.4. కథాసరిత్సాగరములో రామకథ 31

4.3.5. కథాసరిత్సాగరములో రాష్ట్రపాలనము 36

4.3.6. కథాసరిత్సాగరములో భౌగోళిక పరిస్థితి 51

4.3.7. కథాసరిత్సాగరములో స్త్రీకి గల స్థానము 69

4.3.8. కథాసరిత్సాగరము-సంస్కృతి వైశిష్ట్యము - విద్యాశిక్షణ పద్ధతి 83

4.3.9. కథాసరిత్సాగరములో కనబడు మతాధిక్య ప్రదర్శనము 101

4.3.10. కథాసరిత్సాగరములోని ధర్మములు 105

4.3.11. కథాసరిత్సాగరములో వివాహములు 119

4.3.12. కథాసరిత్సాగరము-ఆభూషణములు-ప్రసాదన సామాగ్రి-క్రీడా వినోదములు-గోష్ఠులు-ఉత్సవములు 130

పంచమ ప్రకరణము

5. కథాసరిత్సాగర-బృహత్కథామంజరీ-శ్లోక సంగ్రహములతో సమాన కథలు - భిన్న కథలు (గ్రంథత్రయములో సామ్యవైషమ్యములు) 153

5.1. కథాసరిత్సాగర-బృహత్కథామంజరీ-శ్లోకసంగ్రహ కథల తులనాత్మక పరిశీలనమున అభివ్యక్తములగు ప్రధానాంశములు 164

5.2. బృహత్కథామంజరి-కథాసరిత్సాగర కథలలోని భేదములు 172

5.3. కథాసరిత్సాగర-బృహత్కథామంజరీ-శ్లోకసంగ్రహము లలోని కథావిషయ సంక్షిప్త ప్రదర్శన సూచిక-గ్రంథత్రయములో నరవాహనదత్తుడు వివాహామాడిన కన్యలు 179

5.4. ఉదయన నరవాహనదత్త కథ-కథాసరిత్సాగరము కథాక్రమసంఘటన సమావేశము 190

షష్ఠప్రకరణము

6. సాహిత్య విమర్శ

6.1. బృహత్కథా శ్లోకసంగ్రహ-బృహత్కథామంజరీ-కథాసరిత్సాగర సూక్తులు—ఒక పరిశీలనము 211

6.2. కథాసరిత్సాగర-బృహత్కథా శ్లోకసంగ్రహ-బృహత్కథామంజరీ కావ్యములలో రసాలంకరణపోషణ 221

సప్తమ ప్రకరణము

7. ప్రపంచ సాహిత్యముపై బృహత్కథా ప్రభావము 248

అష్టమప్రకరణము

8. ఉపసంహారము 271

పాదసూచికలు

ఉపయుక్త గ్రంథసూచి 281

# కథా సరిత్సాగర - బృహత్కథా మంజరి - బృహత్కథా శ్లోక సంగ్రహాలలో కథా విషయాది పరిశీలనము

## ద్వితీయ భాగము

### చతుర్థ ప్రకరణము - ద్వితీయ భాగము

#### కథాసరిత్సాగరములో - సామాజిక జీవనము

కథాసరిత్సాగర కాలమునాటి సామాజిక జీవనము బహువిధ దృష్టిచే పరిశీలించినచో చాలా మహత్త్వపూర్వమైనదని చెప్పవచ్చును. ఆనాటి వరకు సమాజము నిశ్చిత రూపములో ప్రవర్తిల్లు చుండెను. వైదిక యుగముయొక్క వైయక్తిక స్వాతంత్ర్యము సమాజహితము కొఱకు క్రమముగా నియమ బద్ధముగా నుండెను. పరంపరాగత మైన సామాజిక నియమనిబంధనలు అందరూ తప్పనిసరిగా పాటించ వలసి యుండెను. జనసంఖ్యా వృద్ధిచే సమాజములో సంశ్లిష్టత ఏర్పడెను. నవీన సాంస్కృతిక చైతన్య పరంపర వల్ల వచ్చినరూఢ వాది సమాజ మధ్యములో కలహములు మొదలైనాయి. ప్రాచీన సంస్కారమువలన జనసముదాయము నవీన సౌకర్యవాది ప్రయోగ మును స్వీకరించుటలో సంశయగ్రస్తముగా నుండెను. యుగాధారా

నుకూలమైన ప్రాచీన సామాజిక నియమ నిబంధనలతో కథాసరిత్సాగర మంతయు వ్యాపించి యుండెను. స్వేచ్ఛా మనోవృత్తి గల వారి సంఖ్య దినదినాభివృద్ధి నొందు చుండెను. ఈ ప్రాచీన నవీన సాంస్కృతిక సంధ్యావేళలో చిత్రవిచిత్ర మానవ ప్రవృత్తి గల మనోరంజకమైన కథలు, నిజ జీవితములోని యథార్థములను చక్కగా ఈ గ్రంథమునందు బహిర్గతము చేయుచున్నవి.

ప్రారంభము నుండి అనేక పరివర్తనములు కనబడుచున్నవి. ఆర్య సముదాయము ఉన్నత సామాజికనియమములతో కూడి యుండెను. వేద కాలీన సమాజము తాత్కాలికమైన సుఖప్రాప్తికి విముఖమై ఔదార్యమైన వికాసాత్మక దృష్టిలో నుండెను. భౌతిక సాఫల్యముచే ఆధ్యాత్మికతలో కూడ మిక్కిలి బలమును ప్రదర్శించు చుండెను. సామాజిక వ్యవస్థకు, జ్ఞానము, త్యాగము, సేవ, తపస్సు, ప్రణయము ఆధార భూతములుగా నుండెను. నైతికతయే ఆర్యులకు సామాజిక జీవనాధారముగా నుండెను.

వైయక్తిక జీవనములో ఈ గుణముల ననుసరించి సదాచార పాలనయే సామాజిక ప్రధాన వ్యవస్థకు ఆధారముగా నుండెను. 11వ శతాబ్దము వరకు ఉదాత్త సిద్ధాంతములలో సరళ స్వభావ స్థానమును జటిలత, కృత్రిమత చోటు చేసుకొనెను. వాస్తవికత, సత్య జిజ్ఞాసాకాంక్ష నశించి పోయెను. శ్రద్ధా విశ్వాసములకు స్థానము లేకున్ననూ మంత్ర, తంత్ర, హోమ, ప్రభావము అధికముగా నుండెను. జీవన మూల్యము ఆధ్యాత్మికతను వదలి బహిర్ల ప్రధానమయ్యెను. ఇంద్రియ సుఖము ప్రధానమయ్యెను. దీనివల్లన నైతిక మూల్య గతికవరోధము ఏర్పడెను. దీని ఫలితముగా ప్రాచీన విలువ

అప్పై ఆనాడు తీవ్ర విద్రోహ భావన విశేషముగా వ్యాపించెను. దీని ప్రభావ మంతయు కథా సరిత్సాగరమున స్పష్టముగా కనవడును.

ఈ గ్రంథమున అనేకచోట్ల ధర్మము వలన ధర్మార్జనము, ఔదార్యము, త్యాగము, బలిదానము, ఇంద్రియ నిగ్రహము మరియు దేవబ్రాహ్మణార్చన సంబంధములగు అనేక ఉపాఖ్యానములు కనబడుచున్నవి. మరికొన్ని చోట్ల అర్థలోలుపత, లంపటత, కృతజ్ఞత, వేశ్యల భిన్నభిన్న జీవన విధానము ఆ యుగ వైశిష్ట్యముగా నుండెను. వైదిక దేవతలను గూర్చి, భూత, బేతాళ, కాపాలిక, సిద్ధ సంబంధమైన అనేక కథలు కనబడుచున్నవి. ఆర్ష వివాహముల కంటె గాంధర్వ వివాహములే శ్రేష్ఠములనెడి భావన ప్రజలలో వ్యాప్తమయ్యెను. వర్ణ వ్యవస్థా కాఠిన్యములో కూడా అవస్థోల్లంఘనము కనబడుచున్నది. ఇట్లు కథా సరిత్సాగరమున వర్ణింపబడిన కథలలో ఆ కాలము నాటి సామాజిక చైతన్యము స్పష్టముగా ప్రతిబింబించుచున్నది.

10-11వ శతాబ్దము కాలమునాటి సమాజము చతుర్విధ వర్ణములతో నుండెను. కానీ ప్రాచీన కాలమున కూడా ప్రతిలోమ జాతి వివాహములు నిషేధింపబడలేదు. ఆ వివాహములపై సమాజములో గౌరవ దృష్టి యుండెను. కథా సరిత్సాగరమున పాటలీపుత్ర నివాసి పౌండ్రవర్ధన నగర కన్యను వివాహమాడెను. ఆమె హీనకులస్థురాలైననూ ఎట్టి ఆశ్చర్యము కళ్యాణమున వ్యక్తము కాలేదు. వ్యవసాయము జాత్యా శ్రేష్ఠముగా లేదు. బ్రాహ్మణులు కూడా మల్లయుద్ధము చేయుచుండిరి. బ్రాహ్మణ వీరవరుడు రక్షణోద్యోగమునుకూడా చేయుచుండెను. భారతదేశమున మహమ్మదీయులు ప్రవేశింపక పూర్వము

హర్షవర్ధనుని రాజ్యకాలమున గల సామాజిక విశేషములే కథా సరిత్సాగరమున ప్రతిబింబించును. హర్షుని తర్వాత రాజపుత్రు లనెడు విశిష్ట క్షత్రియ వర్గము భారతీయేతిహాసమున ప్రాదుర్భవించెను.

శిరోవ గుంఠనమును తొలగించుట ఈ యుగ వైశిష్ట్యము. రాజ భవనములలో రాణులు నివసించుటకు అంతఃపుర వ్యవస్థ యుండెను. అందు పురుష ప్రవేశము నిషేధింపబడి యుండెను. సామాన్య స్త్రీలు శిరోవ గుంఠనమును ఉపయోగించెడివారు కారు. ఒకానొకడు తన భార్యను మిత్రునకు చూపించెను. "ప్రదృశ్యంతే నదారాశ్చ కైతవం తన్న సౌహృదం" అనగా మిత్రునకు స్వపత్నీ దర్శనమును నిషేధించినచో కపటమే యగును. సమాజములో కఠోర దండ విధానమున్నను చోరులు, హంతకులు, దూర్త సన్యాసులు మొదలగు సమాజ విరోధులుకూడా కనబడుచుండిరి. "ద్యూతము వినాశకారి అని తెలిసినను వేదపారులైన బ్రాహ్మణులు మొదలుకొని సామాన్యుల వరకు ద్యూతాసక్తి కనబడుచున్నది." 1 ద్యూత ప్రస్తావన అనేక కథలలో కనబడుచున్నది. ద్యూతక్రీడలో వైరుధ్యము ప్రదర్శించినచో గృహమున ద్యూతకారులు తమ భార్యలను కూడా పీడించుచుండిరి. భార్యలు ద్యూతకారులైన తమభర్తలను నిందించెడివారు. "యోవ్యద్య ద్యూతకళాంవేత్తి తస్యహస్త గతోనిధిః" అని ఒకానొకడు పలుకును. ఆ విశ్వాసముతోడనే అనేకులు ద్యూతక్రీడలో పాల్గొనుచుండిరి. వైదిక యుగము నుండి ద్యూతక్రీడ ప్రవర్తిల్లు చున్నది. ద్యూతములో పరాజితుడైన వాని కష్టాలు చెప్పసాధ్యము కానివి. వేద పాఠియైన దేవదత్తుడనే బ్రాహ్మణుడు ద్యూతములో సర్వధనమును, గోవులను పణముగా పెట్టెను. మహా తపస్వియైన జలపాదుడు, వ్యసనికి సమస్త భూమండలమున సంపద యుండదని పలికెను. ఇట్లు ఆ కాలమున

ద్యూతక్రీడా ప్రాచుర్యమున్నను సమాజములో దానిపై గర్హిత దృష్టి యుండెను. ద్యూతక్రీడ దండనీయమైన అపరాధముగా నుండెను.

## వర్ణవ్యవస్థ

భారతీయ వర్ణాశ్రమ వ్యవస్థ అతి ప్రాచీనమైననది. వైదిక యుగంలో చతుర్వర్ణ వ్యవస్థయే మధ్య యుగమున కూడ యుండెను. కథాసరిత్సాగరమున కూడ వర్ణవ్యవస్థ పూర్వ పద్ధతినే అనుసరించి యుండెను. జన్మ సంబంధ కులాధార వర్ణ విభాగమున్నను వ్యక్తుల వ్యవసాయ కర్మ మహత్వాపేక్ష అధికముగా నుండెను. రాజత్వము కేవలము నామమాత్రము కాదు. సామాజిక మూల్య ప్రతిష్ఠాభారము కూడా దానిపై నుండెను. వర్ణాశ్రమ ధర్మ పాలకుడైన రాజు కర్తవ్య పరాయణుడు. అతడు జనులను విభిన్న కర్మలలో నియోగించి పరస్పర సహకారమును క్రమబద్ధము చేయును. వర్ణాశ్రమ పాలనకు సంబంధించిన రాజ కర్తవ్యములు కథాసరిత్సాగరమున కనబడుచున్నవి. రాజైన మహావరాహుని పుత్రియైన పద్మావతి వివాహము కొఱకు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రయువకులు వచ్చిరి. రాజు తన కుమార్తెయైన పద్మరతితో స్వయంవరమునకు వచ్చిన వారిలో నీకు అభీష్టుడైన వానిని వరింపుమని చెప్పెను. అపుడు పద్మరతి తండ్రితో నిట్లు పలికెను. నాయకుడైన శూద్రకునితో ప్రయోజనమేమి? పశు పక్ష్యాది శబ్ద జ్ఞానముగా గల వైశ్యునితో ప్రయోజనమేమి? నేను క్షత్రియ వనితనై వారికెట్లు భార్యను కాగలను? మూడవ వాడైన క్షత్రియుడు ఒకే కులస్థుడైననూ, గుణవంతుడైనను సేవకోపజీవి. ప్రాణ విక్రయి, దరిద్రసఖుడు, పృథ్వీపతి పుత్రికనైన అతని పత్నిని ఎట్లు కాగలను. నాల్గవ వాడైన జీవదత్తుడు బ్రాహ్మ

ణుడు. అతడు విరూపస్థుడు, వికర్మస్థుడు, వేదత్యాగముచే పతితుడు. అందువలన అతడు నా అభిమతుడు కాడు. అతడు నీచే దండనార్హుడు. అట్టి వానికి నన్నివ్వగలవా? నీవు వర్ణాశ్రమ ధర్మ రక్షకుడైన రాజువు కదా? అని పలికెను.

ఇట్లు రాజు వర్ణాశ్రమ ధర్మపాలకుడుగా నుండెను. వర్ణ స్వరూపము, వర్ణ ధర్మములు నిర్ధారింపబడెను. వర్ణచ్యుతులకు సామాజిక ప్రతిష్ఠ లేకుండెను. సమాజ నిర్మాణములో రాజుకు మహత్వ పూర్ణమైన స్థానముండెను. కథాసరిత్సాగర కాలమున గుణ కర్మాధారమున కాక అన్యాశ్రయముగా వర్ణము నిర్ణయింప బడెను. ఆ జీవిక భేదాధారమును బట్టి జాతి గ్రహింపబడెను. జాతియే కుటుంబ సమూహము. జాతికి స్వచ్ఛమైన పేరు. జాతిసభ్యత పైతృకత్వమునుబట్టి నిర్ధారింపబడెను. సాధారణముగా స్వజాతిలో కుటుంబవివాహము ప్రచురముగా నుండెను పౌరాణిక పురుషుల నుండి లేదా పౌరాణిక దేవతల నుండి జాతి పుట్టినట్లు చెప్పబడెను. ఇట్లు ఒకే వర్ణమునందు జాతులు ఉపజాతులు ఏర్పడినవి. వాయకుడు మాలకరి (పుష్పమాలా నిర్మాత) ధీవరుడు (బెస్తవాడు) మొదలగు వారలకు వృత్తిని బట్టి జాతి ఏర్పడెను.

## కులము

సమాజము అన్నిటి కంటె అల్పఘటికమైనది. కులము : కథాసరిత్సాగరమున కుల మర్యాద సర్వవ్యాప్తమై యుండెను. వివాహ సంబంధము సమానకులములోనే అంగీకరింపబడియుండెను. "అతుల్య కుల సంబంధా స్తైషోకింవా అపరాధ్యతి" అను ఉదాహరణము కూడా నబడు చున్నది.

## బ్రాహ్మణులకు సమాజములో గల స్థానము

వర్ణము లన్నింటిలో బ్రాహ్మణులకు ఔన్నత్యము, మాన్యతః ఆదరము సర్వాధికముగా నుండెను. వైదికయుగమున కంటె బ్రాహ్మణుడు మాన్యుడుగా నుండెను. "బ్రాహ్మణోస్య ముఖమాసీత్ బాహు రాజన్యః కృతః" మనుష్యులలో బ్రాహ్మణుడు సర్వశ్రేష్టుడు. బ్రాహ్మణుడు, వేదజ్ఞుడు, సర్వక్రియామర్మజ్ఞుడు. ధర్మజ్ఞతచే సర్వశ్రేష్ఠుడు. జ్ఞాన కర్మోపాసనాదులచే దేవతారాధనారతుడు. శాంతుడు, దాంతుడు, దయాళువు. అని మొదలుగాగల గుణములు బ్రాహ్మణ గుణములుగా శుక్రనీతిలో పేర్కొనబడినవి.

"నాషడంగ విదాసీత్ సదస్యామ్ నవా బహుశ్రుతః ।
నావ్రతో నానుపాధ్యోయో నాపాద్యో నాక్షమోద్విజః ॥

అని మహాభారతములో పేర్కొనబడినది. శాస్త్రీయ వర్ణములననుసరించి బ్రాహ్మణుడు వేదవిద్యా పారంగతుడు, సాత్వికుడు, ఆచారపాలకుడు. కానీ కాలక్రమమున బుద్ధి సంస్కారరహితుడైన కేవల జన్మ బ్రాహ్మణుడైనవాడే మాననీయు డయ్యెను.

కథా సరిత్సాగరకాలమున కూడా బ్రాహ్మణుడు సమాజమున సన్మాననీయుడనెడి ప్రజాభిప్రాయ ముండెను. "దేవద్విజ సపర్యాహి కామధేనుర్మతా సతామ్" అని చెప్పబడినది. వేదాధ్యయనము శాస్త్ర చర్చ వారి కర్తవ్యముగా నుండెను. "సుప్రతిష్ఠ నగరములో,,

"క్వచిత్ సామాజిక ఛందోగాహి గాయంతిచ యధావిధి ।
క్వచిత్ వివాదో విప్రాణామభూత్ వేద వినిర్ణయే" ॥

అని చెప్పబడినది.

బౌద్ధధర్మ ప్రభావముచే జన్మగత బ్రాహ్మణులు నిందింపబడిరి కర్మ బ్రాహ్మణుడే మాన్యుడయ్యెను. రాగాదిసంగ్రహీత, అనాసక్తుడు దయాశీలుడు, క్రోధ రహితుడైన వాడే బ్రాహ్మణుడని బౌద్ధమతము "గుణీయేవ బ్రాహ్మణః పూజ్యః" అని కథాసరిత్సాగర మతముకూడా. పుత్రుడు వైదిక ధర్మానుయాయి. తండ్రి బౌద్ధ ధర్మానుయాయి, పుత్రుడు అతని తండ్రిని తిరస్కరించి నీవు వైదిక ధర్మమును వదలి అధర్మమును సేవించు చున్నావని పలికెను. బుద్ధ ప్రతిపాదిత బ్రాహ్మణ ధర్మమును దృష్టిలో నుంచుకొని, రాగద్వేష రాహిత్యము సత్యవ్రతము, ప్రాణులయందు దయ జాతి కలహ రాహిత్యమనునవి బ్రాహ్మణ ధర్మములని, తండ్రి పుత్రునితో పలుకును. బ్రాహ్మణో చిత గుణ మహత్త్వమునకు ప్రాధాన్య మివ్వబడెను. అయినప్పటికిని బ్రాహ్మణులకు జన్మచే గూడ సమాజ పూజ్యత యుండెను.

ప్రాచీన శాస్త్రములను అనుసరించి బ్రాహ్మణుల కారుధర్మములు పేర్కొనబడినవి. 1) వేద పఠనము 2) పాఠనము 3) యజనము 4) యాజనము 5) దానము 6) ప్రతిగ్రహమనునవి షడ్ధర్మములు. దాంతత, కులీనత, తటస్థత, అనుద్వేగత, స్థిరత, పరలోకభీరుత, ధార్మికత, యోగశీలత, అక్రోధత అనునవి బ్రాహ్మణులకు విధింపబడిన సామాన్య గుణములు.

ప్రాచీన మాన్యత ననుసరించియే కథాసరిత్సాగరమున కూడా బ్రాహ్మణ ధర్మము ప్రతిపాదించబడినది. విరూపుడైన, కర్మహీనుడైన, బ్రాహ్మణుడనేక మారులు కథాసరిత్సాగరమున నిందింపబడెను. అందు వలన సురూపత, కర్మరత, వేదజ్ఞత, సదాచారత బ్రాహ్మణులకావశ్యమని తెలియుచున్నది. క్షమయే బ్రాహ్మణుల

ప్రధాన ధర్మము. "ప్రియా ప్రియేషు సౌమ్యేన క్షమాహి బ్రహ్మణః పదమ్" అని చెప్పబడినది. కానీ జీవనము కొఱకు అనేక బ్రాహ్మణులు వర్ణాంతర కార్యమునుగూడ చేపట్టిరి. కానీ ఆ ఆచారము నిందాభాజమై యుండెను. వీరవరుడు బ్రాహ్మణుడైననూ క్షత్రియోచితమైన కర్మ చేయుచుండెను. అనేక కథాసరిత్సాగరోదాహరణములను బట్టి బ్రాహ్మణ గృహములలో యజ్ఞాగ్ని నిత్యము జ్వలించు చుండెనని తెలియు చున్నది. అగ్నిహోత్ర కర్మ వారి దైనిక కర్తవ్యము. గృహవాసి యైన ఛాత్రుడు త్రికాలములలో అగ్ని హోత్రమును ఆచరించును అగ్ని యావజ్జీవము జ్వలించును. మరణానంతరము గూడ అగ్ని చేతనే ఉత్తర సంస్కారము చేయుదురు. ప్రాచీనకాలము నుండి బ్రాహ్మణులు విశేషాచారాధికారులుగా నుండిరి. రాజనీతి ధార్మిక, బౌద్ధిక, ఆర్థిక, సామాజికాదికార్యములలో అనేక విధుల నిర్మాణములో బ్రాహ్మణులకు ప్రధాన స్థానముండెడిది. మధ్య కాలమున గూడ పూర్వస్థితియే నెలకొని యుండెను. అభిషేకోత్సవాదులలో బ్రాహ్మణ పురోహితులే ముఖ్యముగా పాల్గొనుచుండిరి. బ్రాహ్మణులు, మంత్రులు సేనాపతులు, ధండనాధికారులు మొదలగు వారు యథాక్రమముగా ప్రముఖ స్థానమున ప్రతిష్ఠింపబడిరి. అవశ్యకత ననుసరించి శాస్త్రమును గూడ గ్రహించుచుండిరి. శ్రీదత్తుడు బ్రాహ్మణుడైననూ శస్త్రవిద్యలో మల్లయుద్ధములో అద్వితీయుడుగా నుండెను. ప్రాచీన శాస్త్రములలో బ్రాహ్మణులు మృత్యుదండాధికారులుగా పేర్కొనబడిరి. కృత్య కల్పతరువు ననుసరించి వీరికి మృత్యుదండ వ్యవస్థ నిషేధింప బడినది. కథాసరిత్సాగరమున కూడ బ్రాహ్మణుడు అవధ్యుడే. "కాంతో దూతశ్చ నవధ్యః" అని చెప్పబడినది. బ్రాహ్మణులకు మృత్యుదండము కూడ విధింపబడినట్లు కొన్ని కథలలో కలదు. రాజైన

విక్రమశక్తి కాలనేమి బ్రాహ్మణునకు మృత్యుదండమును విధించెను. బ్రాహ్మణుడైన సోమదత్తునకుకూడ మృత్యుదండము విధింపబడినది. "ఇట్టి ఉదాహరణములు అపవాద రూపములు.

ధార్మిక క్షేత్రమున బ్రాహ్మణులకు ఉత్తమాధికార ముండెను. పౌరోహిత్యము వీరికి యావజ్జీవ హక్కుగా నుండెను. అన్ని వర్ణముల వారికి వీరు ఇచ్ఛా గురువులుగా నుండిరి. ఆర్థిక దృష్టిని బట్టిగూడ వీరికి విశేషాధికార ముండెను. కథాసరిత్సాగరమున సంపన్నులైన దరిద్రులైన బ్రాహ్మణుల ప్రస్తావము కూడ కలదు. అనేక బ్రాహ్మణారామమున ప్రవేశించును. బ్రాహ్మణులకు భోజనచింత లేకుండెను. అన్న సత్రములోకూడ బ్రాహ్మణులకు భోజనవ్యవస్థ కల్పింపబడెను. నివాసము కొఱకు, జీవనము కొఱకు బ్రాహ్మణులకు అగ్రహారములు ఇవ్వబడెను. వాటికే బ్రాహ్మణ స్థలములని పేరు. బ్రాహ్మణులకు దానముగా సువర్ణమును, వస్త్రము లిచ్చుచుండిరి. విశిష్ట దినములలో వీరికి భోజన ధ్యాన పూజ లుండెను. ఉపకోశ బ్రాహ్మణ భోజనము కొఱకు వర్తకుని నుండి ధనమును గ్రహించును. వర్ణాంతరకన్యలు గూడ బ్రాహ్మణులచే ప్రణయమాడబడిరి. ఆదిత్యసేనుడు బ్రాహ్మణుడైన విదూషకునకు తన పుత్రిక నిచ్చెను. అనేక రాజ కుమార్తెలు బ్రాహ్మణులను వివాహమాడిరి. ఒక బ్రాహ్మణ విదూషకుడు రాజే అయినాడు. రుద్రశర్మడను బ్రాహ్మణునకు ఇరువురు భార్యలుండిరి. బహుపత్నీ వివాహము బ్రాహ్మణులకు నిషేధింపబడక పోవుటయే దీనికి కారణము. ఆర్థిక బలమును బట్టి అట్టి వివాహములంగీకరింపబడి యుండెను. దరిద్రునకు ఒక స్త్రీని పోషించుటయే కష్టమని అగ్నిదత్తుడు గుణశర్మతో పలికెను. ఇట్లు సమాజమున ఆర్థిక

పరముగా బహుపత్నీ వివాహము అంగీకరింపబడినది. "అలబేరుని" అను నతడు కూడ బుద్ధి వైభవమును బట్టి బ్రాహ్మణులకు గల సమాజాధికారమును సమర్థించెను.

## బ్రాహ్మణ స్వరూపము

కథాసరిత్సాగరమున సోమదేవుని వ్యంగ్యాత్మక వచనములు సాంస్కృతిక జీవన కేంద్ర బిందురూపకులు, సామాజిక మూల్య ప్రతిష్ఠాపకులు ధార్మిక కార్యప్రవర్తకులైన బ్రాహ్మణుల స్వరూపములను తెలియజేయుచున్నవి. దుర్బల చరిత్రులు, పదభ్రష్టులైన బ్రాహ్మణుల సంఖ్య స్వల్పమైననూ వీరు సమస్త బ్రాహ్మణ సమాజమునకు కలంక భూతులుగా నుండిరి. సమాజ దౌర్బల్యము నిందాపాత్రమై యుండెను. చారిత్రక దౌర్బల్యము అభివృద్ధమైనచో సామాజిక వ్యవస్థ యొక్క ఆధారశిలయే నశించును. అందువలన సోమదేవుడు నిష్పాక్షికముగా చరిత్ర హీనదశను వర్ణించుటకు విముఖుడుగా కనబడును.

తండ్రియైన బ్రాహ్మణుడు ధనలోభము వలన పుత్రుని సంహరింప దలంచును. వంచనా ప్రవణులైన లోభులుండిరి. "భయ కార్కశ్యలోభానాం గృహంహి భాండాసాద్విజాః" వేదకాలము నుండి మోక్షమార్గ విరోధకర్మ క్రోధమున్నను, బ్రాహ్మణులకు దైవయోగము వలన ప్రకృత సిద్ధముగా కనబడుచున్నది. కామక్రోధాదులచే ఒకప్పుడు మునులు కూడా సమ్మోహితులగు చున్నారు. అట్టి స్థితిలో బ్రాహ్మణుల మాట ఎక్కడ? ఆరామవాసులైన బ్రాహ్మణులు స్వప్రాముఖ్యము కొఱకు పరస్పరము కలహించుకొను చుండిరి. వంచనా ప్రయత్నములో గ్రామీణులను బాధించుచుండిరి. బ్రాహ్మణ

పుత్రుడు ద్యూతకారుగా వర్ణింపబడెను. అర్చకులు మహా దక్షిణా లోభముచే అకాలములో దేవాలయములను తెరచుచుండిరి. ఇట్టి చరిత్ర హీనత్వోదాహరణములు అనేకములు కలవు. శాస్త్ర జ్ఞానము అలౌకికత బ్రాహ్మణులకు సర్వత్ర ప్రసిద్ధముగా నుండెను. వేద పారియైన బ్రాహ్మణుడు వేశ్యాగృహమున సామగానము చేయును. బ్రాహ్మణులలో అంత్ర, తంత్ర హఠయోగ, భూత ప్రేత సిద్ధులు కూడ విశేష ప్రవృత్తులుగా కనబడుచున్నవి. మంత్ర, తంత్ర, సాధన ప్రభావము వీరిలో అధికము. తాంత్రిక బ్రాహ్మణుడైన హరస్వామి బాలక వధాభియోగముచే దేశ బహిష్కార దండమునకు పాత్రు డయ్యెను.

## క్షత్రియులు

వర్ణ వ్యవస్థలో క్షత్రియులకు రెండవ స్థానము ఉండెను. ఉప నయనాధికారముచే వీరు ద్విజాతులలో పరిగణింపబడిరి. ప్రాచీన కాలము నుండి దేశరక్షణ క్షత్రియ ధర్మముగా నుండెను. ప్రజా రక్షణము, దానము "ప్రజానాం రక్షణా దాన మిజ్యాధ్యయన మేవచ విజయేష్వ ప్రసక్తిశ్చ క్షత్రియేష్వ సమానతః" అని చెప్పబడినది. శస్త్రధారణము నిష్పక్షపాతత, దేశపాలనము వర్ణాశ్రమ ధర్మరక్షణ మనునవి క్షత్రియుల ధర్మములు. క్షత్రియులు ఈశ్వ రుని పూజింపవలెను. "లోకరక్షా దక్షః వీరః దాంతః" అని శుక్రాచా ర్యుడు పేర్కొనెను. పరాశర స్మృతి కూడ క్షత్రియ ధర్మమున శుక్రనీతిని అనుసరించు చున్నది. మధ్యయుగమున కూడ పూర్వోక్త ధర్మములే క్షత్రియులకు విధింపబడినవి. కథాసరిత్సాగరము పాల

కులైన క్షత్రిక చరిత్రకు నిలయము. "క్షతాత్ త్రాయతే ఇతి క్షత్రియః" కథాసరిత్సాగరమున బ్రాహ్మ్యంశీలం క్షమానామ క్షాత్ర మాపన్న రక్షణమ్" అని పేర్కొనబడినది. "విజిగీషుత క్షత్రియ ధర్మము" తాత, న క్షత్రి యేష్వేషః ధర్మోయదజిగీషుతా" అని ఉదాహరణము. కర్తవ్యహీనుడైన క్షత్రియుడు సమ్మానార్హుడు కాడు. పద్మరతి క్షత్రియుడు తుల్యవర్ణుడైననూ సేవోపజీవి, దరిద్రుడు, ప్రాణ విక్రయి యాచింపడు, ప్రతిగ్రహమును చేయడు కాల బ్రాహ్మణుడు ఇక్ష్వాకులను యాచింపుమని అడిగెను. అపుడు ఇక్ష్వాకువు అహం దదామి విప్రేభ్యోగృహ్ణీమీహి త్వయచితో విధిః।
విపరీత మిదం గృహ్ణామి అలమేష దదాతి యత్" ॥ అని చెప్పెను. క్షత్రియులకు వివాహసౌకర్యము ప్రాచీనకాలము నుండి ప్రవర్తిల్లు చున్నది. వారి బహుపత్నీ - త్వము సామాన్య విషయము "రాజానో బహు వల్లభాః" అను వాక్యము ప్రసిద్ధము. వివాహ విధానములలో గాంధర్వ వివాహము క్షత్రియులలో విశేష ప్రచార ములో నుండెను.

## వైశ్యులు

"కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్" అని భగవద్గీతలో పేర్కొనబడుట వలన వైశ్యులు కూడ ద్విజాతులలో పేర్కొనబడిరి. దేశ సమాజ ఆర్థిక స్థితి దృఢత్వ సంపాదనము వైశ్యుల కర్తవ్యము. పశురక్షణము, దానము, యజ్ఞవిధి, కుసీద గ్రహణము (వడ్డీ వ్యాపారము) కృషి అనునవి 7 కర్మలు. ప్రాచీన కాలము నుండి వైశ్యులకు విధింపబడినవి. కాని 12వ శతాబ్దమున వీరికి కృషియే ముఖ్యవృత్తిగా నుండెను.

కథాసరిత్సాగర కాలమున వైశ్యులు కృషీవలులుగా వాణిజ్య కళా నిపుణులుగా నుండిరి. వారికి అర్థ లోభము అనంతరముగా నుండెనని పుత్రకుడు పలికెను. వైశ్యులకు వాణిజ్యమే వ్యవసాయమని పేర్కొనబడినది. మృత మూషికము నుండి కూడ ధనమును సంపాదింప దలచుచుండిరి. అర్థిక సంపన్నుడు "మహావణిక్" అని చెప్పబడెను. వాణిజ్యము కొఱకు ప్రవాసమావశ్యకమని చెప్పబడినది. ప్రాణ సంకటమును గూడ లెక్కచేయక వైశ్యులు ధన సంపాదన కొఱకు ద్వీపాంతర యాత్ర చేయుచుండిరి. ద్వీపాంతర యాత్ర లక్ష్మీప్రదమని వారి విశ్వాసము. మార్గ మధ్యమున దైవ విపత్తి కంటె అతిరిక్తమైన చోర భయము, సేనాక్రమణము మొదలగు భయంకర పరిస్థితులెదురగు చుండెను. కథాసరిత్సాగరము ద్వీపాంతర యాత్రా ప్రసంగములతో నిండియున్నది. వీరి అర్థ సంపాదన ప్రవృత్తి అనేక విధములుగా నిందింపబడినది. వైశ్యులైన అర్థవర్మ, భోగవర్మల కథలలో ధనలక్ష్మి కంటె లోకలక్ష్మి శ్రేష్ఠమని చెప్పబడినది.

"తదేవం లోక సంపన్నా శ్రీ రప్యల్ప తరావరం।
న పునర్భోగ రహితా సువిస్తీర్ణాప్య పార్థికా॥"

అని నిర్దేశింపబడినది. ధనార్జనము సంతాన పరంపర వరకు అవినాశి. వైశ్యులకు ధనోపార్జన విధి సామాజిక హితదృష్టితో తప్పక సాధింపదగినదని ఆచార సంహితలో కలదు. వైశ్యులు కూడా బ్రాహ్మణుల వలె, క్షత్రియుల వలె సమాజమున సమ్మానితులైరని కథాసరిత్సాగరము వలన తెలుసుకొనగలుగు చున్నారు. రాజులు వైశ్యుల కన్యలను పరిణయమాడు చుండిరి. వైశ్య కన్య లక్ష్మీపాత్రురాలు అనెడి విశ్వాస ముండెడిది. "వాణిజ్యంతు కులస్త్రీవ స్థిరా లక్ష్మీ రనన్యజా" అని చెప్పబడినది.

శూద్రులు

వర్ణము లన్నింటిలో శూద్రుల స్థానము చిట్టచివరిది. మహత్వ దృష్టిని బట్టి కూడ వీరు మూడు వర్ణముల తర్వాతనే పరిగణింపబడిరి. వర్ణాశ్రమ వ్యవస్థలో కూడ వీరి కర్తవ్య స్వరూపము స్పష్టముగా ప్రతిపాదింపబడినది. మనుస్మృతిలో వర్ణాశ్రమ శుశ్రూష అసూయా రహితముగా శూద్రులాచరించవలెనని పేర్కొనబడినది. శుక్రనీతిలో, యాజ్ఞవల్క్యస్మృతిలో మహాభారతాదులలో ఇట్లే పేర్కొనబడినది.

నాతి మామ్నతో నాతి శుచయః పిశునాశ్చయే
తే శూద్ర జాతయో జాతా నాతిధర్మరతాశ్చ్యయే।
కళారంభోప జీవిత్వం శిల్పితా పశుపోషణం
వర్ణత్రితయ శుశ్రూషా ధర్మాస్తేషా మ్పుదాహృతాః॥

కథాసరిత్సాగర కాలమున భారతదేశమున శూద్ర స్వరూపము అధికముగా ప్రాచీన పద్ధతినే అనుసరించెను. వీరి సామాజిక దశ హీనముగా నుండెను. అనుచిత కార్యమును చేయువాడు శూద్ర తుల్యుడని నిందింపబడెను. శూద్రులతో కలిసి ఉత్థానము, ఉపవేశము పై వర్ణస్థులకు గర్హితముగా పేర్కొనబడెను.

ఏకదా బుద్ధ గోష్ఠికమ్ శూద్రైః సహ విలోక్యతం।
సోపుదత్తం పిత్ప సుహృత్ ద్విజః కోప్యేవ ముబ్రవీత్॥

"అగ్నిదత్త సుతోభూత్వా శూద్రవత్ మూర్ఖ! చేష్టసే!" "అగ్నిదత్తుని కుమారుడవై యుండియు శూద్రుని వలె ఆచరించుచున్నావు" ఇంద్రదత్తుడు మరణించిన రాజైన నందుని శరీరములో ప్రవేశించును. శకటాలుడు ఇంద్ర శరీరమును కాల్చివేయును ఇంద్రదత్తుడు శోకమును ప్రకటించి విప్రుడైననూ శూద్రుడనైతినని పలు

కును. అధికారమున కర్తవ్య దృష్టిచే శూద్రులు ఉపేక్షింప బడిరి. 11వ శతాబ్దమున బౌద్ధమత ప్రభావము వలన శూద్రులలో నవీనాశ జనించెను. కావున బౌద్ధమతము వీరితో మహావేగముతో వృద్ధి పొందెను. బౌద్ధ ధర్మము వైదిక ధర్మవృక్షమునకు కుదార మయ్యెను. శూద్రులు బౌద్ధ ధర్మ దీక్షితులై సమాజమున వైదికుల కంటె భిన్నముగా ద్వితీయ వర్గముగా ఏర్పడిరి. శూద్రుల కంటె బౌద్ధులకు సమాజమున సమీచీన స్థాన ముండెను. శూద్ర శబ్దమే నింద్యా వ్యంజకముగా నుండెను. బౌద్ధ ధర్మము నందలి సర్వసమభావము అన్యమతస్థుల నాకర్షించెను.

"వితస్తాదత్తుడను" పేరుగల మహాధనికుడు వైదికుడుగా నుండి బౌద్ధుడయ్యెను. అతని పుత్రుడైన రత్నదత్తుడు వైదిక ధర్మపరుడుగా నుండెను. అతడు తండ్రిని స్నానశౌచాది హీనుడని, అకాల భోజన ప్రియుడని కేవల కౌపీన వస్త్రధారియని నిందించును. నూతన స్థానలాభ లోభము వలన నీచులు మాత్రమే బౌద్ధధర్మమును గ్రహించుదురని ఆ బౌద్ధమతముతో ప్రయోజనమేమని తండ్రిని ప్రశ్నించును. శూద్రులు వాణిజ్యమును కూడ చేయుచుండిరి. ఒకానొక శూద్రుడు వస్త్రములు తయారుచేసి విక్రయించెను. ఇట్లు వర్ణవ్యవస్థ మధ్యయుగమున ప్రాచీన శాస్త్రములను అనుసరించినట్లే యున్నది. ఆచార వ్యవహారములలో విచార కర్మలలో యుగానురూప భిన్నత అచ్చటచ్చట కనబడును వర్ణవ్యవస్థా కార్యక్రమములో అచ్చటచ్చట పరివర్తనము కనపడును. ఈ పరివర్తనము వాస్తవికముగా క్రాంతి కారిణి.

## అంత్యజులు

చండాలాది జాతులు అంత్యజులుగా లేదా అస్పృశ్యులుగా వ్యవహరింపబడిరి. వారిని స్పృశించినచో వెంటనే స్నానాదులాచరించవలెనని ధర్మశాస్త్రకారులు చెప్పుచున్నారు. చండాల మ్లేచ్ఛ పతిత, మద్యభాండ, రజస్వలా స్వపాక స్పర్శ జరిగినచో వెంటనే స్నానమాచవలెనని అత్రిమహర్షి పేర్కొనును.

కథాసరిత్సాగర కాలమున కూడ ఈ జాతులకు పూర్వము వలె సమాజ బహిష్కారముండెను. అంత్యజులని వ్యవహరింపబడు వీరు నగరమునకు, గ్రామమునకు దూరముగా నివసించుచుండిరి. వీరి నివాస స్థానము చండాల వాటిక అని పేర్కొనబడినది. సమాజ భిన్నులైనను విశేష కార్యము కొఱకు వీరినాహ్వానించుచుండిరి. వీరిలో రాజధీవర నావికాదులు ఉన్నతవర్గ అంత్యజులు చండాలాదులు నిమ్న వర్గ అంత్యజులు.

సాధారణముగా వీరి సామాజిక స్థితి హీనముగా నుండెను. ఒకప్పుడు సమాజములో అపవాదముగా మంచి ఆచారముగల అంత్యజులు కూడా ఉండిరి. ఒకానొక చండాలుడు తపస్విగా నుండెను. ఒకప్పుడు మనోహారిణియైన చండాల కన్యచే ఉన్నత వర్గస్థులు ఆకృష్టులగుచుండిరి. సదాచార సంతుడైన చండాలుడు పూర్వజన్మలో వత్సకులీనుడుగా నుండియుండెనని చెప్పుకొనుచుండిరి. అవంతీ వర్ధనుడు చండాలకన్యయైన సురత మంజరిచే ఆకృష్టుడయ్యెను. ఇట్లే రాజకుమారియైన కురంగి చండాలుని ద్వారా ఏనుగునుండి రక్షింపబడెను. పూర్వ జన్మాధారమువల్ల వారికి వివాహమయ్యెను. సురత మంజరి రాజును వివాహమాడుటకు ఒకే దినమున వెయ్యిమంది బ్రాహ్మణ

అతో చండాల గృహమున భోజనమును స్వీకరింపవలెనని చెప్పబడినది. సమస్య అతి కఠినమయ్యెను. బ్రాహ్మణులు చండాల గృహమున నెట్లు భోజనమును స్వీకరింప గలరు? అప్పుడాకాశవాణి వధూవరు లిరువురూ పూర్వజన్మమున విద్యాధరులని చెప్పెను. ఇట్టి ఉదాహర ణములు అపవాద రూపకములు. ఉన్నత వర్గ సమాజము. వీరిని నీచ దృష్టితో చూచుచుండెను.

కథాసరిత్సాగరమునందు వర్ణింపబడిన జాతులు

జాతులు : ఇందు నాలుగు వర్ణముల వారు వర్ణింపబడిరి. బ్రహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్రులు.

ఉపజాతులు : కుంభకారులు, కువిందులు, నాపితులు, మాలాకారులు, రజకులు, ధీవరులు, డోంబులు, చండాలురు.

కుంభకారుడు : మృత్పాత్రను తీసికొని రాజభవనము వెళ్ళెను.

కువిందుడు : వస్త్ర నిర్మాత, వాయకుడు, కువిందుడు

నాపితుడు : స్పృశ్య క్షుద్రనాపితజాతి, జన్మజాతి, చాతుర్యముచే ప్రసిద్ధము.

మాలాకారుడు : పుష్పప్రసాదన, విశేషజ్ఞుడు, మాలాకారుడు అనేక చోట్ల నిర్దేశింపబడెను.

తక్షకుడు : తక్షణ కార్య విశేషజ్ఞుడు 1-643

గోపాలకుడు : 3-8-23. కిరాత 1-174, 75, శబరి 4-31-15

పుళిందకులు : 4-2-64 పుళింద 1-3-45

కథా సరిత్సాగరమున అనేక అరణ్య జాతులు పేర్కొన బడిరి. వీరి చరిత్రము పరస్పర విరుద్ధముగా కనపడుచున్నది. భిల్లులు శాంతి ప్రియులుగా నీచజాతి వారైననూ ఒకప్పుడు నిర్ధే

శింపబడిరి. వీరే దాస్యులు వీరు దుర్గాదేవికి నరబలినిచ్చుదురు. వసుదత్తుడు పుళింద జాతీయులచే బలికొఱకు బంధింపబడెను. కాని శబరాధిపతి అతనిని దయతో రక్షించి అతని స్థానమున తననే అర్పించుటకు ఉద్యుక్తుడగును. పుళిందకులకు సంఘటితమైన సైన్యము కూడా కలదు. మహారాజులు కూడా వీరి సహాయము కొఱకు వచ్చుచుండిరి. ఇది మహత్త్వపూర్ణమైన విశేషము. వింధ్య సమీప ప్రాంతము వీరి నివాస స్థానము ఆర్య అనార్య సంస్కృతి సమ్మిళితమై వారిలో ఆదాన ప్రదానము ఉండెను. గాంధర్వ వివాహము శివునకు నరముండమాల, పరకాయ ప్రవేశము, సంకేతభాష. పైశాచిభాష, తంత్ర మంత్రాది సిద్ధి అనార్య సంస్కృతిగా పరిగణింప బడుచుండెను. కిరాత పుళింద జాతులు అరణ్యజాతులు. మంత్రములచే సర్పముల నాకర్షించి వాటిని బంధించుట వీరివృత్తి రాజైన ఉదయనుడు కిరాతునిచే బాధింపబడిన సర్పమునకు విముక్తిని కలిగించును. ఆ కిరాతకుడు సర్పబంధనము మా జీవన వృత్తి యని చెప్పును. సర్ప పూజక జాతులలో ఒకానొక జాతినుండి కిరాతులు జన్మించియుందురని "ఎటకిన్సన్" చెప్పియున్నాడు.

రజకులు :- వస్త్ర మాలిన్య పరిహరణ వీరి జీవనవృత్తి వీరు ప్రాచీనకాలమునుండి సమాజసేవకులలో ముఖ్యులుగా నుండిరి. "యత్ర తత్ర బాహ్యే సరసి ఏకాం దృష్ట్వాస్త్రియం వస్త్ర ధావినీమ్" అనుట వలన వీరి ప్రస్తావన వ్యక్తమగుచున్నది.

ధీవరులు :- అస్పృశ్యులైన వీరి వృత్తి మత్స్య పరిగ్రహణము వ్యవసాయ రూపముగా వర్ణింపబడినది. నావికులు, రజత, స్వర్ణకారులు మొదలగు వారి ప్రస్తావము కూడా కథాసరిత్సాగరమున కనబడుచున్నది.

డోంబులు :- వీరు నీచకర్మ ప్రవృత్తిగల జాతివారుగా ఇచ్చట పేర్కొనబడిరి.

చండాలురు :- రాజదండనచే వధ్యులగు వారిని వధించుట వీరివృత్తి కథా సరిత్సాగరమున వధ్యులను సంహరించుటకు రాజనియుక్తులైన చండాలురు వెళ్ళుచుండిరి. మ్లేచ్ఛా, హూణా, తురుష్కాది విదేశ జాతులు కూడ భారతదేశమున నివాసమేర్పరుచుకొనియున్నట్లు కథా సరిత్సాగరమును బట్టి తెలియుచున్నది. మ్లేచ్ఛుల నివాస స్థానము భారతదేశ ఉత్తర దిగ్భాగము.

ఆశ్రమములు :- బ్రహ్మచర్యము, గృహస్థము, వాన ప్రస్థము, సన్యాసమనెడి పేర్లతో కర్మను బట్టి ఆశ్రమములు నాలుగు విధములుగా విభజింపబడినది, బ్రాహ్మణులకు నాలుగు వర్ణము లావశ్యకములు. ఇతరులకు సన్యాసము తప్ప మిగిలిన మూడు ఆశ్ర మములు అవశ్యకములు. విద్యార్జన కాలమున బ్రహ్మచర్యము సర్వ పాలన కొఱకు. గృహస్థాశ్రమము ఇంద్రియ దమనము కొఱకు వాన ప్రస్థము, మోక్షసిద్ధి కొఱకు సన్యాసాశ్రమము విధింపబడినవి.

కథాసరిత్సాగరమున గల ఆశ్రమక్రమము పూర్వకాలీన క్రమమే. శివుడు గృహస్థాశ్రమమును అంగీకరింపలేదు. పురోహితుడు ఆశ్రమ క్రమము నీకు తెలియదా? అని ప్రశ్నించెను. ఇచ్చట బ్రాహ్మణాతిరిక్తులు కూడా సన్యాసమును స్వీకరించుచుండిరి. రాజైన సహస్రానీకుడు ఉదయనునకు రాజ్యమునిచ్చి మహాప్రస్థానము కొఱకు హిమాలయమునకు వెళ్ళెను. ఉదయనుడును, నరవాహన దత్తుడును మొదట బ్రహ్మచర్యాశ్రమమునందే విద్యాభ్యాసము గావించి పిమ్మట వివాహితులైరి. ఈ క్రమోల్లంఘనము నిసర్గ విరుద్ధము.

యువాస్థలో గృహస్థాశ్రమ భోగానంతరమే వైరాగ్యమును స్వీకరింపవలెనని రాజైన అలంకారశీలుడు విరక్తుడైన తనపుత్రునితో పలికెను.

బ్రహ్మచర్యాశ్రమము :

బ్రహ్మచారి ఉపనయన సంస్కారమైన పిమ్మట గురు గృహమును ప్రవేశించి విద్యాధ్యయనము చేయును. ఐదవ సంవత్సరము నుండి విద్యాధ్యయనము ప్రారంభమగును. గురు గృహమున ఇంద్రియనిగ్రహము విశిష్ట కర్తవ్యపాలనము. కానీ నిత్యభిక్షాటనము స్వేచ్ఛా నియమముగా నుండెను. గురు శుశ్రూష బ్రహ్మచారికి అవశ్య కర్తవ్యము.

కథా సరిత్సాగర కాలమున కూడా బ్రహ్మచారులకు పూర్వోక్త నియమ పాలనము తప్పనిసరియై యుండెను. పాటలీపుత్రమున వేద కుంభడను పేరుగల ఉపాధ్యాయుని సేవించి దేవదత్తుడు విద్యాధ్యయనము చేయుచుండెను. కుండినపురమున కూడ ఏడుమంది బ్రాహ్మణులు ఉపాధ్యాయ గృహమున విద్య నభ్యసించుచుండిరి. ప్రాచీనకాలము నుండి వేదాధ్యయన విధానము గురు గృహమున జరుగుచుండెడిది. బ్రహ్మచర్యము వర్ణత్రయమునకు సమానము. ఉదయన మహారాజు జమదగ్న్యాశ్రమములో ధనుర్వేద విద్య నభ్యసించెను.

గృహస్థాశ్రమము :

మహత్త్వదృష్టిచే ఈ ఆశ్రమము అగ్రగణ్యమైనది. ఇది సర్వోత్తమాశ్రమమని కథాసరిత్సాగరమున పేర్కొనబడినది. ఇందు ధర్మముచే ధనోపార్జనము ఆవశ్యకమని పేర్కొనబడినది. దేవ, పితృ, అతిథిపూజ, గృహస్థుని ప్రప్రథమ కర్తవ్యము. గృహస్థుడు సుఖిగా

నిచ్చుట చక్కగా వర్ణించబడెను. ధర్మదత్తుడు మేము కలహరహితుల ముగా దేవపితృ అతిథులకు పూజ గావించి మిగిలిన దానిని పరి మితముగా భుజించి సుఖముగా నున్నామని చెప్పెను. ధర్మార్థ కామాచరణము గృహస్థునకు పరమలక్ష్యము. దీనికొఱకు గృహస్థుడు మహాత్ములను పూజించును. స్వాధ్యాయముచే ఋషులను, హోమముచే దేవతలను, తర్పణముచే దేవతలను, బలిచే భూతములను అన్న దానముచే మనుష్యులను సంతోషపెట్టును.

వానప్రస్థము :

అనేక రాజులు రాజ్యభారమును పుత్రులయందు ఉంచి వాన ప్రస్థాశ్రమమున ప్రవేశించిరి.

సన్యాసము :

సర్వకర్మఫల త్యాగమే సన్యాసము. ఆత్మజ్ఞానలీనుడైన సన్యాసి మోక్షము కొఱకు సన్యసించును. కథాసరిత్సాగరమున సన్యాసి స్వరూపము ప్రాచీన మర్యాదనే పోటించినట్లు చెప్పబడినది. వార్ధక్యమున రాజు సర్వమును త్యజించి సన్యసించును.

సంస్కారములు :

"జన్మనా జాయతే శూద్రః సంస్కారాత్ ద్విజ ఉచ్యతే"
వేదాధ్యయనమువలన విప్రుడు బ్రహ్మసాక్షాత్కరమువలన బ్రాహ్మణు డగును. మనుస్మృతి ననుసరించి స్వాధ్యయనవ్రతము, హోమము, దైవ, ఋషి తర్పణము, యజ్ఞము సంతానోత్పత్తి, ఇజ్య అను మహా పంచ యజ్ఞానుష్టానములచే శరీరము బ్రహ్మ అగును. అశుభ ప్రతీకారము కొఱకు, అభీష్ట ప్రభావాకర్షణకొఱకు సాంస్కృతిక, ఆధ్యాత్మిక, నైతికదృష్ట్యా వ్యక్తిత్వ నిర్మాణముకొఱకు పరిష్కృతమైన యోగ్యమైన వైయక్తిక జీవనముకొఱకు సంస్కార సంయోగము అత్యావశ్యకము.

గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకకర్మ, నామ

కరణము, నిష్క్రమణము. అన్నప్రాశము, కర్ణవేధ, చూడాకరణము, వ్రతబంధము, వ్రతము, విద్యారంభము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యేష్టి అనునవి షోడశ సంస్కారములు.

కథాసరిత్సాగరమున ఈ సంస్కారముల మహత్వము యథాపూర్వముగానే యున్నది. "జమదగ్ని మహర్షి ఉదయనుని క్షత్రియోచిత సంస్కారభూతునిగా చేయును." ఇచ్చట సంస్కార శబ్దము మనుష్య ప్రవృత్తి వ్యవహార వాచకము. విశిష్ట సంస్కారమునకు పూర్వజన్మే కారణమని చెప్పబడినది. ఇందు ఉపనయన, అంత్యేష్టి సంస్కార చర్చ అధికముగా కనబడుచున్నది. ఉపనయన సంస్కార స్వరూపము ప్రాచీన పద్ధతినే అనుసరించినది. బ్రాహ్మణులకు సంస్కారము అనివార్యముగా నుండెను. యజ్ఞోపవీతము బ్రాహ్మణత్వ సూచకముగా నుండెను.

4 3.3. వివాహమహత్వ స్వరూపములు

విభిన్న సంస్కార స్వరూపములలో వివాహ సంస్కారము సర్వప్రధానమైనది, భారతీయ సామాజిక సువ్యవస్థకు వివాహ సంస్కారము ప్రధాన నిదర్శనము. సుఖమయ జీవనమునకు కుటుంబిక జీవనమునకు నియమిత యవ్వన సంబంధమునకు ఈ వ్యవస్థలో అత్యధిక ప్రాముఖ్యము కలదు. వివాహము అనివార్యధార్మిక కర్తవ్యముగా పరిణతమయ్యెను. అపత్నీకుడు అయాజ్ఞికుడుగా పేర్కొనబడెను.

పత్నీ ధర్మార్థ కామానాం కారణం ప్రవరం స్మృతమ్ ।
అపత్నీ కొనరో పూత కర్మయోగ్యో న జాయతే ॥

అని యాజ్ఞవల్క్య స్మృతి.

సర్వ ప్రథముగా ధార్మిక కార్యములలో పత్నియొక్క ఆవశ్యకత అనివార్యమైనది. పుత్రప్రాప్తికి పత్ని అత్యావశ్యకురాలు పుత్రభావనముచే మానవ జీవనమున సాఫల్యత ఏర్పడును. సంతానోత్పత్తి లేనిచో పితృఋణము నుండి విముక్తుడు కాడు. బ్రహ్మచర్యము వలన ఋషి ఋణము, యజ్ఞము వలన దేవతల ఋణము, సంతానోత్పత్తి వలన పితృఋణము పరిహరింప బడును. కథాసరిత్సాగర కాలమున వైవాహిక ప్రాచీన మర్యాద అక్షుణ్ణముగా నుండెను. వివాహము యొక్క వైయక్తిక సామాజిక ధార్మిక మహత్త్వము సర్వజన విదితమై యుండెను. అపత్నీకుని సామాజిక స్థితి అతిహీనమనెడి విశ్వాసముండెను. భార్యా విహీనుడైన గృహపతి గృహము శూన్యమని "సింహపరాక్రముడు" వివాహావశ్యకతను గూర్చి చెప్పెను. కాంతా విహీనమైన గృహము కారాగృహమని మూలదేవ కథ వలన తెలుసుకొనుచున్నాము. దేవ పితృ అతిథి సేవ వలన కలుగు పుణ్యము గృహస్థాశ్రమమునచే కలదు. వివాహము ధర్మార్థకామ పురుషార్థ ప్రాప్తి హేతువు. వైవాహిక జీవనము లేనిచో సామాజిక ప్రతిష్ఠ లభింపదు.

"ఆత్మావై పుత్ర నామాసీత్" సంతానోత్పత్త్యభిలాష వైవాహిక జీవన ప్రేరకము. పుత్రహీనుడైన "ధనదత్తుడను" వైశ్యుడు చింతిల్లును. బ్రాహ్మణులను పిలిపించి పుత్రప్రాప్తి కొఱకు ఉపాయము నడుగును, కథాసరిత్సాగర కాలమున వివాహ పద్ధతులలో భేదము ఉన్ననూ తత్ స్వరూప మహత్త్వము ప్రాచీనశాస్త్ర మాన్యతనే అనుసరించి యుండెను. కథాసరిత్సాగర మంతయు వివాహసంస్కారోద్ధరణ పూర్ణమే. సర్వకథలు వివాహము చేతనే పరిసమాప్తములగును. ప్రాచీన కాలమున ప్రౌఢ కన్యా వివాహము గూడా ప్రచల్లుచుండెను.

ఋతు మత్యాంహి కన్యాయామ్ బాంధావాః యాంత్యధోగతిమ్ ।
వృషలీసా వరస్ప్రాస్యాః వృషలీపతి రుచ్యతే ॥

కథాసరిత్సాగర కాలమున రజోదర్శనా నంతరమే కన్యా వివాహము సముచితమని చెప్పబడినది.

ఆ కాలమున కన్యాపక్షమునకు దాన స్వరూపముగా ఐచ్ఛికముగా ధన దాన వ్యవస్థ యుండెడిది. రూపధనుడను రాజు వివాహకాలమున రత్న దానము చేయును. వివాహ సమాప్తియైన పిమ్మట కన్య తల్లిదండ్రి ఆహూతులందరినీ సముచితరీతిలో సత్కరించును. పద్మావతి వివాహ కాలముననే కూడ వస్త్రాదిదానము ఆచరింపబడినది. ఆ వివాహమున వర పక్షమున నియత ద్రవ్యమెచ్చటనూ యాచింపబడలేదు, భారతీయ పరంపర ననుసరించి కన్య కొఱకు లేదా వరుని కొఱకు ధన స్వీకరణము నిందింపబడినది. కథాసరిత్సాగరమున వివాహ సందర్భమున వస్త్ర భూషణములతో పాటు దాసీ దాన ప్రధ కూడా యుండెను.

కథాసరిత్సాగరమున గాంధర్వ విధిచే వివాహము సమాప్తమైననూ వైదికపద్ధతిలో వివాహ సంస్కారము చేయవలసి యుండును, వాసవదత్తోదయనులకు గాంధర్వ విధిచే వివాహము జరిగిననూ వైదిక పద్ధతిచే మరలా వివాహము చేయబడినది. వాసవదత్త తండ్రియైన చండమహాసేనుడు దూతను పంపించి శాస్త్రీయ వైవాహిక కృత్య ప్రతీక్ష కొఱకు ఉదయనుని యాచించును, నా పుత్రీ వివాహము అవైదికముగా నుండకుండుగాక, నా పుత్రుడైన గోపాలకుడు వచ్చి శాస్త్రోక్తముగా సుందరి వివాహమును నీతో జరిపించగలడని ఉదయనునకు సందేశమును పంపించును. నాడు ధార్మిక శిక్షా విధానము కర్మకాండ అనివార్యముగా నుండెను.

గాంధర్వ పైశాచికాది వివాహములలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు అగ్ని సమక్షముగా వైవాహిక క్రియలను యాచరింప వలెను. అగ్ని దేవుడైన ద్విజుని సాక్షిగా పాణి గ్రహణోత్సవము జరుగుచుండెను. ఆ కాలమున అగ్నిదేవ ద్విజ సాక్ష్యముననే అగ్ని ప్రదక్షిణ, లాజ హోమము, సప్తపది మొదలగునవి ప్రధానముగా చేయవలసి యుండెను.

రాజైన ఉదయనుడు మహావైభవముతో అంతఃపురమున ప్రవేశించి సుమంగళ భరితమైన వివాహ గృహమున అడుగు పెట్టెను. పిమ్మట వివాహవేదిక నధిష్ఠించి పద్మావతి పాణిగ్రహణము చేసి అగ్ని ప్రదక్షిణము చేయును. వివాహోత్సవమున వస్త్రభూషణ దానము చేయబడినది చారణులు మనోహర గీతాగానము చేసిరి. వేశ్యలు సుందర నృత్యము నాచరించిరి. సూర్యప్రభ వివాహోత్సవ మున గూడ నృత్యగాన మద్యపాన గోష్ఠి విశేషములు జరిగినవి. వివాహము కొఱకు లగ్న ముహూర్త నిర్ణయము అవశ్యకమై యుం డెను. రాజైన "మందర దేవుడు" పుత్రీ వివాహ ముహూర్త నిర్ణ యము కొఱకు జ్యోతిష్కుల నాహ్వానించును. జ్యోతిష గణనము నను సరించి శుభముహూర్తమున వివాహము జరుగుచుండెను.

కన్యాదాన మహత్త్వము

కన్యాదానాదృతే పుత్రి! కింస్యాత్ కిల్బిష శాంతయే"
అని పేర్కొనబడుట వలన కన్యాదాన మహత్వము అనిర్వచనీయము అని కథాసరిత్సాగరమును బట్టి తెలియుచున్నది, కన్యాదానము వలననే పుత్రుని కంటె పుత్రిక గొప్పదని పరోపకారియైన రాజు పలుకును ఫలం యచ్చ సుతాదానాత్తై కుతః పుత్రాత్ పరత్రతత్ అని వృద్ధ బ్రాహ్మణుడు చెప్పెను.

## వివాహ పద్ధతులు

స్మృతుల ననుసరించి వివాహములు అష్టవిధములు బ్రాహ్మ్య ప్రాజాపత్య, దైవ, అర్ష, గాంధర్వ, అసుర, రాక్షస, పైశాచికము అని వీటి పేర్లు మొదటి నాలుగు ప్రశస్తములైనవి. మిగిలిన నాలుగు అప్రశస్తములు. బ్రాహ్మ్య వివాహము సర్వశ్రేష్టము. చివరి రెండు వివాహములు నిషిద్ధములు, వివాహములలో కథాసరిత్సాగరమున కొన్ని మాత్రమే కనపడును. గాంధర్వ వివాహము సర్వాధికముగా కనపడును. మొదట వరుని నుండియే కన్య అర్థింపబడును. రాజైన "కనకవర్షుడు" మదన సుందరీ వివాహము కొఱకు సందేశమును పంపును. రాజైన సహసానీకుడు కూడ మృగాంకదత్త కొఱకు దూతను. వివాహమైన పిమ్మట వరుడు ఏడు దినములు కన్యాగృహమునందుండును. కానీ రాజైన పృథ్వీరూపుడు వివాహానంతరము దశదిన పర్యంతము మామగారింట యుండెను. కాని కథాసరిత్సాగరమున రాక్షసులను సంహరించి వారి కన్యలను వివాహమాడు సందర్భములు కనపడుచున్నవి. విదూషకుడు తన పరాక్రమములతో రాక్షస పుత్రికల పాణిగ్రహణము చేయును. ఉదయనాది రాజులు గాంధర్వ విధిచే అనేక కన్యలను వివాహమాడిరి. "అనురాగ పర, నిశ్చయదత్తుని" గాంధర్వ విధిచే వివాహమాడెను. ధర్మశాస్త్ర కారులు గాంధర్వ వివాహమును ప్రశంసించలేదు, కథాసరిత్సాగరమున వర్ణింపబడిన గాంధర్వ వివాహములు పరస్పరాకర్షణ రూపములు. ఆ కాలమున ప్రణయ వివాహముల అధికృత వలన సమాజమున గాంధర్వవివాహము ఉత్తమముగా స్వీకరింపబడెను. అనులోమ ప్రతిలోమ వివాహములు కూడ జరుగుచుండెను.

మధ్యయుగమున అంతర్జాతీయ వివాహములు జరిగినవి.

అట్టి వివాహములకు కథాసరిత్సాగరమున అనేకోదాహరణములు కలవు. "వరోపకారి" అను పేరుగల రాజు తన పుత్రికను బ్రాహ్మణునకు లేదా క్షత్రియునకిచ్చుటకు సన్నద్ధుడైనాడు. క్షత్రియ రాజకుమారునకు వైశ్యపుత్రికతో వివాహము జరుగును. అంగారవతీ-స్వయంవరాస్థానమునకు వివిధకులీనులైన పురుషులు వచ్చిరి. బ్రాహ్మణునకు రాజకుమారితో వివాహము విద్యావినయ సంగమము వలె వరస్పర శోభాజనకమని చెప్పబడినది. ఒకానొక వైశ్యుడు ధీవర పాణి గ్రహణము చేయును. ఇందనేక ప్రతిలోమ వివాహములు కనబడుచున్నవి. కానీ వాటికి సమాజమున హైన్యభావముండెను. ప్రతిలోమ వివాహము వలన జన్మించినవారు అస్పృశ్యులుగా పరిగణింపబడిరి. వర్ణ సంకర సంతతి యనెడి ప్రథకూడా ఏర్పడి యుండెను. నిమ్న వర్ణునకు ఉన్నత వర్ణ స్త్రీతో వివాహము అంగీకరింపబడలేదు. కానీ దీనికి అపవాదముగా అట్టి వివాహములు కొన్ని కథాసరిత్సాగరమున కనబడుచున్నవి. ఒకరాజకన్య ధీవరుని వరించును, మఱియొక రాజకన్య చండాలుని వరించును. కథాసరిత్సాగరమున స్వయంవర ప్రథా ప్రస్తావము కనబడుచున్నది.

### వరవధూ లక్షణములు

ప్రాచీన మాన్యత ననుసరించి కథాసరిత్సాగరమున కూడ వరునకుండవలసిన గుణములు నిర్దేశింపబడినవి.

వయోరూపమ్ కులంశీలమ్ విత్తం చేతి వరస్యతత్ ।
మృగ్యతే సఖిపయో వంశాదికే తతః ॥
మన్యే రూపాభి సంపన్నో దరిద్రోపి వరం పతిః
నహిరూక్షః పునః కృత్స్న పృథివీ చక్రవర్త్యపి
వరస్వామీ గుణాః ప్రోజ్యాః లక్ష్మీహి క్షణభంగినీ ॥

అనునవి ఇచ్చట ఉదాహరణములు రూపమున కత్యధిక ప్రాముఖ్యత ఇవ్వబడెను, వరుడు రూపవతిని అభిలషించినట్లే కన్య కూడ రూపవంతునభిలషించును. రాజైన ప్రతాపముకుటుడు "ఈ అశోకదత్తుడు జాతిచే, విద్యచే, రూపముచే సర్వాధికుడు. వరగుణము లన్నియు ఇతని యందున్నవి. అని పలుకును. వరునకు పౌరుష మనివార్యము. కన్య నిర్బలుడైన వరుని పరిత్యజించు కథలనేకము లిచ్చట కలవు, ఒకానొక వరుడు అరణ్య గజగర్జముచే భయపడి తన కన్యను వదిలి పరుగెత్తును. అపుడు బ్రాహ్మణుడొకడు ఆమెను రక్షించును. ప్రాణసంకటములో తనను పరిత్యజించిన వరుని పతి బుద్ధితో నిరాకరించి ఆ కన్య రక్షించిన బ్రాహ్మణునే వివాహమాడును. విద్యాధరిపతి నపుంసకుడు. ఆమె తన తండ్రితో ఈ విషయమును చెప్పును. శాస్త్రము ననుసరించి నపుంసకునకు వివాహాధికారము లేదు. "హా హతోస్మి షండః పతిః ప్రాప్తోనుయా" అని ఇందలి ఉదాహరణము.

కథాసరిత్సాగరమున అన్యగుణముల కంటె సౌందర్య గుణమునకే సర్వాధిక్యత కనబడుచున్నది. కన్యాసౌందర్యముచే ముగ్ధులై, గాంధర్వ వివాహమున కన్యను వరించుచుండిరి. నృత్య గానాది కన్యా గుణములు పరీక్షింప బడుచుండెను. రాజైన కృతవర్మ వివాహ ప్రస్తావమున స్వపుత్రీ గుణములను దూతకు చూపెట్టును.

అథదృష్ట్వా మృగావత్యా నృత్యగీతాది కౌశలమ్ ।
రూపంచా ప్రతిమం తస్మైదూతా యా దర్శయత్ నృపః ॥

అనునది ఇందలి ఉదాహరణము.

స్నిగాకులీనా మహతీ గృహిణీ తాపహారిణీ ।
తపచ్ఛాయేవ మార్గస్థాపుణ్యైఃకస్యాపి జాయతే ॥

అని పేర్కొనబడినది.

## బహుపత్నీత్వము

బహుపత్నీ వ్యవస్థ వేదకాలమునుండి ప్రవర్తిల్లుచున్నది. దేవతల మతము ననుసరించి బ్రాహ్మణుడు నలుగురు కన్యలను, క్షత్రియుడు ముగ్గురు కన్యలను, వైశ్యుడు ఇరువురు కన్యలను, శూద్రుడొక కన్యను మాత్రమే వివాహమాడవలెనని మనువు పేర్కొనెను. దీనిని బట్టి విశేష పరిస్థితులలో ద్వితీయ వివాహ మంగీకరింపబడినది. కామ వాసనా ప్రేరితులు అధిక కన్యలను వివాహమాడుట అసంద్యము, "త్యక్తాపి పత్నీ ధనేన తోషయితా" అని పేర్కొనబడినది. కథాసరిత్సాగరమున ఉదయిన నరవాహన దత్తాదులు అనేక వివాహమాడిరి, సాధారణముగా అధిక సంపన్నతయే బహుపత్నీ వివాహ ప్రేరణ హేతువుగా నుండెను. గుణశర్మ అగ్నిదత్తుని" దరిద్రో విభృతియా దికామపి కష్టంకుతో బహుః" అని చెప్పెను. అక్షక్షపన కథయందు మధ్య వర్గియా వ్యక్తికి ద్వితీయ వివాహము జరిగెను, సాధారణముగా సామాన్యులు బహుపత్నీత్వమును అంగీకరించక యుండిరి రాజులు మాత్రము బహుపత్నీ వివాహోన్ముఖులై యుండిరి. ఈ విషయమున కథాసరిత్సాగరమున అతి మనోహరమైన ప్రసంగము కలదు. దేశ, రూప, అవస్థా, చేష్టా, విజ్ఞానాది భేదము లచే శీలవతలు భిన్న భిన్న గుణములతో కూడియుండిరి. ఒకే స్త్రీ సర్వగుణసంపన్నురాలు కాజాలదు, అందువలన రాజులు బహుకన్యల నభిలషించు చుండిరి. అని ఒక స్త్రీ నరవాహన దత్తుని బహుపత్నీ వివాహమును సమర్థించును. దీనిచే తత్కాలీన రాజపురుషుల కామ లప్స వ్యక్తమగుచున్నది.

## నియోగము

సంతానేచ్ఛచే విధవాస్త్రీ మృతపతి సోదరుని నుండి లేదా

స్వ ప్రియుని నుండి సంతతిని పొందవచ్చునని మనువు పేర్కొనెను. కథాసరిత్సాగరమున బేతాళ కథలో క్షేత్రజపుత్ర చర్చ కలదు. మరణించ దలచిన చోరుడు క్షేత్రజ పుత్రోత్పత్తిచే సద్గతి గల్గునని చెప్పెను.

బహుపతిత్వము

కథాసరిత్సాగరమున స్త్రీలు అనేక పురుషులను పరిత్యజించి అన్య పురుషులను పరిణయ మాడిన ఉదాహరణములు అనేకములు కనబడుచున్నవి. కాని అట్టివారు నిమ్నకులీనులు. "అనంగ ప్రభ" ఒకపతిని పరిత్యజించి మరియొక పతిని పరిణయమాడును. కానీ బహుపతిత్వోదాహరణము ఒకేమారు కనపడదు. ధర్మనైతికాంకుశము కారణముగా భారతీయ మహిళలకు ఏక పతియే శాస్త్ర సమ్మతము.

వృద్ధ వివాహము

ఇందు స్వార్థభోగ లిప్సా ప్రేరితములైన వృద్ధ వివాహోదాహరణములు కనపడుచున్నవి, "వృద్ధోపర్థ ప్రభావేన పరిణి న్యేవణిక్సుతామ్" అనునది ఉదాహరణము. కథాసరిత్సాగరమున వృద్ధ వివాహము నిందింపబడెను. ఇది సామాజిక అత్యాచారముగా పరిగణింపబడెను.

ప్రసేనజిచ్చ ప్రవయాః సద్భిష్టో నృపతిర్మయా ।
జాతీ పుష్పస్య జాత్యేవ బిద్ధస్యాస్య కులేన కిమ్ ॥

అని సోమ ప్రభ కళింగ సేనతో వృద్ధుడైన ప్రసేన జిత్తుని గూర్చి చెప్పెను.

4 3.4. కథాసరిత్సాగరములో రామకథ

రామాయణ ఉత్తరకాండ కథ కథాసరిత్సాగరములో ప్రసిద్ధ

కథకంటె భిన్నముగా నున్నది. కథాసరిత్సాగరములో అలంకారవతీ లంబకములో ప్రథమ తరంగములో 58 శ్లోకము నుండి 112 శ్లోకము వఱకు రామకథ వర్ణింపబడినది.

రామునిచే పరిత్యజించబడిన సీత వాల్మీకిచే కరుణచే అదరింపబడినది. అతని "ఆశ్రమ వాసులైన మునులు సీత దోషురాలు లేనిచో రాముడెందులకు అమెను పరిత్యజించెను. ఈమె దర్శనము వలన నిత్యము మనకు పాపము సంక్రమించును. వాల్మీకి కృపతో అమెను ఆశ్రమము నుండి బహిష్కరింపలేదు. మహర్షి ఈమె దర్శనము వలన జనించిన పాపములను తనస్సుచే పోగొట్టుకొనగలడు. మనము మఱియొక ఆశ్రమమునకు వెళ్ళదమని మంత్రాలోచన గావించుకొనిరి".[1] అపుడు దివ్యదృష్టితో ఈమె పవిత్రురాలు సాధ్వి అని (వాల్మీకి) రాముడు వారికి చెప్పెను. అప్పటికిని వారు అసంతృప్తులు కాగా సీత నన్ను యథేచ్ఛగా పరీక్షింపుడు నేను అశుద్ధనైనచో శిరస్సును ఛేదింపుడని చెప్పెను. అది విని మునులు కారుణ్యముతో ఈ వనమున టీటిభ సరస్సు అను పేరుగల తీర్థము కలదు. పూర్వము భర్త తన భార్యపై అన్యసమాగమ శంక కలవాడుకాగా టీటిభి మిథ్యాపవాదముచే సాధ్వీనుటియైననూ దూషితురాలై, అశరణయై దేవతలను గూర్చి ఆక్రందనము చేసెను. దేవతలు ఆమె శుద్ధిని పరీక్షించుటకు ఈ తీర్థమును నిర్మించిరి. సీత కూడ ఇచ్చట తన ప్రసిద్ధతను మాకు నిరూపించవలెను అని పలికిరి. అది విని సీత ఓ సరస్సు కడకు వెళ్ళి "ఓ మాతా! నా మనస్సు ఆర్యపుత్రులైన శ్రీరాముని తప్ప ఇతరుని స్మరింపకున్నచో ఈ సరస్సునుండి నన్ను ఉద్ధరింపుము" అని పలికి సరస్సులో దుమికెను అపుడు భూదేవి ప్రత్యక్షమై సీతను ఒడిలో కూర్చుండ బెట్టుకొని

సరస్సునుండి పైకి వచ్చెను. అపుడు మునులందరూ భూదేవికి నమస్కరించి సీతా పరిత్యాగము గావించిన రాముని కోపముతో శపించ దలంచిరి. అపుడు సీత "శ్రీరామునకు అమంగళము శంకింప గలదు పాపాత్మురాలైన నన్నే శపింపుడని అంజలి ఘటించి వారిని రామునకు శాపమివ్వకుండా నివారించెను. అపుడు ఆ మునులు సంతుష్టులై ఆమెకు పుత్ర జన్మాశీర్వాదము నిచ్చిరి. పిమ్మట ఆమె మంగళకాలమున లవుని పుత్రునిగా ప్రసవించెను. ఒకప్పుడు సీత బాలుడైన లవుని తీసికొని స్నానమునకు వెళ్ళగా వాల్మీకి ఆశ్రమము శూన్యముగా నుండగా చూచి పర్ణశాల యందున్న బాలుడు క్రూర మృగముచే తీసికొని వెళ్ళబడి యుండునని తలంచి పుత్రవియోగము నొందిన సీత ప్రాణత్యాగము గావించునని తలంచి దుర్భలతో పవిత్రమును చేసి ధ్యానించి లవసమానుడైన బాలుని సృష్టించెను. నదీ స్నానము నుండి తిరిగి వచ్చిన సీత కుశలచే సృష్టింపబడిన లవసదృశుడైన బాలుని వృత్తాంతమును వాల్మీకి ద్వారా తెలుసుకొనెను, భవితవ్యుడు అను పుత్రుని గ్రహింపుమని వాల్మీకి సీతతో చెప్పి కుశ సృష్టుడగుటచే ఆ బాలునకు కుశుడనెడి నామకరణము చేసిరి.

సర్వ విద్యాసంస్కారములను పొందిన బాలురిరువురూ ఆశ్రమ మృగమును సంహరించి దాని మాంసమును తెచ్చిరి. వాల్మీకి మహర్షి యొక్క అర్చాలింగమును క్రీడనీయకముగా చేసిరి. దానిచే ఖిన్నుడైన ముని సీతాదేవితో అర్థింపబడి శాంతకోపుడై కుబేర సరస్సు నుండి స్వర్ణ పద్మములను ఆ ఉద్యానము నుండి మందార పుష్పములను వెంటనే లవుడు తెచ్చుగాక, వాటితో బాలురిరువురూ లింగార్చన చేసి పాపశాంతిని పొందవలెనని కుమారులకు ప్రాయశ్చిత్త

మును ఆదేశించెను ఇది విన్న వెంటనే లవుడు కైలాసమునకు వెళ్ళి కుబేర సరస్సును, ఉద్యానవనమును ఆక్రమించి యక్షులను సంహరించి స్వర్ణపద్మములను మందార పుష్పములను తీసుకొని వచ్చుచూ మార్గమధ్యమున వృక్షఛాయ యందు విశ్రమించెను. ఇంతలోపుగా రాముని నరమేధ యాగము కొఱకు సులక్షణుడైన పురుషుని అన్వేషించుచూ లక్ష్మణుడు ఆ మార్గము గుండా వచ్చెను. లక్ష్మణుడు సమరమునకు ఆహ్వానించిన లవుని మోహనాస్త్రముచే మూర్ఛితుని గావించి క్షత్రియ ధర్మానుసారముగా బంధించి అయోధ్యకు తీసికొని వెళ్ళెను. అపుడు లవుని ఆగమమునకు నిరీక్షించుచున్న సీత నిరీక్షించి నిరీక్షించి దుఃఖితురాలై యున్న సీతనుచూచి వాల్మీకి ఓదార్చి అయోధ్యలో బాధింపబడిన లవుని ఈ దివ్యాస్త్రములతో విముక్తిని చేయుమని చెప్పి దివ్యాస్త్రములను కుశునకు ఇచ్చెను. కుశుడు అయోధ్యకు వెళ్ళి అచ్చట యజ్ఞభూమిని ఆక్రమించి లక్ష్మణుని జయించెను. వాల్మీకి దత్త దివ్యాస్త్ర ప్రయోగ ప్రభావముచే రాముడు కూడా కుశుని జయింప జాలదయ్యెను. అపుడు రాముడు ఆ వృత్తాంతమును కుశుని వలననే తెలుసుకొని లవుని విడిపించి అమందానంద భరితుడై లవకుశుల నిరువురినీ కంఠాలింగనము చేసుకొని పౌరజన ప్రశంసితుడై సీతను వాల్మీకి ఆశ్రమమునుండి రప్పించి రాజ్యభారమును పుత్రులపై ఉంచి సీతతో సుఖముగా నుండెను. అని అలంకారవతి తల్లి కాంచన ప్రభ పరస్పర వివాహోత్సుకులైన అలంకారవతీ, నరవాహన దత్తులను ఒక్కరాత్రి వియోగమును సహింపుడని ప్రాతః కాలమున మీకు వివాహము జరుగగలదని చెప్పుచూ ధీరులు అనంత విరహమును సహింతురు. దీనికి ఉదాహరణముగా సీతారామ కథను వినుడని వారికి ఈ కథను చెప్పెను.

వాల్మీకి ఆశ్రమమున సీత అన్యమునులచే నిందింపబడుట జల పరీక్షానంతరము వారు ఆమెకు పుత్రలాభ అశీర్వాదమునిచ్చుట నీ ష్కారణ సీతా పరిత్యాగముచే రాముని కోపముతో శపింప వచ్చియత్నించుట, సీత వారిని నివారించుట, లవుడు ఆశ్రమమున కనబడకపోగా వాల్మీకి కుశలతో మంత్రధ్యానముచే కుశుని సృష్టించుట, అతని కుశ నామకరణము చేయుట ఆశ్రమ మృగవాహనము, అర్చాలింగ క్రీడ, కుపితుడైన వాల్మీకి ప్రాయశ్చిత్తము కొఱకు కుబేర సరస్సునుండి స్వర్ణకమలములను, ఉద్యానమునుండి మందారపుష్పములను లవుని తెమ్మని ఆజ్ఞాపించుట ఉభయులూ ఆ పుష్పములచే శివలింగార్చన గావించినచో పాపశాంతి కలుగునని చెప్పుట, లవుడు యక్షులను సంహరించి సువర్ణకమలమును మందారపుష్పములను తెచ్చుట రాముడు నరమేధ యాగమును ఆచరించుట, దాని కొఱకు వచ్చిన లక్ష్మణుడు మార్గమధ్యమున తరుచ్ఛాయ యందు విశ్రమించిన యుద్ధమునకు ఆహ్వానించిన లవునిపై మోహనాస్త్రమును ప్రయోగించి బంధించుట, వాల్మీకి విషయమును తెలుసుకొని కుశుని ద్వారా లక్ష్మణుని పరాజితుని గావింప చేయుట, రాముడు కూడా వాల్మీకి దత్త దివ్యాస్త్రములచే పరాజితుడగుట, పిమ్మట విషయమును తెలిసిన రాముడు సీతాపుత్రులను కలుసుకొనుట అను విషయములు మూల రామాయణము కంటె కథాసరిత్సాగరమున భిన్నముగా నున్నవి. నిర్దోష పరీక్ష కొఱకు 11వ శతాబ్దములో ఆచారములోనున్న అగ్నితైల జలాది పరీక్షలలో జలపరీక్ష సీతా పాతివ్రత్య నిరూపణ కొఱకు సోమదేవునిచే పరికల్పింప బడినది. లక్ష్మణుడు లవుని బంధించుట, సీతా పాతివ్రత్యము వాల్మీకిచే దివ్యదృష్టిచే తెలుసుకొనబడుట, పాపుల దర్శనముచే జనించు పాపమును తపశ్శక్తిచే వాల్మీకి పరి

హారణ సమర్థుడని చెప్పుట అను విషయములను బట్టి వాల్మీకి మహర్షి రామాయణ రచనకు పూర్వమే మహామహిమాన్వితుడై ఉండెనని గ్రంధకర్తయైన సోమదేవుని వచనముల వలన తెలుసుకొనగలుగు చున్నాము. ఇందు రాముడు నరమేధ యాగమున చేయు ప్రస్తావన యుండుటచే 11వ శతాబ్దములో నరమేధయాగములు ప్రచురముగా ఉండెనని తెలియుచున్నది. తత్కాలమున వివాహిత స్త్రీ జ్ఞాతి కులవాసము కూడా నిందింపబడినదని రామకథా సందర్భము వలన తెలుసుకొనగలుగుచున్నాము.

4.3.5. కథాసరిత్సాగరములో రాష్ట్రపాలనము

రాష్ట్రము :- రాష్ట్ర సుఖసమృద్ధి సంపాదనము రాజ ప్రధాన కర్తవ్యము. మంత్రి పరిషత్ సహాయముచే రాష్ట్ర వ్యవస్థ సుస్థాపితము చేయబడెను. ధన ధాన్యము, పశు సంపత్తి, సదాచార వ్యక్తులు, జంతువులు, వీధులు, వ్యాపారులు మొదలగు వాటి యొక్క సమృద్ధి రాష్ట్ర ఐశ్వర్యమును, ఔన్నత్యమును సూచించును. కథా సరిత్సాగరమున ఉత్తమ రాష్ట్ర లక్షణములన్నియు కలవు. ప్రజలు రాష్ట్రానురక్తి కలవారై యుండవలెను. ప్రజల సుఖసమృద్ధి ఈ గ్రంధమున కావ్యాత్మక శైలిలో చిత్రింపబడినది. "రాజనీతిలో సంధి, విగ్రహ, యాన ఆసన, ద్వైధీభావ, సమాశ్రయములనెడి షడ్గుణము లు పేర్కొనబడినవి. ఈ షడ్గుణ ప్రయోగమును రాజు ఆచరించవలెనని ఈ గ్రంధమున చెప్పబడినది".1 కథాసరిత్సాగర కాలీన పాలకు లందరూ షాడ్గుణ్య సిద్ధాంతమును అనుసరించుచుండిరి.

సంధి :- విశేష నియమాధారముల వలన పరస్పరము చేసుకొనబడు అంగీకారమును సంధి అందురు. సంధులు అనేక విధ ములు. పరాజిత రాజు విజేత నియమములను అనుసరించి ఆత్మ సమ

ర్పణము చేసుకొనును. దీనిని "అభిష" సంధి అందురు. సేనాపతిని రాజకుమారిని శత్రువు కడకు పంపి చేసుకొను సంధిని "పురుషాంతర సంధి" అందురు. శత్రు కర్మ సిద్ధి కొఱకు నేనొక్కడినే వెళ్ళగలను లేదా నా సైన్యము వెళ్ళగలదనెడి అట్టి నియమము ననుసరించి చేయ బడు సంధి "అదృష్ట పురుష సంధి" అని చెప్పబడును. ఈ మూడు సంధులలో మొదట రెండు సంధులందు విశ్వాసము కొఱకు విజేత అయిన రాజు ప్రముఖ రాజ పురుషుల కన్యలను వివాహమాడును. దీనిని దండోపనత సంధి అందురు. ధనాదులను స్వీకరించి అమాత్యు నకు విముక్తిని కలిగించినచో "పరిక్రమ సంధి" అందురు. పరిక్రమ సంధిలో నియమాధారముగా ధనము ఇవ్వబడినదో "ఉపగ్రహ సంధి" అందురు. కొన్ని సందర్భములలో ధనదాన వాగ్దానము చేయబడి నచో ప్రత్యయ సంధి అందురు. నిశ్చిత ధనమును నియమ సమయ పర్యంతము దానము చేయుట కన్యాది దానము ద్వారా భవిష్య త్కాలమున సుకకర సంధిని చేసుకొనుట సువర్ణ సంధి అందురు. ఈ సంధిలో ధనమును అడిగిన వెంటనే ఇచ్చినచో "విపరీత సంధి" అందురు. కథా సరిత్సాగరమున పైన పేర్కొనబడిన వాటిలో అనేక సంధులు వర్ణింపబడినవి. కన్యా సంబంధమను పేరుగల సంధియందు బహుళముగా ప్రయోగింప బడినది. ఉదయనుడు మగధరాజ పుత్రిని ఈ సంధిని అనుసరించి పరిణయమాడును. కానీ ఇందు ఉదయనుడు విరుద్ధకార్యమును ఆచరింప లేదను విషయమున సంశయమేర్పడు చున్నది. ఉదయనుని వలన పరాజితుడైన బ్రహ్మదత్తుడు సంధి దూతను పంపించి స్వయముగా ఆత్మసమర్పణ చేసుకొనును. విక్రమ శక్తి అను రాజు భయభీతుడై మహాసేనునితో సంధి చేసుకొనెను.

విగ్రహము :- కౌటిల్య మతము ననుసరించి అపకారమే విగ్రహము. ఈ విగ్రహము సమానబలునితోనే అచరింపవలెను. ఇది 8 విధములు. కథాసరిత్సాగరకాలమున పాటింపబడిన విగ్రహము కామజ విగ్రహము. కామజము, ఆష్టజము, లోభజము, మదోద్ధితము' భూభవము, ఏక ద్రవ్యాభిలాష, మానసంభవము, అభయము.

ఆసనము :- కౌటిల్యమతముననుసరించి ఉపేక్షణమును ఆసనమందురు. ఈ ఆసనము మానసోల్లాసముననుసరించి దశ విధ విధములు. 1 స్వస్థానసనము, 2 ఉపేక్ష్యాసనము, 3 మార్గశోధనాసనము, 4 దుర్గ సిద్ధ్యాసనము, 5 రాష్ట్రస్వీరకణాశ్రమము' 6 రమణీయాసనము, 7 నికటాసనము, 8 దూర మార్గాసనము 9 ప్రలోభాసనము, 10 పరాధీనాసనము.

యానము :- యానము అనగా ప్రయాణము. రాజు ఇతర రాజులపై దండెత్తుటకు చేయబడు ప్రయాణమును యానమందురు, వరియాణకాలమున యాత్రాసంబంధ కుశలచర్చ చేయబడి యున్నది. యుద్ధ సన్నాహా నంతరము విజయసూచనములచే ప్రసన్నుడైన ఉదయన మహారాజు శుభదినమున పూర్వ దిగ్విజయ యాత్రను ఆచరించెను,

సమాశ్రయము :- ఒకానొక రాజును శరణుపొందుట సమాశ్రయము. అశక్తుడైన రాజు పరాజయ సూచనను పొంది యుద్ధ విజయము కొఱకు బలవంతుడైన రాజు శరణుజొచ్చెను.

ద్వైధీభావము :- సంధి విగ్రహముల రెండింటినీ ఒకే సారి ప్రయోగించినచో ద్వైధీభావ మగును. కథా సరిత్సాగరమున కూడ షాడ్గుణ్య సిద్ధాంతమును అనుసరించి స్వదేశ, విదేశ రాజనీతి ప్రయోగింప బడుచుండెను.

శక్తి త్రయము :- ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహ శక్తి అని శక్తులు మూడు. "పరదేశ జిగీషుః స్యాత్ విచార్య స్వ పరాంతరమ్"2 మంత్రశక్తి జ్ఞానబలము. ప్రభుశక్తి కోశబలము. ఉత్సాహశక్తి సేనాబలము. విక్రమ బలము. కథాసరిత్సాగరమున విజిగీషులైన రాజులు ఈ మూడు శక్తులను సంపాదించుటకు నిరంతర ప్రయత్నము చేయ వలెనని ఉపదేశింప బడినది. రాజనీతి శాస్త్రము లన్నింటిలో శక్తి త్రయము వర్ణింపబడినది.

ఉపాయచతుష్టయము :- ప్రాచీన రాజనీతి శాస్త్రము ననుసరించి సామ, దాన, భేద, దండోపాయములచే రాజ్యవిస్తరణ గావించి ప్రభుత్వమును స్థాపింపవలెనని చెప్పబడినది. కథాసరిత్సాగరమున ఈ నాలుగు ఉపాయములు విస్తృతముగా వర్ణింపబడినవి. ఉదయముని మంత్రులు నాలుగు ఉపాయముల ఆవశ్యకతను ప్రతిపాదించిరి. "సామదానాద్యుపాయజ్ఞో యోగక్షేమం ప్రసాదయేత్" విజిగీషుడైన రాజు కార్యాకార్యవిభాగమును చేయవలెను." అసాధ్యం యదుపాయేన తత్కార్యం పరిత్యజ్యతే తత్కార్యం యదుపాయేన సాధ్యం తత్ చతుర్విధమ్" మృగాంక దత్తుడను రాజు కర్మసేనుని పుత్రిని వివాహమాడుటకు స్వాభిలాషను ప్రకటించెను. అతని మంత్రియైన మాతంగరాజు విజిగీషువునకు కార్యాకార్య భేద జ్ఞానము ఆవశ్యకమని విచారించెను. ఉపాయముచే కూడ సాధింపరాని అసాధ్య కార్యమును పరిత్యజింప వలెను. కథాసరిత్సాగరమున సామము కంటె దండము నికృష్టమని చెప్పబడినది."3 ఈ విషయమున మాతంగ రాజు మృగాంక దత్తునితో లోపరహితుడైన "కర్మసేనుడు" దానము వలన వశీకృతుడు కాడు. ఇతనిచే అసంతుష్టుడైనవాడు ఎవ్వడూలేడు. అందువలన భేద ప్రయోగము కూడ అయుక్తమే. బలశాలి అగుట

వలన దుర్గరోధముచే దండ ప్రయోగము కూడ అయుక్తమే కావున సామప్రయోగమే ఉచితమైనది" అని చెప్పెను.

శాసన వ్యవస్థను గూర్చి కథాసరిత్సాగరమున సముచిత స్థలత్యాధారములు లభింపవు. అశోకాది రాజుల కాలములోని శాసన వ్యవస్థను అనుసరించియే రాజులు కుశల ప్రశిక్షత, ప్రశాసక పద్ధతిలో రాజ్యమును పాలించుచుండిరి. "అతుల చటర్జీ" అభిప్రాయము కూడ పై విషయమును బలపరుచుచున్నది. గ్రామ, నగర చర్చ విశేషముగా కథాసరిత్సాగరమున ఉన్ననూ తద్విభాగాధిపతి నిర్దేశము మనుస్మృతిని అనుసరింపలేదు. తత్కాలీన ప్రకాశకులు రెండు విధములుగా విభజింపబడిరి. మొదటి విభాగములోని అధికారులు శాసనకార్యమును నిర్వహించుచుండిరి. మొదటి వర్గములోని రాజ్యాధికారి, ముఖ్యప్రతీహారి నర్మసచివుడు, వినోదమంత్రి, చారాధికారి, పురోహితుడు, సేనాధిపతి, ద్వారపాలకుడు, లేఖహారుడు, అంతఃపుర చేటి. ద్వారపాలిక మొదలగువారు ఉందురు. రెండవ వర్గమున నగరాధ్యక్షుడు, నగర రక్షకుడు, నగర సేనాధ్యక్షుడు మొగలగు వారుందురు.

ప్రతీహారి :- దక్షుడు, మధురభాషి, వినయ సంపన్నుడు సర్వచిత్తాకర్షకుడై ఉన్నతుడైనవాడు ప్రతీహారి. అతడు రాజుకు పరమ ప్రియుడు. కథాసరిత్సాగరమున ప్రతీహారుల సంఖ్య అత్యధికము. ప్రతీహారులలో ఒకడు ముఖ్యుడుగా నుండును. ద్వారపాలికలు కూడా ఈ గ్రంథమున నిర్దేశింపబడిరి.

లేఖహారుడు :- ఇతడు కూడ కథాసరిత్సాగరమున నిర్దేశింపబడెను. ఇతనికి అనేక నామములు కలవు. శుక్రనీతిని అనుసరించి

గణనా కుశలో యస్తు దేశభాషా ప్రభేదవిత్" అసందిగ్ధమగూఢార్థం విలిఖేత్ సచలేఖకః అని చెప్పబడినది.

రాష్ట్రాధికారి :- రాష్ట్రాధికారుల అనైతికాచరణమును గూర్చి అనేక కథలందు కలవు కౌటిల్య మతము ననుసరించి రాష్ట్రాధికారులు విభజింపబడిరి. రాష్ట్రాధికారులలో నగరపాలకుడు ఉపకోశను అనైతిక బుద్ధితో అనుసరించెను. నగర పాలకుని అధీనమున అనేక సేవకు లుండిరి.

న్యాయము, దండము :- రాజ్యము న్యాయరాజ సుఖ శాంతులు ఏక దధీనములు, కథాసరిత్సాగరకాలీన పాలకుల న్యాయము, దండ విధానము ప్రాచీన సిద్ధాంతము ననుసరించియే యుండెను. నియమోల్లంఘనము గావించినచో కఠోర దండన విధిం చబడుచుండెను. రాజే న్యాయపాలనమున సర్వోన్నతాధికారి. కానీ న్యాయ నిర్ణయమున అతనికి స్వాతంత్ర్యము లేకుండెను. ప్రమాణ మును, సాక్ష్యమును ఆధారముగా గొని రాజు న్యాయ నిర్ణయము చేయుచుండెను. ఒకప్పుడు వాసవదత్త ఒక కులటను స్వప్నమున దర్శించెను. స్వప్న దృష్టయైన ఆమె రాజసభకు వచ్చి పతిపై అభియోగమును ఆరోపించెను. రాజు వాసవదత్త యొక్క స్వప్న ఫలమును విని తదాధారముగా దండింప దలచెను. కానీ యౌగంధ రాయణుడు ప్రమాణము సాక్ష్యము లేకుండా న్యాయనిర్ణయము చేయ కూడదని చెప్పెను. పిమ్మట సాక్షివచనమును విని అపరాధినియైన అ స్త్రీని దేశ బహిష్కారము గావించిరి. పరదారాభి గమన దోషము ఆరోపింపబడినచో దేశ నిష్కాసనము, అతని సంపదను స్వాధీనము చేసుకొనుట దండరూపముగా నుండెను. దానినే సర్వస్వ హరణ దం డనమని పేర్కొనిరి. ధనము నపహరించిన వాని ధనమునంతటినీ

స్వీకరించి అతని హస్త పాదములను ఛేదించుమనిరి. స్వల్ప అపరాధము చేసిననూ ఒకప్పుడు మృత్యుదండము కూడా విధింపబడుచుండెను. చౌర్యఫలమూ మృత్యు దండ విధానమే. రాజద్రోహికి మృత్యుదండము అనివార్యముగా నుండెను. బ్రాహ్మణ సోమదత్తుని బంధించుటకు రాజు సైన్యమును పంపెను. సోమదత్తుడు ఆ సైన్యముతో కలహించెను. ఈ అపరాధము ఆధారముగా గొని సోమదత్తునకు మృత్యుదండము విధింపబడెను. అప్పుడప్పుడూ తమ నిర్దోషముల గూర్చి ప్రమాణము కూడ ఉద్దండ యువకులు చేయవలసి యుండెను కథాసరిత్సాగర కాలమున బ్రాహ్మణులు, దూతలు అవధ్యులుగా నుండిరి. అల్పశక్తి ప్రయోగము చేతనే సువ్యవస్థ ఏర్పాటగునపుడు అదిక శక్తి ప్రయోగము నిషేధింపబడెను. కుబేరుడు స్వానుచరులకు బ్రహ్మహత్యాకారణముచే శాపమునిచ్చెను. "బ్రహ్మ హత్యాకధం పాప హారితా సహసా త్వయా నివార్యతే నవిత్రాస్య విఘ్నైస్తైః నహన్యతే".

దూత :- రాజ్యాంగములలో దూత ప్రధానుడు. రాజ్యాధికారములలో ఇతని పాత్ర మహత్తరమైనది. ప్రాచీన కాలమున కూడ రాజనీతిలో దూతకు మహత్త్వపూర్ణస్థాన మీయబడినది. కథాసరిత్సాగరమున దూతకుండవలసిన గుణములు వర్ణింపబడినవి. ప్రతిభాశాలి, గంభీరభాషి, కార్యకాలజ్ఞుడు, కఠోరుడు, సహిష్ణువైనవాడు దూత "ఏషః స ప్రతిభో వాగ్మి గతిజ్ఞః కార్యకాలయోః కర్కశశ్చ సహిష్ణుశ్చ సర్వదూత గుణాన్వితః".

ప్రాచీనకాలము నుండి దూత అవధ్యుడుగా చెప్పబడెను. బ్రాహ్మణహత్య, దూతహత్య శాస్త్ర విరుద్ధమైనది. మృగాంకుడను రాజు కర్మసేన పుత్రి కొఱకు దూతను పంపించెను. కర్మసేనుడు క్రుద్ధుడయ్యెను. నీవు దూతవగుట వలన అవధ్యుడవు. లేకున్నచో

ఇట్టి మాటలచే నీవు అవశ్యమూ వధ్యుడవే" అని చెప్పెను. సైన్య విహీనుడైన రాజు దూత ప్రేషణమున అనధికారి.

గుప్తచరుడు :- గుప్తచరుడు రాజనేత్రము. ఇతని వల ననే రాజు రాజ్యగతి విధిని దర్శించును. ప్రాచీన కాలమునుండి ఇతనికి మహత్త్వము కలదు. కౌటిల్యమతము ననుసరించి గుప్తచరులు నవవర్గములుగా విభజింపబడిరి. అక్రమణోద్దేశ్యమును బట్టి ఈ గుప్తచరులు ప్రయోగింపబడుచుండిరి. యౌగంధరాయణుని గుప్త చరుడు కాపాలిక వేషము ధరించి బ్రహ్మదత్తుని రాజ్యమున ప్రవే శించెను. ఆ గుప్తచరుడు బ్రహ్మదత్తుని ద్వారా చేయబడిన ప్రతి బోధములను, ఉపాయములను యౌగంధరాయణునకు విశదీకరించెను "రాజు కర్తవ్యమును గూర్చి ఇట్లు చెప్పబడెను. రాజు గుప్తచరుల ద్వారా మంత్రుల రహస్యములను తెలుసుకొనవలెను. గుప్తచరుల అధికారిని చారాధికారి అని వ్యవహరించిరి." స్త్రీలు కూడా గుప్తచర కార్యమునకు నియమింపబడిరి.4 అపరాధ విషయ సాక్ష్యము కొఱకు కూడ స్త్రీలు ఉపయోగింపబడుచుండిరి.

సేన-యుద్ధసామాగ్రి :- సైన్య శక్తిచే రాజు ప్రతిభా శాలి యగును. శుక్రనీతిని అనుసరించి శస్త్రాస్త్ర సజ్జిత మనుష్య సంఘటిత సముదాయమే సేనయని చెప్పబడుచున్నది. సేనా సంఘ టన స్వరూపము కథాసరిత్సాగరమున శుక్రాచార్యమతము నను సరించియే యున్నది. యుద్ధలిప్సగల అనేకరాజులు ఆక్రమణము నకు సంబంధించిన అనేక సందర్భములు కథాసరిత్సాగరమున కలవు వారి శస్త్రాస్త్రములు, యుద్ధకౌశలము, కపట ప్రయోగము పూర్వ కాలము కంటె అధికముగా, వైజ్ఞానికముగా ప్రభావశీలిగా నుండెను సర్వసమస్యలకు యుద్ధమే కారణమని తత్కాలీనులు విశ్వసించిరి.

సైనిక మనోబలమును పెంచుటకు యుద్ధజన్యమృత్యువే సర్వోత్కృష్టమని చెప్పబడెను. యుద్ధ మృత సైనికుల ఆత్మ స్వర్గమునకంటె ఉన్నత స్థానమున ప్రవేశించును. శాస్త్ర జ్ఞానము కంటె శాస్త్ర విద్యకు అధిక మహత్త్వము కలదు. రాజులకు శస్త్రాస్త్ర సంచాలన ప్రావీణ్యమపేక్షింపబడెను, రాజులు నిరంతరము శస్త్రాస్త్రభ్యాసమును ఆచరింపవలెను. శస్త్రాస్త్ర విద్యలో అశిక్షితుడైన రాజు యుద్ధ సాఫల్యమును పొందజాలడు. వ్యాయామము. లక్ష్యవేధ శస్త్రాభ్యాసము వేట కర్తవ్యములుగా నిర్దేశింపబడినవి. శాస్త్రకోశము లేనిచో శస్త్రాధికారులు యుద్ధ విజయమును సంపాదింపలేరని చెప్పబడినది. కథా సరిత్సాగరమున చతూరంగ సేనామహత్త్వము వర్ణింపబడెను. మహాసేనుని చతురంగ సైన్యము బయలు దేరెను, హరి భటాది రాజుల వద్ద లక్ష రథసైన్యము, 40 వేలు పదాతి సైన్యము అగణ్య గజాశ్వ సైన్యము ఉండెను.

పదాతిదళము :- భారతీయ సైన్యమునకు పదాతిదళము మేరుదండము. ఇది ఏడురకములు. వంశ క్రమానుగతమైన పైతృక సేన, ధనాగతమైన భృత్యసేన, మిత్రాగతమైన మిత్రసేన నిశ్చిత సమయమున సహాయమునిచ్చు సేన, శ్రేణీసేన, పర్వత ప్రదేశమున భిల్ల నిషాద శబరాది సంఘటితసేన, ఆటవిక సేన రత్రుసేనచే ఆక్రమింపబడి పరుగెత్తుచూ పిమ్మట స్వీకృత దాస్యభావముగలసేన అమిత్రసేన అని చెప్పబడెను. కథాసరిత్సాగరమున ఈ సప్తవిధసేన అభివర్ణింపబడినది. ఉదయనాదులకు పైతృకసేనయుండెను. రాజులకు అవసరమేర్పడినపుడు శబరసేన సహాయము చేయుచుండెను. అమిత్రసేన కూడ ఇందువర్ణింపబడినది, దేవదత్తుడను రాజు కర్ణభూషణమును విక్రయించి ఆ ధనముచే సైన్య

మును సంపాదించెను. ఇది భృత్యువేన పదాతిదళము ఇతర సైన్య ము కంటె మహత్త్వపూర్ణమైనది.

గజబలము :- "ప్రధాన విజయో రాజ్ఞామ్" అని కౌటిల్యుడు గజబలమును గూర్చి చెప్పెను. కథాసరిత్సాగరమున గజబలము యుద్ధ విజయమున అవశ్యకమై చెప్పబడెను. శ్రుతశర్మ సేనలో గజబలమును చూచి సూర్యప్రభ మొదలగు వారు కూడ గజారూఢమైన సైన్యమును సంహరించుచుండిరి. గజబలచర్చ కథాసరిత్సాగరము నందంతటనూ కలదు. భద్రబాహువనురాజు వారణాసి ప్రభువైన ధర్మబాహువుయొక్క గజమును ధ్వజముచే సంహరించెను. గజ విరహితమైన అతని సైన్యశక్తి క్షీణించెను. తత్ఫలముగా అతడు కన్యాదానమునకు సంసిద్ధుడయ్యెను.

అశ్వసేన :- కథాసరిత్సాగరమున అశ్వసేనకు సంబంధించిన విస్తృత వర్ణన కలదు. కాంభోజ సైంధవాశ్వములు ఉత్తమాశ్వములని అవిరాజ హితకారులని చెప్పబడెను. మార్గమును విస్మరించిన ఆదిత్యసేన రాజును అశ్వము యుక్త మార్గములో నడిపించెను. ఉత్తమ అశ్వములు విషమస్థితిని సానుకూలము చేయును.

రథబలము :- కథాసరిత్సాగరమున గజ అశ్వ సైన్యముతో పాటు రథసైన్యము కూడ వర్ణింపబడినది. పవనాక్షిప్త విక్షిప్తైస్తస్య సేవాధ్వజాంశుకే" అని చెప్పవడుటచే రథగజ వర్ణనకూడ ఇచ్చట కలదు.

సైన్యసంఘటనము :- ప్రశాసన సౌకర్యము కొఱకు సువ్యవస్థగల సైన్య సంఘటనము అవశ్యకము రాజు సర్వ సేవాధ్య

క్షుడు. తదనంతరము సేనాపతి ద్వితీయ స్థానమును ఆక్రమించును. సేనాపతి పదవి నుండి సైనిక పదవి వరకు వేతన వ్యవస్థయుండెను. మాయాసురుడు సర్వసేన కొఱకు నిరీక్షించెను. రథసేవకు సంబంధించిన విభిన్న సంఘటనల గూర్చి అతడు విస్తృతముగా వర్ణించెను. కథాసరిత్సాగరమున దళనాయకుడు మహారథి, మహారథ దళనాయకుడు మహారథ యూధపుడు, అతిరథ నాయకుడు, అతిరథ నాయకుడు, అతిరథ యూధపుడు ఇత్యాది విధముగా రథాధిపతులు వ్యవహరింపబడిరి. సైనికశక్తి ననుసరించి మహారాజు, రాజు అని వ్యవహారముండెను. శ్రుత శర్మ అధీనమున 100 మంది రాజు లుండిరి. వారిలో ఒక్కొక్క రాజునకు 32 వేల పదాతిసైన్యముండెను.

శస్త్రాస్త్రములు :- కథాసరిత్సాగరమున శస్త్రాస్త్ర ప్రయోగమున ప్రాచీన, నవీనయుగ సమావేశముండెను. ధనుస్సు, బాణము, ఖడ్గము, చక్రము, గదాదులు, ప్రాచీనములు. భల్ల, వరశు, ముద్గర, ముసల, శూలాదులు నవీనములు. ద్వివిధములైన శస్త్రాస్త్రములిందు ప్రయోగింపబడినది.

వ్యూహప్రతివ్యూహములు :- శ్రుతశర్మబలమున చక్రవ్యూహమును దామోదరుడు సన్నద్ధము చేసెను. "వజ్రవ్యూహం ప్రథాసశ్చ దామోదరో మహాసూచివ్యూహం విద్యాధరోత్తమః" అనునది కథాసరిత్సాగరమందలి ఉదాహరణము. ముందు వెనకల వ్యవస్థితమైన వ్యూహమును వజ్రవ్యూహమందురు. కథాసరిత్సాగరమున దామోదరుడు మహాసూచి వ్యూహమును నిర్మించెను.

ప్రతివ్యూహము :- వ్యూహభేదమునకు ఉపయోగింపబడు వ్యూహము ప్రతివ్యూహము. మంద్రదేవుడను రాజుయొక్క వ్యూహమును ఛేదించుటకు నరవాహన దత్తుడు ప్రతివ్యూహమును నిర్మించెను.

యుద్ధము :- కథాసరిత్సాగరమున మూడు విధములైన యుద్ధములు వర్ణింపబడినవి. మొదటి పద్ధతిలో రాజు స్వసేనతో కలిసి యుద్ధ రథుడగును. ఉభయ పక్షములందు సైన్యము నశించినపుడు వారు ద్వంద్వయుద్ధ ప్రవృత్తులగుదురు. ఉభయుల శస్త్రములు నశించినపుడు బాహుయుద్ధము ఆరంభమగును. అందు శరీరబలముచే యుద్ధము చేయుదురు. శ్రుతశర్మ సూర్యప్రభల యుద్ధమున అధిక సైనిక బలము నశింపగా వారు ద్వంద్వ యుద్ధ ప్రవృత్తులైరి. పిమ్మట బాహుయుద్ధ ప్రవృత్తులైరి. ఇట్లే ముక్తాఫల విద్యుద్ధ్వజులకు యుద్ధము ఏర్పడినపుడు వీరిరువురూ ద్వంద్వయుద్ధమును ఆచరించిరి. దీనినే బాహుయుద్ధమని మల్లయుద్ధమని వ్యవహరించిరి.

యుద్ధకారణములు :- సామ్రాజ్య విస్తారము నారీసౌందర్యము, ఆత్మసంస్థానరక్ష అనుమూడు యుద్ధకారణములుగా కథాసరిత్సాగరమున వర్ణింపబడినవి. చక్రవర్తిత్వము కొఱకు యుద్ధము ఆచరింపబడుచుండెను. రాజ్యాభిషేకానంతరము ఉదయనుడు తత్పుత్రుడు నరవాహనదత్తుడు పృథ్వీ విజయము కొఱకు బయలుదేరిరి. నరవాహనదత్తుడు చక్రవర్తిత్వ ప్రాప్తి కొఱకు విద్యాధరులలో అనివార్యమైన యుద్ధము నాచరించెను. సుందరీ ప్రాప్తికొఱకు చేయబడు యుద్ధములలో ఉపాయములన్నీ నిష్ఫలములు కాగా ఓడిపోయిన రాజు సైన్యబలముతోడ కన్యను గూడ ఇచ్చుచుండెను. దేవదత్తుడను

రాజు ఆత్మ గౌరవము కొఱకు యుద్ధమును ఆచరించి రాజ్యమును సంపాదించెను.

యుద్ధాచారనియమములు :- మొదట రాజు ప్రతిపక్ష రాజు కడకు యుద్ధ నివారణ కొఱకు దూత ద్వారా సందేశమును పంపవలెను. దౌత్యకార్యము నిష్ఫలమైనపుడు యుద్ధమే శరణ్యము. శక్తివంతుడైన రాజే దండప్రయోగమును ఆచరింపవలెను. యుద్ధమును అతి క్రౌర్యమును అవసరమైన సమయములలో మాత్రమే ప్రదర్శింపవలెను. మృగాంకదత్తుడనురాజు దౌత్యకార్యము నిష్ఫలమైనపుడే యుద్ధమును ఆచరించెను. రాజు రాజ్యమున లేనప్పుడు శత్రురాజు తన అనుపస్థితిని తెలుసుకొని స్వరాజ్యమును ఆక్రమించునసెడి భీతి రాజులకుండెను. అందువలన అనేక ఉపాయములను ఆలోచించుచుండిరి. స్థిరసేనాపతికంటె భిన్నముగా ఆక్రమణ విశేషార్థము మరియొక సేనాపతిని రాజు నియోగించుచుండెను. ఒకానొక రాజు గోపాలకునకు మిథిలా రాజ్యము నిచ్చెను. పద్మావతీ సోదరుడైన సింహవర్మకు చేదిరాజ్యము నిచ్చెను. భిల్లుల రాజైన పుళిందకునితో మైత్రిని ఆచరించెను. పిమ్మట రాజ్యమున విజయయాత్రా సన్నాహము ప్రారంభమయ్యెను. గుప్తచరుల వలన శత్రురాజ్య సమర సన్నాహము తెలుసుకొనబడుచుండెను. కుశలి అయిన రాజు శత్రు రాజసంబంధ అమాత్యాదులను ప్రలోభ పెట్టి తనతో సంధిచేసుకొనుటను ప్రయత్నించుచుండెను. మృగాంకదత్తుడను రాజు కర్మసేనుని అధికారులను ప్రలోభపెట్టి వారిని తన పక్షము వైపు త్రిప్పుకొన ప్రయత్నము చేసెను. కానీ కర్మసేనుని అధికారులు పరిలోభమునకు లొంగిపోలేదు, స్వసైన్యశక్తి పెంపొందించుటకు మిత్రరాజ్య సైన్య

సహాయమును కూడా అపేక్షించుచుండిరి. మృగాంకదత్తుడు శబరాధీశుని నుండి సైనిక సహాయమును స్వీకరించెను. యుద్ధ సన్నాహము పూర్తియైన పిమ్మట శత్రురాజ్య అక్రమణమునకు బయలుదేరుచుండిరి, విజయానుకూల పరిస్థితిని గూర్చి విశ్లేషణము చేయుచుండిరి. ఈ కాలము దైవానుకూలము. ఇందు పురుషార్థము కూడా కలదు. నీ మంత్రి గుణము కూడ రాజనీతి పాండిత్యము కలది, అందువలన తప్పక యుద్ధ యాత్రను ఆరంభింపవలెనని యౌగంధరాయణుడు ఉదయనునితో చెప్పెను. అనిష్టశమనము కొఱకు వ్రత పూజాదులు అనుష్టింపబడు చుండెను. ఉదయనుడు యుద్ధవిజయము కొఱకు ఉపవాసము లను ఆచరించెను.

సైనిక ప్రయాణము :– రాజు గజము నధిరోహించి మొదట సర్వసేనకు ముందు భాగమున వెళ్ళుచుండెను. అధర్మయుద్ధము నిషేధింపబడెను. "అధర్మ యుద్ధేన జయం కోపీచ్ఛేత్ క్షత్రియో భవన్" మారమున ప్రయాణాను కుల్యము కొఱకు తగిన ప్రయత్నము చేయుబడుచుండెను. రణభేరి నినాదము చేయుబడుచుండెను, రాజుతో సహా మహారాణులు కూడ యుద్ధభూమిననుసరించు చుండిరి. ఉదయనుని పత్నులు యుద్ధమున ఉదయనుని అనుసరించిరి. సైనిక ప్రయాణముచే పాదమార్గము సమ్మర్దనము చేయుబడుచుండెను. సోమదత్తుని క్షేత్రము సైన్యము వలననే యుధ్వస్థమయ్యెను.

సైనికోత్సాహము :– ఉత్సాహవంతులైన సైనికులు దుష్కర కార్యమును కూడ అచరింతురు. సైనికులకు మనోబలము అవశ్యకము. అనవతరము ఘోషింపబడు యుద్ధఘోష సైనికులను యుద్ధప్రేరితులను చేయును. సంగ్రామేనామ శూరాణాం ఉత్సవోహి

మహానయమ్" అని ఈ గ్రంథముననే సంగ్రామము ప్రశంసింప బడినది.

సైన్యశిబిరములు :- కథాసరిత్సాగరమున శిబిర స్థానమున కటక పదము ప్రయోగింపబడినది. సూర్యప్రభుని సేనా సాయం సమయమున యుద్ధమును పరిసమాప్తి చేసి స్వకటకమునకు వెళ్ళెను. కటకమునకు నలుపైపులా శత్రుదుర్భేద్యమైన కటక విశేషముండెను. రాజపత్నులకు కూడ కటకమున ఉచిత స్థానములు నియమింపబడెను. పరాజితులైన సైనికులు కూడ కటకమున బంధింపబడుచుండిరి. రణభూమి విశాలక్షేత్రముగా నుండెను. సూర్యప్రభుడను రాజు శ్రుతవర్మను విస్తృత క్షేత్రమునకు వెళ్ళుమని సందేశమును పంపెను. యుద్ధమున విజయమును పొందిన విశిష్ట వీరులను పట్టబంధములు ఇవ్వబడుచుండెను.

కూటనీతి :- కథాసరిత్సాగరమున కూటనీతి ప్రయోగము అత్యధికము ఉదయనుని బంధించుటకు చండ మహాసేనుడు యంత్ర గజమును నిర్మించి అందులో సైన్యము నుంచెను. ఏకాకియై ఉదయనుడు గజ వశీకరణమునకు వెళ్ళి అందలి సైన్యముచే బంధింపబడెను. యౌగంధరాయణుడు కూడా పోటనీతిని ప్రయోగించి చండ మహాసేనునిపై ప్రతీకారమును ప్రదర్శించెను. వసంతక యౌగంధరాయణులు కాపాలిక వేషమును ధరించి యుద్ధము లేకయే ఉదయనునకు విముక్తిని కలిగించిరి. "బ్రహ్మదత్తుడనురాజు ఉదయనుని యుద్ధయాత్రా మార్గమున వివిధ వినాశజాలములను నిర్మించెను. విషకన్యా ప్రయోగము కూడా గావించెను."[5] యౌగంధరాయణుడు బ్రహ్మదత్తునిచే ప్రయోగించిన విషప్రయోగము లన్నింటినీ నిష్ఫలము గావించెను. ముద్రారాక్షస నాటకమున గూడా విషకన్యాప్రయోగ

ప్రస్తావన కలదు. శేష పరిణామము కూడా యుద్ధమున కూటనీతిలో భాగమే. కుబేరదత్తుని మహామాయుడు విభిన్నరూపధారణముచే సంహరించెను. పుణ్యసేనుడను రాజు అధిక శత్రుబలముచే ఆక్రమింపబడి స్వర్గస్థుడయ్యెనని ప్రకటింపబడి పిమ్మట దానిని విశ్వసించి వచ్చిన శత్రురాజుపై దండెత్తి విజయమును పొందెను. అసత్యమును భయాశంకను కలిగించి యుద్ధ విజయమును పొందుచుండిరి. మహాసేనుడు సైనికావృతుడై యుండెను. అతని మంత్రి దేవదూత రూపమును ధరించి నిద్రాళువైన రాజు కటకమున ప్రవేశించి నేను దేవదూతను నీవు సంధిని చేసుకొనవలయును. లేనిచో నశింపగలవు అని హితబోధ చేయుటకు వచ్చితినని చెప్పెను. ఇట్లు అనేకవిధ కూటనీతి ప్రయోగముల విస్తృతవర్ణన కథాసరిత్సాగరమున లభించుచున్నది.

4.3.6. కథాసరిత్సాగరమున భౌగోళిక పరిస్థితి

భారతదేశమునందలి భూ సంబంధ సీమా విస్తార ద్వీప, జన, పర, గ్రామ, నగర, పర్వత నదీ వన ప్రదేశములు

ఆర్యావర్తనము :- సంపూర్ణదేశమునకు ఆర్యావర్తనము లేదా భారతమనెడి పేరు ఇచ్చట లభింపదు. భిన్నముగానున్న ప్రాంతములకే పేర్లు కనబడుచున్నవి. ఉత్తరాపథము, దక్షిణాపథము మధ్యదేశము, పూర్వభాగము అపరాంతము మొదలగు విభిన్న దేశముల పేర్లు వినబడుచున్నవి. సమస్త భారతదేశమును పృథ్వీ అని వ్యవహరించుచుండిరి. విభిన్న నగరముల సంపూర్ణ భూమి క్షితి అని, భూః అని మేదిని అని ప్రసిద్ధముగా పేర్కొనబడెను. యౌగంధరాయణుడు సంపూర్ణ పృథ్విని ఉదయనుడు జయించెనని చెప్పియున్నాడు. ఉదయనుని విజయ యాత్ర వారణాసి నుండి ప్రారంభమగును.

క్రమముగా అతడు వంగ, కళింగ, చోళ, మురల మొదలగు దేశ నాయకులను ఓడించి ఉజ్జయినిని చేరెను. మరల లాట, కైలాస, కామరూప దేశములను జయించెను. గధకు వెళ్ళెను. ఉదయన విజయము సంపూర్ణ పృధ్వీ విజయముని వర్ణింపబడెను. నిగిర్ణ విసుదాతలః అని అందలి ప్రయోగము. ఇట్టి అతిశయోక్తి పూర్ణవర్ణనము ప్రాచీన కాలమున కూడ కలదు. చిన్న దేశమును పాలించువారు కూడా కవులచే సమ్రాట్, మహారాజాధిరాజు అవనీపతి మొదలగు సంబోధనలచే సంబోధింపబడిరి. సుదూర ద్వీపములను క్రమ పద్ధతిలో వర్ణించుట వలన కవి భౌగోళిక జ్ఞానము వ్యక్తమగుచున్నది.

జంబూద్వీపము, ఆర్యావర్తనము భారత వర్షము మొదలగు నామములు ప్రాచీన కాలమునుండి ప్రసిద్ధిలో నున్నవి1 రామాయణ మహాభారత పురాణాలు దీనికి ప్రమాణములు. దేశము, రాష్ట్రము, విషయు, దేశ, రాష్ట్ర, సామ్రాజ్యాది శబ్ద ప్రయోగము కొన్ని స్థలము పరిమితార్థమును మరికొన్ని స్థలములలో పర్యాయ వాచకత్వమును తెలియ జేయుచున్నది. సర్వత్రా అతిశయ పూర్ణ వచనములకు ప్రాధాన్యము ఇవ్వబడినది.

పృధ్వీ వ్యుత్పత్తి :- ప్రాచీన మాన్య పద్ధతిననుసరించి యే పృధ్వీ ఉత్పత్తి వర్ణింపబడినది. ప్రాచీన కాలమున పార్వతీ పరమేస్వరులు పృధివిని సృష్టించినట్లు చెప్పబడినది." పురా కల్ప క్షయే వృత్తి జాతం జలమయం జగత్" మయాతతో రక్తబిందుర్ని, పాతితః పూర్వము కల్పక్షయము సంభవించినపుడు జగత్తంతయు జలమయమయ్యేను. అపుడు నానుండి రక్త బిందువు స్రవించెను. "జలాంతమభూ దండం తస్మాత్ ద్వేధా కృతాత్ పుమాన్ నిరగచ్ఛత్ తతః ప్రజాపతీ సన్యాన్ సృష్టతన్తో ప్రజాశ్చ తే అతః పితామహః ప్రోక్తః

సపుమాన్ జగత్ ప్రియే అత ఏవ ససర్జాదౌ తాసుబీజ మహా సృజత్ కించ ఏతన్మే కపి లాత్మ జగద్దేవ కరేస్థితమ్" అని శివ వచనము పైన పేర్కొన్న అండకాలమున రెండు రోదసులు పరికీర్తింప బడినవి.

పృథ్వీ స్వరూపము :- అండాకారము. ప్రకృతి పురుషుల సంసర్గముచే పృథ్వి నిర్మింపబడినది. శివుడే సృష్టికి మూలకారణుడు, సంపూర్ణ బ్రహ్మాండము కపాలసమానము. పృథ్వి అండ సమానము, అండము ఆకాశమని, కపాలము పృథ్వి అని రోదసి అని పేర్కొన బడెను.

సప్త ద్వీప సప్త సముద్ర పరివేష్టిత పృథ్వి :- కథా సరిత్సాగరము ననుసరించి పృథ్వి ద్వీపములచే, సప్త సముద్రము లచే పరివృత్తమై యున్నది.1 ఒకే గ్రంథమున పృథ్వి చతుస్సము ద్రములచే కూడ పరివృతమైనట్లు కీర్తింపబడెను. చతుస్సముద్ర పరి పరివృత పృథ్వి అతి ప్రాచీనమైనది. పృథ్వికి శిరోభాగమున ఉత్తర దక్షిణ వేది ప్రాంతము విద్యాధరాధికారముండెను. ఉత్తర ధృవము దక్షిణ ధృవము దేవస్థానమని చెప్పబడెను. అర్య ధర్మశాస్త్రములతో కూడ దక్షిణ ధృవము దేవస్థానము లేదా పితృయాన మార్గమని ఉత్తర ధృవము దేవయానమార్గమని చెప్పబడెను. ఈ రెండు స్థాన ములలో విద్యాధరులు నివసించుచుండిరి. ఉత్తర దక్షిణ వేదిశాసకుడు చక్రవర్తి అని వర్ణింపబడెను.

సీమా విస్తారము :- ఏకాదశ శతాబ్దము వఱకు భారతదేశ మునకు సుదూర దేశములతో ఘనిష్ఠ సంపర్కము ఉండెను. సాము ద్రిక యాత్రా యాత్రలచే మార్గము ప్రశస్తమై యుండెను. వాణి జ్యము వలన అన్యదేశ జ్ఞానము ఏర్పడెను. పశ్చిమమున గాంధార దేశము భారతదేశమునకు బాహ్యసీమగా ఉండెను. పారశీక తురుష్క

ఖాజ్ఞికాది నామములు పేర్కొనబడుటచే భారతీయులు నాడు ఉత్తర దిక్కునందు నేపాల, అలక, మానస సరోవరాదులను దాటి చైనా దేశమునకు కూడా వెళ్ళుచుండిరని తెలియుచున్నది. కథాసరిత్సాగరమున సువర్ణద్వీప, నారికేళ ద్వీప, శ్వేత ద్వీపాది యాత్రా ప్రసంగములవే నిరతియున్నది. దక్షిణదిక్కున భారతీయులు సింహద్వీప యాత్రను కూడా నిర్వహించిరి.

దేశ విభాగము :- దేశవిభాగమున మధ్యదేశము, అప రాంతము, ఉత్తరాపథము, దక్షిణాపథము, పూర్వదేశము అనునవి ప్రసిద్ధములు. కథాసరిత్సాగరమున మధ్యదేశము అనేకసార్లు నిర్దే శింపబడెను. భారతదేశ విభాగములలో ఇది సర్వోత్కృష్టమైనది. దీని విస్తారము మనుస్మృతిని రాజశేఖర కవి మతమును అనుసరించి యున్నది. దేశేష్వపిచ వాద్యాద్రి హిమమధ్యవర్తిషు జాహ్నవీ జల పాతోయః సప్రశస్తతమోమతః" అని మధ్యదేశమిందు ప్రస్తుతింప బడినది.

అంతర్వేది :- గంగా యమునా మధ్యప్రదేశమును అంతర్వేది అందురు. అపరాంతము. కథాసరిత్సాగరమున భారత పశ్చిమ ప్రదేశమును అపరాంతమని వ్యవహరింపబడెను. ఈ పదము నకు పశ్చిమ ప్రాంతమని అర్థము. సముద్ర పర్యంత సమస్త భారతదేశము దీనిలో అంతర్భవించును. నాసిక శూర్పారాంతర్భాగము భృగు కచ్ఛ, సరస్వతి సహిత సురాష్ట్రము, ఆనర్తము, అర్బుదము అనునవి అపరాంత ప్రదేశములని తెలియుచున్నది.

ఉత్తరాపథము :- భారతదేశమునకు ఉత్తరమునమున్న ప్రదేశములకు ఉత్తరాపథమని పేరు. కథాసరిత్సాగరమున ఉత్తరా

విధ మహత్త్వము వర్ణింపబడెను. సమస్త విద్యాధర క్షేత్రము హిమాలయ పర్వత శృంగములపై ఉండెనని హిమాలయోత్తర భాగము నుండి దక్షిణభాగము వరకు ఈ క్షేత్రము వ్యాపించి యుండెనని చెప్పబడెను. మ్లేచ్ఛ సంపర్కము వలన ఉత్తర దిగ్భాగము దూషింపబడెను.

దక్షిణాపథము :- భారతదేశ దక్షిణ ప్రదేశములకు దక్షిణాపథములో అంతర్భవించిన మహత్త్వపూర్ణదేశములు కథాసరిత్సాగరమున వర్ణింపబడినవి.

పూర్వదిక్కు :- అంగ, వంగ, కళింగ, కోసల, ఉత్కల, విదేహ, నేపాల, ప్రాగ్జ్యోతిష తామ్రలిప్తి, కామరూపాది ప్రదేశములు దీనితో చేరియున్నవి. ఈ ప్రదేశములన్నియు కథాసరిత్సాగరమున వర్ణింపబడినవి. పూర్వదిక్కుమ దేవేంద్ర దిక్కని పేర్కొనిరి దిక్కులలోనిది మంగళదాయక దిక్కు. అందువలన యౌగంధరాయణుడు పూర్వదిక్కునుండి విజయ యాత్రను నిర్వహింపవలెనని చెప్పెను.

జనపదములు :- కథాసరిత్సాగరమున వత్స, అవంతి, మాళవ, విదేహ, వంగ, అంగ, చేది, కళింగ, చోళ, మురల, లాట కామరూప, మగధ, పద్మప్రదేశ, శ్రీకంఠ, కోసల, ముద్ర, కర్ణాట, సౌరాష్ట్ర, గౌర, నిషాద, కాశ్మీర, సింధు, నేపాల, పారశీక, విదర్భ పులింద, విరాట, గాంధార, తురుష్క, చీన, బృహాకళ్ళ అను పేర్లు గల జనపదములు నిర్దేశింపబడినవి.

వత్స జనపదము :- కథాసరిత్సాగరమున దీనికి ఉదయనుడు నాయకుడుగా వర్ణింపబడుటచే అనేక స్థలములలో ఇది వర్ణింపబడినది.

అవంతీజనపధము :- ప్రాచీన భారతదేశములో ప్రసిద్ధ జనపధమిది. తామ్రవర్ణినుండి ఒకానొక ఉత్తరభాగము వరకు ఇది వ్యాపించి యున్నది.

మాళవదేశము :- కథాసరిత్సాగరమున మాళవదేశమున జన్మించిన వీరవరచరిత్రము అనుపశౌర్యమునకు ఉదాహరణముగా వర్ణింపబడెను.

వంగజనపదము :- కథాసరిత్సాగరమునను సరించి పూర్వ సీమనుండి అంతిమభాగమున సముద్ర పర్యంతము వ్యాపించిన భూభాగమునకు వంగ జనపదమని పేరు.

అంగజనపదము :- అనంగుడు తనదేహమును ఇచ్చట పరిత్యజించెను. అంగదేశ ప్రదాన నగరము విటంకపురము. ఇది సముద్ర తీరమున కలదు.

లాటజనపదము :- ఇది స్త్రీ సౌందర్యమునకు ప్రసిద్ధ మైనది.

కామరూపజనపదము :- ఇది మంత్ర తంత్ర సిద్ధికి ప్రసిద్ధమైనది.

మగధజనపదము :- కథాసరిత్సాగరము ననుసరించి ఛాత్రులు దూరప్రాంతముల నుండి మగధకు వచ్చి విద్యనభ్యసించు చుండిరి.

పద్మప్రదేశజనపదము :- ఇది గ్రంథమున ఒకేమారు నిర్దేశింపబడెను.

శ్రీకంఠ జనపదము :- ఇది రాష్ట్రమని, విషయమని, జనపదమని నిర్దేశింపబడెను.

నిషాధ జనపధము :- హిమాలయ పర్వతక్షేత్రమున ఈ ప్రదేశము కలదు.

కాశ్మీర జనపదము :- కథాసరిత్సాగరమున విశేషంగా ఇది వర్ణింపబడి కవి మాతృదేశ ప్రేమను వ్యక్తము చేయుచున్నది".2

సింధు జనపదము :- ఇది వేదకాలము నుండే అశ్వములకు ప్రసిద్ధమైనది.

విదర్భ జనపదము :- దీనికి సంబంధించిన గొప్పనగరములు. 1. ప్రతిష్ఠానపురము 2. కుండినపురము మొదలగునవి ఇందు వర్ణింపబడినవి.

బృహత్కథకు కేంద్రస్థానము ప్రతిష్ఠానపురము.

బృహకక్ష జనపదము :- ఇది నర్మదా తీరమున కలదు.

ద్వీపములు :- సువర్ణ కటాహ, నారికేళ, కర్పూర, మలయ సింహళ, శ్వేత, ఉత్పల, రత్నకూట, ముక్తిపుర, హంస, మణియపుర, ద్వీపములు కథాసరిత్సాగరమున వర్ణింపబడినవి. ఈ ద్వీపముల విస్తృత వర్ణన తత్కాలీన భారతీయ సంస్కృతి గౌరవమును వ్యక్తము చేయుచున్నది. వ్యాపారులు, నావికులు, ధర్మప్రచారకులు, సముద్ర యాత్రా ప్రదేశములను సహించి భారతీయ సంస్కృతిని సుదూర ద్వీపములకు ప్రచారము గావించిరి. సముద్రయాత్ర గౌరవ ప్రదముగా నుండెను. స్వశక్తి జీవనమున పూజ్య భావముండెను. సువర్ణ ద్వీప యువ ద్వీపముల వరకూ రాత్రింబవళ్ళు సముద్రయాత్ర

జరుగుచుండెను. ద్వీపాంతరయాత్ర లేనిచో లక్ష్మి ప్రాప్తి సంభవించ దని తత్కాలజన విశ్వాసము. కథాసరిత్సాగరమున ద్వీపాంతర యాత్రాకథలు అనేకములు కలవు. సముద్రశూరుడను వ్యాపారి సముద్ర యానము ద్వారా సువర్ణ ద్వీపమునకు వెళ్ళి అచ్చట కలశ పురమున నివసించెను. సువర్ణద్వీపము నుండి తిరిగి వచ్చు రుద్రు డను వ్యాపారి నౌక సముద్రములో పడిపోయెను. ఇట్లే కటాహ ద్వీప రాజకుమారి యానము కూడా భారతదేశమునకు తిరిగి వచ్చునపుడు సువర్ణద్వీప సమీపమున సముద్రములో పడెను. రాజకుమారికి సువర్ణ ద్వీపమే రక్షణమయ్యెను. కటాహద్వీపము అతి సమృద్ధిశాలిగా ఉం డెను. సువర్ణద్వీప కటాహ ద్వీపములకు పరస్పర సంబంధము ఉండెను. చంద్రస్వామి పుత్రీ పుత్రాన్వేషణ కొఱకు ద్వీపోన్ముఖుడు గా బయలు దేరెను. కనక వర్మ నారికేళ ద్వీపమునకు వెళ్ళుచున్నా డని తెలుసుకొని అతని ననుసరించి నారికేళ, కటాహ, కర్పూరసువర్ణ, సింహళ ద్వీపములకు వెళ్ళెను. ఈ నగరములు వాణిజ్య కేంద్రములు గా ఉండెను. ఆ నగరముల నుండియే ద్వీపాంతర యాత్ర ప్రారం భమయ్యెను. ద్వీపములో నున్న నగరములకు కూడా ఆ ద్వీపముల పేర్లే యుండెను. ఈశ్వరవర్మ అను వ్యాపారి సువర్ణ ద్వీపమునకు వెళ్లుచూ కాంచన పురమున ప్రవేశించెను. కాంచనపురము సువర్ణ తుల్యముగా ఉండెనని పేర్కొనబడినది. సముద్ర శూరుని నౌక కుశల పుర ప్రయాణమున సాగరములో పడెను. సముద్ర పర్యటనమున శబర సిద్ధి-మలయపురము అను పేరుగల మహానగరమున ప్రవేశించు చుండిరి.

సువర్ణద్వీపము :- ఇది రెండు కథలలో పేర్కొనబడెను.

**మలయ ద్వీపము :-** కథాసరిత్సాగరమున ద్వీపములలో

మలయపురము పేర్కొనబడెను. ఈ ద్వీప పాలకుని పుత్రికయైన మలయవతి విక్రమాదిత్యుని పరిణయమాడెను.

సింహళ ద్వీపము :- ఇది దక్షిణ దేశమున లంకా సమీపమున కలదు. ఇది ఒక ద్వీపము. చంద్రస్వామి కర్పూరద్వీపము నుండి సువర్ణ ద్వీపమునకు, అచ్చటనుండి సింహళ ద్వీపమునకు వెళ్ళి స్వదేశమునకు తిరిగి వచ్చెను. అనంగదేవుడు సింహళ ద్వీపమున స్వర్ణ రాజధానిని దర్శించితినని విక్రమ శక్తితో చెప్పెను కథాసరిత్సాగరమునందలి శ్వేత ద్వీప వర్ణనము పురాణముల ననుసరించియే యున్నది.

నగర, గ్రామములు :- కథాసరిత్సాగరమునందలి గ్రామ, నగర విస్తృత వర్ణనము తత్కాలీన ఆర్థిక, సామాజిక, సాంస్కృతికాభివృద్ధిని ప్రకాశింపజేయుచున్నది. ప్రసిద్ధ నగరములు, రాజధానులు సువ్యవస్థిత రూపముతో సుందరముగా పరిణమించెను. భౌగోళిక మహత్త్వ స్థానముగల ప్రదేశము నగరమని పేర్కొనబడెను. నగరములలో కొన్నింటికి రాజధాని, మహానగరి, నగరి, నగరము మహాపురమని నామములుండెను.

ఖేట, గ్రామ, అగ్రహార, కుబ్జ, దుర్గ, పత్తన, పుర, రాజధాని అని నగరము 8 విధములుగా విభజింపబడెను1 శూద్రులు నివశించు దానిని ఖేటమని, సర్వజాతి నివసించు దానిని గ్రామమని, బ్రాహ్మణులు నివసించు దానిని అగ్రహారమని, సీమంత నగరమును కుబ్జమని, దేశరక్షణ కొఱకు ఏర్పాటు చేయబడిన జల దుర్గమాదులతో కూడిన దానిని జలదుర్గమని, ద్వీపాంతరము నుండి తెచ్చిన వస్తు క్రియ విక్రియములు చేయుస్థానమును పురమని, రాజభవనముతో,

వ్యవస్థ ఉండెను. ఉన్నత ప్రాకారము నుండి సుదృఢ సైనిక వ్యవస్థ ఉండుట వలన మృగాంకదత్తునకు ఉజ్జయినీ నగర ప్రవేశము దుర్లభమయ్యెను. నగర ద్వారమున 2000 గజములు, 25 వేల అశ్వములు, 10 లక్షల సైన్యము పదాతి దళము, నగర రక్షణ కొఱకు ఉండెను.

విస్తృతరాజమార్గము గమనాగమన సౌకర్యము కొఱకు ప్రతోలికూడ ఉండెను. మార్గమును చందన జలముతో తడుపు చుండిరి. క్రయ విక్రయము కొఱకు నగర మధ్యమున పణ్య వీథి కలు ఉండెను. నగరమున సర్వజాతి ప్రజలు పరస్పర సద్భావముతో జీవించుచుండిరి. జాతిని బట్టి సౌకర్యములను ఏర్పాటు చేయుటలో భేదముండెడిది కాదు. కానభూతి ప్రతిష్ఠాన నగరమున సామవేదజ్ఞుల సామగానము శాస్త్రజ్ఞుల చర్చ, వనిజుల వాణిజ్యము సర్వజాతి వ్యవసాయము ప్రవర్తిల్లు చుండెనని వర్ణించెను. నగర ప్రారంభమున శివమందిరములుండెను. కథాసరిత్సాగరమున అన్యదేవతా మందిరముల కంటె శివ మందిరములు అధికముగా వర్ణింపపడినవి. బౌద్ధ బిక్షువుల నివాసము కొఱకు బౌద్ధ విహారములు ఉండెను. విశేషముగా ధర్మశాలలు నిర్మింపబడెను. ఈశ్వరవర్మ కాంచిన పురమున దేవకులమున ప్రవేశించి సుందర వేశ్యానృత్యమును దర్శించెను నగరోధ్యానములు, క్రీడోద్యానములు మనోరంజన స్థలములుగా నుండెను. నగర భవనములకు కూడా నామకరణము చేయబడెను. భూగర్భ భవనములకు పాతాళ వసతి అని పేరు. ప్రముఖ భవనములతో నివాస, కోష్ఠ, కటక, వాతాయన యుక్త హర్మ్య దుర్గాదులు ఉండెను కథాసరిత్సాగరమున నగర శబ్దమునకు చివర పుర, పుట, శృంగపతి మొదలగు శబ్దములు ప్రయోగింపబడెను. ముక్తాపురము, శైలపురము

వజ్రకూటము, ఇరావతి, పుష్కరావతి, వైదుర్యశృంగము, కాంచన శృంగము మొదలగు విధములుగా పురనామము లుండెను. రాజుల పేర్లతో కూడ నగరములు వ్యవహరింపబడుచుండెను. చిరాయువు అను రాజు పేరుతో చిరాయునగరము వ్యవహరింపబడెను.

గ్రామములు :- కథాసరిత్సాగరమున నగరములకంటె గ్రామ సంఖ్య చాలా తక్కువ వీటి స్వరూపమును గూర్చి స్పష్ట నిర్దేశము లేదు. పల్లీ భిల్ల పల్లీ, అగ్రహారాది శబ్దములు గ్రామవాచకములుగా ఉండెను. గ్రామవాసులు గ్రామ్యులని వ్యవహరింపబడుచుండిరి. గ్రామ సంస్కృతి నగర సంస్కృతికంటె అల్ప ప్రభావోపేతమై యుండేను. కొన్ని గ్రామములు నగరములవలె ప్రసిద్ధములై యుండెను. లావణ్యగ్రామము, నందిగ్రామము నగరము వంటివి. ఇందు సర్వజాతీయులు నివసించుచుండిరి. మొదట గ్రామ శబ్దము నగర వాచకముగా ఉండెను.

ఉదా॥ బాహ్లిక గ్రామము. కథాసరిత్సాగర కాలము వరకూ గ్రామ, ఘోష నగర సంవాహములలో స్పష్టభేదముండెను. కథాసరిత్సాగరమునందలి మూర్ఖ కథలు సంబద్ధములు. ఇందు గ్రామ పర్యాయముగా పల్లె శబ్దము అధికముగా ప్రయోగింపబడెను. శబర, కిరాత, భిల్లుల, నివాస భూమ పల్లి అని వ్యవహరింపబడుచుండెను. శబ్దకల్పద్రుమములో స్వల్పగ్రామము పల్లి అని పేర్కొనబడెను. రాజులచే బ్రాహ్మణులకు ఇవ్వబడిన భూమిని అగ్రహారమని వ్యవహరించుచుండిరి. ఒకే చోట అగ్రహార గ్రామ, నగరముడు నిర్దేశింపబడినవి. అగ్రహారము విశాలమైనచో మహానగరమని వ్యవహరించుచుండిరి. "తతోవ్యగ్రహారాన్ గ్రామాన్ చిన్వన్ నగరా చ".

కథాసరిత్సాగర వర్ణిత నగరములు :- ఇందనేక పౌరాణిక నగరములు పేర్కొనబడినవి. కౌశాంబి, ఉజ్జయిని, పాటలీపుత్రము, మధుర, అయోధ్య, శ్రావస్తి, తామ్రలిప్తి, ప్రతిష్ఠానము, వలభి, తక్షశిల, పౌండ్రవర్ధనము, వర్ధమాన నగరము, కుండినపురము, శాకల పురము, కాంపిల్యము, హస్తినాపురము, అలక, గోకర్ణ నగరము కాంచీవిశాలపురి, గంగాద్వారము, కనఖలము, రాజగృహము, విదిశ, పుష్కరావతి అనునవి ఇందలి ప్రధాన నగరములు.

కథాసరిత్సాగరమున కౌశాంబి మహానగరముగా వ్యవహరించబడెను. ఉజ్జయనీ నగరము విక్రమక్షేత్రమని పేర్కొనబడెను. పాటలీపుత్రమును గూర్చి కథాసరిత్సాగరమున కథ గలదు. ఇది లక్ష్మీ సరస్వతుల క్షేత్రము. పుత్రకుడను రాజు తన భార్యపేరుతో పాటలీపుత్రమని దీనికి నామకరణము చేసెను. తక్షశిలవలె ప్రసిద్ధ విద్యా కేంద్రమిది. కథాసరిత్సాగరమునననుసరించి ఉపవర్ష, వర్ష, పాణిని, పింగళ, వ్యాడి, వరరుచి, పతంజలి మొదలగు ఆచార్యులకు పాటలీపుత్రము కార్యక్షేత్రముగా ఉండెను. మధురానగరము ఈ గ్రంథమున మహానగరముగా పేర్కొనబడెను. అయోధ్య పౌరాణిక రాజధానీ రూపములో, ప్రసిద్ధ తీర్థరూపములో నిర్దేశింపబడెను. "స్వరం ఆస్తి అస్మిన్ ఇతి శ్రావస్తీ" బౌద్ధ ధర్మ ప్రధాన కేంద్రమిది. తామ్రలిప్తి వర్ణన కథాసరిత్సాగరమున విశేషముగా గలదు, దక్షిణ భారత ప్రసిద్ధ నగరములలో ప్రతిష్ఠాన పురము ఒకటి. పౌండ్ర వర్ధనము కథాసరిత్సాగరమునసనుసరించి పూర్వదిక్కునకలదు. కుండిన పురము విదర్భదేశమున కలదు. శాకల్ల పురము మద్రదేశమున శాకల్ల నగరముండెను. ఇది మద్రదేశమునకు రాజధాని. ద్రౌపదీ స్వయంవరము కాంపిల్య నగరమున జరిగెను. హస్తినాపురమునకు సుహోత్ర పుత్ర

డైన హస్తిచే నిర్మింపబడుట వలన అన్వర్థ నామము ఏర్పడెను. కథాసరిత్సాగరమున హిమాలయ ప్రదేశమున అలకా నగరమున్నట్లు వర్ణింపబడెను. అది కుబేరుని రాజధానిగా ప్రసిద్ధి నొంది యున్నది. దక్షిణ భారతమున గోకర్ణము కలదు. కథాసరిత్సాగరము ననుసరించి మైసూరు రాష్ట్రమున నేటి గోకర్ణము కలదు. కాంచి-మహాసమృద్ధిచే కాంచీనగరము విశాల నగరమని వర్ణింపబడెను. "అస్తి కాంచీతి నగరీ గరీయా గుణగుంఫితా। కాంచీవ వసుధా వధ్వాహ సదలం కృతి-తాంగతా॥" అని ఇందలి వర్ణనము. ఇందు పర్వతాకార విశాల భవనములు, రాజమార్గములు వర్ణింపబడెను. ఈ నగరము సముద్ర తటమున నిర్మింపబడినది] విశాలపురి-ఇది పృథ్వి, స్వర్గభూమి అని పేర్కొనబడెను. "అస్తి శక్రపురీ వాన్యాచాయా సుకృతనాం దివచ్యుతా నామ్ విహితా విశాలాఖ్యా పురీ భువి".

రాజగృహము :- కథాసరిత్సాగరము ననుసరించి ఇది ప్రసిద్ధ విద్యాకేంద్రము.

కథలలో వారణాసి ప్రయాగ, చిత్రకూటము గయ మొదలగు ప్రముఖ తీర్థములు అనేకచోట్ల వర్ణింపబడినవి. హిమాలయ పర్వత ప్రదేశములలో అనేక నగరము లుండెనని తెలియుచున్నది. కానీ నేడు అవి లభింపవు వాటిలో కొన్ని పేర్లు-శైలపురము, ముక్తాపురము, విద్యాధర నగరము, వజ్రకూట నగరము, త్రికూటపతాక, కాంచన శృంగము, ధూమపురము, విలాసపురము, కనకపురము, శంఖపురము, అషాఢపురము, వైదుర్యశృంగ నగరము, సురపురము, ధవళపురము, రత్నాకరనగరము, వజ్రకూటము, దీర్ఘ నగరి, అన్నలపురము, భీమపురము, మొదలగునవి.

కొన్ని గ్రామముల పేర్లు :- బహుసువర్ణ గ్రామము, తలాప గ్రామము, వక్కోల గ్రామము, లావణ గ్రామము, నంది గ్రామము వసుమతి గ్రామము మొదలగునవి.

పర్వత నదీ వన ప్రదేశములు :- సాధారణంగా దేశ సంస్కృతి, వికాసము ప్రాకృతిక భూగోళాశ్రితము. పర్వత ప్రాంత వాసులు కఠోర పరిశ్రమ శీలురై యుందురు. నదీ ప్రాంత వాసులు వ్యవసాయము వలన అర్థిక దృష్ట్యా సంపన్నులై యుందురు. శరీర ఘటనమున పర్వత నదీ ప్రదేశ ప్రభావముండును. హిమాలయము విద్యాధర నివాస స్థానమని కథాసరిత్సాగరమున వర్ణింపబడినవి. సమస్త హిమాలయ పర్వత క్షేత్రము విశదముగా ఇందు వర్ణింప బడినది. హిమాలయ పర్వత శాఖలు అందలి నగరములు చక్కగా ఇందు వర్ణింపబడినవి. వింధ్య పర్వత చర్చ, పౌరాణిక పర్వత చర్చ ఇందు కలదు. "కర్ణతాళ వనాఘాత సీమంతు కులాచల" అని కులా చల ప్రస్తావము ఇందుకలదు. గణేశ స్తుతిలో కర్ణతాళ ప్రబలా ఘాతములచే కులపర్వతములను సంచలింప చేయుటచే సఫలమార్గ ప్రదర్శకుడైన విఘ్నరాజు విజయముతో వర్ధిల్లు గాక" అని వర్ణింప బడెను. మహేంద్రమలయ, వింధ్య, అక్షపర్వతములు ఇందు పేర్కొవ బడినవి.

కథాసరిత్సాగరము నందలి పర్వతముల వివరణము :- సర్వ కులాచలములలో హిమవత్పర్వతము శ్రేష్టము. ఇది పర్వత చక్ర వర్తి అని కీర్తింపబడెను. హిమాలయ ఉత్తుంగ శిఖర పర్వతో త్తర భాగమునకైలాసము కలదు. కథాసరిత్సాగరము ననుసరించి ఇది బహు యోజన విస్తీర్ణమైన పర్వతము. కథాసరిత్సాగరము ననుసరించి పూర్వ సముద్రతీర కరకంఠిక నగర సమీపమున శీతోద

నదీ ప్రవాహానంతరము ఉదయాచల మనెడి పేరుగల సిద్ధక్షేత్రీభూతమైన పర్వతముండెను, ఉశీనర పర్వతము హిమాలయ శృంఖలము, కథాసరిత్సాగరము ననుసరించి హరిద్వారమున కనఖలము అను పేరు గల పర్వత తీర్థముండెను. అందు దేవగజము ఉశీనర పర్వతమును వినాశము చేసెను. గంగా ప్రవాహమును చెల్లాచెదురు చేసెను. కథాసరిత్సాగరమున మేరు పర్వత స్వర్ణశిఖరములు వర్ణింపబడినవి. కనకాద్రి అని దీనికి పేరు. ఇది ఉత్తర దిక్కున కలదు. కథాసరిత్సాగరము ననుసరించి మధ్యదేశము వింధ్యపర్వత పర్యంతము వ్యాపించియున్నది. ఇది బహుదేవతా నివాసభూత పర్వతము. దక్షిణోత్తర భారతదేశమును వేరుచేయు నర్మదా తటవర్తి సంపూర్ణ పర్వత శృంఖలను వింధ్య పర్వత మందురు, సుమేరుపర్వత తపోవన మధ్యమున్న స్థానమును త్రికూట పర్వతమని, ఇది సుమేరు పుత్ర పర్వతమని కథాసరిత్సాగరమున వర్ణింపబడెను. అసితగిరి కశ్యప మహర్షి ఆశ్రమముగా వర్ణింపబడెను.

నదులు :- కావేరి, నర్మద, గోదావరి, సిప్ర, వితస్థ చంద్రభాగ, ఇరావతి, విపాశ, దేవ, వైధ, మందాకిని, శీతోద ఇచ్ఛుమతి, యమున, గంగ, గంధవతి మొదలగు నదులు కథాసరిత్సాగరమున నిర్దేశింపబడినవి. ఇందు ముఖ్యముగా కాశ్మీర్, పంజాబ్ సింధూ ప్రదేశాది పశ్చిమోత్తర ప్రాంత నదీ వర్ణన మధికము. నదీతీరనగరములకు విశిష్ట స్థానము కలదు. గంగ సర్వాధిక పవిత్రనది గంగాతీరమున కుసుమపురము, నర్మదాతీరమున మరుకచ్ఛ, వితస్తా తీరమున తక్షశిల, ఇచ్ఛుమతీ తీరమున ఇచ్ఛుమతీ నగరము విశేషముగా వర్ణింపబడినవి. కావేరి మురళ జనపద సమీపమున ఉన్నట్లు పేర్కొనబడెను. ప్రాచీన చోళరాజ్యము నుండి కావేరి

ప్రవహించుచున్నదని వర్ణింపబడినది. గుజరాత్ రాష్ట్రమున నర్మదా నదీ తీరమున మరుకచ్ఛమనెడి నగరముండెనని పేర్కొనబడినది. గోదావరి "తత్రస్య సప్తధా భిన్నం వపుర్గోదావరీ పయః" అని చెప్పబడెను గోదావరి నదిలో కనకవర్షరాజు జలక్రీడలాడెను. కథా సరిత్సాగరము ననుసరించి సిప్రానది ఒడ్డున ఉజ్జయినీ నగరము వర్ణింపబడెను

మందాకిని :- కథాసరిత్సాగరము ననుసరించి ఉదయనుడు పుత్రప్రాప్తి కొఱకు మందాకినీ తటమునందలి శివమందిరమున తపస్సు ఆచరించుటకు వెళ్ళెను. ఇందు మందాకిని కైలాస పర్వత సమీపమున నున్నట్లు చెప్పబడెను. ఇక్షుమతి నగరమును విశ్వామిత్రుడు నిర్మించినట్లు కథాసరిత్సాగరమున పేర్కొనబడెను. గంగా నది అధికముగా కథాసరిత్సాగరమున వర్ణింపబడినది, అన్ని తీరులందు గంగాస్నాన మహత్త్వము వర్ణింపబడినది. హరిద్వారము యొక్క ప్రాచీననామము గంగాద్వారము. ఈ నదీ తీరమున ప్రసిద్ధినగరములు వర్ణింపబడినవి. హరిద్వార సమీపమున "కనఖల" సమీపమున హిమాలయము నుండి ఈ నది ప్రవహించుచున్నది.

విభిన్న వన ప్రదేశములు కథాసరిత్సాగరమున వర్ణింపబడినవి. ఖాండవ వనము-అర్జునుడు కృష్ణ సహాయముచే దగ్ధము చేసిన వనమిది. దీనికి సంబంధించిన పౌరాణిక కథాసంకేత మిందు కలదు.

సరోవరములు :- పంపాసరస్సు, మానససరోవరము, వాసుకీ సరోవరము, గోదావరి తీర్థము, శంఖహ్రదము అను సరోవరములు కథాసరిత్సాగరమున వర్ణింపబడినవి.

వృక్షసంపత్తి-జీవజంతువులు :- కథాసరిత్సాగరమునందలి వృక్షములను మూడు విధములుగా విభజించవచ్చును, ఫలవృక్షములు శోభావృక్షములు, పుష్పవృక్షములు అని విభజించవచ్చు. అమ్ర, అమలక. బిల్వ, లవంగ, నారికేళ, పూగ, ఏలా, ఉదంబర, నాగవల్లి, ఖర్జూర, మాతులుంగ, కపిత్థ వృక్షములు ఫలవృక్షములు.

అశ్వత్థ, న్యగ్రోధ, సింశివ, వట. సాల, అశోక, తమాల, చందన, ఫలాశ, శాల్మలీ, సేమల, కదంబ, వృక్షములు శోభావృక్షములు. అగురు, కుటజ, చంపక, జప, పున్నాగ. బందూక, మందార, మాధురీ, లోధ్ర, వసంత లతిక, శిరీష, కర్ణికార, కమల, లతాకుంజ, పుష్పరాగ మాలతి, నాగవల్లి, పాటలాదులు పుష్పవృక్షములు. ఒకే వృక్షమునుడిడి అనేక జాతీయ పుష్పములు పుష్పించుట ప్రసిద్ధముగా వర్ణింపబడినది.

పోషిత పశువులు :- హస్తి అశ్వము, వృషభము, మహిషము, గర్దభము, శునకము, కుక్కురము మొదలగునవి శిక్షిత పశువులు మర్కట వనదీప కృష్ణసార, సింహ, వానర, గోమాయు, శశ, వ్యాఘ్ర శృగాలి, నకుల, ఉలూక, మూషిక, వనగజ, భల్లూక, శరభ, సూకరాదులు వన్యజంతువులు. ఇవి అన్నియు కథాసరిత్సాగరమున పేర్కొనబడినవి. ఇట్లే అనేక సరీసృపములు, జలచరములు, పక్షులు, కీటకములు కథాసరిత్సాగరమున ప్రస్తావింపబడినవి.

ఇట్లు కథాసరిత్సాగరమున వర్ణింపబడిన జనపద గ్రామ, నగర, ద్వీప, పర్వత, నదీ, వన, ప్రదేశ సరోవర, వృక్ష, లతా, జీవజంతు, పక్ష్యాదులు భారతదేశ సాంస్కృతిక మహత్త్వమునకు ద్యోతకములుగా నున్నవి.

4.3.7. కథాసరిత్సాగరములో స్త్రీకి గల స్థానము :-

కథాసరిత్సాగరమున స్త్రీ చరిత్ర కోశమని చెప్పుట అతిశయో క్తి కాదు. ఇందు పతిపరాయణులైన, పతివ్రతలైన స్త్రీల చరిత్రము ఆదర్శప్రాయముగా అనుకరణవిధముగా ఉదహరింపబడియున్నది. కులటలు స్వైరిణులైన స్త్రీల అద్భుత సాహస పూర్ణ గాథలు ఆశ్చ ర్యమును జనింపచేయును. ఇందు స్త్రీల కథలే అధికములు. వారిలో దుష్ట-విశ్వాస పాత్రలు కాని స్త్రీల సంఖ్య సర్వాధికముగా నున్నదని "వింటర్ నిడ్జ్" చెప్పుటలో అసత్యమేమి లేదు, Keith కూడా కథా సరిత్సాగర వర్ణిత స్త్రీ చరిత్ర విశేషములను విస్తృతముగా పేర్కొ నెను. బృహత్కథాను వాదమున కాశ్మీర సంస్కరణ సంకలన కర్తలు స్త్రీ విషయ కథా బాహుళ్య గ్రంథమును ఉపయోగించిరి. స్త్రీ విష యమున అధిక ప్రాతికూల్యమిందు ప్రదర్శించబడినది. సాధారణ ముగా స్త్రీల వివిధ మనోదశలను అంతర్బాహ్య మనోవృత్తులను సూక్ష్మముగా ఒకే గ్రంథమున విశ్లేషించుట కష్టముగా నుండును.

ప్రాచీనకాలమున స్త్రీలు సమాజమున పూజ్యస్థానమున ప్రతిష్ఠింపబడియుండిరి. మనుస్మృతిలో వివాహిత స్త్రీ సంతాన సమి ష్టిచే, వ్యక్తి సమిష్టిచే సన్మానింపబడెను. "యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః" అని లోక వచనము కూడా కలదు. కానీ కథాసరిత్సాగర కాలమున వారికి గల పూజ్యభావము క్రమక్రమముగా తగ్గుతూ వచ్చెను. వారు సంపూర్ణముగా పురుషాశ్రితలైరి.

పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే ।
పుత్రా రక్షంతి వార్ధక్యే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి ॥
నచ బంధు పరాధీనా కన్యా స్వాతంత్ర్య మర్హతి" అను లోక

ప్రసిద్ధి కూడా వ్యాపించినది. కథాసరిత్సాగరగ్రంథము ఈసిద్ధాంతమునకు తగిన బలము కూడా కలదు. మధ్యయుగ సమాజముననే ఈ పరతంత్రత ఉండెను. కన్యానామమహద్దుఃఖమ్ ధిగహో మహతా మపి" గొప్పవారలకు కూడా స్త్రీ దుఃఖస్థానము. కీర్తిసేన దీనిని గురించి "నిందంతి కన్యానాం జన్మబాంధవాః శ్వశూననంద సంత్రాస మసౌభాగ్యాది దూషితమ్" బంధువులు కన్యాజన్మను నిందించుదురు. అత్తమామల, అల్లుండ్ర వలన భయముచే అసౌభాగ్యమై కన్యాజన్మ దూషింపబడుచున్నది" అని చెప్పెను. ఇట్టి వాక్యములు కూడ స్త్రీలపై గౌరవ హీనతకు ఉపోద్బలకములు.

తత్కాలీన స్త్రీల సామాన్య విశేషములు :- కుటుంబముననే కన్యాజననము దుఃఖప్రదముగా నుండెను. క్షేమస్వామి తత్కాలిమందలి మూడు దోషములను గూర్చి ఇట్లు పేర్కొనెను. "చాపలం సాహసికతా, శాకినీ శంబ రాదయః"

దోషాః స్త్రీణాం త్రయః ప్రాయోలోక త్రయ భయావహాః॥" చాపల్యము సాహసికత శాకినీ శంబరాదులు అను స్త్రీలకు గల మూడు దోషములు ముల్లోకములలో భయజనకములు. స్త్రీలకు వాక్సంయమము ఉండదు. వారు అసత్య భాషణమున్ల నిపుణులు అశోకవతి యొక్క మిథ్యాదోషణా రూపముచే మహా దుఃఖోపేతుడైన గుణశర్మ మొదట అసత్యము పిమ్మట దుష్ట స్త్రీలు జన్మించిరని పేర్కొనెను. స్త్రీల చిత్తవృత్తులు చాలా చంచలమైనవి. వీరి అసత్య ముగ్ధవాక్యములను ఎవ్వరూ అసత్యమని తెలంపరు. అభీష్ట స్త్రీ వియోగముచే వివేకి కూడ బాధింపబడును, భావానురక్తమైన స్త్రీల మనస్సు విరహమును వహింపదు. స్త్రీలు ఆపదలకు అధికారణము. స్త్రీ స్వైరము ఆపదలకు బీజము, సత్ స్త్రీలు స్నిగ్ధతను మౌగ్ధ్యతను ప్రదర్శింతురు. దుర్ధర్షుడైన పురుషుని ప్రతికి యుండగనే కాకిపశ క్రూర స్త్రీ సంహ

రించును. ఆస్థానపతియైన కులకన్య శ్రవణ మాత్రము చేతనే పరులకు కూడా ఉద్వేగమును కలిగించును. కన్యాదానము పాపనాశకము బంధు పరాధీనయైన స్త్రీకి స్వాతంత్ర్యముండదు. కన్యఋతుమతియైనచో బంధువులు అధోగతి పాలగుదురు. ఆమె వృషలి అని ఆమె భర్త కూడా వృషలుడని చెప్పబడును. రక్తోన్ముఖియైన స్త్రీ గాఢోద్గాఢ అంతర్విష దుస్సహమై మనో వికారత్వమును పొందినదై సర్పము వలె తప్పక ఎవ్వరికైనను అపకారము చేయగలదు. కన్యలు పుత్రులంటె ఇహపరలోకములో శుభకారులు కుంతి మొదలగు కన్యా గుణములచే కుంతి భోజాదులు దుస్సహ, దుర్వాసాదుల నుండి పరాభవ సాగరమును దాటికి కుటిలురాలైన అత్త తోడేలు వలె కోడలి మాంసమును భక్షించును. యువతుల అభినవారూఢమైన మనః ప్రవృత్తి స్వతంత్రమైనది. సపత్ని సర్వదా సర్వత్రా నింద్యురాలు చిటవర్ధనచే నిదగ్ధలైన స్త్రీలు కూడా వంచింపబడుదురు స్త్రీలు సాహసికులు. సహజముగా వీరి దౌష్కృత్యము ఏమియులేదు.

స్త్రీ అమృతముచే, విషముచే సృష్టింపబడినది. అనురక్తురాలైన స్త్రీ అమృతమని, విరక్తురాలైన స్త్రీ విషమని పేర్కొనబడినది. ఉ స్త్రీ దుష్కర సాహసము చేయును. స్త్రీత్వము, క్షీణత్వము, ఏకాంతత, పురుషలాభము. అనియంత్రణ ఈ ఐదు పంచాగ్నులు లభించినచో శీలమునకు చోటే ఉండదు. మద్య ప్రసక్తయైన చపలస్త్రీని రక్షణచే గూడ నియంత్రింప జాలము. స్త్రీలు సంధ్యాకాలము వలె క్షణ రాగిణులు. నదివలె కుటిలాశయులు. సర్పము వలె అవిశ్వాస్యులు. విద్యుత్తువలె చంచలులు. స్త్రీ చిత్తము అతి దుర్గమము. "నిసర్గ చపలాః లలనాః" స్త్రీలకు సపత్ని మాత్సర్యము సహజసిద్ధము. వీరు వివేకమును నశింప జేసి బహుదుశ్చరిత్రములచే సంసార వైరాగ్యము జనింప చేయుదురు.

అంగధ ఉదార సత్త్యుని లక్ష్మివలె వరించును. హీన బలుని నుండి భార్యలు పలాయనము చిత్తగింతురు. అనర్గల చేష్టగల స్త్రీల పై ఎవ్వరికిని ఇచ్ఛ జనింపదు. దేశరూప వయశ్చేష్టా విజ్ఞానాది బేధముచే స్త్రీలు భిన్న భిన్న గుణమూలను కలిగియుందురు. సర్వ సద్గుణాన్వితలైన స్త్రీలెవ్వరూ లభింపరు. గృహమున బంధకి ఉండగా కుల స్త్రీవలె లక్ష్మి నశించును. కూట స్త్రీలలో సత్య కథార్ధ లేశము కూడా యుండదు. వేశ్యలు ధన ప్రియులు. అనురాగ హీనులు తుమ్మెదనవనవ పుష్పమును వాంఛించునట్లు వేశ్యా స్త్రీ నవ నవ పురుషుని వాంఛించును. కొన్ని ప్రదేశములలో వేశ్యలు సద్వృత్తము కలవారు కూడ కనబడుచున్నారు. బ్రహ్మ, ధన యౌవనాంధలు, ధన ప్రాణాపహారిణులు, కుమార్గవతులైన వేశ్యలను సృజించెను. వేశ్యధనముచే పూజింపబడును. వేశ్యారాగము పరిత్యాజ్యము. వేశ్యాజనము యువకుని పై, శిశువుపై, వృద్ధుని పై విరూపుని పై, రూపవంతుని పై మునివలె సమానురాలై పరమార్ధమును అనుభవించును. వేశ్యలను విశ్వసింపరాదు, కథాసరిత్సాగరమున వర్ణింపబడిన సూక్తి వాక్యములచే వేశ్యా స్వభావమిట్లు వర్ణింపబడినది.

కులటలు :- వివాహానంతరము కూడా పితృ గృహమున నున్న స్త్రీలను కులటలని వ్యవహరించుచుండిరి పితృగృహమున నున్న స్త్రీలను విశ్వసింపరాదు. వ్యభిచారిణియైన స్త్రీని బంధకి యని వ్యవహరించుచుండిరి. పతిఘాతములయిన స్త్రీల శతాధిక కథలు వారి నైతిక పతనమును ప్రదర్శించుచున్నవి. "వజ్రసారుని" పత్ని భర్తకు అంగభంగము గావించెను. "చద్రశ్రీ" భర్త యుండగా ప్రియుని కడకు వెళ్ళెను. పతి మరణానంతరము ప్రియుని పరిత్యజించి భర్తతో సహగమనమును ఆచరించెను.

ఇట్లు స్త్రీల చిత్తగతి దుర్జ్ఞేయమైనది. వారు అన్య పురుషులతో అనైతిక సంబంధమును కలిగి పతి మరణించిన వెంటనే సహగమనమును ఆచరించుట లోకారాధనము కొఱకని తెలియుచున్నది. దశమారిక అను సతి దశ వివాహములలో దశ భర్తలను పొందెను. కానీ ఒక్కొక్కరు క్రమంగా మరణింపగా ఏకాదశ పతిని పొందెను. స్త్రీ ఈర్ష్యాళువు అయిన పురుషుని పరిత్యజించును. అవసరమేర్పడినపుడు ప్రయోజనమునుబట్టి పతిని సంహరించును దుష్టపత్ని పతి విరోధమేర్పడినపుడు రాజు కడకు వెళ్ళి పతిపై దోషమును ఆరోపించును. "పర పురుష సంగమము స్త్రీల స్వాభావికధర్మము" అనుమాట సత్యమో మో? పురుషులు స్త్రీలను ఆనందపఱచుటకు ఎట్టి కార్యమునైననూ చేయుటకు వెనుకాడరు. ఒకానొక స్త్రీ నేను నీవంటి వంద పురుషులతో సంగమించితిని. నీవు నావలన ఎందుకు భయపడుచున్నావు. నాపై విశ్వాసము లేనిచో నాపైనున్న ఈ శతాంగుష్ఠములను చూడుము అని చెప్పెను.

ఒకానొక రాజకన్య ఎట్టి శ్రమలేకయే అనేక పురుషులను క్రమముగా అనుభవించెను" "బ్రాహ్మణుడైన రుద్రసోముని పత్ని హీనకులునతో వ్యభిచరించెను. శశి అనుసతని భార్య ఇట్లే భోగలిప్సను సంతృప్తిపరచుకొనెను"1 నాగకన్య శత పతులతో సంగమించెను. కథాసరిత్సాగరమిట్లు పుంశ్చలులైన స్త్రీలతో పరిపూర్ణమైయున్నది. ఆకర్షణకు రూపగుణములే మూలకారణముకాదు. వీరుడు, సదాచారుడు సుందరుడు అయిన భర్త యున్నను వివేకినులైన యువతులుకూడా అన్యపురుషునితో వ్యభిచరింతురు. విశుద్ధ మనస్సుగల స్త్రీలు దుర్లభము. రత్నవతి వధ్యస్థలమునకు తీసికొని వెళ్ళబడు చోరుని వరించి అతనిని సంతోషపెట్టి అతనితో సహగమనమును చేసెను. స్త్రీల

చారిత్రక పతన సంఘటనలు వృద్ధి పొందెనని నిస్సంశయముగా చెప్పవచ్చును. ఆనాడు స్త్రీలను విశ్వసింపకుండిరి. "వరం హాలా హాలం భుక్త్వం అహి బద్ధో వరం గతే,

నపునః స్త్రీషు విశ్వాసో మణి మంత్రాద్య గోచరః" విషపాన మైననూ కంఠ సర్పబంధనమైననూ శ్రేష్ఠము కాని మణి మంత్రాదులకు కూడా అగోచరులగు స్త్రీలను విశ్వసింపరాదు" అని చెప్పబడినది. రత్నాధిపుడు అను రాజునకు రోగగ్రస్తమైన గజముండెను. పతివ్రతయైన స్త్రీ స్పర్శచే రోగవిముక్తమగునని ఆకాశవాణిచే చెప్పబడెను. వేలమంది రాజపత్నులు స్పృశించిననూ ఆ గజము రోగగ్రస్తముగానే యుండెను. ఇట్లు సర్వరాజపత్నుల అపవిత్రత ప్రమాణితమయ్యెను. చివర "హర్షగుప్తుడు" అనుపేరుగల వేశ్యపత్ని స్పర్శచే ఆ గజము రోగవిముక్తిని పొందెను. ఆమె పాతివ్రత్యముచే ప్రభావితుడైన రాజు ఆమె సహోదరిని వివాహమాడెను, ఆ సహోదరిని సముద్ర గృహములో నుంచిననూ అన్యపురుషునితో రమించెను. అందువలన రత్నప్రభ "మహత్తరేణ రక్ష్యంతే శీలైనైవ కులస్త్రియః" అని చెప్పెను. చంచల స్త్రీ చిత్తమును బ్రహ్మకూడా మార్చలేడు. మదోన్మత్తలైన స్త్రీలను ఎవరూ నియంత్రింపలేరు. గురుపత్ని భ్రష్టతకూడా ఆశ్చర్యమును కలిగింపజేయును.

పాతివ్రత్య ప్రశంస :

పతివ్రతలైన స్త్రీల కథలు కథాసరిత్సాగరమున అనేకములు కలవు. దేవస్మిత అనుచిత ప్రేమ ప్రదర్శనోత్సుకులను దండించెను. వారిని అవమానించుటకు రహస్య సమాగమ సంకీర్తనము గావించెను. పతివ్రతా స్త్రీ మునుల అహంకారమును కూడా అణచును. "ఒక

పతివ్రతా స్త్రీ నాకు పతి భక్తి తప్ప ఇతర ధర్మము తెలియదని పేర్కొనెను."2 ఈ గ్రంథమున పాతివ్రత్య ధర్మ ప్రశంస అనేక స్థలములలో కలదు. "పతిః సతీనాం పరమం హి దైవతమ్" ఇహ పర లోకములలో సాధ్వీమణులకు పతియే గతి. పతిమాత్ర భక్తిచే స్వ సతీత్వ తేజోదార్ఢ్యముచే ఆత్మరక్ష గావించుకొను పతివ్రతలను ఆపద లందు దేవతలు రక్షింతురు. అనురాగిణియైన స్త్రీ చరింపదు. స్త్రీ వ్యభిచరింపదు. పదభ్రష్టమైన నారి సమాజమును సన్మార్గోన్ముఖము గావించుటకు కథాసరిత్సాగరమున పతివ్రతల చరిత్రము వర్ణింప బడినది. స్త్రీలు వాణిజ్యములో సహాయపడుచుండెడివారు. అర్థలోభి యైన ఒకానొక పత్ని మానవరురాలై వ్యవసాయమున భర్తకు సహ కరించెను. సామాజిక లజ్జచే, భయముచే అక్రమ సంబంధ సంతాన మును స్త్రీలు రహస్యముగా పరిత్యజించుచుండిరి.

కథాసరిత్సాగరమున ధర్మపత్ని స్వభావమునకు దుస్త్రీలకు సంబంధించిన కొన్ని ఉదాహరణములు. "మానవతీ మవః ప్రియ ప్రణయ హే వాకి" కుల స్త్రీలు ఆపదలోకూడ సతీవ్రతమును పరి త్యజింపరు. కుల స్త్రీల గుప్తశీలము, చరిత్రము అగణ్యము"వినయో హి సత్ీవ్రతమ్" పద్వ్రృత్తముగల కులీనాంగనలు వంశాలంకారిణులు స్నిగ్ధా, కులీనా, గృహిణీ తాప హారిణీ మార్గస్థా తరుఛయేవ కస్యాపి పుణ్యైః జాయతే" ఇహ ముత్రచ స్వాధీనాం పతిరేకాగతిః" దేవతా ఏవ సాధ్వీనాం త్రాణ మాపది కుర్వతే" భర్తృ భక్తి రథారూఢలైన స్వాధీమణులు శీలసన్నాహరక్షితలై, ధర్మసారథులై పూజ్యమతి హేతువులై విజయముతో వర్ధిల్లుచున్నారు. ఆపదలలో రక్షితచరిత్ర ధనము కలవారలై, భర్తకు కళ్యాణమును కలుగజేయుచున్నారు. మరి

కొందరు స్త్రీలు భర్త అనాసక్తుడు కాగా లేదా దివంగతుడు కాగా మరణ నిశ్చయము కలవారై అద్వైన్య గాంభీర్యముచే నిస్పృహలై యుందురు. పురంధ్రుల గూఢ ప్రేమ ఖండించ నసాధ్యము. కులీన భర్తృద్రోహము. నాచరిందురు పతిహితము తప్ప సాధ్వీమణులు అన్యము నెఱుంగరు. సత్యసాధ్వీమణులకు ముల్లోకములలో అసాధ్యమేమియూ నుండదు. భార్యారహితమైన గృహపతి గృహము శూన్యము. కథాసరిత్సాగరమునగల ఈ లోకోక్తులు సాధ్వీమణుల స్వభావమును ప్రకాశింపజేయుచున్నవి. ప్రపంచమున సద్వృత్తము గల స్త్రీలు విరళముగా నుందురు. పౌరుష్యమునకు గురియైన కామిని చిరస్థాయిగానుండదు. ఈర్ష్యావతులైన స్త్రీలపై ఆసక్తిని ప్రదర్శింపరాదు. బుద్ధిమంతులు కుస్త్రీలచే సుంభముగా వంచింపబడుదురు. కుస్త్రీలు సన్నికృష్ణునితో రమింపరు. పురుషులు కొందరే కొంతకాలమే దురాచారులుగా ఉందురు. కానీ స్త్రీలు ఎల్లప్పుడూ దురాచారులే. పురుషుడు స్త్రీ కావచ్చును. కానీ స్త్రీ పురుషుడుగా ఎప్పుడూ కాజాలదు స్త్రీల హృదయము కులిశముకంటె కఠినమైనది.

తాంత్రిక ప్రవృత్తి :

తత్కాలీననారీజనమునకుమంత్రతంత్రములపై అధికశ్రద్ధయుండెను మంత్రతంత్రసిద్ధికొఱకు తత్ప్రభావ లోలుపలై సాహసముతో నీచ కార్యమునుకూడా ఆచరించుచుండిరి. ఒకప్పుడు రాజైన "ఆదిత్యప్రభుని" పత్ని ఏకాకియై కేశములను విరబోసుకొని, మహాసిందూరతిలకమును ధరించి జపపరాయణయై, మండల మధ్యవర్తినియై నగ్నముగా లో రక్త, మద్య, నరమాంసముతో ఉగ్రబలి నిచ్చుచూ భర్తృదృష్టి

పదమున పడెను. రాజు ఆ దృశ్యముచే ఆశ్చర్యచకితుడయ్యెను. పిమ్మట ఆమె చెప్పిన మంత్రాది ప్రభావమును విని తానుకూడా మహామాంస భక్షణ పంసిద్ధుడయ్యెను. బలి కొఱకు పుత్రుడు కూడా సంహరింపబడెను. పుత్రలాభము కొఱకు పుత్ర బలి నిచ్చుట తంత్ర ప్రభావ సూచకమే.

పారివారిక స్థితి :

కుటుంబ సుఖశాంతులకు స్త్రీలే ప్రధాన కారణము, సుందర కాంతావిహీనమైన గృహము కారాగార సమము. సుందర స్త్రీ చంద్ర ముఖముచే, వీణచే పతిని ఆనందింపజేయును. దుష్ట స్త్రీ కలహ కారిణియై చరిత్ర హీనతచే పతిని దుఃఖితుని చేయును. దుష్టపత్ని గృహవాసముకంటె అరణ్యవాసమే శ్రేష్ఠమైనది. వైశ్యుడైన ధన దేవుడు తన పత్ని చరిత్రను చూచి విరక్తుడై ఇట్లు చెప్పెను. గృహ మోహము వ్యక్తము. గృహము స్త్రీ బంధకము స్త్రీ బంధ గృహమున కంటె వికాంత అరణ్యవాసమే శ్రేయస్కరము. ఇట్టి భావనచేతనే రుద్రసోముడను బ్రాహ్మణుడు శశి అనునతడు విరక్తులై అరణ్యము నకు వెళ్ళిరి. దుష్ట నారీజనము ఉభయలోకమున భ్రష్టత్వము పొం దును. సద్గృహిణి గృహమును స్వర్గముగావించును. శుభకార్య ప్రభావముచేతనే స్త్రీలు గృహిణి అగుదురు. భర్త దేశాంతరము వెళ్ళి నపుడు కుల స్త్రీకి రూపాకృష్టజన దృష్టిపాతమున పడుటకంటె మరణమే మేలు.

తద్భర్తృ వేశ్మ "తాదృశ మర్థయేహం శ్వశ్రూః" న యత్ర నచ యత్ర శతో ననందా" అని చెప్పబడుటచే అత్తమామలకోడండ్ర పరస్పర ఐకమత్యమే కుటుంబ శాంతి హేతువని తెలియజేయుబడినది.

అత్తమామలు వైధవ్యమును కలిగించుటచే కన్యాజీవితము దూషిత మగుచున్నది. దుష్టశ్వశ్రూశ్వశుర వర్జితమైన పతిగృహము ఉత్తమమని నిశ్చయింపబడినది. సంయుక్త కుటుంబమున పరస్పర సంబంధము సాధారణముగా కటువుగా నుండును. ఆ కాలమున పరస్పర ఈర్ష్యాద్వేషములచే గృహస్థ జీవితము దుఃఖపూరితముగా ఉండెను. దుష్టశ్వశ్రూ సంబంధములైన అనేకకథలు కథాసరిత్సాగరమున కలవు. ఇచ్చట (ఈ గ్రంథమున) కీర్తిసేనపై ఆమె (అత్త) హత్యాచారమును ప్రదర్శించుట రోమాంచకారిగా యున్నది. వసుంధరుని పత్ని శ్వశ్రూ బాధచే మరణించెను. కొన్ని సందర్భములలో అత్తా కోడండ్ర సంబంధము ప్రశంసనీయంగా ఉండెను.

భారతదేశమున వేశ్యాచారము అతిప్రాచీనము సౌందర్య పిపాసకుల తృప్తికొఱకు నాడు వేశ్యల అవశ్యకత యుండెను. సామంత ప్రధాన మధ్యయుగంలో వేశ్యలకు గొప్ప పూజ్య భావముండెను. కథాసరిత్సాగరమున వేశ్యల భిన్నభిన్న స్వభావము వర్ణింపబడినది. వారు ధనాభిలాషిణులై సంపన్నులైన వారిని శవాకృతులైననూ స్పృశించుచుండిరి. "శవం స్పృశంతి సుజనాః గణికా నతు నిర్ధనమ్" క్వాను రాగః క్వ వేశ్యాత్వం ఇతితే విస్మృతం కథమ్" వేశ్యావృత్తి కాలపరిమితమైనది. కావున వారు యవ్వనముచే అత్యధిక ధనమును సంపాదింప ప్రయత్నించుచుండిరి. ఆ కాలమున వేశ్యావృత్తిలో శిక్షణకూడా ఇవ్వబడుచుండెను. "మకరదంష్ట్ర" అను నామె నగరములోని సమస్త వేశ్యలకు శిక్షకురాలుగా ఉండెను. సర్వకుట్టనులకు ధన మహత్త్వమును బోధించుచుండెను.

కొందరి వేశ్యల సంపన్నత ఆశ్చర్యమును జనింపజేయును

"కౌముదిక" అనుపేరుగల వేశ్యాభవనమున 100 గజములు, 20 అశ్వములు, అమూల్య రథములుండెను. ఆమెకు అనేక సేవక జనము కూడా యుండెను. ఒకప్పుడు వేశ్యలలో కూడా పవిత్ర ప్రేమ వర్ణింపబడెననుటకు కుముదికా వృత్తాంతముదాహరణము. కుముదిక తన ప్రియునను బంధనము నుండి విముక్తిని కలిగించుటకు విక్రమ సింహుడను రాజును కామించెను. వేశ్యలలో సౌందర్యముతోపాటు నృత్యగీత, వాద్య నైపుణ్యము కూడా యుండెను.

ప్రాచీన భారతదేశమున వేశ్యాప్రవృత్తి అనింద్యముగా నుండెనని ఋగ్వేదము వాజసనేయ సంహితవలన తెలియుచున్నది." స్మృతి కాలమున వేశ్యా ప్రవృత్తి నిందింపబడెను. బుద్ధకాలమున నృత్య గీతాభ్యాసము బ్రాహ్మణులకు నిషేధింపబడెను. జాతక కాలమున మాత్రము అంగీకరింపబడి గౌరవింపబడెను. వేశ్యలు అధిక ధన సంపదలచే సమాజ పూజ్యులుగా నుండిరని "కూకూ"మహాశయుడు కథాసరిత్సాగరమున ఉదాహరించెను. కౌటిల్యుని అర్థశాస్త్రమున గణికాధ్యాయమే కలదు. సభలలో వారు ఉన్నత పదవులందు ప్రతిష్ఠింపబడిరి. రాజకీయచామరాదులు కూడా వారికి ఇవ్వబడుచుండెను. రాజకీయ నియంత్రణమునకూడా వారుపయోగింపబడుచుండిరి. వారి ఆదేశమును ఉల్లంఘించుట దండనార్హముగా ఉండెను. పూర్వము మధ్యకాలమున వేశ్యావిషయములనుగూర్చి కామ శాస్త్రమనెడి పేరుతో గ్రంథమే రచింపబడినది. వాత్స్యాయనుని కామ సూత్ర గ్రంథము ఇందుకు ఉదాహరణము.

నృత్య, గీత, వాద్య నైపుణ్యము గృహిణులకు కూడా ఆవశ్యక

మని పేర్కొనబడెను. ఇట్లు వేశ్యల పూజ్యస్థానము కథాసరిత్సాగరము వర్ణింపబడినది.

దేవదాసి :

దైవ మందిర సంబద్ధముగా వేశ్యాతిరిక్త స్త్రీ వర్గముండెను. మందిరములలో దేవతా సేవకొఱకు నియోగింపబడిన వీరిని దేవదాసీ లని వ్యవహరించుచుండిరి. కలణుడు రాజతరంగిణిలో దేవదాసీచర్చను వర్ణించెను. కథాసరిత్సాగర కాలమున దేవదాసీ వ్యవస్థ సంపన్నముగా నుండెను. దైవమందిరమున దేవ వివాహిత కన్య సర్వ గ్రాహ్యగా నుండెను. దేవసేనుడను రాజు సేనాపతిచే పరిణయ మాడబడిన ఉన్మాదినియందు ముగ్ధుడయ్యెను. అప్పుడు సేనాపతి ఆమెను దేవకులమున నిన్ను త్యజించగలను, అపుడు రాజు గ్రహించుటలో దోషముండదని చెప్పెను తాం త్యజామేహ దేవ దేవకులే తత! నదోషా గ్రహణే తస్యాస్తవ దేవకుల స్త్రియః" ఇట్లే బలధరసేనాపతికూడా దేవకులములో వదలబడిన తన భార్యను గ్రహింపుమని యశోధన రాజుతో చెప్పెను. రూపిణిక దైవ మందిరమున పూజను ఆచరించుచుండెను. దీనివలన రూపిణిక వేశ్యా-దేవదాసిఅని స్పష్టమగు చున్నది. నృత్యము, భగవన్మూర్తి అలంకరణము, మందిరశోధనము ఆమె కర్తవ్యముగా ఉండెను. ఈ దేవదాసీ కథకు రాజ తరంగిణిలో ఐతిహాసిక ప్రామాణ్యము కలదు. కథాపాదిత్యుడను రాజు "నోవ" అనుపేరుగల ఒకానొకని పత్నిని మందిరములో దేవదాసీగా నుండగా పరిణయమాడెను ఈమె కాశ్మీర ప్రభువులుగా ప్రసిద్ధిచెందిన చంద్రాపీడ, తారాపీడ, లలితాదిత్య, ముక్తాపీడులకు తల్లి.

దేవదాసీ వ్యవస్థకు ధర్మశాస్త్రాధారములేదు. మిత్రదేశములలో దేవపత్ని అను వ్యవహరింపబడు వీరిని పరిణయమాడుట

వలన వీరు మృత తుల్యులుగా పరిగణింపబడిరి. దక్షిణభారతదేశము నందలి దేవదాసీ ప్రథవిదేశీయుల ఆక్రమణచే ఉత్తరభారతదేశ మందిరములలో ప్రాచీన స్వరూపమును కోల్పోయినది. కథాసరిత్సాగరమున వర్ణింపబడిన రూపణిక మధురానివాసిని మహమ్మదీయులు ఆక్రమించిన పిమ్మట మధురానగరము ధార్మిక కేంద్రముగా నుండెను. 208 A.D. కాలమునకు చెందిన తమిళ శిలా లేఖములలో దేవదాసీలు పేర్కొనబడిరి. ఆ శిలాలేఖము చోళవంశీయుడయిన రాజరాజునకు చెందినది ఈ దేవదాసీ వ్యవస్థ ఎట్లేర్పడినదో పవిత్ర మందిరములలో వారి ప్రవేశము ఎట్లు అంగీకరింపబడినదో నిశ్చయించని జాలము. నరబలి స్థానమున దేవదాసీ వ్యవస్థ ప్రాదుర్భవించెనని కొందరు చెప్పుదురు. దైవముచే వివాహితురాలైన స్త్రీకి పిమ్మట వైధవ్యము సంభవించు కుండుగాక అని ఈ వ్యవస్థను ప్రచురితము చేసితిరని కొందరి అభిప్రాయము. దేవునిచే పరిణయమాడబడిన దేవదాసిని కూడ కొందరు భార్యగా స్వీకరించుచుండిరి. అతిథులకు సంభోగ సుఖము నిచ్చుటకు ఈ వ్యవస్థ ఆరంభమని కొందురు చెప్పుదురు. దుష్టగ్రహ ప్రభావము నుండి రక్షించుటకు, దేవతాప్రీతి కొరకు తదర్పణ ప్రథ పరికల్పింపబడెనని కొందరి వాదము. అసభ్య ద్రావిడ సంస్కృతికి మూలము ఇది అని మరి కొందరి వాదము. పై అభిప్రాయములలో ఏదియు విశ్వాసార్హము కాదు.

ఇందు పవిత్రోద్దేశ్యము ఒకటి కలదని కొందరి అభిప్రాయము రాగానంతరమే వైరాగ్యమున స్థిరత్వము లభించును. దైవమందిరములలో లౌకిక సుఖక్షణ భంగురతను బోధించుటకు దేవదాసీలు సహకారిణులుగా ఉండిరని చెప్పుచున్నారు భారతదేశమున ధర్మాచార దర్శనములు నిత్యము పరిణామము పొందుచున్నవి. కాలానుగుణముగా

దేవదాసీ వ్యవస్థ సమర్థనీయముగా ఉండెనని "టానె" పేర్కొనెను.

సతీ ప్రథ :-

సతీ శబ్దము సమీచనార్థమును బోధించును. భర్తమరణించిన పిమ్మట శవంతో స్వేచ్ఛగా దహింపబడు స్త్రీ సతి అని పేర్కొనబడినది. క్షత్రియ వంశములో ప్రసిద్ధమైన ఈ వ్యవస్థ ప్రాచీన అసభ్య సంస్కృతి విశేషమని ఆమె పేర్కొనెను. ఋగ్వేదములలో కానీ మనుస్మృతిలో కాని దీని ప్రస్తావన లేదు. మనువు విధవా నియమములను పేర్కొనెను. రామాయణమున సతీప్రథ లేదు కానీ మహాభారతమున కలదు. "అనశ్రా ప్రే నమీవాః సురత్నా ఆరోహంతు జనుషోధో నిమగ్రే" అను ఋగ్వేద మంత్రము అధర్వణ వేద పాఠాంతరమున లేకుండుటచే ఇది ప్రక్షిప్తాంశమని తెలియుచున్నది. సంపూర్ణ భారత దేశమున ఈ ప్రథలేదు. బెంగాల్, రాజపుతాన్ ప్రాంతములలో సతీ ప్రథకు విశేషోదాహరణములు కలవు. సిక్కుల గురువైన అమరదాసు ఈ సతీ ప్రథను నిందించుచూ పతి మరణించిన పిమ్మట వియోగ దుఃఖముచే మరణించిన స్త్రీయే సతి అని పేర్కొనెను.

పతి మరణానంతరము సహగమనము లేదా శేషజీవనమున బ్రహ్మచర్యోపాసనము అను రెండు పద్ధతులు బృహస్పతిచే పేర్కొనబడినవి. "అంగిరస స్మృతిలో" పతి మరణానంతరము అగ్నిదగ్ధయగు స్త్రీ అరుంధతీ సదృశురాలై స్వర్గలోకమున మహత్వ స్థానమును ఆక్రమించునని చెప్పబడినది. మనుష్యశరీరమున ఎంత రోమ సంఖ్య కలదో అన్ని సంవత్సరములు సహగమనము చేయు స్త్రీ స్వర్గములో ఉండగలదు, వ్యాసస్మృతి," విష్ణుపురాణము, పరాశర స్మృతి, దక్ష స్మృతులు పేర్కొన్న విధవల అగ్న్యారోహణమును మధ్యయుగమున సమర్థించినవి. కుమార సంభవమున గాథాసప్తశతిలో, కామ సూత్ర

ములలో, విధవా సతుల ప్రశంస కలదు. కథాసరిత్సాగర కాలమున రాజకులమున ఈ వ్యవస్థ సంపూర్ణముగా నుండెను. సోమదేవునకు ఆశ్రయ మిచ్చిన రాజైన అనంతుని పత్ని సూర్యమతి స్వయముగా పతితో సహగమనము చేసెను. సతీభావ ఘటనలు ఎన్నియో కథాసరిత్సాగరమున కలవు. శతానీకుని మరణానంతరము రాణి సతి అయ్యెను. చంద్రశ్రీ కూడా సతి అయ్యెను.

విధవ :-

సామాన్య జన విధవలు ఆ జీవనమును బ్రహ్మచర్యమును పాటించుటలో చాలా క్లేశమును అనుభవించుచుండిరి. దశమారిక సతి మరణానంతరము దశపత్ని ఆయ్యెను, "ఒకానొక విధవ జీవనము కొఱకు అనైతిక జీవనమును గడుపు చుండెను."3 గర్భవతియైన స్త్రీని సతిగా వ్యవహరింప కుండిరి సంపూర్ణ కథాసరిత్సాగరమున సతీప్రథ నిందింపబడినదని గాని, ప్రశంసింప బడినదని గాని చెప్పజాలము. రాజ కులమున పరంపరాచారముగా ఇది పాటింపబడుచుండెను. ఇట్లు కథాసరిత్సాగరమున భిన్న భిన్న స్వభావములు గల స్త్రీల చరిత్ర ను వర్ణించుటచే కథాసరిత్సాగరమున స్త్రీ చరిత్ర కోశమని చెప్ప వచ్చును.

4.3.8. కథాసరిత్సాగరము-సంస్కృతి వైశిష్ట్యము :-

కథాసరిత్సాగర సంస్కృతి భిన్న సంస్కృతి సమ్మిళితమై విశిష్ట స్థానమును ఆక్రమించినది. ఇందు శివభక్తుడైన సోమదేవుడు శివ స్తుతి చేతనే గ్రంథము నారంభించెను. తత్కాల విశ్వాసములు స్వచ్ఛ హైందవ భావ నిలయములుగా ఉండెను. అందు బౌద్ధ తాంత్రిక విషయములు ఆధునిక కాలమున అభివృద్ధి పొందిన మత దృక్ప

ధములకు సమానముగా నున్నవి హిందూ తాంత్రిక సిద్ధాంతములు బౌద్ధమత విధానము జంతుబలి అటవీజనాచారములు మిశ్రమాచారత్వముచే అగామి భారతీయ మహమ్మదీయ యుద్ధమున సామాజిక సైర్వమునకు లేదా రాజకీయ స్థైర్యమునకు ఉపకరింపలేదు.

10, 11 శతాబ్దములలో సమాజమున నాలుగువర్ణముల వారుండిరి. కులము మనుష్యుల జీవన వృత్తిని నిశ్చయించుటకు సమర్థము కాకుండెను. బ్రాహ్మణులు మతాతీత కార్యములలో నియుక్తులై యుండిరి. ఒకానొక బ్రాహ్మణ యువకుడు మల్లయుద్ధ విశారదుడై ఉండెను. ఒకానొకడు పండితుడై ఉండెను. అయినప్పటికిని వారు బ్రాహ్మణత్వమును త్యజింపకుండిరి. బ్రాహ్మణుడైన సోమదత్తుడు భర్తృధర్మమును ప్రవర్తింపజేసెను. వీరవర కథలో బ్రాహ్మణుడు సైనికుడయ్యెను.

కాయసలము కూడ మధ్యయుగమున ప్రారంభముననే యుండెను. దానికి పూర్వము కాయస్థుల నామమే వినబడకుండెను. మొట్టమొదట లేఖకులు ఉండిరి. భారతీయ సంస్కృతి విస్తరింపబడుట వలన లేఖకులు కాయస్థులనెడి ఒక కులముగా ఏర్పడిరి. పూర్వము వారిని కేవలం లేఖనమును బట్టి లేకకులని వ్యవహరించుచుండిరి. కాయస్థులు ద్విజాచారములను ప్రవర్తింప జేయుచుండిరి. సమకాలీన సాహిత్య ఆధారముగా వీరు అక్రమ ధనార్జన పరులుగా నుండిరని తెలియుచున్నది. దేవాలయ అధికార స్థితిని వినాశము చేయుటకు వీరు జన్మించిరని కల్హణుడు పేర్కొనెను.

వీరు ప్రజల వాక్-స్వాతంత్ర్యమును నశింపజేయుదురని క్షేమేంద్ర, సోమదేవ, కల్హణులు తమ గ్రంథములలో వర్ణించిరి. సమకాల కవులు కూడా సమభిప్రాయములను వ్యక్తపరచిరి. కథాసరి

త్సాగరమున క్రూర, నిమ్నజాతి చరిత్ర వర్ణనము తీవ్ర దృష్టితో పరి శీలింపబడినది. వీరి చరిత్రము గా విపులముగా వర్ణింపబడుటకు గల కారణమును తెలుసుకొనుటకు మధ్యయుగ ప్రారంభకాల రాజకీయ, సాంఘిక, ఆర్థిక స్థితిని చక్కగా అధ్యయనము చేయవలెను.

కథాసరిత్సాగరమున ఆలోచనలో ఉన్నత భావములు, ఉపా యములు, ఆదర్శములు సాహిత్యమున మతములలో విజ్ఞాన శాస్త్రమున లలిత కళలలో చక్కగా సంయోజితములు కాలేదు. కాని ఆలోచనా భావములు జీవితమున సర్వస్థానములలో సర్వకార్యములలో, భోజన పాన, వేష, భూషణ వినోద క్రీడాదులలో చక్కగా ప్రదర్శింపబడినవి. ఆ ఆలోచనా భావములు మానసిక, వైజ్ఞానిక సంస్కారము నుండి ప్రాదుర్భవించెను. భారతీయ సమాజ సంబంధములైన అనేక విషయ ములు క్షేమేంద్రునిచే, సోమదేవునిచే స్వగ్రంథములందు ప్రస్తుతింప బడినవి.

కథాసరిత్సాగరమున స్త్రీల కంచుకములను గూర్చి విచిత్ర ఆకర్షణ వర్ణన కలదు. కంచుకమునకు, చోలీ, బ్లౌజ్ అని ఆధునిక నామములు. మనోహారిణులైన స్త్రీలు విస్తృత వక్షోజ ఆస్తరణమునకు దృఢ బద్ధ కంచుకములను ధరించుచుండిరి. ఆ కంచుకములు వక్షోజ గోపనమునకు చిత్ర వర్ణముద్రితములుగా నుండెను.

పురుషులు కూర్పాసకముచే దేహాచ్ఛాదనము చేసుకొనుచుం డిరి. కథాసరిత్సాగరమున పురుష సాధారణమైన వస్త్రధారణము రెండు విధములుగా విభజింప బడెను. శరీరము యొక్క ఉత్తర భాగమును ఆచ్ఛాదించు వస్త్రమును ఉత్తరీయము లేదా దుప్పటము అని వ్యవ హరించిరి. సోమదేవుడు పట బంధమను పేరుగల వస్త్రమును నిర్దేశిం చెను. దేశమున ఉత్తమ సేవకుడు పటబంధ వస్త్రము ఇవ్వబడు

నుండెను. స్త్రీలు పాదనూపుర పర్యంతము చీరను ధరించుచుండిరి. శాటకము చీర- సౌందర్యము కొఱకు చీరయందే అనుబంధముగా నిర్మింపబడుచుండెను. స్త్రీలు లహంగమును సాంఘిక మహోత్సవము లలో ధరించుచుండిరి. దీని అధునిక నామములంగా శాలముచే పై భాగమును కప్పుకొనుచుండిరి. కథాసరిత్సాగరమున ప్రజల ఆర్థిక స్థితి తృప్తిని కలిగింపదు. బ్రాహ్మణులు రాజుల భూదానముతో జీవించుచుండిరి. కానీ దానికి సంబంధించిన విస్తృత విషయములు శిలాశాసనముల వలన లభింపలేదు. దాస వృత్తి అంగీకరింపబడి యుండెను. బ్రహ్మదత్త కథలో "ఒకానొక దాసి బ్రాహ్మణ గృహమున నున్నదై వైశ్య గృహములో లున్న ధనక్రీతుడను దాసుని వివాహమాడెను."1 దాస వృత్తి నిర్బంధముగా లేకుండెను. వివాహిత దాస దాసీజనులు (చే) స్వేచ్ఛగా స్వగృహమున నుండుటకు ఎట్టి ప్రతిబాధకము ఉండెడిది కాదు. దాసవృత్తి వంశ పారంపర్యమా లేదా వ్యక్తిగతమా అని నిర్ణయించుటకు సాధ్యపడదు. బ్రహ్మదత్త కథలో దారిద్ర్యము కూడా వర్ణింపబడినది. ఒకానొక బ్రాహ్మణుడు దరిద్రుడై దాసులిచ్చిన భోజనమును భజించెను. బ్రాహ్మణుడు భోజనమును భుజింపగా భోజనదాత క్షుత్ పిపాసచే మరణించెను. అతని భార్య సతి, ధర్మావలంబనియై వెంటనే సహగమగము చేసెను. అతివృష్టి అనావృష్టులచే ఆహారము లభింపక దరిద్రులు నివాసస్థానమును వదలి ఆహారము కొఱకు సుదూర స్థానమునకు సకుటుంబముగా వెళ్ళుచుండిరి అని కథాసరిత్సాగరము వలన తెలుసుకొనగలుగుచున్నాము.

చంద్రదస్వామి కథలో రాజు ప్రజలనుండి రాజసేవక జనము నుండి అక్రమధన సంపాదన ప్రవత్తుడయ్యెను. దారిద్ర్య నివారణ కొఱకు దీర్ఘ కాల పర్యంతము ధాన్యజల రక్షణార్థము నాటి పాలక

వర్గము ఎట్టి ప్రయత్నము చేయకుండెను.

శ్రద్ధాజనకమైన దేవదాసు కథవలన సువర్ణ సంచయ కార్యమును గూర్చి తెలసుకొనుచున్నాము. నేడుకూడ భారతదేశమున సువర్ణ సంచయ వైభవము కొనసాగుచున్నది. వాణిజ్యము పూజ్యముగా ఉండెను. వణిజులు వాణిజ్యము కొఱకు సముద్ర ప్రయాణము చేయుచుండిరి. సముద్ర ప్రయాణమున మత, సామాజిక పరమైన అవరోధము ఉండెడిదికాదు. భోజనపాన సంబంధ విషయములకు కథాసరిత్సాగరమున అధిక ప్రాముఖ్య మివ్వబడును. ఆమ్ర, ఆమలక, జంబు. త్రిఫలాదుల ఫలముల కోవలో సమృద్ధిగా లభించుచుండెను. కొందఱికి మత్స్యమాంస భోజనము ముఖ్యముగా ఉండెను వనజంతువులైన హరిణాదుల మాంసము కూడా ఉపయోగింపబడుచుండెను, ఆచారశీలుడైన అర్థవర్మకథలో అర్థవర్మకు ఘృత, మిశ్రిత శాలి, స్వల్పశాలి ధాన్యము, మాంసము, భోజన ప్రాప్తములుగా నుండెను. నైతిక నియమ జీవనము గల భోగవర్మకూడా భోజనముతో పాటు ద్రాక్షాసవమును మద్యముగా సేవించుచుండెను. రాజవంశమున స్త్రీలు కూడా మద్యపానము చేయుచుండిరి. వణిజులు మద్యపానము చేయుట సర్వసాధారణముగా నుండెను. రాజ స్త్రీల మద్యపానముచే సోమదేవుడు వారి ఉన్నత సామాజిక జీవనమును మనకు పరిచితము చేసెను. దీనిచే సోమదేవ కాలమునకూడ మద్యపానము స్వాభావికముగా నుండెడిదని తెలియుచున్నది. ఇతనికి మద్యపాన స్త్రీలతో సంబంధముండెడిదని ఊహించవచ్చును, ఆధునిక కాలమున స్త్రీ మద్యపానమునకు ప్రసిద్ధిలేదు. బహిరంగముగా స్త్రీలు మద్యమును సేవించుట దోషముగా గుర్తింపబడుచున్నది. హిందూమత నైతికాచారములు, భక్తి ప్రధానత మహమ్మదీయులచే భారతదేశపాల

మొదలగు కారణములచే స్త్రీ మద్యపాన నిషేధింపబడినది.

నాడు ఉన్నత కులస్త్రీలకు నాట్యము సాధారణ విద్యగా నుం డెను. (కాంతారమున) దేవదాసీ వర్గమునకే నాట్యము పరిమిత మయ్యెను. స్త్రీలకు ఏకాంతవాస నియమము, మహ్మదీయ మత ప్రభా వము సర్వస్త్రీల నాట్యాభ్యాస నిషేధమునకు కారణమని తలంచ వచ్చును.

ఆ కాలమున హంసవతి అను రాజకుమారి పితృ సన్నిధిలో సభ యందు ప్రణయనాట్యము చేసెను. నాట్యోపాధ్యాయుడుకూడా రాజ సభయందే యుండెను స్త్రీ పురుషులు సంగీతమును అభ్యసించు చుండిరి. గాయకులు నాట్యాచార్యులు సభలో నుండిరి. చిత్రకళకు, శిల్పకళకు విశేష ప్రాముఖ్యముండెను. రాజసభ బహుచిత్ర పటా లంకృతమై ఉండెను. రాజభవనమున, దేవాలయమున సౌందర్యము కొరకు ఉద్యాన శోభానాలంకరణముకూడా ప్రసిద్ధమైయుండెను.

జ్యోతిష్కులు, వైద్యులు, సాముద్రికులు, మానవ జీవిత త్రికాలజ్ఞులు నాటి సమాజములో నుండిరి. మూర్ఖజ్యోతిష్కులు అల్పజ్ఞు లని ఆ వృత్తివలననే జీవించుచుండిరని తెలియుచున్నది. నగర ములో చారిత్రక పవిత్ర స్థలములనేకము కథాసరిత్సాగరమున నిర్దే శింపబడినవి. ఉజ్జయినీ పాటలీపుత్రము, కాశ్మీరము, తక్షశిల, లాట, చోళ, కళింగ, కానురూపాది దేశములు గ్రంథమున ప్రస్తావింప బడినవి.

కథాసరిత్సాగర కాలమున విద్యాశిక్షణ పద్ధతి :

ప్రాచీన భారతీయ శిక్షణ పద్ధతి సునియోజితముగా పరి

ష్కృతమై సుసంఘటితముగా నుండెను. శిక్షణలో ఆధ్యాత్మికతోపాటు సామాజిక మూల్యములు కూడా ఆవశ్యకములుగా నివేశింపబడెను. సమాజమున ప్రబుద్ధమార్గమునకు ఒకదానికే యావజ్జీవము అధ్యయనము, అధ్యాపనము కర్తవ్యముగా నుండెను. గురుకుల శిక్షణ సంస్కృతికి కేంద్రముగా నుండెను. అందు సంపన్నులు, దరిద్రులు సమానముగా విద్యాశిక్షణ పొందుచుండిరి. ఆచార్యుల నిస్వార్థ జీవనము క్షత్రియులకు ఆదర్శప్రాయముగా నుండెను. సంస్కృతి రక్షకమైన భావి సంతతి ప్రథా - ప్రదర్శకమైన నవీన విజ్ఞానసృష్టి గల జ్ఞానజ్యోతి నిత్యము గురుకుల విద్యావిధానములో దేదీప్యమానముగా నుండెను. గృహస్థాశ్రమమున ప్రవేశించినవారు ధర్మప్రవణులై భారతీయ సంస్కృతికి ప్రతీకలుగా నుండిరి. ఆదర్శోన్ముఖమైన శిక్షాపద్ధతి కాలక్రమమున యదార్థస్వరూపమును విడనాడెను. శస్త్ర, శాస్త్ర, దర్శన, కళాది సర్వ విషయములకు సమాన మహత్త్వముండెను.

కథాసరిత్సాగర కాలమునాటి శిక్షణ పద్ధతికూడా సుప్రతిష్ఠమై యుండెను, ఛాత్రులు గుర్వాశ్రమమున నున్నవారై ప్రాచీనకాలం నుండి విద్య నభ్యసించుచుండిరి. మధ్యకాలమునకూడా ఇదే వ్యవస్థ కొనసాగుచుండెను. దూరదేశము నుండి ఛాత్రులు విద్యాధ్యయన కొఱకు గురుగృహమునకు వెళ్ళుచుండిరి. ఒకానొక బ్రాహ్మణుడు శోభావతీ నగరము నుండి విశాలనగరమునకు వెళ్ళి బ్రహ్మచారులతో కలిసి విద్యను అభ్యసించుచుండెను. అట్లె దేవదత్తుడు విద్యాధ్యయనము కొఱకు పాటలీపుత్రమునకు వెళ్ళి వేదకుంభుడను అధ్యాపకునివద్ద విద్య నభ్యసించుచుండెను. "నామస్వామి" అనుపేరుగల బ్రాహ్మణుడు

పాటలీపుత్ర వాసియైన జయదత్తుడను పేరుగల ఉపాధ్యాయుని నుండి విద్య నభ్యసించుచుండెను. "ఒకానొక గ్రామమున "అగ్ని దత్తుడను" ఉపాధ్యాయుడు వట వృక్షము క్రింద శిష్యులకు విద్య నేర్పుచుండెను."1

గురుకులములు :

గురుకులములు అనేక విధములు. ప్రసిద్ధ విద్వాంసులు ఉపాధ్యాయులు ప్రసిద్ధ నగరములలో, గ్రామములలో నివసించుచుండిరి. చాలాదూర ప్రాంతములనుండి కూడా విద్యార్థులు వచ్చి విద్యాధ్యయనము గావించుచుండిరి, ఉపాధ్యాయులు సంపూర్ణముగా గృహస్థాశ్రమవాసులై యుండిరి. వారి వృత్తి కేవలము అధ్యాపనమే. అగ్ని దత్తుడను పేరుగల ఉపాధ్యాయని గృహము సంపన్నాలయముగా నుండెను. గోవులు, అశ్వములు మొదలగునవి అతని గృహమున నుండెను. గ్రామనామముకూడా అతని నామముతోడనే అంకితమై యుండెను.

## అగ్రహారము

శిక్షణ విషయమున అగ్రహారములకు రెండవ స్థానము కలదు. ప్రసిద్ధ పండితులకు రాజులు సన్మాన రూపంలో అగ్రహారముల నిచ్చుచుండిరి. వాటినే అగ్రహారములని వ్యవహరించుచుండిరి. ఆ అగ్రహారములు ప్రసిద్ధ విద్యా శిక్షణా కేంద్రములుగా ఉండెను. రాజులు కూడా శిక్షణ కేంద్రముంను పోషించుచుండిరి. ఉపాధ్యాయుల కొఱకు సన్మానరూపమున నిచ్చు అగ్రహారములనుగూర్చి కథాసరిత్సాగరమున విస్తృతవర్ణన కలదు. గంగాతీరమున " బహుసువర్ణమను " పేరుగల అగ్రహారమునకు వివిధశాస్త్రజ్ఞుడైన "గోవిందదత్తు

దను" వాడు ప్రభువుగా నుండెను. యమునా తటస్థ అగ్రహారమున వేదజ్ఞుడైన "అగ్నిస్వామి," వృక్షఘట నామక అగ్రహారమున విష్ణుస్వామి ఉపాధ్యాయ స్థానములో నుండిరి. సుఘోషమను పేరుగల ప్రసిద్ధ అగ్రహారమున వేదజ్ఞుడైన బ్రాహ్మణుడైన "పద్మశర్మ" ఉపాధ్యాయుడుగా నుండెను. ఇట్లనేక అగ్రహారములలో వేదజ్ఞులైన విద్వాంసులు ఉపాధ్యాయులుగా నుండిరని గ్రంథమున వర్ణింపబడెను. ఆదిత్యసేనుడను రాజు బ్రాహ్మణ మఠమున ప్రవేశించెను ఇట్లనేక మఠములు కథాసరిత్సాగరమున వర్ణింపబడి ఆ మఠములన్నియు మధ్యకాలమున విద్యాశిక్షణా కేంద్రములుగా యుండినవి కావున అగ్రహారములు, బ్రాహ్మణ మఠములు గురుగృహములు విద్యా కేంద్రములని తెలియుచున్నది.

పూర్వకాలమున, మధ్యయుగమున వలభి, కాశ్మీరము ప్రముఖ కేంద్రాలుగా నుండెను. కథాసరిత్సారమునందలి వివరముల వలనకూడా ఈ విషయమే స్పష్టమగును. వారణాశి, తక్షశిల, పాటలీపుత్రము, ప్రముఖ విద్యా శిక్షణా కేంద్రములు మధ్యయుగమున వర్ణింపబడెను. విష్ణుదత్తుడు విద్యార్జనకొఱకు వలభీ నగరమునకు వెళ్ళెను. వలభి నగరము తర్వాత కాశ్మీరము ధర్మమునకు విద కు ప్రముఖస్థానముగా నుండెను, ఒకానొక విద్వాంసుడు పాటలీపుత్రము నుండి విద్వద్విరయము కొఱకు కాశ్మీరమునకు వెళ్ళెను. ఇట్లే మరియొక శ్రమణుడు కాశ్మీరము నుండి పాటలీపుత్రమునందలి పండితులను జయించుటకు వెళ్ళెను.

పాటలీపుత్రము :

కథాసరిత్సాగర కాలమున తృతీయ విద్యా శిక్షణా కేంద్ర ము

పాటలీపుత్రము, ఛాత్రుడు వేదకుంభుడను పేరుగల ఉపాధ్యాయుని నుండి విద్యాశిక్షణ పొందుటకు పాటలీపుత్రమునకు వెళ్ళుచుండిరి.

## శిష్యులు

గురుగృహమున నున్న శిష్యగా గురుసేవచే ఉపాధ్యాయుని ప్రసన్నము చేసుకొనుచుండిరి. అనవరత గురుపరిచర్య ఛాత్రుల పరమధర్మముగా నుండెను. గురుభక్తిచే వినీతులైన ఛాత్రులు జ్ఞానము నాకర్షించుచుండిరి. కథాసరిత్సాగర కాలమున గురుసేవచే విద్యార్జనము జరుగుచుండెను. ఇరువురు శిష్యులు గురుచరణ సేవ కొఱకు పరస్పరము కలహించుకొనిరి. శిష్యులలో బ్రాహ్మణులు, క్షత్రియులు ఉండిరి. వైశ్యులు శిష్యులుగా ఉండిన ఒకే ఒక ఉదాహరణము కథాసరిత్సాగరమున కలదు. వైశ్యులకుకూడా వ్రాయుటకు గణించుటకుఅధ్యయనము అవశ్యకమయ్యెను. కుమారదత్తుడను వైశ్య పుత్రుడు గురువునుండి లేఖనమును గణనమును నేర్చుకొనెను. కుల భేదుని మతము ననుసరించి మధ్యయుగమున వైశ్యులకు వేదాధ్యయ అధికారము లేకుండెను.

## విద్యాభ్యాస కాలము :

పంచమ వర్షముననే విద్యాధ్యయనము అరంభింపబడుచుండెను ఉపనయన సంస్కారానంతరము ఛాత్రులు గురుకులమున ప్రవేశించుటకు అర్హులైయుండిరి. కథాసరిత్సాగర ఉదాహరణములు కూడా ఈ విషయమును బలపఱచుచున్నవి, వరరుచి ఉపనయన సంస్కార అనంతరమే అధ్యయన యోగ్యుడయ్యెను. విషుదత్తుడు 14 సంవత్సరముల వయస్సులో విద్యార్జనమునకు వెళ్ళెను. విక్రమాదిత్యుడు కూడా ఉపనయన అనంతరమే విద్యాధ్యయనము గావించెను.

క్షత్రియోచిత సంస్కారానంతరమే ఉధయనుడు విద్యను, ధనుర్వేద మును అధ్యయనము గావించెను. సమాజమున ధనికులకు, దరిద్రు లకు అధ్యయనమున సమాన ప్రవృత్తి ఉండెను. సంపన్నులయిన ఛాత్రులు కూడా క్లేశమును అనుభవించి శిక్షణ కొఱకు సుదూర ప్రాం తములకు వెళ్ళుచుండిరి. మాళవనివాసియైన శ్రీధర బ్రాహ్మణుడు స్వపుత్రులను విద్యాధ్యయనము కొఱకు దేశాంతరమునకు పంపించెను. ఒకనొకడు కుండిన పురమునుండి పాటలీ పుత్రమునకు విద్యాధ్యయ నమునకు వెళ్ళెను. "భిక్షాటనము బ్రహ్మచారులకు దైనిక కర్తవ్యముగా నుండెను."2 సంపన్న కుటుంబములో జన్మించిన ఛాత్రులు గురు గృహముననే విద్యనభ్యసించు చుండిరి.

గురువు :-

కథాసరిత్సాగరమున అధ్యాపకుడు ఉపాధ్యాయుడని వ్యవ హరింప బడెను."3 ఉపాధ్యాయుని సామాన్యయోగ్యత వేదపాండి త్యము. కథాసరిత్సాగరమునందు వర్ణింపబడిన ఉపాధ్యాయులు వేద విద్యా విశారదులుగా నుండిరి. గుణశర్మ విద్యలోని ద్వాదశ శాఖలను అధ్యయనము గావించెను. అతడు సామవేదము నుండి రెండు శాఖ లను, ఋగ్వేదము నుండి రెండు శాఖలను, యజుర్వేదము నుండి ఏడు శాఖలను, అధర్వణ వేదము నుండి ఒక శాఖను అధ్యయనము చేసెను. వేద విద్యాపారంగతులే అధ్యయన అధికారులుగా నుండిరి. గురువు శిష్యునిపై పుత్రస్నేహమును ప్రదర్శించి అతని ప్రశ్నలకు అన్నింటికీ సమాధానము చెప్పుచుండెను.

పాఠ్యవిషయములు :- రాజులు వేదాధ్యయనము చేసి

వైదిక యజ్ఞమును నిర్వహించు చుండిరి. వేదాధ్యయనము గురు సంరక్షణ యందే జరుగుచుండెను. పాఠ్యాంశములలో వేదములు అప రిహార్యములు. ఆదిత్యశర్మ మొదట వేదమును పిమ్మట అన్యవిద్య లను, కళలను అధ్యయనము గావించెను. కురభకుడను బ్రాహ్మణుడు వేద విద్యావిశారదుడై ఉండెను. గుణశర్మ కూడా సర్వవేద విద్యా విశారదుడుగా ప్రసిద్ధి పొందెను. కథాసరిత్సాగరమున వేద మహ త్త్వము అనేక సందర్భములలో వర్ణింపబడినది.

శస్త్రవిద్య :-

పాఠ్యవిషయములలో వేదానంతరము శస్త్ర విద్యకు ప్రాము ఖ్యము ఇవ్వబడెను. ఛాత్రులు వేదాధ్యయనముతో పాటు శస్త్ర విద్యను కూడా అభ్యసించుచుండిరి. కథాసరిత్సాగరమున వసుదత్త, శ్రీదర్శన శ్రీదత్త, గుణశర్మ అను బ్రాహ్మణులు అస్త్రశస్త్ర వేదవిద్యా నిపుణు లుగా వర్ణింపబడిరి. శ్రీదత్తుడు, అశోకదత్తుడు బాహుయుద్ధములో కూడ నిపుణులుగా నుండిరి. మహీపాలుడు అను బ్రాహ్మణుడు శస్త్రా స్త్రవిద్యలో సంపూర్ణ జ్ఞానమును పొందెను. ఆ కాలమున శిక్షణను పొందిన బ్రాహ్మణులు సైనికులు, రాజులు అగుచుండిరి. అశోకదత్తా వీరవరులు బ్రాహ్మణులుగా నుండి సైనికులయిరి. "దాక్షిణాత్యయువ బ్రాహ్మణుడు నరవాహన దత్తునకు రక్షకుడుగా నియమింపబడెను."4 ఈ ప్రమాణములచే పాఠ్యవిషయములలో శస్త్ర విద్యకు కూడా ప్రా ముఖ్య ముండెనని బ్రాహ్మణులు కూడా శస్త్రవిద్యాశిక్షణను పొందు చుండిరని తెలియుచున్నది.

విద్య :-

వేదములు, వేదాంగములు, ధర్మశాస్త్రములు, పురాణములు, మీమాంస, తర్కాదులు విద్యాంతర్గతములు. ఆ కాలమున విద్యాసంఖ్య మార్పు చెందుచుండెను. మొదట నాలుగు వేదములకే విద్యావ్యవహార ముండెను. పిమ్మట విద్యాస్థాన సంఖ్య చతుర్దశ అని పేర్కొనబడెను. కథాసరిత్సాగరమున వేదములలో పాటు చతుర్దశ విద్యాస్థానములు పేర్కొనబడినది. ఉదయన పుత్రుడయిన నరవాహన దత్తునియందు విద్యలు ప్రవేశించెను. శివుడు సర్వవిద్యా ప్రాప్తి కొఱకు ఆశీర్వదించెను సర్వవిద్యలలో వ్యాకరణ మహత్త్వము మధ్యయుగ ప్రారంభముననే ఉండెను. కథాసరిత్సాగర కాలపౌరాణికములలో వ్యాకరణమునకు సర్వాధిక మహత్త్వపూర్ణస్థానమివ్వబడెను. వరరుచి జీవనము ననుసరించి అతడు వర్షోపాధ్యాయుని నుండి విద్యలను అధ్యయనము గావించి ప్రపంచమున వ్యాకరణమును ప్రతిష్ఠితము చేయగలడని సరస్వతి వరమిచ్చెను. శృతధరుడు వరరుచి వర్షోపాధ్యాయుని నుండి వ్యాకరణమును పొంది దానిని ప్రతిష్ఠితము చేసిరి. పాణిని మహర్షి శివుని కృపచే వ్యాకరణ శాస్త్ర పాండిత్యమును పొందెనని కథాసరిత్సాగరము వలన తెలియుచున్నది. వ్యాకరణము సర్వవిద్యలకు ముఖము వంటిదని పేర్కొనబడెను. ఇది వేదపురుషునికే ముఖము. కావున వేదాంగములలో వ్యాకరణమునకు ప్రాధాన్యము కలదు. శాతవాహనరాజు వ్యాకరణ జ్ఞానభావముచే విదేశీయునిచే అవమానింపబడెను. సర్వవిద్యాముఖ భూత నవీన వ్యాకరణమును 12 సంవత్సరములు అధ్యయనము చేయవలెనని గుణాఢ్యుడు చెప్పెను. కావున వ్యాకరణ శాస్త్రాధ్యయనమునకు 12 సంవత్సరములు ఆవశ్యకములు.

ఆ కాలమున పాణీని వ్యాకరణము కంటె ఇతర వ్యాకరణ ములు ఎక్కువ అభిరుచింపబడు చుండెను. కాతంత్ర వ్యాకరణము కథాసరిత్సాగరమున నిర్దేశింపబడెను. గుణాఢ్యుడు పాణినీయ వ్యాకరణమును నేర్పుటకు 12 సంవత్సరములు ఆవశ్యకములని శాతవాహనునితో చెప్పెను. ఇతని ప్రతిద్వంద్వి అయిన "శర్వవర్మ" 6 మాసములలోనే వ్యాకరణమును నేర్పగిలనని ప్రతిజ్ఞ చేసి కార్తికేయ స్వామి కృపచే కాతన్త్ర వ్యాకరణ నిర్మాణమున సఫలుడయ్యెను. అతడు "సింధోః వర్ణసమామ్నాయః" అని ఉచ్చరించెను. పిమ్మట సూత్రమును శర్వవర్మ చెప్పెను. ఇది విని కార్తికేయుడు నీవు మానవ సులభ చంచలతచే ముందున్న సూత్రమును స్వయముగా ఉచ్చరింపజాలకున్నచో అప్పుడి వ్యాకరణము పాణినీయ వ్యాకనణము కంటె అతిశయింప గలదు. ఇప్పుడు స్వల్ప విస్తర కారణముచే కాతంత్ర మనెడి పేరుతో ప్రసిద్ధిని పొందగలదు నాకు వాహన భూతమైన మయూర కలాప నామముతో కలాపము అని ఈ వ్యాకరణమునకు రెండవ పేరుండగలదని చెప్పెను. ఈ కాతంత్ర వ్యాకరణము అన్యగ్రంధములలో కూడా పేర్కొనబడినది, వైయాకరణులుగా పాణిని, వరరుచి కంటె భిన్నముగా వ్యాడి అనునతడు కూడా ఈ గ్రంధమున పేర్కొనబడెను. ఇతడు మొదట పాణినిని ఓడించి 8వ రోజు శివహుంకారముచే పరాజితుడయ్యెను. వ్యాడి తనను ఐంద్ర వ్యాకరణజ్ఞునిగా చెప్పెను. పాణినిచే పరాజితుడగుటచే ఐందర్రి వ్యాకరణము లోకమున నష్టమయ్యెను. దీని వలన పాణిని కంటె పూర్వము ఐందర్రి వ్యాకరణ అధ్యయన సంప్రదాయముండెనని తెలియుచున్నది ప్రాతిశాఖ్య అధ్యయనము కూడా వేదాధ్యయనాంగమే. ఇది కూడా కథాసరిత్సాగరమున పేర్కొనబడినది.

కళలు :

చతుర్దశ విద్యాస్థానములతోపాటు కళలుకూడా పాఠ్యవిషయము లుగా నుండెను. ఆదిత్యశర్మ వేదవిద్యను, కళలను అధ్యయనము గావించెను. విక్రమాదిత్యుడు కూడా విద్యను, కళలను అధ్యయనం గావించెను. నరహవానదత్తుని కొఱకు కళలే అతనియందు ప్రవేశించి నవి. ఈ ఉదాహరణములచే కళాధ్యయనము పాఠ్యాంశములో ఒక భాగముగా ఉండెనని తెలియుచున్నది సాధారణముగా గురుగృహము ననే ఛాత్రులు కళా శిక్షణ పొందుచుండిరి.

జ్యోతిషము :

గ్రహలగ్నాది విచారణకొఱకు జ్యోతిష్కులు కథాసరిత్సాగర మున ఉల్లేఖింపబడిరి. జ్యోతిష్కులకు జీవనాధారము జ్యోతిష్క విద్యయే. మహాసేనుడు అనురాజు జ్యోతిష్కులను వివాహలగ్నమును గూర్చి ప్రశ్నించెను. జ్యోతిష సిద్ధాంతములుకూడా అచ్చటచ్చటా పేర్కొనబడినవి. దీనికి సంబంధించిన అనేక ఉదాహరణములు కథా సరిత్సాగరమున కలవు. రాజమార్తాండము, భీమ పరాక్రమము. బుజబల నిబంధము, మానసోల్లాసము మొదలగునవి ప్రసిద్ధజ్యోతిష గ్రంథములు.

ఆయుర్వేదము :

కథాసరిత్సాగర కాలమున అధ్యయన విషయములలో వేద వ్యాకరణ, కళా, జ్యోతిష, ఆయుర్వేధములు ప్రముఖములుగా ఉం డెను. కావ్య రచనకుకూడా కథాసరిత్సాగరమున మాన్యత ఉండెను. "ఏకః పత్కావ్య శబ్దానామివ శబ్దో నిరర్థకః" అని మృగాంకదత్తుడు పేర్కొనెను. లక్షదత్తుడను రాజు కర్ణాట సుభాషితములను వీనిపింప

వలెనని ప్రశ్నించెను. కర్ణాటక సుందరుడు కావ్యమయ శైలిలో సుభా షితములను వినిపించెను.

బౌద్ధశిక్ష

వైదిక శిక్షా వ్యవస్థతోపాటు బౌద్ధమతములలో బౌద్ధశిక్షణవ్యవస్థ యుండెను. బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులు వైదిక శిక్షాధికారులుగా నుండిరి. అందువలన వైదికశిక్షకు అనర్హులైన ఛాత్రులు దీక్షితులై బౌద్ధధర్మములను అధ్యయనము గావించుచుండిరి.

శాస్త్రార్థము

విద్వత్పరీక్షలో శాస్త్రార్థ విధిచే పరీక్షా ప్రణాళిక ప్రాచీనకాలం నుండి జరుగుచుండెను. విద్వాంసులు ఒకచోట నుండి మరియొక శిక్షా స్థానమునకు వెళ్ళి శాస్త్రార్థమున విజయమును పొందుచుండిరి. అనేక విద్వాంసులను ఓడించిన వారిని మహావిద్వాంసుడుగా వ్యవహరించు చుండిరి, ఈ గ్రంథమున శాస్త్రార్థ సంబంధములైన అనేక ప్రసంగ ములు కలవు. శాస్త్రార్థమ్మున వ్యాడి, పాణిని మహర్షులలో మొదట పరాజితుడయ్యెను. పిమ్మట శివకృపచే పాణిని వ్యాడిని ఓడించెను. కాశ్మీరము నుండి ఒకానొక విద్వాంసుడు పాటలీపుత్రమున సింహా క్షుని రాజసభలో ప్రవేశించి శాస్త్రార్థ స్పర్థను ప్రదర్శించెను. విద్వాంసులు పాటలీపుత్రము నుండి కాశీర్మరమునకు, కాశ్మీరము నుండి పాటలీపుత్రమునకు రాకపోకలు సాగించుచుండిరి.

స్త్రీ శిక్షణము :

స్త్రీలకు ఉపనయన సంస్కారము లేకున్ననూ సంపన్న కుటుం బములలో వారు సామాన్య విద్యాశిక్షణను పొందుచుండిరి. లలిత విస్తార గ్రంథము ననుసరించి స్త్రీలు కవిత్వములో శాస్త్రములలో

శిక్షణ పొందుచుండిరని తెలియుచున్నది. హాలుని గాథా సప్తశతిలో కూడా సప్త కవయిత్రులు పేర్కొనబడిరి. రాజశేఖరుని భార్య అవంతీ సుందరి పండితురాలు. విజయాంక ప్రసిద్ధ కవయిత్రి. కథాసరిత్సాగర కాలమందలి స్త్రీలు కళాకౌశలమున నిపుణులై యుండిరి. వ్యాకరణశాస్త్ర కావ్యశాస్త్రాతిరిక్త, నృత్య, గీత, వాద్య, చిత్ర కళాదులుకూడా స్త్రీలకు ప్రియ విషయములుగా నుండినవి. కళాజ్ఞానము స్త్రీలకు అవశ్యకముగా నుండెను. శాతవాహనుని ఒకానొక పత్ని వ్యాకరణశాస్త్ర జ్ఞానముచే జలక్రీడా సమయమున మోదకైః తాడయ అని సంక్లిష్ట పదమును ప్రయోగించి రాజును అవహాసితుని గావించెను. అలంకారవతి తన తండ్రివద్ద నుండి విద్యలను అభ్యసించెను. రత్నప్రభ కూడా విద్యలను అభ్యసించెను. ప్రభావతికి కూడా విద్యా బలముండెను. స్త్రీల నృత్యగీతాది ప్రావీణ్యతకు కథాసరిత్సాగరమున అనేకోదాహరణములు గలవు. మృగావతి నృతగీత కళానిపుణురాలు, మదన మంజుక కూడా నృత్యగీతాదులలో శిక్షణ పొందెను. హరిబలుడను రాజు లంబవరుని అంతఃపుర స్త్రీలకు నాట్యాచార్యునిగా నియమించెను వీణావాదనలో చిత్రరచనకు స్త్రీలు నిపుణులుగా నుండిరి. కథాసరిత్సాగరమున విభిన్న కళలలో నిపుణ స్త్రీల సంఖ్య అధికముగా కలదు. వియోగదశలో, విపత్తిలో స్త్రీలు అపరిచితస్థానములలో స్వశిక్షిత కళద్వారా సుఖముగా కాలము గడుపుచుండిరని కళాప్రయోగమునుగూర్చి చెప్పబడినది. ఉదయనసుందరి స్వప్రియుని చిత్రమును నిర్మించెను. కథాసరిత్సాగరమున మనోవినోదముకొఱకు కూడా స్త్రీలు కళాశిక్షణ పొందుచుండిరని తెలియుచున్నది.

విద్యాశిక్షణోద్దేశము :

జ్ఞానార్జనమే శిక్షణ ప్రధానోద్దేశముగా నుండెను. ఛాత్రులు జ్ఞానార్జనకొఱకు సుదూర ప్రాంతములకు వెళ్ళి గురుకులములలో బహు వర్ష పర్యంతము అధ్యయనము గావించుచుండిరని కథాసరిత్సాగరము వలన తెలుసుకొనగలుగుచున్నాము.

శిక్షణ మహత్త్వమును గూర్చి కథాసరిత్సాగరమున అనేక స్థలములలో వర్ణింపపడెను. విశ్వనరుడను బ్రాహ్మణుడు బ్రాహ్మణుడైన గోవిందదత్తుని గృహమునకు అతిథిగా వెళ్ళెను. గోవిందదత్తుని పుత్రుడు మూర్ఖుడుగా నుండెను. అందువలన అతడు అతిథిసంస్కారమును స్వీకరింపకుండెను. మూర్ఖపుత్రకారణముచే నీవుకూడా పతితుడవైతివి. నీ గృహమున భుజించినచో ప్రాయశ్చితము చేసుకొనవలసి యుండునని విశ్వనరుడు చెప్పెను. సంపన్నులైననూ వ్యాడి, ఇంద్రదత్తులు విద్యాధ్యయనముకొఱకు వెళ్ళిరి. తపోదత్తుడను బ్రాహ్మణుడు బాల్యమున తాను విద్యనభ్యసింపకపోతినని దుఃఖించెను. సమాజమున అతడు నిందింపబడెను. విద్యాధ్యయనమునకు శ్రమ అపేక్షితం లేఖనపఠనములేకుండా విద్యావ్యాప్తి సంభవింపదనెడి విశ్వాసముండెను తపోదత్తుడు తపస్సుచే విద్యను పొందదలచి తపోమగ్నుడయ్యెను. అపుడు దేవేంద్రుడు మనుష్యరూపములో వచ్చి పఠనలేకనములు లేకుండా విద్యను పొందలేవని తపోదత్తుని నిందించెను.

—o—

4 3.9. కథాసరిత్సాగరములో కనపడు మతాధిక్య ప్రదర్శనము :-

వర్ణనాత్మక సంస్కృత కథాసాహిత్యకవులలో ప్రధానుడైన సోమదేవుడు నానావిధ జాతీయ కథాజాల సృష్టి సౌకర్యము కొఱకు కథాసరిత్సాగరమును రచించెను.1 కథాసరిత్సాగర కాలమునాటి సమాజము బహుమతాచార సంప్రదాయములతో నిండియున్నది. అందు శైవమతశాఖ మిక్కిలి ప్రబలమయినది. 2కథాసరిత్సాగరము శైవ మహాత్మ్య కథా సంకలన భాగమే. అని ఆచార్య పలిన్స్ప్ లకోటే పేర్కొనెను. శైవులు కాపాలిక4 వ్రతులు, కాపాలికులు, మహావ్రతులు, పాశుపతులు7 అచ్చటచ్చట నిర్దేశింపబడి యున్నారు. శైవులు8 శివుని దేవదేవుడని పలుకుచూ సర్వదేవాధిక్యతను అతనికి ఆవిష్కరించిరి.

ఇతర9 దేవతలందరూ శివునకు నమస్కరించిరి. చతుర్ముఖ10 శ్రీమన్నారాయణులు తపస్సు చేసి సివుని పూజించి అతని నుండి అభీష్ట వరమును సంపాదించిరి. బ్రహ్మ11 సివుని ఆజ్ఞను లోకములో ప్రవర్తింపజేయును. శివుని కంటె ఇంద్రుడు కూడా న్యూనప్రభావము కలవాడే. అసుర12 సంహారము కొఱకు ఇంద్రుడు శివ సహాయము నపేక్షించుచున్నాడు. 13కథాసరిత్సాగరమున వరరుచి కథకూడా ఇంద్రునిపై శివాధిక్యతను నిరూపించు చున్నది. భయంకరమైన శివుని నాదము చేతనే ఐంద్ర వ్యాకరరణము విశ్వవ్యాప్తమయ్యెను. 4ఇంద్రుని వజ్రాయుధము శివుని క్రోధము చేతనే విచ్ఛిన్నమయ్యెను. అట్లే15 సర్వదేవతల ఆయుధములు ఉపశమించిన ప్రభావము కలవయ్యెను. బ్రహ్మ16, విష్ణువు శివభక్తులై శివుని సంతోషపెట్టుటకు తీవ్ర తపము నాచరించిరి. 17కుబేరుడు శివుని పూజించును, అగ్ని ఈశ్వర శాపమువలన భయపడును. అందువలన ఇరువురు

కూడా శివుని కంటె న్యూన ప్రభావులే. శివుడు18 సాయుధుడు కాగా సర్వ దేవాయుధములు విష్ణుప్రభావములగునని శైవవాదము. 19పాశు పతాస్త్రము సర్వదేవతల ఆయుధములను అతిశయించునని చెప్పుచూ శైవులు కథాసరిత్సాగరము శివాధిక్యమును ప్రదర్శించుచున్నారు.

శివుడొకడే సత్యము. అతడే విభువు.20 విశ్వేశ్వరుడు21, స్వయంభువు22, నిర్గుణుడు, స్థాణువు23 అని వర్ణింపబడెను. అది మూర్తి 24. అతడు25 హంస వలె మానస సరోవరమున (స్వచ్ఛభక్త మనస్సులలో) విహరించును. 26అతని దేహము ముక్తిదాయకము. ప్రపంచ సృష్టికర్త శివుడేనని శైవులు చెప్పుదురు. అతడు27 స్వేచ్ఛగా బ్రహ్మాండమును సృజించి లయముగావించును. అతడే28 సర్వలోకేశుడు సృష్టి29 స్థితి లయకారి. శివుని బ్రహ్మాండ సంబంధము కథాసరిత్సాగరమున కనపడుచున్నది.

శివపూజే30 ఉత్తమ పూజ, 31శివపూజ చేతనే సర్వదేవపూజ సిద్ధించును. శైవులు శివుని భిన్న భిన్న ఆచారములతో సంతృప్తిని చేయుదురు. శైవశాఖ తంత్ర సిద్ధాంత ప్రభావోపేతమైనది శ్మశాన వాసులైన తాంత్రిక శక్తిగల కపాలిక32 మహావ్రత33 పాశుపతులచే తాంత్రికాచారములు ఆచరింపబడుచున్నవి.

కథాసరిత్సాగరమున శివునకువలె పార్వతి దేవికి కూడా అత్యధిక ప్రాముఖ్యము కనబడుచున్నది. పార్వతి35 త్రిలోక మాత యని 36శివశక్తి స్వరూపిణియని వర్ణింపబడినది.

కథాసరిత్సాగరమున గాణపత్యులు ప్రభావోపేతులే. గాణపత్యులు గణేశుని అన్యదేవాధికునిగా వర్ణించుదురు. గణేశుడు37 దేవదేవుడు. ముల్లోకములు38 కూడా అతని పూజించును. ప్రధాన39

దేవతలు కూడా పాపనాశకమయిన అతని నామ జపము చేయుదురు. నిర్విఘ్న40 సృష్టికార్య పరిసమాప్తి కొఱకు బ్రహ్మకూడా గణేశ సహాయమును ప్రార్థించును. గణేశుడు41 బ్రహ్మకు అవసరమయిన కమలమును సంచలింపజేయుచు అతనికి భయమును కలిగించును. ఇంద్ర42, విష్ణు, శివుల కంటె గణేశుడే శక్తిమంతుడు. గణేశుని43 పూజచే సంతుష్టుని గావించియే దేవతలు స్వకార్య సాఫల్యమును పొందుచున్నారు. కథాసరిత్సాగరమున కార్తికేయ జన్మ కథలో శివుడు పార్వతికి దేవేంద్రునకు గణేశపూజ అవశ్య కర్తవ్యమని ఉపదేశించును. ఇది గాణపత్యులకు శివునిపై ఔన్నత్య సంప్రదాయము. కథాసరిత్సాగరమున గణేశునకత్యధిక ప్రాధాన్యము అనేక స్థలములలో కనపడుచున్నది. 43సర్వలోకాశ్రయభూతుడు గణేశుడొక్కడే గణేశ45 పూజ చేయక ఎట్టి గొప్పవారు కూడా కార్యసిద్ధిని పొందజాలరని గాణపత్యులు చెప్పుదురు.

శాక్తులు బ్రహ్మవిష్ణుశివుల కంటే శక్తి యొక్కటే మహత్వపూర్ణమయినదని ప్రతిపాదించుదురు ఆ శక్తియే47 త్రిలోకరక్షకి. సృష్టిలో ప్రాణశక్తి కూడా ఆమే. ఆమే48 ప్రపంచమును చలింపజేయును. శివుని40 శాసన శక్తి స్వరూపిణియైన ఆమె ముల్లోకములను పాలించు చున్నది. ఆమె శక్తి చేతనే జనులు జీవించియున్నారు, చలించుచున్నారు. శైవులవలె శాక్తులు కూడా తాంత్రిక ప్రభావ విశ్వాసము కలవారే, శక్తి ప్రీతి కొఱకు నరబలికూడా ఇవ్వబడుచుండెడిది. వైష్ణవులు50 విష్ణువును సర్వదేవాధికునిగా వర్ణించుచున్నారు. విష్ణుదయ చేతనే తమకు భిన్న భిన్న స్థానములలో వృద్ధి వైభవములు లభించుచున్నవని చెప్పుదురు. 51బ్రహ్మకు ఆధారభూతుడు విష్ణువు. అందువలన విష్ణువు బ్రహ్మకంటె అధికుడని వైష్ణవమతము

విష్ణువే చరమ సత్యము. అతడు[52] సర్వజ్ఞుడు. దైవస్వరూప హంస అతడు. మానస సరోవరములో సన్మనస్కులయందు సంచరించునని వైష్ణవులు చెప్పుదురు. సృష్టి లయకారి[54] అతడే. అతడు విరాడ్రూపముగా వర్ణింపబడెను. భూమి[55] అతని పాదములు. ఆకాశము అతని శిరస్సు. దిక్కులతని కర్ణములు. సూర్యచంద్రులతని నేత్రములు, బ్రహ్మ అతని జఠరము.

విష్ణువు ప్రపంచమును సృజించును. అతని[56] నుండి జ్వలించు అగ్నినుండి స్ఫులింగా ఘాతము వలె ప్రాణులు జ్వలించును. ప్రళయము లాగా మరల అతనియందే ప్రవేశించును. సాంఖ్య పురుషుని వలె విష్ణువు సత్వరజస్తమో గుణములచే అస్పృష్టుడు. [58]సృష్టికర్త అయిననూ అతడు చలుడే. లోకాధారుడయిననూ నిరాధారుడే. విశ్వరూపియైననూ అరూపుడే. అతని తత్త్వము నెవ్వరూ తెలిసికొన జాలరు.

[59]బ్రహ్మారాధకులు ఇంద్రుని కంటె బ్రహ్మయే మహోన్నతుడని ప్రతిపాదించుదురు. ఇంద్రుడు బృహస్పతితో కలిసి బ్రహ్మ సహాయము నర్థించెను. బ్రహ్మ ప్రపంచ సృష్టికర్తయని చెప్పబడెను. అతడు శివుని స్వపుత్ర భావము కొఱకు ప్రార్థించెను. అందు వలననే బ్రహ్మ పూజానర్హుడయ్యెనని కథాసరిత్సాగరమున చెప్పబడినది. బ్రహ్మపై శివాధిక్య ప్రదర్శకులయిన శైవుల హాస్యజనకాభిప్రాయమిది.

కథాసరిత్సాగరమున సౌరశాఖ కూడా కలదు. సౌరులు సూర్యుని సర్వప్రాణుల కంటె అత్యున్నత దేవునిగా వర్ణించుదురు. సూర్యుడే విష్ణువు, శివుడు ప్రజాపతి అని చెప్పబడెను. ఇట్లు కథాసరి

త్సాగరమున శైవులు, గాణాపత్యులు, శాక్తులు, వైష్ణవుడు, బ్రాహ్మణ సౌరులు ప్రధాన మత శాఖగా వర్ణింపబడియున్నారు. శాఖలన్నింటిలో శైవశాఖ ప్రబలమయినది. వైష్ణవ బ్రహ్మసౌర శాఖలు యథాక్రమముగా స్వల్పప్రాముఖ్యముతో వర్ణింపబడినవి. ఇట్లు కథాసరిత్సాగరమున ఒక్కొక్కమతశాఖ దేవతలు అన్యమత శాఖాదేవతల కంటే అధికులుగా తచ్ఛాఖీయులచే ప్రదర్శింపబడిరి.

### 4. 3. 10. కథాసరిత్సాగరములోని ధర్మములు

బహువిధ దృష్టిచే కథాసరిత్సాగర కాలీన ధర్మము మహత్త్వపూర్ణమయినది. నాడు సమాజమున వైదిక ధర్మము పునరుద్ధరింపబడు చుండెను. బౌద్ధ ధర్మము నిమ్న వర్గీయులకు మాత్రమే జనప్రియముగా ఉండెను. భారతదేశ మూల నివాసులయిన పుళింద, శబర, కిరాతాదులకు ప్రత్యేక సంస్కృతి యుండెను. వారి ధార్మిక విశ్వాసము కూడా భిన్నముగా నుండెను. కానీ ఆర్యావర్త సంస్కృతైక్యము కొఱకు విభిన్న సాంప్రదాయ ధర్మముల ఆదాన ప్రదాన అవశ్యకమై యుండెను. వైదిక ధర్మము నవలంబించు వారు స్వధార్మిక శిక్షణ కొఱకు అర్యేతర వాసుల ధార్మిక విశ్వాసమును కూడా స్వీకరించిరి. అర్యేతర దేవతలు కూడా వైదిక దేవతా పంక్తిలో పరిగణింపబడినవి. 11వ శతాబ్దిలో అర్య అనార్య సంస్కృతుల భిన్న స్వరూపమును తెలుసుకొనుట కష్టము. కానీ కొన్ని ఉదాహరణములచే ఆర్యావర్త సంస్కృతి మధ్య భిన్నత్వము కనబడుచునే యుండును. అర్యులు ఉత్తర, పశ్చిమ దిగ్భాగముల నుండి క్రమముగా భారత దేశమున దక్షిణ దిగ్భాగమున ప్రవేసించిరి. దక్షిణ భారతము ద్రావిడులకు మూలస్థంభముగా నుండెను. వీరి సంస్కృతి ధార్మిక విశ్వాసము కూడా భిన్నముగా నుండెను. అర్య అనార్య సంస్కృతి సమ్మిళి

తమై కూడా యుండెను.

కథాసరిత్సాగరమున ద్రవిడ సంస్కృతికి సంబంధించిన కొన్ని ఉదాహరణములు లభించెను. గుణాఢ్యుడు బృహత్కథయందు ఉపయోగించిన పైశాచిక భాష పశ్చిమోత్తర పంజాబ్ ప్రాంతీయ భాష లేదా మధ్యభారతదేశ వింధ్య పర్వత భాషయై ఉండవచ్చును పైశాచి సంస్కృతము కంటె భిన్నమైనగి. భారతదేశ పశ్చిమోత్తర ప్రాంత నివాసులైన పిశాచ జాతీయులు ఈ భాషతో నిత్యవ్యవహారము జరుపుచుండిరి. కథాసరిత్సాగరమున ఆర్య, అనార్య పరస్పర సంబంధమునకు పూజ్య భావమును కల్పించుటకే గాంధర్వ వివాహము అంగీకరింపబడెను. కథాసరిత్సాగరము వలన అనేక గాంధర్వ వివాహములు ఆర్య అనార్యుల మధ్య జరిగినట్లు తెలియుచున్నది. "నాగరాజ కుమారుడయిన కీర్తిసేనుడు బ్రాహ్మణ పుత్రికయైన శృతార్థను గాంధర్వ విధిచే వివాహమాడెను. వీరి పుత్రుడే గుణాఢ్యుడు, బ్రాహ్మణుడని వ్యవహరింపబడెను." పాటలీ పుత్ర నివాసియైన శ్రీదత్తుడను బ్రాహ్మణుడు శబరి పుత్రికయైన సుందరిని పరిణయమాడెను. అనేక ఉదాహరణములిందు కలవు. గాంధర్వ వివాహము కూడా నాడు మాన్యస్థానమున ఉండెను.

పుత్రకుని పాటలీ సంబంధము ఆర్యేతర సంస్కృతికి ప్రతీక. కథాసరిత్సాగరము నందలి సంకేత భాష మంత్ర తంత్రాదులు, భూత పిశాచములు, బేతాళాదులు. ఆదిమ అనార్య సంస్కృతికి ప్రతీకలు. ఇందు సమాజమున విభిన్న ధర్మముల అద్భుతసమ్మేళనము దర్శింపవచ్చును హైందవుల, బౌద్ధుల అరణ్యవాస జాతీయుల మంత్ర తంత్ర ప్రధాన ధర్మ సమ్మిశ్రణము ఈ యుగ ప్రముఖ

ధార్మిక విశేషమని చెప్పవచ్చును. భిన్న కాలీన పౌరాణిక దేవతా పూజ ఒకేచోట సమావేశము చేయబడినది.

హిందూ ధర్మము :-

కథాసరిత్సాగర కాలమున భారతదేశమున బౌద్ధ ధర్మ స్థానమున హిందూ ధర్మము పునః ప్రతిష్ఠిత మయ్యెను. బ్రాహ్మణులు ప్రధానముగా హిందూ ధర్మ పాలకులుగా నుండిరి. హిందూ దైవ మందిరములు విశేషముగా నిర్మింపబడెను. హిందువులు అందురూ నవోత్సాహముతో ధర్మమును పునరుద్ధించు చుండిరి. ఈ కాలము నందలి వైదిక ధర్మము ప్రాచీన కాల ధర్మము కంటె భిన్నము కాదు. యజ్ఞమహత్త్వము సర్వాధికముగా నుండెను. అనేక స్థలము లలో కథాసరిత్సాగరమున యజ్ఞ మహత్త్వము వర్ణింపబడినది. "బ్రాహ్మణులు వైదిక కర్మలతో దుష్కర కార్యములను కూడా సుకర ముగా చేయగలరనెడి విశ్వాసముండెను."[1] యజనము, యాజనము లేనిచో ప్రపంచ స్థితియే నశింపగలదనెడి విశ్వాసము కూడా యుం డెను. గృహస్థులయిన బ్రాహ్మణులకు హోమకర్మ అత్యావశ్యకమై యుండెను. ఇందు బ్రాహ్మణ గృహస్థుల ఇంట నిత్య హోమము జరు గుచున్నట్లు వర్ణింపబడెను. అగ్నిస్వామి అగ్నిహోత్రి అని వ్యవహ రింపబడెను. ఇట్లే విష్ణుస్వామి కూడా గొప్పయాజకుడుగా నుండెను. దైవదర్శనము గల బ్రాహ్మణుడు పంచాగ్ని అని పేర్కొనబడెను. పతివ్రతయైన గృహిణి కూడా అగ్నికార్యము చేయుచుండెను. యావ జ్జీవము అగ్నిజ్వలించుట వలన మరణానంతరము కూడా అదే అగ్ని తోడనే శవదహనము చేయుబడుచుండెను.

హిందూ ధర్మ భిన్నసాంప్రదాయములు :-

కథాసరిత్సాగర కాలమున సమాజమున గ్రంధకర్తయైన

బ్రాహ్మణుడయిన సోమదేవుని ప్రభావము వలన బ్రాహ్మణధర్మ ప్రభావము వదివ్యాప్తమయ్యెను. కథాసరిత్సాగరము అర్య బ్రాహ్మణ వైశిష్ట్య సమన్వితమై యుండును. వరరుచి జన్మ ప్రారంభ జీవన కథ విశిష్ట బ్రాహ్మణ ధర్మస్వరూపమువ వ్యక్తము చేయుచున్నది. బ్రాహ్మణుల విలక్షణ స్మరణ శక్తి వారి విశిష్ట ప్రతిభను ప్రకాశింప చేయుచున్నది. బ్రాహ్మణ జన్మమున శైవ వైవాది సాంప్రదాయి ములు ఉండెను.

శైవము :-

కథాసరిత్సాగరమున ప్రతిలంబకారంభమున ఈశ్వరుడు లేదా గణేశుడు స్తోత్ర లక్ష్య పాత్రుడుగా నున్నాడు. ఇతరత్రా కూడా శివోపాసనకు గొప్ప ప్రశంస కలదు. కవికూడా శివునిచే అధిక ముగా ఆకర్షింపబడినవాడు. కాశ్మీరమున శైవ దర్శన ప్రచారము సోమదేవునకు పూర్వమే యుండెను. కావున ఆ ప్రభావము సోమ దేవునిపై కూడా పడెను. సోమదేవునకు ఆశ్రయ మిచ్చిన రాణియైన సూర్యమతి శాస్త్రోక్తముగా శివోపాసన చేసెను. కలశదేవుడు అను రాజు శివావతారమేనని కవి విశ్వాసము. వత్సరాజయిన ఉదయనుడు యుద్ధ విజయము కొఱకు సివుని ఉపాసించెను. శివుడు వెంటనే సం తోష వడువాడు. అతడు సృష్టి, స్థితి లయకారణ భూతుడు. ఆకాశాది అష్టమూర్తిధారి. దివ్య ప్రకాశధారి. నిర్మల జలస్వరూపుడు. భూత దృష్టి కలవాడు. ఆశ్చర్య మయుడవు నైన నీకు ప్రణామము అని అర్ధనారీశ్వర ప్రార్థన ఇందు కలదు. ఈశ్వరుడు సంకల్ప మాత్రము చేతనే విశ్వసృష్టి కారకుడు. హేమప్రభుడు ఇట్లు శివస్తోత్రము చేసెను పురాణ వర్ణిత శివ చరిత్రమే కథాసరిత్సాగరమున కనబడుచున్నది. త్రిపురాసుర సంహారము కొఱకు దనుర్బాణమును ధరించిన బాణముతో

పాటు వ్యాకులీ భూతమయిన శివుని నేత్రములలో మహోజ్జ్వలోపేత మయిన మూడవ నేత్రము మిమ్ము రక్షించుగాక! అని ఈ గ్రంథ మున శివస్తుతి కలదు. ఇట్లు అనేక సందర్భములలో పౌరాణిక కథలు ఉల్లేఖింపబడినవి. కామ దహన ఘటన అనేక సందర్భములలో వర్ణిం పబడినది. వసుగుప్తుడు శివారాధనము కొఱకే జన్మించెను. "ఓం నమ శ్శివాయ" అను జపముచే సుప్రభువు స్వర్గమువకంటె ఉన్నత స్థాన మును పొందెను. ప్రభాసుడు అష్టోత్తర శతనామ జపముచే శివుని ప్రసన్నము చేసుకొనెను. సోమదేవ కవి కథాసరిత్సాగర కథలకు ఈశ్వరుడే ప్రవక్తయని చెప్పి ఈ కథలకు ఆధ్యాత్మిక మహత్త్వమును విధింప చేసెను.

"ఇదం గురు గిరీంద్ర జా ప్రణయ మంద రాందోలనా
త్పుర కిల కథామృతం హర ముఖాంబుధే దుర్గతమ్।
ప్రహస్య సరయంతి యే విగత విఘ్న లబ్ధర్ధయో
ధురం దధతి వైబుధీం భువి భవ ప్రసాదేన తే॥"

అని గ్రంథారంభమున కవి శివస్తుతి నాచరించెను. ఈశ్వరుని మహా కాల మందిరము అతి ప్రసిద్ధమైనది. అన్య తీర్థములతో పాటు మహా కాల తీర్థమును కూడా కవి గొప్ప శ్రద్ధతో వర్ణించెను. కథాసరిత్సాగర మున కూడా ఉజ్జయినీ సమీపమున నున్న ఈ మహాకాల తీర్థము చక్కగా వర్ణింపబడినది. దీనిచే ఈశ్వరుని మహాకాల తీర్థము మధ్య యుగమున విశేష ప్రసిద్ధిలో నుండెనని తెలియుచున్నది.

వైష్ణవ ధర్మములు :-

కాశ్మీర వాసిఅయిన మహాకవి క్షేమేంద్రుడు 1066 ఎ.డి. కాలమున విష్ణుస్తుతి పరమైన దశావతార చరిత్ర గ్రంథమును రచిం

చెను. అందువలన 11వ శతాబ్దములో శైవమత సమానముగా వైష్ణవ ధర్మము కూడా అధిక ప్రచారములో నుండెనని తెలియుచున్నది. ఈ గ్రంథ ప్రమాణమును బట్టి శివునివలె విష్ణువు కూడా సమాజమున పూర్ణ ప్రతిష్ఠితుడై యుండెను. శివ విష్ణువులపై ప్రజలకు సమాన శ్రద్ధ యుండెను, మందిరములు కూడా శివకేశవులకు సమానముగా నిర్మింపబడెను. నరవాహనదత్తుడు శ్వేత ద్వీపమునకు వెళ్ళి భగవంతుడయిన విష్ణువును స్తుతించెను. ఈ స్తుతిలో విష్ణువైశిష్ట్యము వర్ణింపబడెను. విష్ణువు లక్ష్మితో సహ "క్షీరసాగర వాసి" అని పౌరాణిక స్వరూపము తోడనే వర్ణింపబడెను. వైదిక స్వరూపముతో విష్ణువు పరమ పురుషుడని సర్వవ్యాప్తి అని ఇంద్రాది సమస్తలోక-పాలోత్పత్తి కారకుడని వర్ణింపబడెను. వైదిక, విష్ణు, విరాట్-స్వరూపము అందు అభివ్యక్తమగుచున్నది.

సూర్యోపాసన :-

సమాజమున కొందరు సూర్యోపాసకులుగా నుండిరి. ఈ గ్రంథమున చంద్రస్వామి సూర్యుని స్తుతించెను. సూర్యుడు బ్రహ్మ, విష్ణు, శివ స్వరూపుడనెడి విశ్వాసముండెను.

గణేశుడు :-

శివ విష్ణువుల వలె గణేశుడు కూడా తత్కాల దేవతలలో ఒకడు ప్రతిలంబకారంభమున శివునితో పాటు గణేశుడు కూడా స్తుతింపబడెను. ఇతను విఘ్ననాయకుడని విఘ్నపరిహారము కొఱకే స్తుతింపబడెను. జగత్-సృష్టిని నిర్విఘ్నముగా పరిసమాప్తి గావించుటకు బ్రహ్మకూడా గణేశుని పూజించెనని చెప్పబడినది. గణేశ పూజ లేనిచో దేవతలకు కార్యసిద్ధి కలుగదు. "కార్తికేయ జననము

కొఱకు శివుడు కూడా గణేశపూజను ఆచరించెను."2 తారకాసుర సంహారము కొరకు ఇంద్రుడు కూడా గణేశుని పూజించెను. కనక వర్షుడను రాజు గణేశుని పూజించి ప్రసన్నము చేసుకొనెను. ప్రసన్నుడయిన గణేశుడు నేను నీకు ప్రసన్నుడనైతిని, నీకు విఘ్నములు కలిగింపనని స్వయముగా చెప్పెను. కథాసరిత్సాగర కాలమున గణేశుడు ఆర్య దేవతలలో పరిగణింపబడెను. గణేశపూజకులకు సంగ్రామ, రాజకుల, ద్యూత, చోర, అగ్ని, హింస్ర జంతువుల నుండి భయముకలుగదనెడి విశ్వాసముండెను. ఘటోదర, శూర్పకర్ణ, గణాధ్యక్ష, మదోత్కట, ప్రాశహస్త, అంబరీష, జంబక, త్రిసిత్వాయుక్త మొదలగునవి గణేశుని నామములు. ఇతడు ద్వాదశ సూర్యుని వలె ప్రకాశించును. ఇతడు ఏకదంతుడని, లంబోదరుడని, త్రినేత్రుడని వర్ణింపబడెను. ఇతడు సర్పమునే యజ్ఞోపవీతముగా ధరించును. సౌందర్య ప్రాప్తి కొఱకు శివపూజ ఆవశ్యకమనెడి విశ్వాసముండెను. అందు వలన స్త్రీలు సుందర ప్రాప్తి కొఱకు శివుని పూజించుచుండిరి. కువలయావళి పఖులు పతి ప్రాప్తి కొఱకు గణేశ పూజను ఆచరింపుమని కువలయావళితో చెప్పిరి.

కార్తికేయుడు :-

మధ్యయుగ దేవతలలో కార్తికేయుడు కూడా ప్రధానుడు. కార్తికేయస్వామి అనేక స్థలములతో స్తుతింపబడెను. అగ్నిదత్తుడు గుణశర్మతో కార్తికేయ జపమును ఆచరింపవలెనని చెప్పెను. ఇతడు మహేశ్వరుని నుండి, అగ్నికుండము నుండి, అగ్ని నుండి, శరవనము నుండి, కృత్తికల నుండి జన్మించెను. కనక వర్షుడను రాజు కార్తికేయుని స్తుతించెను, మయూర వాహనుడయిన ఇతడు తారకాసుర సంహారము కొఱకు జన్మించెను. సరస్వతీ కార్తికేయులు ఇరువురూ సహయోగము

చే ప్రస్తుతింపబడిరి. వ్యాడి విద్యాప్రాప్తి కొఱకు కార్తికేయుని పూజించెను.

దేవతలు :-

దేవతల మూర్తి పూజ కూడా ప్రాచీన కాలము నుండి కలదు. కథాసరిత్సాగర కాలమున వింధ్యవాసినీ దేవి సర్వాధికముగా ప్రసిద్ధిని పొందెను. కనక వర్షుడను రాజు వింధ్యవాసినీదేవి దర్శనముచే పత్నీ పుత్రులను పొందెను. జీవదత్తుడను రాజు వింధ్య వాసినీ దేవిని ప్రసన్నము చేసుకొని సిద్ధులను పొందెను. వరరుచి, పుత్రకుడును వింధ్యవాసినీ దర్శనము కొఱకు వెళ్ళిరి. ఇట్లనేక ఉదాహరణముల వలన వింధ్య వాసినీ దేవి మహాత్మ్యము ఆ కాలమున సర్వాధికముగా ఉండెనని తెలియుచున్నది. అచ్చటచ్చట నిర్మింపబడిన చండికా మందిరములలో నిత్యపూజ జరుగుచుండెను. గోవిందస్వామి వారణాసి సమీపమున గల చండికా మందిరమున నుండెను. దూరప్రాంతముల నుండి యాత్రికులు చండికా దర్శనము కొఱకు అచ్చటికి వచ్చుచుండిరి. చండికకు నరబలిని ఇచ్చుట ప్రాచీనకాలము నుండి ప్రసిద్ధిలో నున్నది ధీవర పుత్రుడు శక్తి దేవుని బలి ఇచ్చుటకు చండికాలయమునకు తీసికొని వెళ్ళెను. చండికా మందిరము ఎల్లప్పుడు ప్రాణి-నిగరణ రూపములో, విశాలోదర రూపములో, ఘంటారూప దంత రూపములో నుండెను.

వీరవరుడు చండికనిట్లు స్తుతించెను :- నీవు సమస్త ప్రాణులకు శక్తి స్వరూపిణివి. ప్రాణశక్తివి. నీ వలననే ప్రపంచము జనించుచున్నది. సృష్టి ప్రారంభమున నీవే జన్మించితివి. నిన్ను శివుడు స్వయముగా దర్శించెను. ప్రళయ కాల కోటి సూర్య పంక్తివలె నీవు ప్రాదుర్భవించితివి. ఖడ్గ, ఖేటక, ధనుశ్శూలాదులను ధరించితివి. నీవు భుజ

మండలముచే ఆకాశమును ధరించితివి. శివుడు కూడా నిన్ను స్తుతించెను. హే చండి, చాముండే, మంగళే, త్రిపురే, జయే, నీవు ఏకాంశతో శివా, దుర్గా, నారాయణీ, సరస్వతి, భద్రకాళీ, మహాలక్ష్మి, సిద్ధా, రుద్ర, దానవ-నాశకర్త్రి, నీవే గాయత్రీ, మహారాజ్ఞీ, రేవతి, వింధ్యవాసినీ, ఉమా, కాత్యాయనీ, శర్వాణీ, పర్వతవాసినీ. ఇందు దేవి పౌరాణిక స్వరూపముతో శక్తి స్వరూపిణి అని వర్ణింపబడెను. విభిన్న నామములతో పేర్కొనబడిననూ శక్తిస్వరూపిణియైన దేవత ఈమె ఒకర్తియే. భిల్ల, పుళింద, శబరాదులయిన అరణ్యజాతీయులకు ముఖ్య నివాస స్థానము వింధ్యాటవి. వీరికి కూడా చండికాదేవి ఆరాధ్య దైవముగా నుండెను; ఆ కాలమున వింధ్య వాసినీ దేవిపై వారధిక శ్రద్ధను ప్రదర్శించుచుండిరి. విద్యాధిష్ఠాన దేవతయైన సరస్వతిపై కూడా ప్రజలకు భక్తిభావముండెను. గాయత్రీదేవి పూజ కూడా కథాసరిత్సాగరమున పేర్కొనబడినది.

విశిష్ట ధార్మిక ప్రథ :-

కథాసరిత్సాగరమున మధ్యకాలీన సమాజమునకు విశిష్ట ధార్మిక ప్రథ యుండెను. దేవాలయములు విశ్వాసకేంద్రములనెడి విశ్వాసముండెను. మానవులు స్వాభీష్ట సిద్ధి కొఱకు దివ్యశక్తుల కృప నభిలషించు చుండిరి అప్పుడప్పుడు విశేషోద్దేశ ప్రాప్తి కొఱకు జప, తప ఉపవాసాదులను ఆచరించుచుండిరి. కోరికలలో సంతాన వాంఛ ప్రముఖముగా నుండెను. కార్యసిద్ధి కొఱకు ఉపాయనము కూడా ఇచ్చుచుండిరి. ఒకానొక నగరమున మణిభద్రకుడను మహా యక్షుని మూర్తి ప్రతిష్ఠింపబడెను. నగరవాసులు స్వకార్యసిద్ధి కొఱకు అచ్చటికి వెళ్ళి యథాశక్తి ఉపహారములను సమర్పించుచుండిరి. విశిష్ట ధార్మిక పర్వదినములలో మందిరములలో ఉన్నవారై రాత్రి

జాగరణము చేయుచుండిరి. విశేషావసరములలో బ్రాహ్మణ భోజన సంతర్పణము జరుగుచుండెను. ధార్మిక కృత్యములలో ప్రదక్షిణా చారము అతి ప్రాచీనమయినది. వివాహ సమయమున దేవతా ప్రదక్షిణము, అగ్ని ప్రదక్షిణము కర్తవ్యముగా నుండెను. ఉదయన పద్మావతులు వివాహ సమయమున అగ్ని ప్రదక్షిణము నాచరించిరి. వృక్షప్రదక్షిణము కూడా ఈ గ్రంధమున పేర్కొబడినది. దేవీ పూజలో అజాబలి కూడా ఇవ్వబడుచుండెను. యజ్ఞములలో కూడా బలిదాన మున్నట్లు గ్రంధమున పేర్కొబడినది.

తీర్థయాత్ర :-

విభిన్న తీర్థయాత్రలచే దైవ దర్శనము ముఖ్యధార్మిక కృత్యముగా నుండెను. తీర్థయాత్రచే పుణ్యలాభ ప్రవృత్తి ప్రజలలో నుండెను. ఒకప్పుడు తీర్థయాత్ర కంటె వైదిక కర్మకు మహత్త్వమివ్వబడెను. వైదిక కర్మకు మహత్త్వమివ్వబడెను. వైదిక కర్మకు మహత్త్వమివ్వబడెను. వైదిక కర్మను ఆచరించుటకు ధన సంపద లేనివారు తీర్థయాత్ర ఉచితమని తలంచుచుండిరి. దానాదుల ద్వారా ధనప్రాప్తి కలుగుననెడి విశ్వాసముండెను. నిత్యశుద్ధి కొఱకు తీర్థయాత్ర ఆవశ్యకము. అనేకులు తీర్థయాత్రను చేసి పుణ్యమును ఆర్జించుచుండిరి.

ముఖ్యతీర్థములు :-

ఆర్యావర్తనమున హైందవ తీర్థములు విశేషముగా వ్యాపించినవి. హిమాలయ పర్వతప్రదేశము నుండి దక్షిణ దిక్కు పర్యంతము కామరూపదేశము నుండి కాశ్మీరము వరకు అనేక పవిత్ర తీర్థస్థానములు ప్రాచీన కాలమునుండి ప్రసిద్ధమైనవి. కాశి, ప్రయాగ, మధుర, అయోధ్య మొదలగు ముఖ్య తీర్థ స్థానములందు వర్ణింపబడినవి అన్నింటితో కాశీ తీర్థము ప్రసిద్ధముగా నుండెను. పావనాశ

కొరులలో కాశీ తీర్థము ముఖ్యమైనదని వర్ణింపబడినది. ఇందు పవిత్ర విజయ క్షేత్రము నందిక్షేత్రము కలదు. అనేక కాశ్మీర తీర్థములు స్వయంభూ తీర్థములు ఉజ్జయినీలో మహాకాల తీర్థము విశేష ప్రసిద్ధ మైనది. కనఖలము, బదరికాశ్రమము, పౌండ్ర వర్ధనము, పుష్క రము, టిట్టిభి మొదలగు తీర్థముల వర్ణన కథాసరిత్సాగరమున కలదు.

విద్యాధరులు :-

వీరు దేవగణములో పరిగణింపబడిరి. కథాసరిత్సాగరమున అనేక కథలు విద్యాధరులకు సంబంధించినవి. నరవాహనదత్తుడు విద్యాధర చక్రవర్తి కాగలడని ఆకాశవాణి చెప్పెను. శివుడే నర వాహన దత్తుని కాబోవు విద్యాధర చక్రవర్తిగా మీ గృహమున జన్మింప జేసెనని యౌగంధరాయణుడు చెప్పెను. శివుడు తన గణ మైన సంభకుని నరవాహనదత్తుని రక్షణ కొఱకు నియోగించెను. రాజుచే ప్రశ్నింపబడిన శక్తి వేగుడు శివారాధనచే విద్యాధర పదప్రాప్తి కలుగునని చెప్పెను. విద్యాధర పదము అనేక విధములుగా నున్నది విద్యాధరుడు మనుష్యుని కంటె ఉన్నతుడు దేవతల కంటె నిమ్నుడు అతడు యక్షాధిపతి, కుబేరునివలె విద్యాధరాధి పతి శివుడే. ఎందు వలననగా శివకృపచేతనే విద్యాధర పదవి పొందబడుచున్నది.

మంత్రాది విద్యాధరణచే వీరు విద్యాధరులని వ్యవహరింప బడిరి. ఉత్తరవేధి, దక్షిణవేధి అని విద్యాధరునకు విస్తృతమైన సామ్రాజ్యముండెను. నరవాహనదత్తుడు మానవుడయిననూ ఉత్తర దక్షిణవేది ద్వయమునకు దివ్యకల్పపర్యంతము శివకృపచే అర్థ చక్రవర్తి పదవిలో ఆరోపింపబడెను. పితృయాన దేవయాన మార్గ ములలో ఉత్తర, దక్షిణ ధృవవాసులయిన విద్యాధరులకు శాసకుడు

చక్రవర్తి అని వ్యవహరింపబడెను. ఇతని స్త్రీలు విద్యాధరులని వ్యవహరింపబడిరి. వీరు మంత్ర తంత్ర విద్యా నిపుణులై యుండిరి. ప్రజలు విద్యాధరులచే ఆకర్షింపబడిరి. యక్షులు యక్షిణులు సర్వాధిక లోక ప్రియులు. కానీ విద్యాధర పూజా సంబంధ పవిత్రస్థలము ఎచ్చటా పేర్కొనబడలేదు. వీరి కథలు కేవలము లోక కథా రూపములో నున్నవి.

యక్షులు :-

దేవ మనుష్యుల మధ్యలో యక్షయోని కల్పన ప్రాచీనమైనదియే. యక్షులు కూడా దేవయోనులలో పరిగణింపబడిరి. వేదములలో రామాయణమున యక్షులు పేర్కొనబడుట లేదు. మహాభారతమున మాత్రము యక్షులు పేర్కొనబడిరి. కథాసరిత్సాగరమున యక్షులు అధికముగా వర్ణింపబడిరి. కాణభూతి కుబేరునిచే శపింపబడిన యక్షుడు. కుబేరానుచరుడైన శాతవాహనుడు కూడా యక్షుడే. రాక్షసులు, యక్షులు, పిశాచులు, ఒకేచోట పేర్కొనబడిరి. రాక్షసులకు వలె యక్షులకు కూడా వారి శక్తి క్రమముగా క్షీణించెను. యక్షులు కూడా మొదట రాక్షసులే. పిమ్మట పరస్పర విభేదముచే వీరు ప్రత్యేక వర్గముగా ఏర్పడిరని యక్షులకు మనుష్యులతో మిత్రులవలె సాహచర్యము ఏర్పడెను. కానీ పిమ్మట రాక్షసులు మనుష్య శత్రువు లయిరని "ఎపెంజర్" మహోదయుడు పేర్కొనెను. ఒకానొకడు వ్రత ఖండితుడై దేవత్వమును పొందక యక్షుడయ్యెను. కిన్నెర, గుహ్యక, గంధర్వాది శబ్దములు యక్షపద పర్యాయ వాచకములే. వీరందరూ కుబేరానుచరులే. కిన్నెర, గంధర్వులు కుబేర గాయకులు యక్షుల అనుగ్రహముచే ఆరాధకులకు ధనదాన సమృద్ధి కలుగుచుండెను. మణిభద్రుడను యక్ష మందిరము పూజకు సుప్రసిద్ధముగా నుండెను.

యక్షిణుల అనుగ్రహము వలన కూడా సుఖసమృద్ధి లభించుచుండెను మంత్ర తంత్రాది సిద్ధి కొఱకు కూడా యక్షపూజ నాచరించి సఫలు రగుచుండిరి.

బౌద్ధ ధర్మము :-

కథాసరిత్సాగరమున బౌద్ధ ధర్మము పరిక్షీణమై యుండెను శైవ ప్రభావమైన హిందూ ధర్మము వ్యాపించి యుండెను. బౌద్ధ ధర్మము ఉపేక్షింపబడెను. బౌద్ధధర్మోపదేశములు కథాశ్రవణములో ఉండెను. బౌద్ధ జాతక కథలు లోక కథారూపములో ప్రతిగృహము న వ్యాపించియుండెను. బ్రాహ్మణ ధర్మాచార పరులు కూడా బుద్ధుని పై శ్రద్ధను ప్రదర్శించుచుండిరి. బుద్ధుడు దైవావతార రూపమని కూడా విశ్వాసముండెను. క్షమ, దయ, దానాద్యుపదేశములకు బ్రాహ్మణ ధర్మముతో విరోధము లేకుండెను. అందువలన బౌద్ధధర్మములు కూడా సమాజమున ప్రతిష్ఠితమై యుండెను. కానీ దాని ప్రభావము హిందూ ధర్మము కంటె స్వల్పమే. బౌద్ధ హిందూ ధర్మ సిద్ధాంతములలో మతభేదములుండెను. వితస్తాదత్తుడను పేరుగల వైశ్యుడు బౌద్ధ ధర్మము. అతని పుత్రుడు రత్నదత్తుడు బ్రాహ్మణధర్మ పాలకుడు. రత్నదత్తుడు తండ్రితో నీవు వైదిక ధర్మమును పరిత్యజించి అధర్మ మును సేవించుచున్నావు. బ్రాహ్మణులను పరిత్యజించి భిక్షువులను సేవించుచున్నావు. స్నానశౌచాది హీనుడవై అకాలభోజన లోభివై శిఖాకేశములను బంధించి కౌపీనము ధరించుచున్నావు. విహారస్థాన ప్రాప్తి లోభులు, నీచులు బౌద్ధ ధర్మమును స్వీకరింతురు. ఈ బౌద్ధ ధర్మముతో మనకేమి ప్రయోజనమని నిందించెను. ఈ వాక్యములలో అతిశయోక్తితో పాటు సత్యాంశము కూడా కలదు. బౌద్ధ విహారము లో పూజ్య నియమావళి నశించి యుండెను. నీచజాతీయులధికము

గా సామాజిక హీనస్థితిని కాపాడు కొనుటకు బౌద్ధమతము నవలం బించు చుండిరి. బౌద్ధమత ప్రవేశానంతరము జాతిభేదము లేకుండెను. అందువలన బౌద్ధధర్మజ్ఞానము లేకున్ననూ జీవన సౌకర్యము కొఱకు అందులో ప్రవేశించుచుండిరి. ఇందు బౌద్ధమత సిద్ధాంతములతో మూల ధర్మములలో భేదము లేకుండుటవే ఉన్నత వర్గీయులకు బౌద్ధమతమున సహానుభూతి యుండెను. రాగద్వేష హీనత, సత్యము భూతదయ, జాతిద్వేష రాహిత్యము. సర్వజీవులకూ అభయము నిచ్చుట మొదలగు సార్వజనిక లోకహిత నియమము లుండుట వలనే బౌద్ధ హిందూ ధర్మములలో భేదము లేదని వితస్తా దత్తుడు చెప్పెను. ఉపకృతి ధర్మమే, అందుమత భేదము లేదు. ప్రాణులకు అభయము నిచ్చుట కంటె అతిరిక్తమైన ఉపకారము లేదు. అందువలన అహింసా ప్రధానమైన మోక్షదాయకమైన బౌద్ధమత సిద్ధాంతమున నాకు అభి రుచి కలదు. ఇది అధర్మమా? అని వితస్తా దత్తుడు వాదించెను.

బుద్ధునిపై అందరకూ సమాన ఆదరభావము ఉండెను. సత స్వాతీ, కంద, బుద్ధులు లోకమున ధన్యులని" శి. సోమదేవుడు బుద్ధుని నామమును కీర్తించెను. బుద్ధుడు మోక్షమునకు ప్రతీక, వీతరాగుడు. ఊర్ధ్వరేతస్పుడు బుద్ధ సముడని చెప్పబడెను. నాగార్జునుడు కూడా బుద్ధ సమగతిని పొందెనని చెప్పబడినది. బౌద్ధవిహారములలో ప్రతి ష్ఠింపబడిన బుద్ధ ప్రతిమలు పూజింపబడుచుండెను. సోమప్రభుడు బుద్ధపూజను సమాప్తి చేయవలెనని ఆజ్ఞాపించెను. బౌద్ధజాతక కథలను ఆదరముతో వినుచుండిరి. బౌద్ధ దర్శన ప్రచార కేంద్రములుగా ఉండెను. కథాసరిత్సాగరమున అనేక బౌద్ధ విహారములు రాజులచే నిర్మింపబడినట్లు పేర్కొనబడెను. కళింగదత్తుడను రాజు బహుయుద్ధ మూర్తి ప్రతిష్ఠితమయిన విహారమున ప్రవేశించెను. తక్షశిలలోని

అనేక బౌద్ధ విహారములు కథాసరిత్సాగరమున వర్ణింపబడినవి. తక్ష శిలానగరము పర్వోన్నతమై ఉన్నత విహార శృంగములచే తన కంటె ఉన్నతమయిన నగరము లోకమున లేదని ఘోషించు చున్నట్లు కనబడుచున్నదని వర్ణింపబడెను. సమాజమున బౌద్ధ బిక్షు కులు పూజింపబడిరి. వితస్తానదీ సమీపమున గల విహారము మిక్కిలి ప్రసిద్ధి నొంది యుండెను. క్షేమేంద్రుడు దశావతారములలో బుద్ధుని పేర్కొనెను, బౌద్ధ దర్శన ప్రచారము కొరకు నీతి విషయక కథలు ఆనాడు ప్రచారములో నుండెను. క్షమ దానము మొదలగునవి కథలచే ప్రశంసింపబడెను, దాన, శీల, క్షమ, ధైర్యజ్ఞాన, ప్రజ్ఞా పారమితులు ప్రత్యేకముగా కథలచే నిర్దేశింపబడినవి. బుద్ధ ప్రోక్త షట్ప్రకార, పారమితరూప నౌక ద్వారా భవ సాగరమును దాటవచ్చు నని చెప్పబడినది. ఇట్లు కథాసరిత్సాగరమున సమాజమున బుద్ధ ధర్మము కూడా జీవనమున సర్వశ్రోత్ర పదమున ఉండెను. ఆనాడు సమాజమున జైన ధర్మమునకు మాన్యత యున్ననూ కథాసరిత్సా గరమున జైనధర్మము అత్యల్పముగా వర్ణింపబడెను. జైన తీర్థంక రులు ఆయా కాలములలో జైన ధర్మములను ప్రచారము గావించు చుండిరి.

—0—

4,3,11, కథాసరిత్సాగరములో వివాహములు :-

వివాహమహత్త్వము :- విభిన్న సంస్కారములలో వివాహ సంస్కారము సర్వప్రధానమయినది. భారతీయ సామాజిక సువ్యవస్థా దర్పణమిది. సుఖమయ కుటుంబజీవనమునకు నియమిత

యౌవన సంబంధమునకు వివాహ వ్యవస్థ అవసరము. ధర్మార్థకామ సిద్ధికి వివాహము ఉత్తమ సాధనము. మనువు బ్రహ్మచర్యాశ్రమానంతరము గృహస్థాశ్రమమును విధించెను. ధార్మిక కృత్యముల నాచరించుటకు ధర్మపత్ని అనివార్యమని పేర్కొనబడినది. పుత్ర ప్రాప్తిచే జీవన సాఫల్యము కొఱకు వివాహము అవసరము. అపత్నీకుడయిన పురుషుడు ధర్మ కార్య ఆచరణమున అనధికారి. సంతానోత్పత్తి లేనిచో పితృ ఋణము నుండి విముక్తుడు కాజాలడు.

కథాసరిత్సాగర కాలమున కూడా వివాహ ప్రాచీన గౌరవము అక్షుణ్ణముగానే యుండెను. దీనికి సామాజికముగా ధార్మికముగా, వైయక్తికముగా గొప్ప మహత్వముండెను పత్నీరహితుడయిన వ్యక్తికి సమాజ గౌరవము లేకుండెను. సింహపరాక్రముడు, వివాహావశ్యకతను గూర్చి ఇట్లు పేర్కొనెను. భార్య లేని గృహపతి గృహము శూన్యము. మూల దేవ కథ కూడా ఇదే విషయమును వ్యక్తము చేయుచున్నది. కాంతా విహీనమయిన గృహము కారాగార సమము గృహస్థాశ్రమ ఆవశ్యకత అనేక సందర్భములలో కథాసరిత్సాగరమున వర్ణింపబడినది. "అగ్నిదత్తుడు విరక్తుడయిన గుణశర్మను ఓదార్చుచూ దేవత-పితృ, అతిథి సత్కారములను ఆచరించుటకు వ్రతము నాచరించుటకు జపాదుల నాచరించుటకు పుణ్యప్రాప్తికి గృహస్థాశ్రమమవసరము. ఇతరత్ర గృహస్థాశ్రమ ఫలము లభింపదు"1 అని చెప్పెను. ఆశ్రమములలో గృహస్థాశ్రమము శ్రేష్ఠమైనదని కథాసరిత్సాగరమున ప్రశంసింపబడినది. వైవాహిక జీవనము లేనిచో సామాజిక ప్రతిష్ఠ లభింపదు. సంతానోత్పత్తి అభిలాషయే, వైవాహిక జీవన ప్రేరితుని చేయును. పుత్రుడే ఆత్మ. "పుత్రోహ్యాత్మైవకథ్యతే." ధనదత్తుడను వైశ్యుడు పుత్రా భావముతో చింతించెను

అతడు బ్రాహ్మణులను పుత్రప్రాప్తి కొఱకు ఉపాయమడిగెను. కథా సరిత్సాగర కాలమున కూడా వైవాహిక జీవనము పురుషార్థ సాధనమునకు, ఆధ్యాత్మిక విధి నిర్వహణకు, సామాజిక ప్రతిష్ఠకు సంతానోత్పత్తికి, సుఖమయ కుటుంబ జీవనమునకు అవశ్యకమని వర్ణింపబడినది. భార్యాపుత్ర సహితుడే పూర్ణ పురుషుడు. స్త్రీ వలననే గృహశోభా సంపన్నత ఏర్పడును. ఇతరాశ్రమములు గృహస్థాశ్రమము పై ఆధారపడి యున్నవి.

వివాహ ప్రకారములలో భేదమున్ననూ వివాహస్వరూపము కథాసరిత్సాగరమున ప్రాచీన మాన్య పద్ధతికి అనుకూలముగా నున్నది. కథాసరిత్సాగరము వివాహ సంస్కారోద్ధరణ గ్రంథమని చెప్పవచ్చును. కథాసరిత్సాగరమున ప్రతి కథకు చివర ఏదిఏమైనా ఒక పద్ధతిలో వివాహము జరుగుచున్నది.

వివాహ వయస్సు :-

బ్రహ్మచర్యాశ్రమ అనంతరము సాధారణముగా వివాహ వయస్సు 25 సంవత్సరములుగా నుండవలెనని మనువు పేర్కొనెను. ప్రాచీన కాలమున ప్రౌఢ కన్యా వివాహము వ్యాప్తిలో నుండెను. కాల క్రమమున వివాహ వయస్సు కొలముమ తగ్గింపబడినగి, కథాసరిత్సాగరమున ననుసరించి ఋతుమతి అయిన కన్యగృహమున నుండరాదని చెప్పబడినది. "పరోపకారి"యైన రాజు తన పుత్రికకు వివాహము చేయదలంచి ఇట్లు పేర్కొనెను. ఋతుమతియైన పిమ్మట కన్య పితృ గృహమున నున్నచో బంధువులు అధోగతిని పొందుదురు. ఆ కన్య కూడా శూద్ర కన్యయని, ఆమెను వివాహమాడినవాడు కూడా వృషలీపతి అని చెప్పబడెను. నిశ్చిత సమయమున ఉపనయనాది

సంస్కారమును పొందనివాడు వ్రాత్యుడయినట్లు ఋతుమతిఅయిన కన్య అవివాహితగా యున్నచో వృషలి అని వ్యవహరింప బడును. కథాసరిత్సాగర సమయమున రజోదర్శన-అనంతరము కన్యా వివాహము ఉచితముగా పేర్కొనబడినది.

వివాహ సమయమున కన్యా పక్షమునకు దానస్వరూపముగా ఇచ్ఛానుసారముగా ధనాదులను దానము చేయు ఆచారము కథాసరిత్సాగర కాలమున ఉండినది. వృద్ధీవరూపుడను రాజు రూపలతా వివాహ సమయమున రత్నదానము గావించెను. వివాహ సమాప్తి అయిన పిమ్మట కన్యాపిత అయిన రూపధరుడు వివాహాహుతులయిన వ్యక్తులను ధనాదులచే సత్కరించెను. ఇట్లే పద్మావతీ వివాహసమయమున కూడా వస్త్రాది దానము చేయబడినది. వరులు కన్య బంధువుల నుండి ఎట్టినియత ద్రవ్యమును కోరినట్టు ఆధారములు లేవు. వివాహ సమయమున కన్యాపతికి వస్త్రాలంకారములతో పాటు దాసీలను కూడా ఇచ్చుచుండిరి.

**వివాహవిధి :-**

కథాసరిత్సాగరమున వివిహవిధి అవశ్యకమని చెప్పబడినది. గాంధర్వ విధిచే వివాహమయిననూ వైదిక పద్ధతిలో వివాహము చేయవలసిన అవసరముండెను. ఉదయనుడు వాసవదత్తను గాంధర్వ పద్ధతిలో వివాహమాడిననూ వైదిక పద్ధతిలో వివాహ మంగళ విధులను నిర్వహింప వలసి యుండెను. వాసవదత్త తండ్రియైన చండమహాసేనుడు దూతను పంపి వైవాహిక కృత్యసంపన్నత కొఱకు వేచి యుండవలెనని చెప్పెను. "నా పుత్రికా వివాహము అవైదికముగా నుండకూడదు. నా పుత్రుడు గోపాలకుడు వచ్చి విధి పూర్వకముగా కొవరి వివాహమును జరిపింపగలడు." వివాహమున ధార్మిక విధి

విధానము కర్మకాండ అనివార్యము. అగ్ని సమక్షముగా వైవాహిక క్రియలను పూర్ణముగా ఆచరింపవలెనని దేవలుడు చెప్పెను. కథాసరిత్సాగర కాలమున అనేక వైవాహిక విధులు ఆచారములో నుండెను. వీటిలో అగ్నిని, దేవతలను, ద్విజుని సాక్ష్యముగా నుంచుకొని అగ్ని ప్రదక్షిణము చేయుట లాజా హోమము, సప్తపది అనునవి ఆవశ్యకములై యుండును. వివాహోత్సవము వైభవోపేతముగా ఆచరింపబడుచుండెను.

ఉదయనుడు పురప్రవేశానంతరము అంతఃపురమునకు వెళ్ళి సౌభాగ్యవతీ స్త్రీలతో నిండిన గృహమున ప్రవేశించెను. పిమ్మట వివాహ వేదికపై కూర్చొని పద్మావతిని పరిణయ మాడెను. అగ్ని ప్రదక్షిణము గావించెను వివాహోత్సవమున నూతన వస్త్ర భూషణాదులచే పట్టణమలంకరింపబడెను చారణులు మనోహర గీతములు పాడిరి. వేశ్యలు నృత్యము నాచరించిరి.

అగ్ని ప్రదక్షిణమయిన పిమ్మట లాజాహోమమున ధన దానము చేయబడుచుండెను. శశాంకవతీ వివాహమున లాజహోమ సమయమున విశేషధనదానము చేయబడెను. ఇట్లే సూర్యప్రభుని వివాహోత్సవ సమయమున కూడా వాద్యగానములు చేయబడుచుండెను మద్యపాన గోష్ఠులు ప్రవర్తిల్లు చుండెను. చారణులు ధనదానము పొంది వధూవరులను ప్రశంసించు చుండిరి. నరవాహనదత్త వివాహ కాలమున కన్యాపిత ఇచ్చు వస్త్రాలంకారములతో ఆమె తల్లి సఖి కన్యలైన మదనమంజుకను వివాహోత్సవ వేషముతో అలంకరించిరి. స్త్రీలు మంగళ గానము చేసిరి. మంగళ వాద్యఘోషణము మిన్నంటెను. అలంకృతుడయిన నరవాహన దత్తుడు వివాహమండపమున ప్రవేశించెను. అగ్ని ప్రదక్షిణానంతరము, లాజహోమానంతరము

రత్న దానము చేయబడెను. వివాహ లగ్నము కొఱకు ముహూర్త నిశ్చయము అవశ్యకమై యుండెను. మంద్రదేవుడు తన పుత్రీ వివాహ ముహూర్తము కొఱకు జ్యోతిష్కుని పిలిపించెను. జ్యోతిష గణనానుసారముగా వివాహ శుభముహూర్తము నిశ్చయింపబడెను.

కన్యాదాన మహత్త్వము :-

కథాసరిత్సాగరమున కన్యాదాన మహత్వము వర్ణింపబడెను పరోపకారియైన రాజు "పురుషపాప శాంతికి కన్యాదానమే ఉత్తమ ఉపాయమని కన్యాదాన ఫలకారణము వలననే పుత్రుని కంటె పుత్రిక మహత్వ పూర్ణమైనదని చెప్పెను."ఒ వృద్ధ బ్రాహ్మణుడు కన్యాదానము వలన లభించు పరలోక సుఖము పుత్రుల వలన కలుగదని చెప్పెను,

వివాహ ప్రకారముడు :-

1) బ్రహ్మ 2) ప్రాజాపత్య 3) అర్ష 4) దైవ 5) గాంధర్వ 6) అసుర 7) రాక్షస 8) పైశాచికములని వివాహములు 8 విధములు. వీటిలో మొదటి 4 ప్రశంసనీయమైనవి. బ్రహ్మ వివాహము సర్వోత్తమమైనది. 5,6 వివాహములు సహ్యములయిననూ పైశాచ వివాహము గర్హణీయము. వీటిలో కథాసరిత్సాగరమున కొన్ని వివాహములు మాత్రము పేర్కొనబడినవి. గాంధర్వ వివాహము సర్వాధికముగా ప్రచలితమయ్యెను,

సాధారణముగా వరపక్షము నుండియే వివాహ ప్రస్తావన జరిగెడిది. కనక వర్షుడను రాజు మదన సుందరిని వివాహమాడుటకు సందేశమును పంపెను. సహస్రానీకుడను రాజు మృగాంకవతి కొఱకు దూతను పంపెను. వివాహానంతరము వరుడు సప్తాహము కన్యాగృహమున నుండెను. పృథ్వీరూపుడను రాజు కన్యాగృహమున వివాహ

నంతరము పది దినములుండెను. గృహవర్మ కూడా రాజశ్రీ గృహమున 10 దినములుండెను. పైశాచిక వివాహమునకు కథాసరిత్సాగరమున ఆధారములు లేవు. రాక్షస వివాహము శత్రువులకు మాత్రమే పరిమితము. కథాసరిత్సాగరమున రాక్షసుని సంహరించి వారి కన్యను వివాహమాడిన ఉదాహరణములు కలవు. విదూషకుడు తన పరాక్రమముతో రాక్షస కన్యలను వివాహమాడెను. వివాహము లన్నింటిలో గాంధర్వ వివాహము ఉత్తమమయినదని కథాసరిత్సాగరమున వర్ణింపబడినది. ఉదయనాది రాజులు గాంధర్వ విధిచే అనేక కన్యలను వివాహమాడిరి. "అనురాగపర" నిశ్చయదత్తుని గాంధర్వ విధిచే వివాహమాడెను. కథాసరిత్సాగరమున అనేక కథలకు నాయకులు వీర క్షత్రియులు క్షత్రియులకు గాంధర్వ వివాహముచితమని పేర్కొనబడినది. గాంధర్వ వివాహమున దేవతలే సాక్షులు. గంధర్వులు దేవయోనికి చెందినవారు. కావున తత్సంబంధముచే ఈ వివాహము గాంధర్వము అని వ్యవహార మేర్పడినది. కామ వాసనా ప్రేరితమైన వివాహమిది. కథాసరిత్సాగర కాలమున ప్రేమ వివాహములు అధికములగుటచే గాంధర్వ వివాహము సమాజమున సమ్మతింపబడెను, ప్రాజాపత్య. ఆర్ష, దైవ, బ్రాహ్మ వివాహములు కథాసరిత్సాగర సమాజమున కూడా అంగీకరింపబడినవి.

పుణ్యప్రకార వివాహములు :-

కథాసరిత్సాగరమున అంతర్జాతీయ వివాహోదాహరణములు అధికముగా కలవు. రాజయిన వరోపకారి యొక్క పుత్రిక బ్రాహ్మణ లేదా క్షత్రియ యువకుని వివాహమాడుటకు సంసిద్ధరాలయ్యెను. ఒక రాజు తన సేనాపతితో తన పుత్రిక కొఱకు బ్రాహ్మణ లేదా క్షత్రియ పతినన్వేషింపుమని చెప్పెను. క్షత్రియ రాజకుమారునకు వైశ్యపుత్రి

కతో వివాహమయ్యెను. అనంగారవతి స్వయంవరమునకు అనేక వర్ణ ములకు చెందిన పురుషులు వచ్చుటచే వివాహమున వర్ణనిర్ణయమము దృఢముగా నుండెడిది కాదని తెలియుచున్నది. క్షత్రియ బ్రాహ్మణుల మధ్య వివాహము విద్యావినయ సంగమమని భావించుచుండిరి. ఒక వైశ్యుడు ధీవరుని వివాహమాడెను.

కథాసరిత్సాగరమున ప్రతిలోమ వివాహములకు కూడా ఉదాహరణములు కలవు. కానీ సమాజమున ప్రతిలోమ వివాహములు హేయములుగా పరిగణింపబడుచుండెను. ఒక రాజకన్య ధీవరుని వివాహమాడెను. మరియొక రాజకన్య చండాలుని వివాహమాడును. ఇట్టి ఉదాహరణములు కథాసరిత్సాగరమున స్వల్పముగా కలవు. స్వయంవర పద్ధతి కథాసరిత్సాగరమున రెండు సందర్భములలో పేర్కొనబడెను.

వరగుణములు :-

ప్రాచీన యాజ్ఞవల్క్య స్మృతి పద్ధతి ననుసరించి వర గుణములు నిర్దేశింపబడినవి. యౌవన, రూపము, కులము, చరిత్రము మొదలగునవి వరగుణముల లోనివి వీటిలో అవస్థ ప్రధానమైనది. వరుడు రూపవతిఅయిన కన్యను కోరినట్లే కన్య రూపదత్తుడయిన వరుని కోరును. కురూపి చక్రవర్తి అయినను కన్యవరింపదు. రూప వంతుడు దరిద్రుడయిననూ కన్య వరించును. వరుడు సౌందర్యముతో పాటు విద్యాబుద్ధులను కలిగియుండవలెను. పౌరుషము వరునకని వార్యము. నిర్బలుడయిన వరుని త్యజించి పారిపోయిన కన్యల దృష్టాంతము కథాసరిత్సాగరమున కలదు. ఒక అడవిలో గజమురాగా కన్యను వదిలి వరుడు వరుగెత్తెను. ఒక బ్రాహ్మణుడామెను రక్షించెను. అప్పుడా కన్య ప్రాణసంకట దశలో తప్పించుకొన్న వరుడు

నాకు అవసరం లేదని ప్రాణరక్షణ గావించిన బ్రాహ్మణుని భర్తగా వరించెను. పుంస్త్వ హీనుడయిన పతిని కన్య త్యజించును. విద్యాధరిపతి నపుంసకుడని తెలిసి విద్యాధరి తన తండ్రితో విషయమును తెలియజేసెను. ఇట్లు కథాసరిత్సాగర కాలమున వరాపేక్షితయోగ్యత లను పరిశీలించి వివాహములు చేయబడుచుండెను.

కన్యాగుణములు :-

శారీరక దోష శూన్యురాలు, శుభనామవతి, హంసగమన లేదా గజగమన, కోమలదంతవతి, మృద్వంగి, కోమలస్వభావురాలు వివాహార్థమపేక్షింపబడునని మనుస్మృతిలో పేర్కొనబడినది. కథాసరిత్సాగరమున వధూగుణములలో సౌందర్యమునకు మహత్త్వ స్థానమీయబడినది. కన్యాసౌందర్యమునకు ముగ్ధులై వరులు కన్యలను గాంధర్వ వివాహమాడిరి. నాట్యము, గానము మొదలగునవి కన్యాగుణములుగా ఉండవలెనని పేర్కొనబడినవి. కృతవర్మ అనురాజు తన పుత్రికా గుణములను వివాహ ప్రస్తావమున దూతకు చూపించెను. మృగాంకవతీ నాట్యము, గానము, అప్రతిమ సౌందర్యము రాజదూతకు ప్రదర్శింపబడెను.

ఉత్తమ పత్ని వృక్షచ్ఛాయ వలె "స్నేహపూర్ణురాలు, కులీన, ఉదార-హృదయ, దుఃఖహారిణియై సన్మార్గమున ప్రవర్తిల్లును. ఇట్టి పత్ని గొప్ప పుణ్యము వలన లభించును."³ యజ్ఞదానాది శుభకర్మ ప్రవృత్తి వలన స్త్రీలు గృహిణీ పదమును పొందుదురు.

బహుపత్నీత్వము :-

వేదకాలమునుండి బహుపత్నీత్వము ఆచారములో నున్నది. కథాసరిత్సాగరమున రాజులు అనేక సుందరీమణులను వివాహమాడిరి

ఉదయన నరవాహన దత్తాసులకు అసంఖ్యాక పత్నులుండిరి. బహు పత్నీత్వము రాజకులములో అధికముగా నుండెను. సాధారణులు అధిక పత్నీ భారమును వాంఛింపకుండిరి. ఆర్థికస్థితినిబట్టి బహు వివాహాధికారము సమాజములో సమానముగా నుండెను. ఈ విషయమున గుణశర్మతో అగ్నిదత్తుడిట్లు పేర్కొనెను. పతి ధనవంతుడయినప్పుడే అనేక భార్యలుండురు. దరిద్రుడు ఒక్క భార్యను కూడా పోషించుటకు కష్టపడును, "అక్ష క్షపణకుని" కథలో మధ్య వర్గీయ వ్యక్తికి రెండవ వివాహము జరుగును. ఈ రెండు సందర్భములందు తప్ప సామాన్య జనులు ద్వితీయ వివాహమును చేసుకొనిన సందర్భములు కథాసరిత్సాగరమున లేవు కామలిప్సచే, సౌఖ్యలిప్సచే, సంతాన లిప్సచే ప్రేరితులయిన రాజులు బహువివాహోన్ముఖులగుచుండిరి కథాసరిత్సాగరమున దీనికి సంబంధించిన మనోహర ప్రస్తావము కలదు, ఒక సఖి నరవాహనదత్తుని గూర్చి ప్రశ్నింపబడి ఇట్లు చెప్పెను. నరవాహన దత్తుడు బహు స్త్రీ లంపటుడు ఎందులకయ్యెను; అనే ప్రశ్నకు సమాధానముగా రాజులు రాత్రింబవల్లు క్రొంగొత్త స్త్రీలను స్వీకరించి సంతుష్టులగుదురు. దేశ, రూప, అవస్థ, చేష్ట విజ్ఞానాది భేదముచే ఉత్తమ స్త్రీలు భిన్న భిన్న గుణములను కలిగియుందురు. ఒకే స్త్రీ సర్వగుణ సంపన్నురాలుగా నుండదు. అందువలన రాజులు అనేక స్త్రీలను పరిగ్రహింతురు ఈ సమాధానము వలన తత్కాలరాజుల కామలిప్స స్పష్టమగుచున్నది.

నియోగము :-

సంతానము కోరు విధవ మృతపతి సోదరుని ద్వారా సంతానమును పొందవచ్చునని మనువు పేర్కొనెను కథాసరిత్సాగమున నియోగమున కుదాహరణములేదు. కానీ బేతాళ కథలో క్షేత్రజ పుత్ర

చర్చ కలదు. మృత చోరుని ప్రేతరూపములో వివాహమాడి క్షేత్రజ పుత్రుని పొందిన సందర్భము కలదు. తద్వారా సద్గతి లభించునని చెప్పబడినది,

బహుపతిత్వము :-

కథాసరిత్సాగరమున దుష్ట స్త్రీలు ఒక్కొక్కపతిని వివాహమాడి అతనిని వదలి పునర్వివాహము చేసుకొన్న సందర్భములు అనేకములు కలవు, "అనంగ ప్రభ" అనేక భర్తలను మార్చెను. కానీ ఒకే సమయమున అనేక పతులను వివాహమాడిన సందర్భము కథాసరిత్సాగరమున లభింపదు. వృద్ధ వివాహము కథాసరిత్సాగరమున నిందింపబడినది. ఒక వృద్ధ ధనిక వైశ్యుడు వార్ధక్యమున వివాహమాడెను. పత్ని అతనిని నిందించెను. కులీనుడయిన వృద్ధరాజు- ప్రసేనజిత్తు కళింగ సేనతో వివాహమాడుటకు సంసిద్ధుడయ్యెను. అపుడు కళింగ సేనాసఖి "సోమప్రభ" అతడు వృద్ధుడు ఈ వృద్ధుని జాతి కులములతో పని ఏమి? ఇతనిని వివాహమాడవలదు" అని హితబోధ గావించెను.

అనేక ఉదాహరణములను బట్టి కథాసరిత్సాగరమున అష్టవిధ వివాహములలో గాంధర్వ వివాహము అధికమని తెలియుచున్నది.

—0—

4. 3. 12. కథాసరిత్సాగరము-ఆభూషణములు-ప్రసాదన సామాగ్రి-వాహనములు-క్రీడా వినోదములు-గోష్ఠులు-ఉత్సవములు.

ఆభూషణములు :-

కథాసరిత్సాగరమున వస్త్రాలంకారముల సహ ప్రయోగము కనబడుచున్నది. ఈ రెండునూ సంస్కృతి ద్యోతకములు. ధాతు నిర్మాణ దృష్ట్యా స్వర్ణాభరణములు, మౌక్తికాభరణములు రజతాభరణములు, పుష్పాభరణములని ఆభూషణములు, విభజింపబడినవి స్త్రీ పురుష సమాన ఆభూషణములు, కేవల స్త్రీ భూషణములు, కేవల పురుష ఆభూషణములు అని ఇవి మూడు విధములు. ముకుట, కంఠహారాదులు పురుషుల ప్రియభూషణములు. స్త్రీల అలంకార సంఖ్య అగణ్యము, అలంకార హీనురాలయిన పత్ని పతి కడకు వెళ్ళుటకు నిషేధింపబడ్డనది. శిరస్సు, కంఠము, కర్ణములు, కరములు, పాదములు మొదలగు శరీరాంగ ఆభూషణముల విస్తృత వర్ణనము కథాసరిత్సాగరమున కనబడుచున్నది.

మణులు :-

పద్మరాగమని, గారుడమణి స్ఫటికమణి, ముక్తా ప్రవాళ వజ్రహీరామణి మొదలగు మణులు ఇచ్చట పేర్కొనబడినవి. విష్ణువు యొక్క కౌస్తుభమని కూడా కథాసరిత్సాగరమున నిర్దేశింపబడినవి. స్త్రీ పురుష భూషణములలో విశేష భేధము కలదు. అంగద, మలయ, హార, ముద్రికా కుండలములు ఉభయ సమాన భూషణములు. పురుషుడు మలయమును హస్తమున, మాలను కంఠమున ధరించుచుండెను. నూపుర మేఖలాది భూషణములు స్త్రీలచే పాదములందు, కటి స్థలము నందు ధరింపబడు చుండెను. స్త్రీలు పుష్పమాలాలంకృతులై యుండిరి

చూడామణి మకుటాదులు కేవల పురుషాభరణములు. వీటిని క్షత్రియులు మాత్రమే ధరించుచుండిరి. చూడామణి ధరించుట వలన విష, పిశాచ ప్రభావము, వార్ధక్య రోగ ప్రభావము నశించుచుండెనని కథాసరిత్సాగరము చెప్పబడినది. "ఇందుమతి అను రాణి రాజుకు ఇట్టి ప్రభావముగల మణి నిచ్చెను."1

శిరోభూషణములు :-

శిరోభూషణములలో చూడామణి సర్వోత్తమమయినది. ఈ పద ప్రయోగము అనేక స్థలములలో గ్రంధమున కనబడుచున్నది. ముకుట కిరీట పట్టములు శిరోభూషణ పర్యాయ పదములు. రాజ పట్టము మహిషి పట్టము, యువరాజ పట్టము, సేనాపతి పట్టము, ప్రసాద పట్టము అని పట్టములు 5 రకములు. విశిష్ట సన్మానము చేయుటకు సాధారణులకు కూడా పట్టము లివ్వబడుచుండెను. పట్ట బంధం ద్వారా సామాజికులను సన్మానించుచుండిరి. సుషేణ రాజునకు కూడా పట్టబంధ మివ్వబడెను. మహారాణి పట్టాభిషిక్త మహిషి అని చెప్పబడు చుండెను.

కంఠాభూషణములు :-

స్త్రీ పురుష సమాన కంఠాభరణము కథాసరిత్సాగరమున వర్ణింపబడినది. మౌక్తికములచే లేదా రత్నములచే తయారు చేయ బడిన హారము స్త్రీ పురుష సమాన భూషణము. స్ఫటికమాల ముక్తావళి కంఠిక, రేఖావళి, కంఠాభరణాది అభూషణములు కథాసరిత్సాగరమున వర్ణింపబడినవి. కంఠమాల ప్రచారము మధ్యకాలీన మూర్తికలచే సుప్రసిద్ధమే. పురుషాభరణమయిన కంఠాభరణము స్వర్ణముచే విద్రుమ మనులచే, మౌక్తికములచే తయారు చేయబడుచుండెను.

కర్ణభూషణము :-

ముత్యములతో తయారు చేయబడిన కర్ణాలంకార ప్రస్తావన కథాసరిత్సాగమున లభించుచున్నది. స్త్రీ, పురుషులకు సమానముగా మణిరత్నాది నిర్మిత కర్ణాభరణములు ప్రియభూషణములుగా నుండెను ఇది మధ్య కాలీన సంస్కృతికి చిహ్నము.

కరభూషణము :-

అంగద, కేయూర, వలయ, అంగుళీయకాదులు కరభూషణములుగా వ్యవహరింపబడుచుండెను. అంగుళీయకము ప్రేమ వివాహములో బహుమానముగా ఇవ్వబడుచుండెను. మేఖల, రశన మొదలగు పదములచే వ్యవహరింపబడు కటిభూషణము, స్వర్ణ, రత్న మౌక్తికములచే కూడియుండెను. ధ్వని కొరకు మేఖలకు గంటలు కూడా అమర్చబడి యుండెను. పాదభూషణములు పాద స్వభావార్ధకములు. నూపురములు అట్టివి. కథాసరిత్సాగరమున కొన్ని స్థలములలో నూపుర వర్ణన కలదు.

ప్రసాధన వస్తువులు :-

శారీరక సౌందర్య వృద్ధి కొఱకు సుగంధ చూర్ణ కుంకుమ అంగరాగాది విలేపనము చర్మ మార్దవము కొఱకు ఆకర్షణ కొఱకు ప్రాచీన కాలము నుండి ఉపయోగింపబడు చుండెను. కేశరచనా సంబంధ వస్తువులు ముఖ సౌందర్య ప్రసాధన వస్తువులు అని ప్రసాధన వస్తువులు మూడు విధములుగా విభజింపబడి యుండెను. కేశాలంకారము స్త్రీ పురుషలిరువురకు ఇష్టమయినది. స్త్రీలు కేశాలంకరణములో విశేష నిపుణులు. ఇందు రెండు విధములయిన కేశబంధనమో వర్ణింపబడినది, విశేష కేశరచనకు "కబరి" అని పేరు. కథాసరిత్సాగర

మున వామ పీఠావలంబి కబరి వర్ణింపబడినది. కబరిసుదీర్ఘత సౌం దర్య ద్యోతకము.

ధమ్మిల్లము :-

కేశరచనలో ధమ్మిల్లము కూడా ఒక పద్ధతి. సంయత కచన ములనే ధమ్మిల్లము అందురు. ౦౦ క్తికములు, పుష్పాదులు ధమ్మి ల్లములో పెట్టుకొనుచుండిరి. సౌందర్యము కొఱకు గుచ్ఛము వలె కేశ ములను ముడివేసుకొనుట కళావిశేషము. వియోగావస్థలో కేశవిన్యా సము నిషేధింపబడెను. నాడు ఒక వేణిని ధరించిన స్త్రీలు మాత్రమే యుండిరి. సుందరీ కేశములు సర్పములతో పోల్చబడినవి. కేశ సౌందర్యము కొఱకు, సౌందర్యము కొఱకు కాలాగురు ధూపము ఉప యోగింపబడు చుండెను.

**ముఖ సౌందర్య సాధనా సామాగ్రి :-**

గోరోచన కుంకుమము (నే) అనేక ప్రకార పత్ర రచనను పురుషులు చేయుచుండిరి. తిలకము ముఖ సౌందర్య విషయమున మహత్వపూర్ణమయినది. తిలక ధారణము స్త్రీ పురుష సమానము. కేశ రాది సౌగంధ్య పదార్థములను తిలకమున ఉపయోగించుచుండిరి, తిల కము ముఖ సౌభాగ్య ప్రతీకము. కథాసరిత్సాగరమున తిలక సౌం దర్య వృద్ధి అభివర్ణింపబడెను. స్త్రీ పురుషులు ముఖమున పత్రరచన చేసుకొనుచుండిరి. అంజనము ప్రపంచమున అనేక దేశములలో సుప్రసిద్ధము. అజంతా శిల్పమున కూడా చిత్రములలో నేత్ర సౌం దర్య వృద్ధి కొఱకు అంజనోపయోగము చిత్రింపబడినది. అంజనము నయన దీర్ఘతను వృద్ధి పొందింప జేయును కర్ణపర్యంతము వ్యాపించి సౌందర్యమును ద్యోతకము చేయును. ఆకర్షణ కొఱకు కూడా అంజన

మును వాడుచుండిరి. విరహదశలో అంజన లేపము నిషేధింపబడెను. శలాకముతో అంజమును పూసుకొనుచుండిరి కాజలము; సురమ అంజనము అనునవి వీటి భేదములు. కథాసరిత్సాగరమున అంజనలేపము వర్ణింపబడినది. తతః స్వీకారయత్ పురి-చేటీభిః కుండక స్థితం కస్తూరి కాది సంయుక్తం కజ్జలం తైల మిశ్రితమ్" అని గ్రంథోదాహరణము. స్నానానులేపనమున శరీర స్వచ్ఛత కొఱకు అంగరాగాది లేపము నిత్యకర్మగా ఆచరింపబడుచుండెను. స్నానానంతరము, అంగలేపము వస్త్రభూషణములు సౌందర్యము కొఱకు ధరింపబడుచుండెను. ఇవి తత్కాలీన జనాభిరుచిని తెలియజేయుచున్నది. కథాసరిత్సాగరమున స్నానానులేపనమునకు సంబంధించిన అనేక ప్రసంగములు కలవు' కర్పూరము, అంగరాగము, చందనము, కస్తూరిక, అనునవి ప్రసిద్ధ లేపనములు. "గుణశర్మ అగ్నిదత్తుని స్నానాను లేపన భోజనము లతో సన్మానించెను. ఇట్లే మదనమంజరి కూడా అనంగ దేవునకు స్వాగతమును ఇచ్చెను. స్నానమునకు మునుపు తైల మర్దనము దాసీల ద్వారా చేయబడుచుండెను."2 ఈ గ్రంథమున శశీ, దాసీలతో తైల మర్దనమును చేయించెను. కర్పూర ఉపయోగము కూడా అనేక స్థలములందు వర్ణింపబడినది. చందన మిశ్రితమయిన కర్పూర లేపనము శరీరముపై అనేక జనులు వాడుచుండిరి. తాంబూలమును ఉపయోగించు పంచ ఫలములలో కర్పూరము ఒకటి. కథాసరిత్సాగరమున కర్పూర ప్రయోగము అనేక స్థలములలో కలదు.

చందనము :-

శీతాకాలమున తప్ప ఇతర కాలములలో స్త్రీ పురుషులు వివిధ వస్తుమిశ్రితమయిన కర్పూరలేపనమును శరీరముపై వాడుచుండిరి. చందన ఉపయోగము అతి ప్రాచీనమయినది. కథాస

త్సాగరమున దీనికి అనేక ఉదాహరణములు కలవు. తాపశమనము కొఱకు, శైత్య సౌగంధ్యము కొఱకు తిలక రూపములో చందనము ఉపయోగింపబడుచుండెను. రాజనిధులలో చందన వృక్షములు కూడా వరిగణింప బడినవి.

కర్పూరము :-

కర్పూరమనెడి పేరుతో ద్వీపమే యుండెను. కర్పూరకుడను పేరుగల రాజపుత్రిక పేరు కర్పూరిక.

అంగరాగము :-

కేశర, కర్పూర కాలాదులను ప్రముఖ సుగంధ ద్రవ్య మిశ్రణముచే అంగరాగము తయారుచేయబడుచుండెను. అంగరాగము లలో కుంకుమ ముఖ్యమయినది. కథాసరిత్సాగరమున కొన్ని స్థల ములలో అంగరాగ వర్ణన కలదు వీరవరుడు అంగరాగమును వద్య వీధిక నుండి కొనెను. నాయికల అంగరాగముచే జలాశయము కూడా రక్తమయ మయ్యెనని వర్ణింపబడినది.

వాసకము :-

నానా ప్రకార సుగంధ చూర్ణోపయోగము కథాసరిత్సాగర మున వర్ణింపబడినది. ప్రాచీనకాల వాసక స్థానమున నేడు శ్వేత చూర్ణములు శరీరముపై వాడబడుచున్నవి. అలక్తకమునకే లాక్షా రసమని పేరు. ఇది పాదములకు ఉపయోగింపబడుచుండెను. మధ్య కాలమున లాక్షారసము సర్వజనోపయోగ్యముగా నుండెను.

పుష్పాభరణము :-

ధాతు అతిరిక్తములయిన పుష్పములు కూడా కొన్ని ప్రసా

ధనము కొఱకు ఉపయోగింపబడుచుండెను. పుష్పాభరణములలో కథాసరిత్సాగర కాలమున కర్ణోత్పలము ప్రధానముగా నుండెను. ఆయా ఋతువులను అనుసరించి పుష్పమాలలు ధరింపబడుచుండెను. స్త్రీలు కూడా పుష్పమాలలను ధరించుచుండిరి. కర్ణోత్పలమును స్త్రీలు మాత్రమే ధరించుచుండిరి. కేశములందు కర్ణములకు హస్తములకు పుష్పమాలలు ఉపయోగింపబడు చుండెను.

సిందూరము :-

స్త్రీల సుఖ సౌభాగ్య ప్రతీకమయిన సిందూరము ఉపయోగ పదార్థములలో నుండెను. ఉత్సవములలో అధికంగా స్త్రీలు శృంగారము కొఱకు సిందూరాది తిలకమును ఉపయోగించుచుండిరి.

ఉత్సవ సామగ్రి :-

ఆర్థిక సంపదను అనుసరించి వివిధ్న వస్తువులు ఉత్సవము లలో ఉపయోగింపబడుచుండెను. రాజ భవనములలో బహుమూల్యములయిన రత్న ప్రదీప, ఛత్ర చామరాదులు వర్ణింపబడెను. సాధారణ గృహములలో కూడా వారి ఐశ్వర్యమును బట్టి గృహోపకరణములు ఉండెను. తపోవంతుల కుటీరములలో కుశలు, భిక్షాపాత్రము మృగ చర్మ, అను సామగ్రి ఉండెను. నిగమ శర్మ భవనమున బహుమూల్యములయిన మణులు ప్రకాశించుచుండెను. రత్న పర్యంకికతో నున్న స్త్రీని కూడా శక్తి దేవుడు చూచెను. అందు రత్న ద్వీపములు ప్రజ్వరిల్లుచుండెను. హరిశర్మ అను బ్రాహ్మణుడు స్వర్ణఛత్రముచే సన్మానింపబడెను. సుఖశయ్య, కుట్య చిత్రపటము, పుస్తిక వల్గులిక మంజూష, కరండిక, పటచ్ఛదము మొదలగు వస్తువుల పేర్లు కథాసరిత్సాగరమున వర్ణింపబడినవి.

వాహనములు :-

మానవ సౌకర్యము కొఱకు పూర్వకాలము నుండియే వాహనములు ఉపయోగింపబడుచుండెడివి. గజ, రథ, అశ్వాదులు వాటిలో ముఖ్యము. రాజపరివారము, సామంతులు, శ్రేష్ఠిగుణము, విచిత్రము లయిన వాహనములను వాడుచుండిరి. గజ, అశ్వములకు మాత్రము అత్యధిక ప్రాముఖ్యముండెను. సాహసికులు నౌకల ద్వారా సముద్ర యాత్ర చేయుచుండిరి. విద్యాధరుడు శీఘ్రముగా వెళ్ళుటకు యంత్ర చాలిత విమానములను ఉపయోగించుచుండిరి.

అశ్వములు :-

అన్నింటి కంటె శీఘ్రముగా వెళ్ళు అశ్వము చక్రవర్తుల సప్తరత్నములలో ఒకటి. కథాసరిత్సాగరమున అనేక అశ్వములు విస్తృతముగా వర్ణింపబడినవి. ఆదిత్యసేనుడు అను రాజు శ్రీ వృక్షము అను పేరుగల అతి శీఘ్రగామి యగు అశ్వమును ఉపయోగించి వెళ్ళెను. ఆ అశ్వము బాణవేగముతో రాజప్రేరితమై పరుగెత్తగా రాజు మార్గమును కూడా తెలుకొనజాలక అరణ్యమున ప్రవేశించెను. అపుడు రాజు నీవు అశ్వము కాదు దేవతవే, స్వామి ద్రోహము చేయు చున్నావు, నన్ను కళ్యాణ మార్గమున పొందింపజేయుమని అశ్వమును ప్రార్థించెను. అతని వాక్కును విని ఆ అశ్వము మరలా సన్మార్గమున పయనించెను. ఉన్నత కులీన-అశ్వములు దేవతలు గానే యుండెను వాటినే దేవతాశ్వములని వ్యవహరించుచుండిరి. శక్తిదేవుడు అశ్వమును చూచి దాని పర్యాణము రత్న నిర్మితమని చెప్పెను. యుద్ధమున అశ్వబలము అధికముగా ఉపయోగపడుచుండెను. సూర్యుడు సప్తాశ్వుడు అని పేర్కొనబడెను. పౌరాణిక అశ్వములు కూడా ఇందు చర్చింపబడినవి. రథమునను లాగుటకు అనేక అశ్వములు ఉపయోగింప

బడుచుండెను. శత్రుముకుటాపహరణమున శత్రు అశ్వాఘాతమున, శత్రు అశ్వ పరాజయమున మొదలగు కార్యములలో అశ్వములకు శిక్షణ నిచ్చుచుండిరి. నకులాశ్వ శాస్త్రమున అస్కందితము, ధౌరితకము, రేచితము, వల్గితము, ప్లుతము నామములు వర్ణింపబడినవి.

గజవాహనము :-

రాజుల ప్రముఖ వాహనములలో గజము కూడా ఒకటి. మహత్వ దృష్టిచే ఇది సర్వోత్తమమయినది. గజశిక్షణ కథాసరిత్సాగరమున ప్రసిద్ధమయినది. గజబలము లేనిచో రాజు సైన్యశక్తి క్షీణించినట్లని నిశ్చయింపబడెను. గజమహత్వము అనేక స్థానములందు కథాసరిత్సాగరమున వర్ణింపబడినది. ఉదయన మహారాజు గజశిక్షణలో విశేషజ్ఞుడు, అతడు గజబంధన కళను చక్కగా నెఱిగినవాడు. విశాల కాయమయిన గజము వింధ్యపర్వతముతో సమానముగా పోల్చబడెను ద్విప, మాతంగ, కుంజర, దంతి, ద్విరథ, కరి నాగ, వన్యహస్తి, వారణ, మత్తద్విప కరేణు మొదలగునవి గజముల విభిన్న నామములు. అరణ్యగజములను ద్విపములందురు. వాటిని వశీకరించుకొనుటకు విశేష శ్రమ అవసరం. మదనోద్దీప్తమై ఉన్మత్తతను పొందిన గజమును మాతంగ మందురు, యుద్ధ కాలమున రాజ ప్రాకారమును ధ్వంసము చేయుటకు, సేనను విచ్ఛేదము చేయుటకు ఉపయోగింప బడుచుండెను. మాతంగములు అతి బలోపేతములయినవి. ప్రచండ కార్యము కొఱకు వీటికి శిక్షణ నిచ్చుచుండిరి. రాజవాహనము కొఱకు కుంజరములను ఉపయోగించుచుండిరి. మాతంగములు అంకుశముచే కూడా వశములు కావు. కుంజరము యొక్క శుండాదండము మాతంగ శుండాదండము కంటె పొడవయినది కుంజరములు శ్వేతవర్ణ విశిష్ట

ములు. సామాన్య గజమునకు దంతి అని వ్యవహారము, గజ జలక్రీడ అతి ప్రసిద్ధమై యుండెను.

శిబిక :—

ఇది కథాసరిత్సాగరమున అనేక స్థలములలో వర్ణింపబడినది క్షౌమ దువలాది వస్త్రములచే శిబిక చక్కగా నిర్మింపబడుచుండెను. మహారాజులు, రాజులు, విశిష్టవ్యక్తులు శిబికను ఉపయోగించుచుండిరి, వివాహిత నవ వధువును శిబికలో కూర్చుండబెట్టి తీసికొని వచ్చుచుండిరి.

శకటము :—

సంపన్నులు రథమును, సామాన్యులు శకటమును ప్రయాణము కొఱకు ఉపయోగించుచుండిరి. రథమును లాగుటకు అశ్వములతోపాటు వృషభములు కూడా వాడబడుచుండెను, సామాన్యులు రథములకు వృషభములనే వాడుచుండిరి రథమునకు నలువైపులా జవనికలు ఉండెను. అగ్రభాగమున రాజధ్వజము ఉండెను, రథప్రయోగోదాహరణములు కథాసరిత్సాగరము-ఆనేకములు కలవు.

వహనము :—

జనయానమును వహనము అని వ్యవహరించిరి. వ్యాపారులు అర్థోపార్జన కొఱకు సముద్రయాత్రలో జలయానమును ఉపయోగించుచుండిరి. ప్రవహనము జలయానము, వహనము మొదలగు నామములు కథాసరిత్సాగరమున అనేక స్థలములలో ఉపయోగించబడినవి.

విమానములు :—

అనేక విధములయిన విమానములు కథాసరిత్సాగరమున

వర్ణింపబడినవి. దేవతల విద్యాధరుల విమానయాత్రలు ఇచ్చట పేర్కొనబడినవి. "సోమప్రభ" యంత్ర నిర్మిత వాయు విమానము ద్వారా ఒళింగసేనను తీసికొని వెళ్ళును. వీటినే "వాత యంత్ర విమానములని" పేర్కొనిరి. ఇవి సహస్రజనము కూర్చొనుటకు తగిన స్థలమును కలిగియుండెను. "నరవాహన దత్తుడు వాయు విమానము ద్వారా కర్పూర ద్వీపమునకు వెళ్ళెను."ని మహాపద్మాది నామములతో విమానములు వ్యవహరింపబడెను. యుద్ధకాలమున గజములను కూడా విమానముల ద్వారా తీసికొని వెళ్ళుచుండిరి. "ఆనాయ్య గజనీకం ఏవం విమానేధి రోపితమ్" అని ఇందు పేర్కొనబడినది.

కర్ణీరవము :-

ఇది స్త్రీల వాహనము. కర్ణీరధావ తీర్ణాం చ తత్రోచిత సరోరుహమ్" అని ఇందలి ఉదాహరణము.

సుఖవాహనము :-

సువర్ణరత్నాది విభూషితమయిన శార్దూల చర్మముచే కప్పబడిన, దండికాయుక్తమయిన, హంసశయ్యకల నలుగురు మనుష్యులు కూర్చొనుటకు తగిన స్థలము గల గజదంతములతో నిర్మింపబడిన దాని సుఖవాహనమని కథాసరిత్సాగరమున పేర్కొనబడినది.

క్రీడావినోదములు :-

జీవనమున భోజనపాన వస్త్రాదుల వలె మనోరంజనమునకు క్రీడలు అవశ్యకము. నిరంతర విభిన్న దుశ్చింతాపీడితుడయిన మనుష్యుడు మనోరంజముచే బాధావిముక్తిని పొందును. మనోరంజనముచే కార్యక్షమత, కుశలత, నవీనోత్సాహము, శక్తి జనించును. అనాది కాలము నుండి నృత్యగీత కథాదుల ద్వారా మనోరంజనము కల్గింప

బడుచుండెను. కథాసరిత్సాగరమున రాజ సఖీమణులు అత్యధిక మగుట వలన ఉన్నత సమాజమునకు విభిన్న మనోరంజక క్రీడా వర్ణన అవశ్యక మయ్యెను. రాజులు నృత్య, గీత, వాద్య, పాన, కథా, వార్తా, మృగయా, జల విహారాదులచే విద్వాంసులు శాస్త్రార్థ కావ్యవినోదములచే మనోరంజనమును పొందుచుండిరి.

ఋతు-అనురూప క్రీడా వినోదము :-

ఋతువును అనుసరించి క్రీడావినోదములు భిన్నముగా నుండెను. గ్రీష్మర్తువులో ధారాయంత్ర గృహములలో జలక్రీడ నిర్వహింపబడుచుండెను. వర్షాకాలమున అంతఃపురమున సమావేశమై సంగీతానందమును పొందుచుండిరి. శరదృతువులో చంద్రరాత్రులలో, ఉన్నత భవనములలో కూర్చొని పానాదుల ద్వారా మనోరంజనమును పొందుచుండిరి. హేమంతఋతువులో కాలా గురు దీపములనుపయోగించి సుగంధిత ప్రకోష్టములలో విశ్రాంతిని పొందుచుండిరి.

యోషిద్భోగము :-

రాజులు స్నానవిలేపన మాలాధారణానంతరము బహుమూల్య వస్తువులచు ధరించి యోషిద్భోగము ననుభవించుచుండిరి, వాత్స్యాయన మతము ననుసరించి వేశ్యాగోష్ఠి సమావేశమును ప్రవర్తిల్లుచుండెను. విద్యాకళాకుశలనులయిన గణికులు గోష్ఠిసమావేశములలో తప్పక భాగస్వామినులుగా ఉండిరి, నృత్యగీత రసాలాపముల ద్వారా సభ్యులకు మనోవినోదము కలుగుచుండెను. సోమేశ్వరుడు మానసోల్లాసమున యోషిద్భోగ ప్రస్తావమున గుణానురూపముగా స్త్రీలను విభజించెను. స్త్రీణాం రూపవతీ శ్రేష్ఠా సురూపాసు సయౌవనా సయౌవనా సు గీతిజ్ఞా స్వపి నర్తకీ । ఉత్తరోత్తర మేతాసు శ్రేష్ఠం పూర్వ గుణైస్సహ ।”

కథాసరిత్సాగరమున కూడా సుందర స్త్రీలు ప్రశంసింప బడిరి. కాన్తా చంద్రోదయో వీణా పంచమోధ్వనిరిత్యపి ॥" యుద్ధమున ప్రియజన మృత్యువుచే దుఃఖితుడయిన సూర్యప్రభుడను రాజు నిద్రించుచుండెను. అతని అనేక భార్యలలో ఒక స్త్రీ అద్యరాజ పుత్రో నిరంగణః సుప్తః ఇపుడు రాజపుత్రుడు అంగనారహితుడై నిద్రించెను" అని చెప్పెను మరియొక స్త్రీ దుఃఖితుడయిన ఆర్యపుత్రుడు ఎట్లు స్త్రీ జనముతో రమంపగలడని చెప్పెను. వీరు ఇట్లు చెప్పుకొను చుండగా ఒకానొక స్త్రీ విస్మయముతో "అయ్యా ఇట్టి రాజపుత్రుడెట్లు స్త్రీ లంపటుడు" అని ప్రశ్నించెను. అహిత రాజ పత్నులు రాజ పుత్రులతో నిత్యము రమించుచు తృప్తిని పొందరు. మనోవతి అను ఒకానొన రాజపత్ని "రాజానాం బహువల్లభాః అనుటకు గల కారణమును ఇట్లు చెప్పెను. దేహ, రూప వియశ్చేష్టా విజ్ఞానాది భేదములచే పరస్త్రీలకు భిన్నభిన్న గుణములుండును. సర్వ గుణములు ఒకరి వద్ద ఉండవు. కర్ణాట, లాట, సౌరాష్ట్ర మధ్యదేశాది భేదముచే స్త్రీలు స్వదేశాచారములచే రాజులను రంజింపజేయుదురు. కొందరు స్త్రీలు శరత్కాల చంద్రముఖములతో మనస్సును ఆకర్షించుదురు. కొందరు కనక కుంభ సమములయిన ఉన్నత స్తనములతో మనస్సును ఆకర్షించుదురు. కొందరు స్మర సింహాసన స్థానములయిన జఘనస్థలములచే, మరి కొందరు స్వసౌందర్యము మనోరమములయిన ఇతరాంగములచే మనస్సును రంజింపజేయుదురు. అందువలన రాజులు నానా రసాస్వాద లబ్ధలక్ష్యులయి భిన్నభిన్న గుణాన్విత స్త్రీలచే రంజింపచేయబడుచుందురు. నర్మవాహనదత్తుని మనోరంజనము కొఱకు కర్పూరక రాజు తన పుత్రికయైన కర్పూరికతో సహా 300 సుందర దాసీమణులను దానరూపముగా నిచ్చెను.

శస్త్రవినోదము :-

వినోదకార్యములలో శస్త్ర వినోదము కూడా ఒకటి రాజులు శస్త్ర శాస్త్ర నిపుణులుగా నుండిరి.

ఇత్యస్య వదతో భూయః సరాజా గుణశర్మణః
భావిత్వా ఛురికాఘాతం దదౌ ధృష్ట ఇతి బ్రువన్
........జఘాన శత మాత్రంచ యోధనామనుధావతాం”

అని కథాసరిత్సాగరమున శస్త్ర వినోదమునకు ఉదాహరణములు కనబడుచున్నవి.

జలక్రీడ :-

జలక్రీడకు సహజవర్ణన ఇందు కలదు శాతవాహనరాజు రాణులతో సరస్సున జలక్రీడలాడెను. అందు పరస్పర జలతాడనము కూడా ప్రవృత్తమయ్యెను. జలసేచనముచే రాణుల విభిన్న అవయవములు స్పష్టముగా కనబడుటచే రాజుకు మనోరంజనము కలుగుచుండెను. వాయుసమానుడయిన రాజు వనమున స్వప్రియురాండ్రను లతా సమానలను చేసెను. వాయువు ఎట్లు లతల పత్రరూప తిలకమును నాశనము చేయునో పుష్పరూప ఆభరణములను పరిహరించునో అట్లే రాజు రాణుల పత్రావలేప రూపతిలకమును, పుష్పసమాన శ్రీశోభిత ఆభరణములను జలతాడనములచే పరిహరించెను. వారిలో ఒక రాణి రత్న భారాలంకృతయై క్రీడాశ్రమమును పొందెను.

ఈ ప్రసంగమున జలక్రీడలో నాయికల కేశములందుగల పుష్పములు జలమున పడి సర్వత్ర వ్యాపితములయ్యెను. వారి శరీరాంగరాగ కారణముచే జలము రక్తిమను పొందెను. జలధారలో శరీర నృత్యావయవములు కూడా కనబడుచుండెను.

ఉద్యాన క్రీడ :-

కథాసరిత్సాగరమున ఉద్యాన క్రీడకు ఉదాహరణములు కనబడుచున్నవి. సుషేణరాజు వసంతఋతువునందు ఉద్యాన క్రీడకు వెళ్ళెను. రంభ ఉద్యానములో నున్న రాజును చూచి ఇతడు మూర్తి మంతుడయిన వసంతుడని తలంచెను. ఆ రాజు రంభతో కలిసి ఉద్యానవనమున క్రీడించెను. మదిరావతి ఉద్యానవనమున పుష్ప ములను కోయుచుండెను. పుష్పములు కోయుటకు ఆమె చేతులెత్తగా తత్పయోధరములు స్పష్టముగా కనబడినట్లు వర్ణింపబడినవి. శాతవాహన రాజు కూడా స్వప్రియురాండ్రతో కలసి ఉద్యాన క్రీడను ఆచరించెను.

ఇట్లు గ్రీష్మఋతువయిన జలక్రీడలు, శరత్కాలమున పాన క్రీడలు, వర్షాకాలమున గాన క్రీడలు కథాసరిత్సాగరమున వర్ణింపబడినవి.

మల్లయుద్ధము :-

మనోరంజకమయిన మల్లయుద్ధ వర్ణనోదాహరణములు ఇచ్చట కలవు. మల్లయుద్ధములో శ్రీదత్తుడు, అశోకదత్తుడు నిపుణు లుగా నుండిరి. మల్లయుద్ధ దర్శనార్థము దూర ప్రాంతముల నుండి తద్విశారదులు వచ్చుచుండిరి.

ఇంద్రజాలిక ప్రయోగము :-

ఇంద్రజాల విద్య కూడా వినోదరూపముగా నుండెను. కథా సరిత్సాగరమున యౌగంధరాయణుడు మంత్ర తంత్ర ఇంద్రజాల ప్రయోగములచే రాజుకు వినోదమును కలిగించెను. ఇంద్రజాల విద్య భారతదేశమున ప్రాచీనకాలమునుండి ప్రవర్తిల్లుచున్నది. శంబరా సురుడు, ఇంద్రుడు ఇంద్రజాల విద్యానిపుణులుగా వర్ణింపబడిరి.

గుళిక క్రీడ :- హిరణ్యాక్షుడు గులిక క్రీడను ఆడుచుండగా అతని ఒక తపస్విని పై పడినట్లు కథాసరిత్సాగరమున వర్ణింపబడినది. "శుక హరిణ క్రీడ" :- రాజులు శుక హరిణాదులతో క్రీడించుచుండిరి. క్రీడాసుఖములనే క్రీడాహిరణములని వ్యవహరించుచుండిరి మదిరావతి వియోగ క్రీడచే శుకాదులతో క్రీడింపకుండెనని వర్ణింపబడెను. బాల, తురంగ క్రీడా ప్రసంగము కూడా కథాసరిత్సాగరమున కలదు.

## మృ గ యా వి నో ద ము

వేట రాజులందరికి ప్రాచీన కాలము నుండి వినోదసాధనముగా నుండెను. కథాసరిత్సాగరమున కూడా ప్రాచీన ధర్మ శాస్త్రములందు వలె వేట దుర్వ్యసనముగా నిందింపబడినది. ఉదయన మహారాజు మృగయావ్యసన పీడితుడయ్యెనని యౌగంధరాయణుడు చింతించెను నారదమహర్షి కూడా వేటను నిందించి దానిని పరిత్యజింపవలెనని ఉదయనునితో కోపముగా ఇట్లు చెప్పెను. పాండురాజు మృగయా వ్యసనముచే మరణించెను. ఈ వ్యసనముచే అనేక రాజులు వినాశమును పొందిరి. ఇది రాక్షసీ సమానమైనది. దీనిచే ఎవ్వరూ శుభమును పొందరు. అందువలన బ్రహ్మనష్టప్రదమైన మృ గ యా ప్రేమను పరిత్యజింపుమని చెప్పెను. కథాసరిత్సాగరమున వేట అతి సహజముగా వర్ణింపబడినది ఈ విలాస క్రీడలో ఉదయన మహారాజు హరితపత్ర వేషమును ధరించి బాణ ప్రయోగముచే మృగ వనమున వరాహాదులను సంహరించుచుండెను. చంపబడిన మృగ రక్తముచే రంజితమైన వనభూమి రాజసేవకొరకున్న వనకమలిని వలె కనబడెను హననోద్యుక్తుడైన రాజు సింహములను చూచి ఆనందభరితుడగు

చుండెను. వేటలో కుక్కలు. జాలములు, మృగాది బంధనము కొరకు ఉపయోగబడు చుండెను. చింతాపీడితులైన రాజులు మృగయా వినోదము కొరకు వనమునకు వెళ్ళుచుండిరి. శస్త్రాభ్యాసమునకు వేట అవశ్యకమని, అభ్యాసము లేనిచో యుద్ధములలో నవలురు కాజాలరని కథాసరిత్సాగరమున వర్ణింపబడినది.

గోష్ఠి :- కథాసరిత్సాగరమున మనో వినోదము కొరకు విభిన్న గోష్ఠులు నిర్దేశింపబడినవి. సంగీత, కథా, చిత్రాది విషయ సంబద్ధములైన అనేక గోష్ఠులు ఆయోజితము చేయబడెను. ఇవి బౌద్ధికములు, సాహిత్య సంబద్ధములుగా నుండెను 1) ద్యూత, హింసాది, కు కర్మ సమ్మిళితములైనవి. 2) లోకచిత్తము ననుసరించిన క్రీడామాత్ర ఫలముగలవి, అని గోష్ఠులు రెండు విధములు. పద, కావ్య, జల్ప, గీత, నృత్య, వాద్య, వీణాది, గోష్ఠులలో ప్రబుద్ధ నాగరకులు భాగస్వాములుగా నుండిరి. నృత్య, గీత, వాద్య, చిత్రకళలు, గోష్ఠులలో విద్యాగోష్ఠి సర్వోత్తమముగా నుండెను. వాత్స్యాయనుడు పంచవిధ సామూహిక గోష్ఠులను వర్ణించెను. ఘట నిబంధనము, గోష్ఠి సమవాయము, సమాపనకము, ఉద్యానగమనము, సమవయోమిత్రులతో క్రీడ అనునవి 5 రకములు సమాపనకమున నాగరికులందరూ కూడి మద్యపానము చేయుచుండిరి. కథాసరిత్సాగరమున పంచవిధములైన గోష్ఠులు వర్ణింపబడినవి.

గీత గోష్ఠి:- గాన నిపుణులందరూ గీత గోష్ఠిలో భాగస్వాములు, సాయంకాలమున దైవ మందిరములో నృత్య గీతములు జరుగుచుండెను. సూర్యప్రభుడను రాజునకు స్వాగతముగా నృత్య గీత గోష్ఠి ఏర్పాటుచేయబడెను. నరవాహనదత్తుడు గీతాది గోష్ఠుల చేమనో

వినోదమును పొందుచుండెను. రత్నప్రభాభవనమున కూడా సంగీత గోష్ఠి ఏర్పాటు చేయబడెను.

నృత్య గోష్ఠి :-

కథాసరిత్సాగరమున గీత, వాద్య నృత్యముల సహభావము వర్ణింపబడినది. గుణశర్మ నృత్య విద్యా నిపుణులుగా ఉండెను. అతడు మహాసేనుని సభలో నృత్యమును ప్రదర్శించుటకు లజ్జితుడై, రాజ ప్రేరితుడై పిమ్మట ఆంగిక నృత్యమును మాత్ర గోష్ఠిలో ప్రదర్శించెను. దీనిచే పురుషులుకూడా నృత్యకళా నిపుణులని తెలియుచున్నది. నృత్యము భావప్రధానము. నృత్తము తాళలయాశ్రయము. ఈ గ్రంథమున నృత్త, నృత్తములు సమానముగా వర్ణింపబడినవి. ఆంగిక నృత్యమునకు అనేక ఉదాహరణములు - ఈ గ్రంథమున కలవు. గోష్ఠులలో పాల్గొను నర్తకులు నర్తకీమణులు, ఆరుభేదములుగా విభజింపబడిరి. 1) నర్తకి 2) నటుడు 3) నర్తకుడు 4) వైతాళికుడు 5) చారణుడు 6) లాటిక.

"సురూపా తరుణీ శ్యామా తన్వీ మంథర పయోధర
వతీ నర్తకీ శ్రేష్ఠా" అని వర్ణింపబడినది.

వాద్య గోష్ఠి :- గోష్ఠులలో విద్యాగోష్ఠి కూడా ఒకటి. వాద్యముచేతనే గీతనృత్యములకు శోభ ఏర్పడును. ఈ గ్రంథమున నృత్యగీతములతో పాటు వాద్యముకూడా వర్ణింపబడినది. వాద్య కళ విభిన్న పద్ధతులలో ప్రదర్శింపబడుచుండెను.

కథాగోష్ఠి :-

కథల ద్వారా మనోరంజనము ప్రాచీనకాలము నుండి సుప్రసిద్ధముగా నున్నది. కథాసరిత్సాగర రచనయే మహారాణియైన

సూర్యమతి మనోవినోదము కొరకు సోమదేవునిచే రచింపబడినది."4 దాసులు రాజులకు కథలు చెప్పి మనో వినోదమును పొందుచుండిరి. సంగతకుడను కథకుడు సహస్రానీకుడను రాజును కథా శ్రవణముచే సంతోషపెట్టెను. రాజ సభలలో, గోష్ఠులలో కథావాచకులు ఉండిరి. మనోరంజన ఘట్టములను ఈర్ష్యా మద మోహాది భావ భరితములను, మనో రమాఖ్యానములను, విట చరిత్ర కథలను గోష్ఠులయందు విని పింపజేయుచుండిరి. ఈ దృష్టిచే కథా గోష్ఠులకు అధిక మహత్వ ముండెడిది. శ్రోతలు సన్మార్గానుష్ఠానమునకు నీతికథద్వారా ధర్మకథల ద్వారా ప్రేరేపింపబడుచుండిరి. వసంతకుడు, వాసవదత్తకు ప్రతిభో పేతమయిన కథను చెప్పెను. వాసవదత్తకూడా మనోరంజన కొరకు బ్రాహ్మణీ కథను చెప్పెను.

జల్ప గోష్ఠి :-

కల్పితకథలద్వారా మనోరంజన జల్పగోష్ఠి ఉప కల్పింప బడినది. జలగోష్ఠులలో అఖ్యానములు మనోరంజకములు.

కావ్యగోష్ఠి :-

కవి రచనలద్వారా మనోరంజనమును కావ్యగోష్ఠి అందురు. మనోరంజనమే కావ్య ప్రధాన లక్ష్యము. కథాసరిత్సాగరమున వాణీ ఉక్తి వైచిత్రి ఉపవర్ణింపబడినది. ఒక శ్లిష్ట పరిహాసము శాతవాహన రాజును విద్వాంసుని చేసెను. జలక్రీడా కాలమున రాణి మోదకము లతో కుట్టవలెనని చెప్పగా రాజు తద్విరుద్ధార్థమును గ్రహించి మోదక ములను తెప్పించి రాణిని కొట్ట నారంభించెను. దీనిచే రాణి పరిహసించినది.

పదగోష్ఠి :- పదగోష్ఠిలో వ్యాకరణతత్వములను గూర్చి తర్క వితర్కములు చేయబడును. రాజుదైనందిన క్రియలలో రాజకార్యములను

పూర్తి చేసుకొని ఆస్థాన మండపమున విభిన్న శాస్త్ర గోష్ఠు లను ప్రవర్తింపజేయుచుండెను. ఈ గోష్ఠులు మనోరంజనమునకు, జ్ఞానమునకు ఉపయోగింపబడుచుండెను.

వీణా గోష్ఠి :-

కథాసరిత్సాగరమున వీణావాదన గోష్ఠి సుప్రసిద్ధమయినది. ఉదయనుడు, తత్-పుత్రుడు వీణావాదన నిపుణులుగా వర్ణింపబడిరి. అతడు వీణను స్వీకరించి గంధర్వ లోకమునకు వెళ్ళెను. అచ్చట అందరి హస్తములలో వీణను చూచి తత్కారణమును తెలుసుకొనెను. రాజకుమారియైన గంధర్వదత్త వీణావాదనలో తనను జయించిన వారిని వివాహమాడెదనని చెప్పగా అచ్చటి వారందరూ వీణాభ్యాసము చేయుచుండిరని తెలియబడెను. గంధర్వదత్తకు, నరవాహనదత్తునకు వీణావాదనలో పోటీ ఏర్పాటు చేయబడెను. నరవాహనదత్తుడు వీణావాదనమున ఆమెను ఓడించి వివాహమాడెను. మృచ్ఛకటకమునకూడా చారుదత్తుడు వీణను ప్రశంసించెను. కథాసరిత్సాగర ఉదాహరణమునుబట్టి తత్కాలమున వీణ ప్రజలకు ప్రముఖ మనోరంజన సాధనముగా నుండెనని తెలియుచున్నది.

సమాపాన గోష్ఠి :-

కథాసరిత్సాగరమున ఆపాన గోష్ఠులు పేర్కొనబడినవి. మృగాంకదత్తుడను రాజు ఆపానగోష్ఠిలో భాగస్వామి. అందు వేశ్యలు కూడా భాగస్వామినులుగా ఉండవలెను. వేశ్యలు రసిక నాగరికులచే మద్యము త్రాగించి వారు కూడా త్రాగుచుండిరి. నరవాహనదత్తుడు మద్యపానముచే, సంగీత గోష్ఠిచే, సుందర హాస విలాసాదులచే ఆనం

దించుచుండెను. భారతదేశమున ప్రాచీన మధ్యపానము బలవీర్య తేజోత్సాహ వర్ధకముగా ఉండెను.

ఉత్సవములు :-

కథాసరిత్సాగర వర్ణితోత్సవములలో వసంతోత్సవము సర్వాధికమైనది. ఉపకోశ కుమారుడైన మంత్రిని వసంతోత్సవమున నీవు తప్పక రావలెనని ఆహ్వానించబడెను. వసంతోత్సవకాలమున ఉద్యాన భ్రమణము, జలక్రీడ వర్ణింపబడెను. వసంతోత్సవము ఉద్యానవనములందే ఏర్పాటు చేయబడుచుండెను. శ్రీదత్తుడు మిత్రులతో కలిసి వసంతోత్సవకాలమున ఉత్సవమును దర్శించుటకు ఉద్యానవనమునకు వెళ్ళెను. అందు నాగరిక స్త్రీలు నృత్య గీతాదులను నిర్వహించుచుండిరి. త్రివిక్రమరాజు ఉద్యాన క్రీడను నిర్వహించినట్లు ఇందు వర్ణింపబడినది. వసంతఋతు ప్రారంభమున ఉత్సవము ప్రారంభింపబడును. వసంతోత్సవము కొరకు కామ దేవాలయములుకూడా స్థాపింపబడెనని కన్యలు వివాహ దినమున కామ దేవాలయమునకు వెళ్ళి మన్మధ పూజను ఆచరించు చుండిరని కథాసరిత్సాగరము వలన తెలియుచున్నది. దీనిచే వసంతోత్సవము ప్రాచీన కాలము నుండి జరుగుచుండెనని విశ్వసింపవచ్చును.

యాత్రోత్సవము :-

ఆషాఢ శుక్ల చతుర్దశినాడు స్త్రీ పురుషులు సమానముగా యాత్రోత్సవములో పాల్గొనుచుండిరని కథాసరిత్సాగరము వలన తెలియుచున్నది.

మకరసంక్రాంతి :-

దీనినే మేష సంక్రాంతి అందురు కథాసరిత్సాగరకాలమున ప్రజలు మకర సంక్రాంతి దినమున పవిత్ర తీర్థస్నానమును ఆచ

రించుచుండిరని తెలియుచున్నది. గంగాస్నానమునకు విశేషమహత్వముండెను. ఇంద్రోత్సవము, ఉదకదానోత్సవము ఇందు వర్ణింపబడినవి.

జన్మోత్సవము :-

పుత్ర జన్మోత్సవము ప్రాచీనకాలము నుండి మహావైభవముతో జరుపబడుచున్నది. "నరవాహనదత్తుని జన్మోత్సవము మహావైభవముతో జరుపబడెను."[5] సంగీత, వాద్య ఘోష నభోమండలమునంటెను. సమస్త విద్యాధరులు రాజకుమారుని జన్మోత్సవమును సూచించిరని ఉత్ప్రేక్షింపబడినది. ఉన్నత భవనములలో హరిత పతాకములు ఎగురవేయబడును. ప్రతి గృహములో ప్రసన్నముగా వేశ్యానర్తన గానములు ప్రవర్తితము అయ్యెను. స్వర్గ సుందరీ మణులే ప్రసన్నలై భూలోకమున అవతరించిరని వర్ణింపబడెను. ఉత్సవమును పలక్ష్యముగాకొని రాజు దానముచేసిన వస్త్ర భూషణాదులను సర్వప్రజలు ఆనందోద్రేకములతో స్వీకరించి నగరమును వైభవోపేతముగా అలంకరించిరి. వివిధాలంకార మండితలయిన స్త్రీలచే అంతఃపురము స్వర్గస్త్రీ సమావేశమువలె నుండెను. వారిచేష్టలు నృత్యమయములుగా, వచనములు పూర్ణపాత్రమయములుగా, వ్యవహారము త్యాగమయముగా, స్వరము వాద్యమయముగా ఉండెను. ఇట్లే కనక వర్షుని పుత్రోత్సవముకూడా వర్ణింపబడినది.

వివాహ మహోత్సవము :-

జీవన ప్రముఖోత్సవములలో వివాహమహోత్సవము ఒకటి. ఈ ఉత్సవమున సంబంధరులందరూ హల్లోల్లాసపూరితులై యుందురు. వాసవదత్తోదయనుల మాంగలిక వివాహమున నగర స్త్రీలు మంగళ

గానమును ఆచరించిరి. మయూరములవలె నర్తించిరి. రాజ దర్శ నార్థము ఉన్నత భవనములను ఆధిరోహించి స్త్రీలు స్వముఖ కమల కాంతిని ఆకాశమునందంతటా వ్యాపింపజేసిరి. ఇట్లె పద్మావతీ వివాహో త్సవమున కూడా రాజు పురమున ప్రవేశించి పిమ్మట రాజ భవనము నకు వెళ్లి సౌభాగ్యవతీ పూర్ణమైన కౌతుకాగారమును దర్శించెను. మదన మంజుకా నరవాహనదత్తుల వివాహోత్సవమున మదనమంజుక మాత కళింగసేన తన పుత్రికను వివాహ వస్త్రాలంకారములతో అలంక రింపజేసెను. రాజ్యమునందంతటా వివాహోత్సవము ప్రవర్తింపజేయ బడెను. నరవాహనదత్తుడు శరత్కాల చంద్రుడువలె దర్శనమిచ్చెను. అతడు మంగళ వాద్య ఘోషోపేతుడై వివాహ మండపమున ప్రవే శించెను. దీనిచే రాజుల వివాహము వైయక్తికముగా కాక సామాజి కోత్సవ రూపముగా పరిణమించుచుండెనని తెలియుచున్నది. సర్వ ప్రజలు ఉల్లాసముతో ఉత్సవమున పాల్గొనుచుండిరి. వివాహోత్సవ మున దుర్గాపూజ కూడా ఆచరింపబడినట్లు కథాసరిత్సాగరమున వర్ణింప బడినది.

———

# పంచమ ప్రకరణము

## 5. కథాసరిత్సాగర - బృహత్కథా మంజరీ, శ్లోకసంగ్రహములలో సమాన కథలు - భిన్న కథలు

కథాపీఠ లంబకము :-

పుష్పదంత మాల్యవంతుల శాప వృత్తాంతము, దక్షయజ్ఞము, వ్యాడీంద్రదత్తుల వృత్తాంతము, వరరుచి వృత్తాంతము. ఉపకోశకథ, శకటాల వృత్తాంతము, మత్స్యహాసకథ, ఆదిత్యవర్మకథ, యోగనంద కథ, కాణభూతి వృత్తాంతము, గుణాఢ్యకథ, పుష్పదంత మాల్యవంతుల్ల నామసార్థక్య కథ అను ఈ కథావిషయములు అన్నియు కథాసరిత్సా గరములో బృహత్కథామంజరిలో సమానముగా నున్నవి. కానీ సోమ దేవుడు కథాసరిత్సాగరములో పై వృత్తాంతములను విస్తృతముగా వర్ణించెను. క్షేమేంద్రుడు బృహత్కథా మంజరిలో వీటిని అతి సంక్షే పముగానే చెప్పెను.

ఈ క్రింది విషయములను కథాసరిత్సాగరమున సోమదేవుడు నూతనముగా వివరించెను. జ్వాలాలింగకథ, బ్రహ్మదత్తకథ, శాత వాహన పూర్వజన్మ వృత్తాంతము, దేవీకృత ఉద్యాన కథ, సామవేది మూఢునికథ, మూషికశ్రేష్ఠికథ, రాక్షసుడు - గంగాదేవికథ, పాణిని కథ, శర్వవర్మకు స్వామిప్రసన్నదైవ విధానము, శిబిచక్రవర్తికథ, దేవదత్తునకు పంచశిఖుడు తోడ్పడుట.

కథాముఖ లంబకము :-

శ్రీదత్తకథ, లోహజంఘకథ, దేవస్మిత కథ, శతానీక మృగా వతుల కథ, శక్తిమతి కథ, ఖాలవినష్టకుని కథ, యంత్రగజకథ, అను

కథలు కథాసరిత్సాగరములో బృహత్కథా మంజరిలో సమానముగా నున్నవి. కానీ సోమదేవుడు వీటిని విపులముగా వర్ణించగా క్షేమేంద్రుడు అతి సంక్షిప్తముగా పేర్కొనెను.

వాసవదత్తా స్వప్నము. పతి విరోధిని ఘట్టములు కథా సరిత్సాగరమున నూతనముగా వర్ణింపబడినవి.

రురు, డుండుభ కథ, బంధుమతీ పరిణయ కథ, బ్రహ్మరాక్షసుడు యౌగంధరాయణునకు మిత్రుడగుట, చండ మహాసేన ప్రభావ కథ, రాక్షస శాప విమోచనము అను కథా ఘట్టములను సోమదేవుడు కథాసరిత్సాగరమున నూతనముగా కల్పించెను.

3. లావణక లంబకము :-

మహాసేన ప్రభువుకథ, ఉన్మాదినీ దేవసేనులకథ, వహ్లికుని కథ, పుణ్యసేనునికథ, తిలోత్తమకథ, పద్మావతీ వివాహము, ఊర్వశీ పురూరవుల కథ, అహితసేనుని కథ, సోమప్రభ - గృహచంద్రులకథ, అహల్యావృత్తాంతము, విదూషకుని కథ, హలభూతి కథ (సోమదత్తుని కథ) కాళరాత్రి కథ అను కథలు కథాసరిత్సాగరములో, బృహత్కథా మంజరిలో సమానములైననూ సోమదేవుడు విస్తృతముగా వర్ణింపగా క్షేమేంద్రుడు పై కథాఘట్టములను అతి సంక్షేపముగా వర్ణించెను.

వైశ్యకన్యా మానవ్రతులకథ, నిధి లాభ కథ, దేవదాసు కథ, కుమారసంభవ కథ, అనుకథలు కథాసరిత్సాగరములో క్రొత్తగా విపులముగా వర్ణింపబడినవి.

లావణక లంబకము నందలి పరివ్రాటుకథ మాత్రము బృహత్కథా మంజరిలో క్రొత్తది.

4. నరవాహనదత్త జననము :-

పింగళికా వృత్తాంతము, దేవదత్త కథ, వాసవదత్త గర్భ దోహదము, జీమూతవాహనకథ, సింహ పరాక్రమ కథ, నరవాహన దత్త జననము, వాసవదత్త స్వప్నము, మంత్రి రాకుమారుల జననము అను కథాఘట్టములు బృహత్కథా మంజరిలో కథాసరిత్సాగరములో సమానములు. ఇవి కథాసరిత్సాగరములో విస్తృతముగా, బృహత్కథా మంజరిలో సంక్షిప్తముగా వర్ణింపబడినవి.

5. చతుర్దారికా లంబకము :-

శక్తివేగకథ, శివమాధవకథ, హరస్వామికథ, అశోకదత్త విజయదత్తులకథ, దేవదత్త కథలు సోమదేవుడు, క్షేమేంద్రుడు సమానముగా వర్ణించిరి. కాని సోమదేవుడు పై కథలను విస్తృతముగా, క్షేమేంద్రుడు సంక్షిప్తముగా వర్ణించిరి.

6. మదన మంజుకా లంబకము :-

విప్రచండాలకథ, సులోచనకథ, రాజపుత్ర-వైశ్య పుత్రుల కథ, పిశాచదుర్గ్రహ కథ, కీర్తిసేనకథ, తేజస్వితకథ, సపత్నీకుట్రకథ, శ్రుతసేనునికథ, ఉన్మాదినీ దేవసేనులకథ, నకుల ఉలూక మార్జాల మూషకకథ, వణిక్సాధ్వీకథ, మదన మంజుకా జననము, నరవాహన దత్తుడు యువరాజగుట అను విషయములు కథా సరిత్సాగరములో, బృహత్కథామంజరిలో వర్ణింపబడినవి, సోమదేవుడు వీటిని విస్తృతముగా క్షేమేంద్రుడు సంక్షిప్తముగా వర్ణించిరి.

తైలపాత్ర వైశ్య కుమారునికథ, సురభిదత్తకథ, తారాదత్తకథ, సప్తద్విజకథ, విప్రవీరకథ, కృతపుత్రికాకథ, యతికథ,

మాయాజోస్యుని కథ, ఉష కథ, దుశ్శీలుని కథ, ధూర్తనాపిత కథ, ప్రసేనజిత్తుకథ, (బుద్ధిబల ప్రశస్త కథ) మానసవేగ కథ, కులటల ప్రవర్తన కథలు కథాసరిత్సాగరమున నూతనముగా వర్ణింపబడినవి.

రత్నదత్తాఖ్యాయిక, క్షమావధాన కథ, వైరాగ్యావధానకథ, హరిశర్మకథ, మూర్ఖకథ, పతివ్రతకథ, యక్షకథ, శత్రుఘ్నకథ అను ఈ కథలు, బృహత్కథామంజరిలో నూతనముగా వర్ణింపబడినవి.

7. రత్నప్రభాలంబకము :-

సత్వవంతునికథ, రత్నప్రభా వివాహము, రూపశిఖశృంగభుజునికథ, కర్పూరకథ, ఇందీవరసేనకథ, మదనమాలకథ, అను కథలు కథాసరిత్సాగరములో బృహత్కథా మంజరిలో సోమదేవుడు విస్తృతముగా వర్ణింపబడినను క్షేమేంద్రుడు వీటిని సంక్షిప్తముగా వర్ణించిరి.

విక్రమతుంగునికథ, రత్నాధిపతి చపలభార్యలకథ, రత్నాధిపుని భార్య-రాజదత్తకథ, అనురాగపర కథ, శృంగోత్పాదినికథ, మర్కట సోమస్వామికథ, వృషభ భవశర్మకథ, మదనమాలకథ, గుణవరాదేవికథ, మరుభూతిసురాపానకథ, వజ్రంగిసోదరులకథ, మానవర కథ అను కథలు కథాసరిత్సాగరమున నూతనముగా వర్ణింపబడినది.

మహాసత్వకథ, శీలవతికథ, నిశ్చయదత్తకథ, వజ్రధరకథ అర్థలోభకథ అను కథలు బృహత్కథా మంజరిలో నూతనముగా వర్ణింపబడినవి.

8. సూర్యప్రభ లంబకము :-

వజ్రప్రభుని వృత్తాంతము, సూర్యప్రభ వృత్తాంతము, చంద్రప్రభునికి ఇంద్రుని సందేశము, చంద్రప్రభువు సునీథుని శరీరములో ప్రవేశించుట, కాలునికథ, సునీథుని తల్లిని దర్శించుట, సునీథుడు బలిని దర్శించుట, గుణశర్మకథ, అను విషయములు బృహత్కథామంజరిలో, కథాసరిత్సాగరములో సమానముగా వర్ణింపబడినను వీటిని సోమదేవుడు విస్తృతముగా క్షేమేంద్రుడు సంక్షిప్తముగా వివరించిరి.

కళావతి ఆగమనము, మహల్లిక ఆగమనము, సూర్యప్రభువు ప్రహ్లాదుని దర్శించుట, మహల్లికా వివాహము, కళావతి ప్రముఖుల కళ్యాణము, యుద్ధవర్ణనము అనువిషయములు కథాసరిత్సాగరములో నూతనములు.

సూర్యప్రభుని దివ్య తూణీరప్రాప్తి, ధనుఃప్రాప్తి, ప్రభాసాదుల దివ్యధనుఃప్రాప్తి, సూర్యప్రభుడు మోహినీ పరివర్తినులను సాధించుట, శ్రుతశర్మద్యూతము, రణదీక్ష, విలాసినీ సమాగమము, ఓషధీసాధనము, ప్రభాసుని పూర్వవృత్తాంతము, సూర్యప్రభ విజయము, కామచూడామణి వివాహము అను విషయములు బృహత్కథామంజరిలో అతి సంక్షేపముగా వర్ణింపబడినవి.

9. అలంకారవతీ లంబకము :-

రామకథ, అనంగరతి వృత్తాంతము, కార్పటికునికథ, వీరవరునికథ, సముద్రశూరునికథ, దమయంతికథ, అను నీకథలు, సోమదేవుడు, క్షేమేంద్రుడు సమానముగా వర్ణించిరి. కాని ఇవి కథా స,

త్సాగరములో విస్తృతముగా, బృహత్కథా మంజరిలో సంక్షేపముగా కనవడును.

పృథ్వీరూపుడను రాజుకథ, హరశర్మ కథ, ప్రలంబ బాహుపు కథ, నలుగురు అప్సరసలకథ, రుద్రశ్రేష్ఠి కథ, సమరతుంగుని కథ, చమరవాల మహారాజు కథ, అర్థధర్మ-భోగవర్మలకథ, చిరదాత ప్రసంగుడు, కనకవర్షుని కథ, మహీపాలుని కథ, చక్రశ్రేష్ఠి కథ, మహాతపుని కథ, త్రిభువనరాజు కథ, అను కథలు, కథాసరిత్సాగరమున నూతనముగా వర్ణింపబడినవి.

రూపలత కథ, నారాయణ దర్శనకథ, అంతఖ్యాయిక, అనురాఖ్యాయిక, లుబ్ధాఖ్యాయిక, హిరణ్యవర్ణాఖ్యాయిక, బంధుమతికథ అను కథలు బృహత్కథా మంజరిలో నూతనముగా వర్ణింపబడినవి,

10. శక్తియశోలంబకము :-

భద్రఘటకథ, ఆలజాల కథ, (మర్కటకథ) కుముదికా కథ, (వేశ్యాకథ), చంద్రశ్రీకథ (స్త్రీవృత్తము), దేవదాసుకథ, వజ్రసారుని కథ, సింహవృషభకథ, మర్కటలోహ కీలాకర్షణకథ, శృగాలభేరీ కథ, ఒకపీతకథ, సింహ-శశకథ, మత్కునకత, యూకాఖ్యాయిక (అరుపుక పిట్టకథ) కంబుగ్రీవ కథ, మత్స్యత్రయ కథ, సూచీముఖ కథ, ధర్మబుద్ధి - దుష్టబుద్ధి (వణిక్ పుత్ర కథాఖ్యాయిక) ఒక సైపుణ్య కథ, లోహతుల కద, చిత్రగ్రీవ కథ, కాక-మూషికకథ, శృంగారకథ, (చతురాఖ్యాయిక) నాగకథ, నాపితార్థికథ కాక-ఉలూక కథ, గార్ధభ కథ, శశసైపుణ్య కథ, శశ - కపింజల కథ (మార్జాలకథ) చోరవర్తక కథ, చోరరాక్షస కథ, మూషిక ఋషి కథ• వృద్ధ సర్ప-భేరకకథ, యశోధర లక్ష్మీధరులకథ, మూఢులకథలు, అను

కథలు, కథాసరిత్సాగరమున, బృహత్కథా మంజరిలో సమానములు. కానీ కథాసరిత్సాగరములో ఇవి విస్తృతముగా, బృహత్కథామంజరిలో సంక్షేపముగా వున్నవి.

ధారికరత్నదత్తుల కథ, కళ్యాణవతి కథ, శుక-అత్మకథ, మకరందిక కథ, "శాస్త్రగంజ" వృత్తాంతము, సోమప్రభ వృత్తాంతము, మనోరథప్రిభ వృత్తాంతము, రశ్మిమంతునిచరిత్ర విద్యాధరకథ, అగ్రదాహకకథ, తిలరక్షకకథ, నాసికారోపణకథ, అగ్నికుంభకథ, పశుపాలకరథ; ఆభరణమూర్ఖకథ, తూలికాసిద్ధికథ, ఖర్జూరచేదకకథ, నిధిపరీక్షకకథ, లవణభక్షకకత, గోపాలకత, నాపితకథ. (బట్టతలవాడు) చిత్రాంగకథ, ఈర్ష్యాపరకత, తైలముగ్ధకథ. అస్థిముగ్ధకత, చండాలకన్యకథ, తిలకార్షికకథ, మూర్ఖప్రభుకథ. మిత్రద్వయకథ, జలభీతకథ, దాతృమూఢకథ. బ్రహ్మచారిపుత్రికథ, గణకకథ, కోపదారికత, కన్యావర్ధయితకథ, అర్ధపణకత, అభిజ్ఞానకర్తకథ, మాంసవినిమయకత పుత్రాంతర కాంక్షిణీకత, అమలకఫల కథ, సోదరద్వయకథ, నకించిన్మార్గణకత, అసంతుష్టికత, సువర్ణముగ్ధకథ, మహామూఢకత, అపూపికముగ్ధకథ, మహిష ముగ్ధకథ, చక్రవాకబుద్ధి కత, వైద్యవామన కత, గాంధర్వ పరితోషికకథ మూర్ఖశిష్యద్వయకత, శిరోద్వయసర్ప కథ, తండులభక్షకకత, ధనదేవగృహిణీవృత్తాంతము, బోధిసత్వకథ, మృగాంకలేఖాహిగణ్యాక్షులకత. పాటలీపుత్ర స్త్రీల వృత్తాంతము, ఏకాదశమారణికథ, హేమప్రభ లక్ష్మీసేనులకథ. కుంభరసేవకునికథ అను నీకథలు కథాసరిత్సాగరమున నూతనముగా విస్తృతముగా వర్ణింపబడినవి.

సుమానసకథ (కాదంబరి), చంద్రచాఖ్యాయిక, ఉష్ట్రాఖ్యాయిక, కచ్ఛపము మత్స్యటిట్టిభ కథ, మృగాఖ్యాయిక, ద్వైతాఖ్యాయిక

రథకారాఖ్యాయిక, హింసాఖ్యాయిక, సత్యాఖ్యాయిక, వానరశిశుమార కత, ఘటకత, లక్ష్మిసేన కతలను కతలు బృహత్కథా మంజరిలో నూతనముగా వర్ణింపబడినవి.

11. వేలాలంబకము :

చంద్రసారకత, జినేంద్రసేనా సమాగమకత అను రెండు కతలు బృహత్కథా మంజరిలో, కథాసరిత్సాగరములో సమానములు. కాని వీటిని సోమదేవుడు విస్తృతముగా, క్షేమేంద్రుడు సంక్షిప్తముగా వర్ణించిరి.

12. శశాంకవతీ లంబకము :-

శృగాలగజకత,దివ్యకన్యకత.లలితలోచన జన్మకథ,లలితలోచనా నరవాహనుల వియోగము. మృగాంకదత్తకత (మంత్రగుప్త కత) వినయవతీ పుష్కరాక్షుల కత, శ్రుతధి వృత్తాంతము, పారవతనాగుడు, మృంగాక దత్తాదులను శపించుట, చండకేతనకథ (ప్రచండశక్తి) భీమీ పరాక్రమకథ. శీలధర, సత్యధరులకథ, హంసావళీ కమలాకరుల కథ, గుణాకరునికథ, వినతీమతి కథ, దాన, శీల, క్షమా, ధైర్య, ధ్యాన, ప్రజ్ఞాపారమిత కథలు, విచిత్రకథకునికథ, శ్రీదర్శనకథ, భూనందకథ, శంఖదత్త మత్స్యనిగరణ కథ, 25 భేతాళకథలు అను కథలు బృహత్కథా మంజరిలో, కథాసరిత్సాగరములో సమానములు, కానీ, వీటిని సోమదేవుడు, విస్తృతముగా, క్షేమేంద్రుడు సంక్షిప్త ముగా వర్ణించిరి.

అనంగలీలా భద్రబాహుకథ, విద్యుల్లేఖా ధర్మసేనులకథ, మృగాంకదత్త ఉజ్జయినీ గమనము, రసాయన నీరాశనుల వృత్తాంతము, మృగాంకదత్తుడు కిరాతరాజును కలియుట, విమలబుద్ధి కత,

కనక మంజరి మోసము వరాహబోధి సత్త్వుని కథ, వినీతమతి బోధిసత్వ స్వీకారము, బ్రాహ్మణీ రజకకథ, అక్షక్షపణకునికథ, పవిత్రధరునికథ, వారణకథ, వ్యాఘ్రసేనునికథ సుందరసేనునికథ అను కథలు కథా సరిత్సాగరము నూతనముగా, విస్తృతముగా వర్ణింపబడినవి.

మందారవతికథ, కుసుమాయుకథ, కేసటకథ అను కథలు బృహత్కథా మంజరిలో నూతనముగా వర్ణింపబడినవి.

3. మదిరావతీ లంబకము :-

విప్రకుమార వృత్తాంతము, విప్రకుమారుని కథలు, బృహత్కథా మంజరిలో, కథాసరిత్సాగరములో సమానములయిననూ వీటిని సోమదేవుడు విస్తృతముగా, క్షేమేంద్రుడు సంక్షిప్తముగా వర్ణించిరి.

14. పంచ లంబకము :-

వేగవతి వృత్తాంతము, గంధర్వదత్త కథ. ప్రభావతికథ గోముఖాని వృత్తాంతము, మరుభూతి, హరిశిఖుల వృత్తాంతములు, పంచకన్యల కథ, అను కథలు కథాసరిత్సాగరములో బృహత్కథా మంజరిలో సమానము లయిననునూ వీటిని సోమదేవుడు విస్తృతముగా క్షేమేంద్రుడు సంక్షిప్తముగా వర్ణించిరి.

బాల-మోదక వృత్తాంతము, మందర దేవ వృత్తాంతము, రత్నసిద్ధివృత్తాంతము, దేవమాయునితో యుద్ధము అను కథలు కథా సరిత్సాగరమున నూతనముగా, విస్తృతముగా వర్ణింపబడినవి.

సావిత్రీకథ, భగీరథయశ కథ, అజినావతికథ అను కథలు ఈ లంబకమున బృహత్కథా మంజరిలో నూతనములు.

15. మహాభిషేక లంబకము :- త్రిశీర్షగృహకథ కథాసరిత్సాగరములో నూతనముగా వర్ణింపబడినది.

16. సురతమంజరీ లంబకము :-

మహాసేనుని నిర్యాణము, వత్సరాజాదుల మహాప్రస్థానము, కురంగికథ, సురతమంజరి పూర్వకథ, తారావలోక వృత్తాంతము, కథాసరిత్సాగరములో బృహత్కథామంజరిలో సమానములైనమా వీటిని సోమదేవుడు విస్తృతముగా, క్షేమేంద్రుడు సంక్షిప్తముగా వర్ణించిరి.

భృత్యకుని చర్య, భవ్యకునిచర్య అంగారవతి చరిత్ర, సుప్రహారునికథ, వాసవదత్తకథ కథాసరిత్సాగరమున విశాలముగా నూతనముగా వర్ణింపబడినవి.

ధీవరకథ, చౌరాఖ్యాయిక, క్షైపత్రిక కథ అను కథలు బృహత్కథా మంజరిలో నూతనముగా వర్ణింపబడినవి.

17. పద్మావతీ లంబకము :-

బ్రహ్మదత్త కథ, విద్యుద్ధ్వజ కథ, ముక్తాఫల కేతు కథ, పద్మావతీ వివాహ కథ, స్వర్ణహంసల వృత్తాంతము, పింగేశ్వర-గృహేశ్వరుల కథ, తపోధనముని ఆగమనము అను కథలు సోమదేవ కథాసరిత్సాగరములో క్షేమేంద్రుని బృహత్కథా మంజరిలో సమానములయిననూ వీటిని సోమదేవుడు విస్తృతముగా క్షేమేంద్రుడు సంక్షిప్తముగా వర్ణించిరి.

18. విషమశీల లంబకము :-

విక్రమాదిత్యునికథ, అనంగరాజుని కథ, గజసూకర శాపవిముక్తి, కీసటకథ, మూలదేవకథ, ఖండకాపాలికకథ, యక్షిణి సమాగమ కథ, కన్యాచతుష్టయ ప్రాప్తి కథ, బంగారుజింకకథ అనుకథలు కథాసరిత్సాగరములో బృహత్కథా మంజరిలో సమానములు. వీటిని సోమదేవుడు విస్తృతముగా క్షేమేంద్రుడు సంక్షిప్తముగా వర్ణించిరి.

మదనమంజరికథ, మలయవతికథ, కళింగసేనకథ, కార్పటికునికథ, ఏకాకికేసరికథ, గుణవతికథ, ధనదత్తునికథ, కందర్పునికథ, కుసుమాయుధునికథ, చంద్రస్వామికథ, దేవస్వామికథ, అగ్నిశర్మకథ, పతివ్రతకథ అను కథలు కథాసరిత్సాగరమున విస్తృతముగా నూతనముగా వర్ణింపబడినవి.

క్షేమేంద్రదృష్టి, నైతికదృష్టి. అతడు గ్రంథారంభముననే "కావ్యే కింతు సతాం చమత్కృతి కృతః సూక్తిప్రబంధః స్ఫుటమ్" "తీక్ష్ణాగ్రారి ఝటితి శ్రుతి ప్రణయినః కాంతా కటాక్షా ఇవ॥" అని పేర్కొని తన కావ్యమున సూక్తులకు ప్రాధాన్యముండునని సూచించెను. తదనుగుణముగా బృహత్కథామంజరిలో సుమారు 150 కథలను ఒక్కొక్క సూక్తికి ఉదాహరణముగా వర్ణించెను. కథాకథన సందర్భమున పాత్రలచే కానీ, స్వయముగా కానీ ఒకసూక్తిని చెప్పి లేదా చెప్పించి కథలను ఉదాహరణప్రాయముగా వర్ణించి యున్నాడు. అందువలన బృహత్కథా మంజరిని కథా కావ్యమనియే గాక సూక్తి రత్నాకర గ్రంథమని చెప్పవచ్చును.

సోమదేవుడు కావ్య సౌందర్య పోషణ దృష్టితో రసపోషణ దృష్టితో అలంకారికముగా, రసాత్మకముగా అనేక వినోదాత్మకములైన అద్భుత రసప్రవాహములయిన చమత్కార జనకకథలను వర్ణించుచూ ఆ కథల అనంతరము తత్సారముగా అనేక సూక్తులను ప్రతిపాదించెను క్షేమేంద్రుని కావ్యములో సూక్తి కొరకు కథలు ప్రవేశపెట్టబడగా సోమదేవ కావ్యములో కథాసారముగా చివరసూక్తి వాక్యములు ప్రవేశపెట్టబడినని, సోమదేవ కావ్యములో సుమారు 600 సూక్తులు కలవు. సోమదేవునకు మూర్ఖకథలన్న చాలా యిష్టము. అందువలన కథాసరిత్సాగరములో అనేక మూర్ఖకథలను ఇతడు ప్రవేశపెట్టెను. ఇట్టి వినోద

విజ్ఞాన ప్రదముగా పశుపక్ష్యాది కథలు, వేశ్యల కథలు, పతివ్రతల కథలు, ధూర్తుల కథలు వణిజుల కథలు, చమత్కారముగా రసవత్తరముగా వర్ణింపబడినవి. ఇందలి ఉపకథలు చాలావరకు ప్రధానకథకు ఔచిత్యముగా అనుబంధింపబడినవి. ప్రధానకథయైన నరవాహనదత్త కథ రెండు కావ్యములలో సమానమైననూ సందర్భానుసారముగా క్షేమేంద్ర సోమదేవులు ఉపకథలలో సమానకథలతోపాటు కొన్ని భిన్న కథలను కూడా పైన పేర్కొన్న రీతిగా తమ కావ్యములలో ప్రవేశ పెట్టిరి.

---

5-1 కథాసరిత్సాగర-బృహత్కథా మంజరీ-శ్లోక సంగ్రహ కథల తులనాత్మక పరిశీలనమున అభివ్యక్తములగు ప్రధానాంశములు

ఇందలి పదునెనిమిది లంబకములలో ద్వితీయ, తృతీయ, చతుర్థ లంబకములు ఒక వర్గమునకు చెందినవి. పంచమ అష్టమ లంబకములు అన్య లంబక సంబంధ రహితములై విద్యాధర కథాఘటితములుగా నున్నవి. ఆరవ లంబకము నూతనారంభము కలదై ఉపోద్ఘాత రహితముగా నున్నది. 7,9,10,11, లంబకములు కేవలము విషయకములు కథా సంబంధ రహితములు. 12, 13 లంబకములు పరస్పర సంబద్ధములు. కానీ ఇవి 14, 15, 17, 18 లంబకముల తర్వాత వినివేశింపదగినవి ఎందువలననగా పరస్పర సంబంధ విషయములు 14, 15, 17, 18 లంబకములలో కలవు. 16వ లంబకము రెండుగా

విభజింపబడి, వినివేశింపదగినది. ఇందలి ప్రధాన భాగము ఆరవ లంబకమునకు ఉపోద్ఘాత రూపముగా నున్నది. రెండవ భాగము స్వతంత్రమై దినితో సంబంధములేనిది.

సోమదేవుని కథాసరిత్సాగరము అనేక విధములుగా అనేకులచే లంబక క్రమములలో కథాత్మస్వరూపములలో పరివర్తనము చేయబడి ఉన్నది.

బృహత్కథా మంజరి - కథాసరిత్సాగర లంబకథా
తులనాత్మక పరిశీలనము

మొదట 5 లంబకములు రెండుచోట్ల సమానములు. తరువాత భేదము కనవడును. 5, 6 అంబకములు మదనమంజుక యొక్క అదృశ్యతతో సమాప్తిపొందిన వేలా లంబకముచే అనుసృతములైనవి కథాసరిత్సాగరమున ఈ విషయము చతుర్దశ లంబకారంభమున వినివేశింపబడినది. ఇట్లు క్షేమేంద్రుని లంబక క్రమము సోమదేవుని లంబకక్రమముకంటె సమీచీనమైనది. వేలా లంబకము తర్వాత 12, 18, 13, 17 లంబకములు సమీచీనక్రమములో వినివేశింపబడినవి. సోమదేవుని గ్రంథమున ఈ ఉచిత క్రమములేదు. పిమ్మట చతుర్దశ లంబకము ఆరంభమైనది. ప్రారంభ సంఘటనచేతనే ఇది వేలాలంబక అంతిమ స్థానమున పరివర్తింప చేయుబడినది.

సోమదేవుడు, సముచితమయిన క్షేమేంద్ర - బృహత్కథా మంజరి లంబకక్రమమును అనుసరింప కుండుటకు గల సమాధానమిది. సోమదేవుడు తన దృష్టిలో ఎచ్చట స్వల్పదోషముండునో ఆ మార్గముండునో ఆ మార్గమును అనుసరించెనని తెలియుచున్నది.

క్షేమేంద్రుడు మదనమంజుకయొక్క అదృశ్యతా క్రమమును అనుస రించి వర్గీకరణము చేసెను. అయినప్పటికినీ ఆ వర్గీకరణ చక్కగ నే యున్నది. కానీ గ్రంథాంతమున ఆ వర్గీకరణముచే గొప్పనష్టమేర్పడి నది. గ్రంథాంతము అస్తవ్యస్థముగా తయారయినది. ఆ అవ్యవస్థ స్థితి పరిశీలనమువలన క్షేమేంద్ర కృత వర్గీకరణమే సమీచీనము కాదని చెప్పవచ్చును. అందువలన కాశ్మీరమున తనకు లభించిన గ్రంథ వర్గీకరణమునే క్షేమేంద్రుడు అనుసరించెను. సోమదేవుడు గ్రంథ ము పరస్పర సంబంధ రహితమని తెలుసుకొని వస్త్వైక్యఘటిత లంబ కాను సంధానము కొరకు ప్రయత్నించెను. 14వ లంబకకథ, 15-వ లంబకకథతో అనుసంధాన సంబంధసహితమైయున్నది. క్షేమేంద్రుడు పంచలంబకమును ప్రవేశపెట్టి యితర మూడు లంబకములతో విచ్ఛేద మును కలిగించి అనేక విశాల కల్పనలను చెప్పి కాలానుగుణ్యతను అగతికముగా వినివేశించెను.

నరవాహనదత్తుడు ఋషుల నుద్దేశించి తన వీరప్రణయగాథను చెప్పుట క్షేమేంద్రుని దృష్టిపథములో చక్కగా పడెను. అందువలన ఆ సంఘటనా సమగ్రతను పరిత్యజించెను.

ఈ కారణము లన్నింటిచే "లకోటే" కశ్మీర బృహత్కథ సంక లన రూపమైనదని అది మూల బృహత్కథ కంటె భిన్నమయినదని చెప్పెను. నరవాహనదత్తుని సాహస కృత్యములను కాశ్మీర దేశీయ కథాసంకలన కర్తలు ఒకే చోట పునర్నిర్మాణము చేయుటకు ప్రయ త్నము చేయలేదు. వారు సంకలిత కథలన్నింటినీ ఒక ప్రధాన మహా కథలో వినివేశము చేయుటకు నరవాహనదత్త కథను ఉపయో గించుకొనిరి. అనేక ప్రసిద్ధకథలు విశదముగా వివరింపబడినవి. నర వాహనదత్తుని అనేక ప్రణయ వీర సాహస కృత్యములను సంక్షేపింప

వచ్చును లేదా పరివర్తనము చేయవచ్చునని వారి మతము. తత్ప్రతి ఫలముగా అనేక లాభ నష్టములు ఏర్పడినవి. నరవాహనదత్తుని కథ అనేక కష్టనష్టములచే దోషభూయిష్ఠమయ్యెను. కానీ అనేక ఉపకథా ప్రవేశము వలన భారతదేశమునకు చెందిన అనేక జానపద విశ్వాచారములు చారిత్రిక గ్రంథములకంటె ఇచ్చట సమగ్రముగా లభించుచున్నవి.

పంచతంత్ర, వేతాళ, బేతాళ వింశతి గ్రంధములు కర్తృత్వముచే భిన్న గ్రంథములుగా లభించుచున్నవి. పండితులు అనేక కర్తృక, పంచతంత్ర, వేలా పంచ వింశతికథలను అంగీకరింపజాలకున్నారు. సోమదేవుడు యథామూలముగా భాషా భేదముచే గ్రంధ విస్తర సంక్షేపములచే ఔచిత్యాన్వితముగా కావ్యధర్మమును, కథారసమును పాటించి నానాకథాజాల స్మృతి సౌకర్యసిద్ధికొరకు కథాసరిత్సాగరమును రచించుచున్నారని గ్రంధారంభముననే ప్రకటించెను. మూల బృహత్కథలో, కథా సరిత్సాగర కథలో భేదములేదు. లంబకములు పరివర్తనావశ్యకత వలన సోమదేవునిచే పరివర్తింపబడెనని "లకోటే" పేర్కొనెను - 14, 15 లంబకములు సముచిత క్రమములోనే యున్నవి. 16 వ లంబకము వరకు సునిశిత పరిశీలనముచే ఈ ఔచిత్యక్రమము తెలియబడుచున్నది.

బృహత్కథా శ్లోక సంగ్రహమును పరిశీలించినచో పూర్వోక్త లంబక క్రమ విమర్శనము సంధ్యమైనదని యెవరికైనను తోచును. సహేతుకమైన స్పష్ట క్రమము శ్లోక సంగ్రహమున కలదు. ఇందలి పాత్రలు భిన్నమార్గములతో పరిష్కరింపబడినవి. నాయక వీర కృత్యములు కూడా భిన్నములే. కాశ్మీర గ్రంథములందు కనబడు మదన మంజుకా వివాహ సంబంధములయిన అనపుచిత్య విషయములు

కలింగసేన ప్రణయ వ్యవహారము బృహత్కథా శ్లోక సంగ్రహమున లేవు. వారి సాంఘిక స్థితి నీచస్థానమున నుండెను. కానీ యిది కథా నిర్మాణమునకు బలమును చేకూర్చును.

వేగవతి ఉన్నత కులంలో జన్మించుటచే మార్పులేకుండా కాశ్మీర గ్రంథ ప్రకాశకులచే అంగీకరింపబడినది, ప్రధాన పాత్రల సాంఘిక స్థితికి ఔన్నత్యమును ప్రదర్శించుటయే వారి అభీష్ట విషయము. వ్యాపారులు రాజకుమారులుగా, మనుష్యులు గంధర్వులుగా వర్ణింపబడిన పరివర్తన దోషములు స్పష్టంగా కనబడుచున్నవి. ఎందు వలననగా ఆ పేర్లే సంస్కృత వ్యాకరణ విరుద్ధంగా ప్రత్యయ యోగముచే మరలా వినివేశింపబడినవి. హీనజాతి కథలకు సాంఘిక ఔన్నత్యమును కల్పించిననూ తజ్జాతి ధర్మములు కాశ్మీర కథా సంకలన కర్తలచే పరిత్యజించ బడిననూ బృహత్కథా శ్లోక సంగ్రహమున తజ్జాతి స్వభావము చక్కగా వర్ణింపబడినది. బృహత్కథాశ్లోక సంగ్రహమునందలి సమీచీనత్వమును "లకోటి" ఇట్లు ప్రతిపాదించెను. కథా సరిత్సాగరమున ప్రదాన దైవము శివుడు. బృహత్కథా శ్లోకసంగ్రహమున ప్రధానదైవము. కుబేరుడు. నాయకుని పేరే దీనిని నిరూపించును. "నరవాహనేన" "కుబేరేన దత్తః నరవాహనదత్తః నరవాహనుడు కుబేరుడే. ఉదయనుడు. పుత్రుని కొరకు కుబేరుని ప్రార్థించెను. అందువలన తద్వర ప్రసాదముచే జన్మించిన పుత్రుడు నరవాహన దత్తుడని వ్యవహరింపబడెను. ఉదయనుడు శివుని ఆరాధించియుండినచో పుత్రునిపేరుకూడా శివదత్తుడని వ్యవహరింపబడి యుండెడిది. అందువలన కాశ్మీర కథా సంకలన కర్తలు ప్రధానపూజ్యదైవమయిన నరవాహనుని స్థానిక సమకాలిక విశ్వాసానుగుణముగా మార్చి శివుని ఆస్థానమున వినివేశించిరి.

కథాసరిత్సాగరమున 16 వ లంబక సంబంధముగల లంబకము ప్రథమ లంబకము. ఇందు దూత్యక సురతమంజరీ సంఘటనాగామి సంబంధముగా గోపాలపాలక చరిత్రము కలదు. సురత మంజరీ వివాహ పరిష్కారము కొరకు ఆహ్వానింపబడిన నరవాహన దత్తుడు స్వీయచరిత్ర కథనము కొరకు ఋషులచే ప్రారంభింపబడెను. తనకిష్టము లేకున్నను నరవాహనదత్తుడు తన కుటుంబ చరిత్రమును అతి కష్టముగా తన జన్మవృత్తాంతమును వివరించెను. అందు 5, 6 లంబకములలో గల విద్యాధర కథ లేకుండా మదన మంజుక కథలో ప్రవేశించుచున్నాము. తద్దర్శనానురక్తుడైన నాయకుడు అనేకసాహస కృత్యములను చేయును. పిమ్మట మదనమంజుక అదృష్ట అయ్యెను. తదన్వేషణమున నాయకుడు అనేక కన్యలను పరిణయమాడును. ఇట్లు సంభవించిన వివాహములతో నిర్మింపబడిన లంబకములన్నియు సక్రమములా లేదా సత్యములా అని నిశ్చయించుటకు సాధ్యముకాదు. కాని 14, 7, 9. 10, 11, 12, 13, 15, లంబకములు, కథాసరిత్సాగరమందున్నవి. మూల బృహత్కథలో కూడా ఉండియుండును. లకోటే అభిప్రాయము ననుసరించి 17-18 లంబకములుకూడాతరువాత సంఘటితము చేయు అవసరమే లేదు.

కొన్ని విషయములలో బృహత్కథ రామాయణము ననుసరించుచున్నది. నాయకుడు పోగొట్టుకొన్న భార్యను తిరిగి పొందుట, మధ్యకాలమున అనేకులతో స్నేహప్రాప్తి, విశ్వాస పాత్రుడయిన మిత్రుడు అద్యంతము సహాయపడుట, నిర్బంధితమైన భార్యా పాతివ్రత్యము చివర సురక్షితముగా నాయికాప్రాప్తి అనువిషయము అందు పరస్పర సామ్యము కనబడుచున్నది. గుణాఢ్యుడు తన గ్రంథ విషయము అశృత పూర్వముగా, పూర్వగ్రంథ అననుసారిగా ఉండ

వలె ననెడి దృష్టితో గ్రంథమును రచించెను. అందువలన యిది రామాయణమును అనుసరింపలేదు. రెండుచోట్ల కథా స్వామ్య ముండుట యాదృచ్ఛికము. బృహత్కథా నాయకులు రామాయణము నుండి గ్రహింపబడలేదు. పూజ్యదేవుడు శివుడు గాని, విష్ణువు గానీ కాదు. ఇందలి వర్ణిత సంఘటనలు కేవలము రాజసంబంధములు కానీ దైవ సంబంధములు కానే కావు.

ఇందలి సుందర రాజకుమారులు వ్యాపారులతో కళాకారులతో, సాహసికులతో, భిక్షుకులతో, నాస్తికులతో కలిసి చరించ్చిరి. నాయిక వేశ్యాపుత్రి. ఆమె స్వకుల హైన్యస్థానమును పూజనీయముగా ఉద్ధరింపదలంచెను. ఈమె భర్త మహాపురుషుడు. అందువలన ఈ పాత్ర లన్నింటిని గుణాఢ్యుడే సృష్టించెనని చెప్పవచ్చును. ఆనాడు వ్యాపారులకు, ధనికులకు పూజ్యదేవుడు కుబేరుడే. ఆనాడు సమకాలీన ప్రేక్షకులు బృహత్కథ, గుణాఢ్య సృష్టియే అని నిశ్చయించిరి. కౌశాంబీ నగరిలో, ఉజ్జయినీలో బృహత్కథా పర్వదినములలో భక్తితో వినిపింపజేయబడుచూ ప్రజలను ఆకర్షించుచుండెను. ఇందలి సుదీర్ఘ సంఘటన విషయములను కూడా ప్రజలు కంఠస్థము చేసియుండిరి. లకోటీ అభిప్రాయము కూడా దీనికి ఉపోద్బలకము.

కాశ్మీర కథాసంకలన కర్తలు మూలకథకు కొన్నిచోట్ల పరివర్తనము చేసిరి. కొన్నిచోట్ల మూలకథా భాగమును పరిత్యజించిరి. గ్రంథారంభమున ఉపోద్ఘాతము కూడా అవసరమని వారు ప్రవేశ పెట్టిరి.

అందువలన పూర్వోక్త కారణములనుబట్టి మూలబృహత్కథ కథాసరిత్సాగరమున అసమీచీన క్రమంలో అనేక లోపములచే వినివే

శింపబడినదని చెప్పవచ్చును. సోమదేవుడు కూడా తన గ్రంథమున కథాక్రమము అనౌచిత్యపూర్ణమని తెలిసినవాడే. అయినప్పటికిని అతడు స్వబుద్ధి కుశలతచే కొన్ని భాగములను సమీచీనక్రమంలో వినివేశించెను. కథయొక్క పునర్నిర్మాణ ప్రయత్నము నవీన గ్రంధ నిర్మాణముతో సమానమైనది అందువలన నతడు గ్రంథముసంతటినీ పునర్నిర్మాణము చేయలేదు. కాశ్మీరదేశ కథా సంకలన కర్తలు సంఘటితము చేసిన ఉపకథలను అట్లే వినివేశింప వలెనని నిశ్చయించెను. అందువలన నతడు మూలకథకు పరివర్తనము చేయజాలక పోయెను ఆ ఉపకథలను అధికముగా ప్రవేశపెట్టుటకు మూలకథలో కొంత పరివర్తనమును చేసెను. అనేక నవీన కథాప్రవేశమునకు పూర్వమే ఉచిత పరివర్తనములు మూల బృహత్కథ యందే చేయబడి యుండవచ్చును,

ఇట్లనేకములోపములున్ననూ సోమదేవుని కథాసరిత్సాగరము అనింద్యము సోమదేవుడు అద్భుత మహాకథా సంకలన గ్రంథమును అపూర్వముగా భారతీయుల పుణ్యఫలముగా రచించెను. ఇందు సమకాలీన ఆచార విశ్వాసములు చక్కగా అద్దము నందువలె ప్రతిబింబించుచున్నవి. కవికథాకథన సైపుణ్యము చక్కగా గ్రంథమున వ్యక్తమగుచున్నది. కానీ బృహత్కథా గ్రంథకథలు "బొకాసియో గోథే-లావగంటైన్ సై సర్-షేక్స్పియర్ మహాకవులను ఆకర్షింపలేదు.

క్షేమేంద్రుని బృహత్కథా మంజరిలేనిచో మనకు కలిగిననష్టము స్వల్పమే. కానీ కథాసరిత్సాగరము లేనిచో ఆ కాలము నుండి నేటి వరకు వ్యాపించిన భారతీయ కథాసాహిత్యము శుష్కప్రాయముగా కనబడెడిదని చెప్పవచ్చును. సోమదేవ మహాకవి కథాపిత. అతని కథాసరిత్సాగరము ప్రపంచ కథా సాహిత్యముననే అత్యుత్తమోత్తమ గ్రంథమని చెప్పవచ్చును.

—.....—

సరిత్సాగరమున విషమశీల కథ 18వ లంబకములో కలదు. కథాసరి త్సాగరములోని 10వ లంబకములో నున్న శక్తి యశోవృత్తము బృహత్కథామంజరిలో 16వ లంబకములో కలదు. బృహత్కథా మంజరిలో 11వ లంబకము మదిరావతీ లంబకము వేలా లంబకము బృహత్కథామంజరిలో వేలాఖ్యానము 8వ లంబకములో కలదు.

బృహత్కథామంజరిలో 12వ లంబకము పద్మావతి లంబకము కథాసరిత్సాగరములో 12వ లంబకము శశాంకవతీ లంబకము. కథా సరిత్సాగరములోని శశాంకవతి కథ బృహకథామంజరిలో 9వ లంబ కములో కలదు.

బృహకథామంజరిలో 13వ లంబకము పంచనామక లంబకము కథాసరిత్సాగరమున 13వ లంబకము మదిరావతీ నామకము. కథా సరిత్సాగరమునందలి మదిరావతీ కథ బృహకథామంజరిలో 11వ లంబకములో కలదు. బృహత్కథామంజరి యందలి పంచఖ్యానము కథానరిత్సాగరమున 14వ లంబకములో కలదు.

బృహత్కథామంజరిలో 14వ లంబకము రత్నప్రభానామకము కథాసరిత్సాగరమున రత్నప్రభ 7వ లంబకములో కలదు. పంచా ఖ్యానము 14వ లంబకములో కలదు.

బృహత్కథామంజరిలో పంచదశలంబకము అలంకారవతి లంబ కము. కథాసరిత్సాగరమున ఈ కథ 91 లంబకములో కలదు. కథా సరిత్సాగరమున కూడా 15వ లంబకము మహాభిషేక లంబకము. 15వ లంబకమునందలి కథాసరిత్సాగరము నందలి మహాభిషేక కథ బృహత్కథా మంజరిలో 17వ లంబకములో కలదు. బృహత్కథా మంజరిలో 18వ లంబకము శక్తి యశోనామక లంబకము. కథాసరి

త్సాగరమున 16వ లంబకము సురతమంజరీనామకము. 16వ లంబకమున బృహత్కథామంజరియందలి శక్తియశోవృత్తము. కథాసరిత్సాగరమున 10వ లంబకములో కలదు. 16వ లంబకములో కథాసరిత్సాగరమునందలి సురతమంజరీ వృత్తాంతము బృహత్కథామంజరిలో 19వ లంబకములో కలదు.

బృహత్కథామంజరిలో 17వ లంబకము మహాభిషేకనామకము. కథాసరిత్సాగరములో మహాభిషేక వృత్తాంతము 15వ లంబకములో కలదు. 17వ లంబకములో పద్మావతీ చరిత్రము కలదు. కథాసరిత్సాగరమునందలి పద్మావతీ చరిత్రము బృహకథామంజరిలో 12వ లంబకములో కలదు. బృహకథామంజరిలో 18వ లంబకము సురతమంజరీ కథ. కథాసరిత్సాగరములో 18వ లంబకమున విషమశీల నృపతి కథ-మహేంద్రాదిత్యుడైన విక్రమాదిత్యుని కథ కలదు. బృహత్కథామంజరి యందలి సురతమంజరీ కథ. కథాసరిత్సాగరమున 16వ లంబకములో కలదు. కథాసరిత్సాగరమునందలి విషమశీల నృపతి కథ బృహత్కథామంజరిలో 10వ లంబకములో కలదు.

బృహత్కథామంజరిలో మొత్తము ఆఖ్యానముల సంఖ్య 200. అందులో ఉపాఖ్యానముల సంఖ్య 150. కథాసరిత్సాగరమున 58 కథావిభాగములు కలవు. 128 తరంగములు కలవు. బృహత్కథామంజరిలో గుచ్ఛముల సంఖ్య 180.

బృహత్కథా శ్లోక సంగ్రహ కథతో బృహత్కథామంజరీ కథాసరిత్సాగర గ్రంథ కథలలో సామ్యవైషమ్యమును పరిశీలించుట.

శ్లోక సంగ్రహమున 28 సర్గలు కలవు. క్షేమేంద్ర సోమదేవుని గ్రంథములు సమానముగా 18 లంబకములుగా విభజింపబడినవి.

పితృఘాతి అని తనపై వచ్చిన ప్రజాపవాదభూను పరిహరించు కొనుటకు గోపాలుడు స్వప్నఫలముగా పదవీచ్యుతిని విని పాలకుడైన సోదరునిపై రాజ్యభారము నప్పగించుట పాలకుడు కూడా రాజ్యమును పరిత్యజించి ఆ రాజ్యభారమును గోపాల పుత్రుడైన అవంతివర్ధనున కప్పగించుట అను విషయములు శ్లోక సంగ్రహమున ప్రథమ, ద్వితీయ సర్గలలో వర్ణింపబడినవి. సురతమంజరి అనుపేరుతో నున్న కథయే బృహత్కథా శ్లోక సంగ్రహమున 3వ సర్గలలో కలదు. ఈ 3వ సర్గచే శ్లోకసంగ్రహములో కథాముఖము సమాప్తమగును. ఈ కథాముఖములో చండమహాసేనుని, అతని పుత్రులు, పౌత్రుల వృత్తము అతి సంక్షిప్తముగా చెప్పబడినది.

ఇందలి 4వ సర్గలోని పింగళికావృత్తము నరవాహనదత్త జన్మ అనుపేరుగల లంబకములో క్షేమేంద్ర సోమదేవుల గ్రంధములలో కలదు.

దోహద సంపాదనము అనుపేరుగల 5వ సర్గము కథ కూడా క్షేమేంద్ర సోమదేవుల గ్రంధములలో నరవాహనదత్త జన్మ అను పేరుగల నాలుగవ లంబకములో కలదు.

శ్లోక సంగ్రహములో నరవాహనదత్త కథ 6వ సర్గలో కలదు. యౌవ రాజ్యాభిషేకము అనుపేరుగల 7వ సర్గ కథకూడా క్షేమేంద్ర సోమదేవుల గ్రంధములలో నరవాహనదత్త జన్మ అనుపేరుగల 4వ లంబకముననే కలదు.

మృగయా విహారము, పులినదర్శనము, రథ్యాసల్లాపము అను పేరుగల 8,9,10 సర్గల కథలు క్షేమేంద్ర సోమదేవ గ్రంథములలోలేవు

మదన మంజుకావృత్తాంతము మూడు గ్రంథములలో కలదు. కానీ బుధస్వామి గ్రంథమందలి మదన మంజుకా జన్మవృత్తాంతము క్షేమేంద్ర, సోమదేవ గ్రంథములకంటె భిన్నమైనది.

క్షేమేంద్ర సోమదేవుల గ్రంథములలో మదన మంజుక తక్ష శిలావాసులైన తారాదత్త, కళింగసేనుల పుత్రిక దేవేంద్రశాపము వలన పూర్వజన్మలో సురభిదత్త అనుపేరుగల అప్సర స్త్రీరూపములో నున్న కన్యనుండి జన్మించిన కళింగసేనకు మదనవేగుడని పేరుగల విద్యాధరునివలన జన్మించినది మదనమంజుక. ఈశ్వరుని వరము వలన నరవాహనదత్తుని రూపంలో జన్మాంతరము పొందిన మన్మధుని పొందుటకు సాక్షాత్తు రతిదేవియే మదనమంజుకగా జన్మించెను. బ్రహ్మ దేవుడు ఈశ్వరాదేశముచే కళింగ సేనా గర్భోత్పత్తి కాలమున శిశు రూపములో రతీదేవిని అచ్చట ఉంచి కళింగసేనా నిజపుత్రికను అవహరించెను. కళింగసేన ఆమెను నిజపుత్రిక అని తలంచి పెంచెను.

ఇట్లు రెండు గ్రంథములలో మదనమంజుక సాక్షాత్తు రతీ దేవియే.

బుధస్వామి గ్రంథమున మదనమంజుకా వృత్తమిట్లు కలదు. పూర్వము భరతుడను రాజు ధర్మార్థ కామ పరాయణుడై చతుస్సాగర పరీత భూమండలము నుండి కన్యలను తీసికొని వచ్చి ఒకేసారి వారిని వివాహమాడి సుఖములను అనుభవించవలెనని తలంచెను. ఎవరి హస్తమును మొదట అతడు గ్రహించెనో ఆ ఆకృతిలో సంతుష్టు డగుచుండెను. మిగతా కన్యలు కేవలము మనోనయనానంద కారిణులుగా ఉండిరి. అతడిట్లు మనోహరస్త్రీలనందరిని రిగుణములుగా

ప్రతిగణమున విశేషాలంకరణ శోభితురాలగు స్త్రీని రాజ స్త్రీగా అంగీకరించి ఛత్ర చామర గౌరవమును కల్పించెను. గణ ంలో తక్కిన వారిని మహత్తములు అని, మహాగణికలని రాజుచే వ్యవహరింపబడిరి. వారిలో కొందరు మహాగణులు అని, మరికొందరిని టకులు అని. మరికొందరిని సంఘట్టకులుఅని, మరికొందరిని కఠోర కులు అని, మరికొందరిని "ఖలులని" వ్యవహరించిరి. వీరినందరినీ ణికా భేదవ్యపదేశాలనుగా భరతుడే పవర్తింప చేసెను. ఈ గణికా దము నేడుకూడా కలదు.

ఆ గణముఖ్యులలో ఒకానొక భేదమందు సరస్సులో పద్మిని లె కళింగసేన జన్మించెను. కళింగసేనకు మదనమంజుక జన్మించెను. మె నరవాహనదత్తుని అనేకమార్లు దర్శించి అతని ప్రేమసాగరములో డి విరహపీడితమై అతని సాంగత్యము లభింపదని రెండుమార్లు త్మహత్యా ప్రయత్నము చేసెను. గోముఖుని సహాయముచే మదన ంజుక నరవాహనదత్తుని సమాగమము పొందెను.

ఇట్లు బుధస్వామి శ్లోక సంగ్రహమున మదనమంజుక గణికా ంశోత్పన్నురాలుగా వర్ణింపబడినది. క్షేమేంద్ర సోమదేవ గ్రంథ ములలో ఆమె సాక్షాత్తు అయోనిజమైన రతీదేవిగా వర్ణింపబడినది. నర ాహనదత్తుడు జన్మాంతరమును గ్రహించిన మన్మథుడుగా వర్ణింప బడి యున్నాడు. మానసవేగుడు మదనమంజుకను అపహరించుట అతని సోదరియైన వేగవతితో నరవాహనదత్తుని సమాగమము, ఇట్లే గంధర్వదత్తతో నరవాహనదత్తుని సమాగమము, అను విషయములు మూడు గ్రంథములందు సమానమే.

తన వలన శంఖబంధము నుండి విముక్తుడైన "అమితగతి" అనువాడు స్మరణ మాత్రముచేతనేవచ్చి కూపమున పడిన నరవాహన

దత్తుని ఉదరించెను. పిమ్మట వీణాదత్తకునిచే సానుదాసుని కడకు తీసికొని పోబడి గంధర్వగానమున అతని పుత్రికయైన గంధర్వదత్తను ఓడించి వివాహమాడెను.

బుధస్వామి శ్లోక సంగ్రహములో 18-వ సర్గలో విపులముగా వర్ణింపబడిన సానుదాసకథ క్షేమేంద్ర సోమదేవుల గ్రంథములలో లేదు. సానుదాసుని స్థానమున గంధర్వదత్త తండ్రిగా సాగరదత్తుడు క్షేమేంద్ర, సోమదేవుని గ్రంథములలో వర్ణింపబడెను.

క్షేమేంద్ర సోమదేవుల గ్రంథములలో అజినావతి లాభకథ యున్ననూ శ్లోక సంగ్రహములోని నళినికాఖ్యానము అచ్చట లేదు. సంగ్రహమున 11 వ సర్గమొదలుకొని 28 వ సర్గవరకూ గల ప్రియదర్శనా లాభకథ క్షేమేంద్ర సోమదేవ గ్రంథములలో లేదు.

ఋషిదత్త చెప్పిన ఆత్మకథ, వృషభుని వలన మహాదిన్నయందు జన్మించిన గోముఖుడను నతనికి ఋషిదత్తతో జరిగిన వివాహము" అను విషయములు క్షేమేంద్ర, సోమదేవ గ్రంథములలో లేవు.

ఉజ్జయినీ పాలకుడైన చండమహాసేనుని కథ తోడనే బృహత్కథా శ్లోక సంగ్రహము అరంభింపబడెను. ఇందు బృహత్కథ సర్వేశ్వరునిచే పార్వతి నుద్దేశించి చెప్పబడెను. అనెడి కథావతారకథ, పుష్పదంత - మాల్యవంతుల కథ, వరరుచి గుణాఢ్యుల కథ, వత్సరాజ ఉదయన కథ, వాసవదత్తా పద్మావతులతోడ ఉదయనుని వివాహము మొదలగు కథాపీఠ కథాముఖ వ్యాస్తములయిన విషయములు శ్లోక సంగ్రహమున లేవు.

శ్లోక సంగ్రహము ననుసరించి నరవాహనదత్తుడు 26 మంది భార్యలను పొందెను. 4,539 శ్లోకముల వరకు గల కథలో అతడు అరవ

ర్యను మాత్రమే పొందెను. మొదటి 5 మంది చరిత్ర, 3,022 శ్లోక
ంలతో కూడియున్నది. దీనినిబట్టి శ్లోక సంగ్రహము నందలి శ్లోక
ంఖ్య 19 వేలని అంగీకరింపవచ్చును.

---

5.3. కథాసరిత్సాగర, బృహత్కథా మంజరీ, బృహత్కథా శ్లోక సంగ్రహములలోని కథా విషయ సంక్షిప్త ప్రదర్శనసూచిక :

కథాసరిత్సాగరము బృహత్కథా మంజరి బృహత్కథా మంజరి
శ్లోక సంగ్రహము

కథాపీఠము: మహాకవి 1. కథాపీఠము: 1,2,3 సర్గలు :
కథా ముఖము
ణాఢ్య విరచిత 1. కథావతారము 4వ సర్గ: పింగళికాఖ్యానం
ృహత్కథకు పూర్వ 2. పాటలీపుత్రకథ 5వ సర్గ : దోహద సంపాదనము
ఠిక, శాతవాహన 3. ఉపకోశాఖ్యాయిక
ాపతి బృహత్కథను 4. యోగనంద 6వ సర్గ : కుమార జన్మ
మత్స్యహాస కథ 7వ సర్గః యౌవన
ధిక్షేపించుట తత్కార 5. అదిత్యవర్మకథ రాజ్యాభిషేకము
ముచే దుఃఖితుడైన 6. యోగనందపుత్ర 8వ సర్గః మృగయా
ణాడ్యుడుబృహత్కథ శాపమోక్షము విహారము
ని 6 లక్షల శ్లోకము
ను అగ్నిలో పడ 7. వరరుచి శాపవిముక్తి 9వ సర్గః పులిన
యుట శిష్యుల దర్శనము
ను నయముచే మిగిలిన 8. గుణాఢ్యకథ

9. పుష్పదంత మాల్యవంతులకథ 10వ సర్గః

| | | |
|---|---|---|
| లక్ష్య శ్లోకములలోగల | | రథ్యా |
| నరవాహనదత్త చరిత్ర | | సల్లాపము |
| ముసు గుణదేవ, నందిదేవులను | | 11వ సర్గః మదన |
| గుణాఢ్య శిష్యులు పరిరక్షించుట | | మంజుకాలాభము |
| | | 12వ సర్గః వేగవతీలాభ |
| | | మున ఉద్యానవియమము |
| 2. కథాముఖము ; | 2. కథాముఖము : | 13వ సర్గ వేగవతీ |
| వత్సరాజ ఉదయనకథ | శ్రీదత్తాఖ్యాయిక | దర్శనము |
| మృగయాసక్తుడైన వత్స | సాహస్రానీకథ | 14వ సర్గః వేగవతీ |
| రాజును మాలవాధిపతియైన | చండమహాశయనకథ | దర్శనము |
| చండమహాశయునుని | లోహజంఘాఖ్యాయిక | 15వ సర్గః వేగవతీలాభము |
| భటులు మాయాగజవ్యాజ | దేవస్మితాఖ్యాయిక | 16వ సర్గః గంధర్వ |
| ముచే బంధించుట, బంధితు | వినష్టాఖ్యాయిక | దత్తాలాభమున |
| డయిన వత్సరాజును | | చంపాప్రవేశము |
| ఉజ్జయినికి | | 17వ సర్గః గంధర్వ |
| తీసుకొని వెళ్ళుట అచ్చట | | దత్తా వివాహము |
| చండ మహాశయున | | 18వ సర్గః సామదాసకథ |
| పుత్రికయైన వాసవదత్తతో | | 19వ సర్గః అజినావతి |
| ఉదయన సమాగమము | | లాభమున నలినికాఖ్యానము |
| అమాత్య యౌగంధరాయణుని | | 20వ సర్గః అజినావతీ లాభము |
| కూటనీతి ప్రయోగముచే ఉదయినునకు | | 21వ సర్గః ప్రియదర్శనా |
| విముక్తి, వాసవదత్తాపహరణము | | లాభమున ద్వైవాఖ్యానము |
| వాసవదత్తతోడ ఉదయనుడు | | 22వ సర్గః ప్రియదర్శనాలాభమున |
| కౌశాంబికి తిరిగి వచ్చుట | | పురుషాకార కథ |
| అచ్చట వారి వివాహము | | 23వ సర్గః ప్రియదర్శనా లాభమున |
| | | నందోపనందకథ |

| | | |
|---|---|---|
| 3. లావణక లంబకము: | 3. లావణకము: | 24వ సర్గః ప్రియదర్శనా |
| ఉదయనునకు మగధరాజ | పరహిత ఆఖ్యాయిక | లాభమున గోముఖ |
| సోదరియైన | బహిల్లహాఖ్యాయిక | వివాహాఖ్యానము |
| పద్మావతితో వివాహము | దేవసేనాఖ్యాయిక | 25వ సర్గః ప్రియ |
| నకు యౌగంధరాయణాదుల | పరివ్రాడాఖ్యాయిక | దర్శనా లాభమున |
| కూటనీతి వాసవదత్త | పుణ్యసేనాఖ్యాయిక | గోముఖ వివాహా |
| అంతఃపురములో | సుందోపసుందాఖ్యాయిక | ఖ్యానము |
| దగ్ధమయ్యెననెడి కూటా | పద్మావతి వివాహము | 26వ సర్గః ప్రియ |
| ఖ్యానము బ్రాహ్మణీ | ఊర్వశ్యాఖ్యాయిక | దర్శనా స్తనదర్శనం |
| వేషములో వాసవదత్త | విహితసేనాఖ్యాయిక | 27వ సర్గః ప్రియ |
| పద్మావతి హస్తమున | | దర్శనా వివాహము |
| నిక్షేపముగా నుంచబడుట | సోమప్రభాఖ్యాయిక | 28వ సర్గః ప్రియా |
| వత్సరాజునకు | అహల్యాఖ్యాయిక | దర్శనా లాభము |
| పద్మావతితో పరిణయము | విదూషాఖ్యాయిక | |
| వాసవదత్తా ప్రకాశనము | దేవదాసాఖ్యాయిక | |
| 4. నరవాహనదత్త | శ్రీవత్సేశ దిగ్విజయము | |
| జననము: వాసవదత్త | హలభూత్యాఖ్యాయిక | |
| గర్భమును ధరించుట | నరవాహనదత్త జన్మః | |
| పుత్రోత్పత్తి | దేవదత్తాఖ్యాయిక | |
| నరవాహనదత్తుడని | బ్రాహ్మణీ సమాగమకథ | |
| నామకరణము | జీమూతవాహనా ఖ్యాయిక | |
| చేయుట | సింహ విక్రమాఖ్యాయిక | |
| యౌగంధరాయణాది | | |
| అమాత్యులకు పుత్రులు జన్మించుట | | |

5. చతుర్ద్వారికా ఖ్యానము

నరవాహనదత్తుని దర్శించుటకు
విద్యాధరుడైన శక్తివేగుడు
వత్సరాజు సభకు వచ్చుట
శక్తిదేవ కథ
తద్వివాహాదిక

6. మదనమంజుకా ఖ్యాయనము:

నరవాహనదత్తుని కారుణ్యప్రాప్తి
కళింగసేన పుత్రికయైన
మదనమంజుకతో తన వివాహము

7. రత్నప్రభాకాఖ్యాయిక:

వత్సరాజధానియైన కౌశాంబి
నగరోప వనమునకు రత్నప్రభ
వచ్చుట, రత్నప్రభావృత్తము
నరవాహనదత్తుడు రత్నప్రభను
పిమ్మట కర్పూర రాజకన్యకయైన
కర్పూరికను వివాహమాడుట
సులోచనా ఖ్యాయిక
రాజపుత్రా ఖ్యాయిక
పిశాచా ఖ్యాయిక
స్వయంప్రభా ఖ్యాయిక

5. చతుర్దారికా ఖ్యానము

శక్తిదేవ సమాగమ కథ
శివమాధవా ఖ్యాయిక
హరస్వామ్యాఖ్యాయిక
శక్తిదేవ ప్రవహన భంగకథ
అశోక దత్తాఖ్యాయిక
దేవదత్తాఖ్యాయిక
శక్తిదేవ కథ

6. సూర్యప్రభా లంబకము

కాలక జాపకాఖ్యాయిక
గుణ శర్మాకాఖ్యాయిక

7. మదనమంజుకాలంబకము:

రత్నదత్తాకాఖ్యాయిక
విప్రచండాలాకాఖ్యాయిక
శిష్యాకాఖ్యాయిక
విక్రమసింహా కాఖ్యాయిక
క్షమావధానము
వైరాగ్యావధానము
కీర్తిసేనాకాఖ్యాయిక
హరిశర్మాకాఖ్యాయిక
తేజోవత్యాకాఖ్యాయిక
మూర్ఖాకాఖ్యాయిక

| | |
|---|---|
| సపత్న్యాఖ్యాయిక | యక్షాఖ్యాయిక |
| శ్రుతసేనాఖ్యాయిక | యౌవ్వరాజ్యాభిషేకము, |
| మార్జారాఖ్యాయిక | విద్యుత్కళా సంక్రాంతి |
| ప్రసేనజిత్ ఆఖ్యాయిక | యోగనంద ఖ్యాయిక |
| కళింగసేనమదనవేగ సమాగమము | |
| శత్రుఘ్నాయిక | మదనమంజుకా జన్మకథ |
| పతివ్రతాఖ్యాయిక | మదనమంజుకా వివాహకథ |

| 8. సూర్యప్రభాఖ్యానము | 8. వేలా లంబకము |
|---|---|
| వత్సరాజు నరవాహనదత్త | చంద్రసారాఖ్యాయిక |
| సమక్షమున వజ్రప్రభుడు | జినేంద్రసేనా సమాగమము |
| చెప్పిన విద్యాధర చక్రవర్తి | మదనమంజుకాపహరణము |
| యయిన సూర్యప్రభ కథ | |

| 9. అలంకారవతీ కథ: | 9. శశాంకవతీ లంబకము; |
|---|---|
| హిమవత్పర్వతమున శ్రీసుందర | కుంజరాఖ్యాయిక |
| పురమున విద్యాధరేశ్వరుడైన | లలితలోచన ఆలాప కథ |
| అలంకారశీలుని పట్టమహిషి | మంత్రగుప్తాఖ్యాయిక |
| అయిన కాంచనప్రభ కన్యను | శృతధి సమాగమము |
| ప్రసవించుట. అలంకారవతి | వినయ వృత్తాఖ్యాయిక |
| యని ఆమెకు తల్లిదండ్రులు | పారవతాక్ష శాపము |
| నామకరణము చేయుట | సంసార చక్రము |
| ఆమెతో నరవాహనదత్తుని | హంసావళీ కథ |
| వివాహము ఆ సందర్భముననే | భీమపరాక్రమ సమాగమము |
| నలదమయంతి కథ | గుణాకార సమాగమము |

దానపారమిత
శీలపారమిత
క్షాంతిపారమిత
ధైర్య పారమిత
ధ్యానపారమిత
కేశటా ఖ్యాయిక
కళింగసేనాలాభవర్ణనము

10. శక్తి యశోవృత్తము:

విద్యాధరుడైన స్ఫటికయశు
నకు హేమప్రభాదేవి యందు
ప్రసవించిన శక్తి
యశతో నరవాహనదత్తునకు
వివాహము

విచిత్రకథాసమాగమము శ్రీధ్వనాఖ్యాయిక
ప్రచండశక్తి సమాగమము,భీమభటాఖ్యాయి
ప్రజ్ఞాపారమిత
వినీతమత్యాఖ్యాయిక
భగవతీ స్తోత్రము
భూనందాఖ్యాయిక

10. విక్రమ శీలాఖ్యాయిక:

టెంటాకరాఖ్యాయిక
ఖండకాపాలివధ కథ
యక్షుని సమాగమ కథ
కన్యాచతుష్టయ ప్రాప్తికథ
శబరరాజపుత్రి లాభకథ
గజవరాహ శాపవిముక్తి కథ
రాజపుత్రీద్వయ లాభకథ
కేసటాఖ్యాయిక
మూలదేవకథ

11 వేలాఖ్యానము : సార్థవాహ రుచిర దేవునియొక్క తత్పత్నియైన వేలయొక్క వృత్తాంతము. రుచిరదేవ భగిని (సోదరి) యైన జయేంద్రసేనతో నరవాహనదత్తుని వివాహము.

11 మదిరవాత్యాఖ్యాయిక

ద్విజపుత్ర కథ

12 శశాంకవతీ వృత్తము : నరవాహనదత్తునకు రుచిరదేవ భగినియైన జయేంద్రసేనతో వివాహము, మృగాంకదత్త కథ, శశాంకవతీ కథ, వేలా పంచవింశతి కథ, మృగాంకదత్తుడు ఉజ్జయినికి వెళ్ళుట, శశాంకవతీ హరణము, మృగాంకదత్త, శశాంకవతుల వివాహము.

12 పద్మావత్యాఖ్యాయిక

| | |
|---|---|
| బ్రహ్మదత్తాయిక | ముక్తకేతు శాపకథ |
| విద్యుధ్వజ వధకథ | పద్మావతి కథ |

13 మదిరావతీ వృత్తాంతము : బ్రాహ్మణ పుత్రుని యొక్క మదిరావతియొక్క కథ. రెండవ బ్రాహ్మణ పుత్రుని కథ.

13 పంచాఖ్య త్రయోదశ లంబకము

| | |
|---|---|
| సావిత్రాఖ్యాయిక | అజినావతీ ప్రాప్తి కథ |
| వేగవతీ ప్రాప్తి కథ | గోముఖ కథ |
| గంధర్వదత్తాఖ్యాయిక | మరుభూతి కథ |
| భగీరథ యశః ప్రాప్తికథ | హరిశిఖ కథ |
| ప్రభావతీ ప్రాప్తి కథ | మానసవేగాది వధకథ |

14 పంచాఖ్యానము : 1. మదన మంజుకాఖ్యానము 2. మదన మంజుకాహారణము 3. నరవాహనదత్తుని గంధర్వ పురగమనము.

అచ్చట గంధర్వ రాజపుత్రియైన గంధర్వ దత్తతో, ప్రసేనజిత్ పుత్రికయైన అత్మనికతో నరవాహనదత్తుని వివాహము. 4. మదన మంజుకాప్రాప్తి చక్రవర్తి సరస్సున నరవాహనదత్తుని జలక్రీడ. వాయువేగ యశ మొదలగు పంచకన్యలతో నరవాహనదత్తుని వివాహము.

14. రత్నప్రభాఖ్యాయిక

| | |
|---|---|
| సత్యశీలాఖ్యాయిక | రూపఖ్యాయిక |
| మహాసత్త్వా " | అజరా " |
| రత్నప్రభా " | నాగార్జున " |
| శీలవత్యా " | ఇందీవర సేనా " |
| నిశ్చయదత్తా " | వజ్రధరా " |
| మదనమాలా " | అర్థలోపా |
| | కర్పూరమంజరి వివాహకథ |

15. మహాభిషేకము : విద్యాధర రాజులయొక్క పంచకన్యలతో నరవాహనదత్తుని పరిణయము. మదనమంజుకా సహితుడైన నరవాహనదత్తుని అభిషేకము.

15. అలంకారవత్యాఖ్యానము

| | |
|---|---|
| రామాఖ్యాయిక | సముద్రసూరాఖ్యాయిక |
| రూపలతా " | అంతరా " |
| అనంగప్రభా " | అమరా " |
| కార్పటికా " | లుబ్ధా " |
| వీరవరా " | హిరణ్య వర్ణా " |

| | |
|---|---|
| నారాయణ దర్శనకథ | అంతర్నిలా " |
| | బంధుమత్యా " |

16. సురతమంజరి కథ : మాలవాధిపతియైన చండ మహాశయుని మరణము అతని భార్యయైన అంగారవతి చితిలో ప్రవేశించుట, ఉదయన వాసవదత్తలకు భృగు పతనము. చండమహాసేన

## 16. శక్తి యశోలంబకము

| | |
|---|---|
| భద్రఘటాఖ్యాక | ఆలజాలాఖ్యాయిక |
| పైశ్యా " | శ్రీవృత్తా " |
| వేదవ్యాసా " | వజ్రసారా " |
| సింహబల " | సుమానసా (కాదంబరి కథ) |
| వానరా " | కాకబకా " |
| శశాకా " | యూకా " |
| చండర " | ఉష్ట్రి " |
| కచ్ఛపమత్స్యటిట్టిభ " | చతురా " |
| సూచిముఖా " | వణిక్పుత్రబకా " |
| లోహతులా " | సింహవృషా " |
| జంబుకా " | మూషకకాకకూర్మకచ్ఛపా " |
| రాసభా " | నాగశశా " |
| మార్జారా " | ఛాగా " |
| దయితా " | చౌరరాక్షసా " |
| రథకార " | మూషికా " |

| | |
|---|---|
| మండూకాఖ్యాయిక | హంసాఖ్యాయిక |
| కాపాలూకా ” | చౌరా ” |
| ఖరా ” | సత్యా ” |
| వానరశిశుమారా ” | ఘటా ” |
| నాపితా ” | నకులా ” |
| అనేకమూర్ఖా ” | శ్రీధరా ” |
| లక్ష్మీసేనా ” | |

17. పద్మావతీ చరితము : గంధర్వాధిపతియైన పద్మశేఖరుని పుత్రికయైన పద్మావతితో విద్యాధరేంద్రుడైన చంద్రకేతు పుత్రుడైన ముక్తాఫలకేతునకు వివాహము.

17. మహాభిషేకము
మహాభిషేక కథ

18. విషమశీల నృపతి కథ : మహేంద్రాదిత్య తనయుడైన విక్రమాదిత్య వృత్తాంతము.

18. సురతమంజర్యాఖ్యానము

| | |
|---|---|
| సూరసేనాఖ్యాయిక | వత్సేశ్వర భృగపతనకథ |
| గోపాలనన్యాస కథ | కురండా ” |
| ధీవరాఖ్యాయిక | చౌరాఖ్యాయిక |
| సురతమంజరీ కథ | తారావలోకాఖ్యాయిక |
| | మొత్తముకథలు — 260లో |
| ఉపకథలు మమారు 600 | ఉపకథలు 150 |

## నరవాహనదత్తుడు వివాహ మాడిన కన్యలు

| బృహత్కథామంజరి ననుసరించి | కథాసరిత్సాగరము ననుసరించి | బృహత్కథాశ్లోక సంగ్రహముననుసరించి |
|---|---|---|
| మదన మంజుక | మదనమంజుక | మదనమంజూ |
| ఆనంద ప్రతిక | రత్నప్రభ | వేగవతి |
| వేలా | కర్పూరిక | గంధర్వదత్త |
| లలితలోచన | అలంకారవతి | అజనావతి |
| గంధర్వదత్త | శక్తియశ | ప్రియదర్శన |
| ప్రభావతి | జయేంద్రసేన | భగీరథయశ |
| అజనావతి | గంధర్వదత్త | |
| సులోచన | ప్రసేనజిన్నృపతిపుత్రిక | |
| సుందరి | ఆత్మనిక | |
| కళిక | పంచకన్యలు | |
| విద్యుత్ఫుల్లి | 10 టు 14 (1) వాయువేగయశ | |
| ఇందువదన | (2) కళిక | |
| మరిమతంగిక | (3) విద్యుత్పుంజ | |
| పద్మప్రభ | (4) మతంగిని | |
| రత్నప్రభ | (5) పద్మప్రభ | |
| కర్పూర మంజరి | భగీరథ యశ | |
| మందరదేవి + ఆమె తో | ప్రభావతి | |
| (23) సఖులు నలుగురు | వేగవతి | |
| వేగవతి | | |

## 5.4. ఉదయన నరవాహనదత్త కథ కథాసరిత్సాగరము ననుసరించి కథా నిర్మాణ కథాక్రమ సంఘటన సమావేశము

"లకోటే" రచించిన బృహత్కథా శ్లోక సంగ్రహ పరిశోధన వ్యాస పరిశీలనచే కథాసరిత్సాగరమును గూర్చి అనేక నవీనవిషయములు తెలియబడుచున్నవి. కథాసరిత్సాగరమున ప్రధాన కథలో అనేక ఉపకథలు అత్యధికముగా చోటుచేసుకున్నవి. నిశిత పఠనము వలననే మనకీవిషయములు అభివ్యక్తము కాగలదు. నరవాహనదత్తుని విజయానంతరము విక్రమాదిత్య కథలను సమావేశపరచుటలో యెట్టి కారణము లభింపదు. విక్రమాదిత్య కథానంతరము మరలా మూల కథలో ప్రవేశించుట కేవలము అవచార పరిరక్షణ మాత్రముగనే యున్నది. అందువలన తర్వాత కాలమున విక్రమాదిత్యకథలు మూల కథలో చేర్పబడినవి, అని నిశ్చయముగా చెప్పవచ్చును. అనేక కథలు ఉపోద్ఘాత రూపముగా రచింపబడి తమ స్థానమున అవి ఉచితములుగానే కనబడుచున్నవి. కానీ వాటిలో అనేక అసంగత కథలు కన్పట్టుచున్నవి. ఆ అసంగత కథలను వాటి స్థానమున తొలగించి మఱియొక చోట పెట్టవచ్చును. పంచతంత్ర కథలన్నిటికి మూల బృహత్కథతో ఎట్టి సాంగత్యమూ లేదు. అందువలన మూల బృహత్కథలో పంచతంత్ర కథలుండవనెడి "లకోటే" మహాశయుని అభిప్రాయము సత్యమని చెప్పవచ్చును.

కథాపీఠ లంబకము :-

ఇందలి ఉపోద్ఘాతమును పరిశీలించెదము. గుణాఢ్యుడను పేరుగల పురుషుడే సత్యముగా నుండియుండడని "బ్రోకస్" విల్సన్, లావన్ అను మహాశయులు అభిప్రాయపడిరి. బృహత్కథా శ్లోక

పూర్వగ్రహముక్త లభించు ఆధారములు కూడా ఈ అభిప్రాయమును బలపరచుచున్నవి. కైలాసమున నున్న పార్వతీ పరమేశ్వరులను గూర్చి వర్ణించెదము. పార్వతీ ప్రార్థనచే శివుడు తన పూర్వకథలతో నొక కథను పార్వతికి చెప్పెను. ప్రాచీనమైన ఆ కథతో పార్వతి అసంతృప్తురాలయ్యెను. ఆమె సంతోషముకొరకు మరలా ఈశ్వరుడు అత్యంత పూర్వ విద్యాధర కథలను చెప్పెను. ఇట్లు కథా కథన సంప్రదాయమే పరిహరింపబడినది. విద్యాధర కథలు నవీనములు. పార్వతి శ్రద్ధతో ఆ కథలను వినెను. ఇట్లు కవి ఇచ్చట కథాసత్యత్వమును దేవ సంబంధముతో ప్రమాణీకరించెను.

క్షేమేంద్ర బృహత్కథా మంజరిలో కథ చాలా జాగరూకతతో ప్రారంభింపబడెను. అందు ఈశ్వరుడు పూర్వపరిచిత కథలను చెప్పుటచే పార్వతీకృత విమర్శ పరిహరింపబడినది. అందు ప్రథమ లంబకమున పార్వతీ శాపముచే పుష్పదంతుని మిత్రుడయిన మాల్యవంతుడు భూలోకమున గుణాఢ్యుడుగా జన్మించెను. అందు సత్యగుణాఢ్యుడని తెలుసుకొనుటకు ఆధారములు కనబడుచున్నవి. గుణాఢ్యుని తల్లి బ్రాహ్మణస్త్రీ. తండ్రి నాగరాజ కుమారుడు. అందువలన రామాయణ మహాభారత కర్తలయిన వాల్మీకి వ్యాస మహర్షుల వలె క్షేమేంద్రుడు దైవప్రకృతియు మహాకవి అని చెప్పవచ్చును. క్షేమేంద్రుడు బృహత్కథను సంక్షేపించెను. నేపాల మహాత్మ్యమున బృహత్కథ నేపాళీ గ్రంథము రామాయణము పరస్పరము పోల్చబడినవి. దైవాజ్ఞచే వాల్మీకి గుణాఢ్యులు నేపాలదేశమునకు వెళ్లుదురు. వాల్మీకి రామాయణమునకు ఉచిత పవిత్రస్థలముకొరకు నేపాళమునకు వెళ్లును. గుణాఢ్యుడు పూర్వ విద్యాధర లోకమును ప్రవేశించుటకు కొన్ని నియమములను పాటించుటకు నేపాళమునకు వెళ్ళును. ఇరువురూ శివలింగమును నేపాలదేశమున సాపించుదురు.

సోమదేవ కథాసరిత్సాగరమున శాతవాహనుడే, పైశాచిక భాషలో బృహత్కథ యెందులకు రాయబడెనో తెలియజేయుటకు కథా పీఠ లంబకమును స్వయముగా రచించెను. ఇట్లే 5వ లంబకమును స్వయముగా రచించెను. ఇట్లే 5వ లంబకము కథా సరిత్సాగరమున పరిసమాప్తి నొందెను. శాతవాహన పదము వంశనామమే. గుణాఢ్యునకు ప్రాకృత కవియైన హాలునకు సంబంధము కలదు. గుణాఢ్యుడు హాల పూర్వీకుడు. దండి మహాకవికూడా బృహత్కథను, గుణాఢ్యుని, 6వ శతాబ్దియందు కీర్తించెను. బృహత్కథలలో మధ్య ఎచ్చట కూడా వరరుచి గుణాఢ్య సంబంధము లభించదు. వరరుచి మొదటనే అంతర్ధానమగుచున్నాడు. ప్రాకృత, సంస్కృత, వ్యాకరణ సంబంధముచే వరరుచి ప్రసిద్ధుడు. ఇతని గ్రంధారంభ ప్రవేశము ప్రసిద్ధవైయాకరణులను పరిచితము చేయుచున్నది. ఇట్లు వరరుచి చిత్రకథలకు చక్కగా సంబందము కల్పింపబడినది. భూలోకమున కాణభూతి సంబంధము సాధారణమే. స్వర్గలోకమున గుణాఢ్యుడు రెండువిధములుగా విభజించబడెను. వరరుచి రూపముతో జన్మించిన పుష్పదంతుడు పార్వతిచే శపింపబడెను. అతడే బృహత్కథకు భూలోక ప్రవక్తగా నుండదగినవాడు. ఇతడు మాల్యవంతుని కంటె స్వల్ప దండమును పొందెను. మాల్యవంతుని దోషము స్వల్పమే. అతడు మిత్రదోషమును క్షమించుటకు పార్వతిని ప్రార్థించెను. రహస్యముగా బృహత్కథను వినుటవలన పుష్పదంతునిదే గొప్ప అపరాధము. వరరుచి గుణాఢ్యుని జన్మస్థానమయిన ఉజ్జయినీ నగరమందే జన్మించెను. అందువలన క్షేమేంద్ర, సోమదేవులచే కాశ్మీరమున పొందబడిన బృహత్కథయే సంస్కృతమున అనువదింపబడెనని "లకోటే" పేర్కొనెను. పొందెనో ఇచ్చట నిర్దేశింపబడినది. అనేక ఉపకథలతో వ్యాపించిన

ఈ ఆధారముల ననుసరించి ఒకానొక కథా సంకలన కర్త లేదా ప్రకాశకుడు వ్యాకరణ విషయ వివాద సంహిత కథను, అనేక ఉప కథలను బృహత్కథలో తరువాత జేర్చి యుండవచ్చును. కథాసరిత్సాగరమున లభించు విషయములకంటె నేపాల బృహత్కథా శ్లోక సంగ్రహ గుణాఢ్యకథ సాధారణముగా, సహజముగా మూల సన్నిహితముగా నున్నట్లున్నది. ఇందు ఒకే గుణము కనబడుచున్నది. ఇతడే మానవ జీవనమున గుణాఢ్యుడను నామముతో వ్యవహరింపబడెను. నాయకుల పేర్లుగూడా వసిష్ఠ యాజ్ఞవల్క్య స్మృతికొఱకు ఆ పేరుతోనే నేపాలురచే వ్యవహరింపబడుచున్నవి. ఇందలి కథా పరిణామములకు కారణమిదియే. బుధస్వామి క్షేమేంద్ర సోమదేవులకంటె పూర్వకాలీనుడు. ఇతని కాలము 7 లేదా 8 శతాబ్దము అయి వుండవచ్చును. బృహత్కథా శ్లోక సంగ్రహమున క్షేమేంద్ర సోమదత్త గ్రంథములందువలె గ్రంథ ప్రకాశకులచే కథా పరిణామములు చేయబడలేదు. అందువలన మూలకథకు బృహత్కథా శ్లోక సంగ్రహము అతి సన్నిహిత గ్రంథమని చెప్పవచ్చును.

కథాపీఠ, కథాముఖ లంబకములు రెండూ ఉపోద్ఘాతరూపములే ఒకే గ్రంథమున రెండు ఉపోద్ఘాతము లుండుట వ్యర్థము. మూలకథయందు కథాముఖ లంబకమే యుండి ఉండవచ్చును. కథాపీఠ లంబకము తరువాత గ్రంథ ప్రకాశకులచే కల్పింపబడి గ్రంథములో ప్రవేశించెనని లకోటే కూడా అభిప్రాయపడుచున్నాడు. ప్రథమ లంబకము మాత్రమే ఇట్లు స్వతస్సిద్ధమని చెప్పవచ్చును.

కథాముఖ లంబకము :

లంబక నామము ననుసరించి ఇందు ఉపోద్ఘాత విషయమే

ించవచ్చును. కథాకథకుని పేరు కథ రచనోద్దేశము, కథావరిధి విధానము, నరవాహనదత్త ప్రశంస ఇత్యాది విషయములిందు పొందుపరచబడినవి. సాధారణముగా పంచతంత్రాది గ్రంథములకు ఇందలి కథాముఖమువలె కథాముఖము యుండవలెను. ప్రధానకథా చరిత్రమున సులభముగా ఈ కథలను పొందుపరచ వచ్చుననెడి ఉద్దేశ్యముచే సోమదేవుడు పంచతంత్ర కథలకు ఉపోద్ఘాత రూప కథాముఖమును కథాసరిత్సాగరమున పరిత్యజించెను. తాను అను సరించిన హస్తలిపి గ్రంథములను అనుసరింపక ఈ కథాముఖమును స్వీకరించెను. మూల బృహత్కథలో కథాముఖము సందలి విషయ ములు భిన్నముగా నుండి యుండును. ఇచ్చట సగభాగముకంటె అధికముగా లంబకమున ఉపకథలు కలవు. ఆ కథలన్నింటికిస్థానము ఇచ్చుటకు యథాశక్తి వాటిని సంక్షేపింపవలెను అందువలన ద్వితీయ లంబకము బహు సంఘటనలతో నిశితముగా నిర్మింపబడినది. నాయక జన్మ, బాల్యము ఉజ్జయినీ పాలకుడైన చండమహాసేనుడు, అతడు పుత్రికయైన వానవదత్తను వివాహమున ఉదయనునకు ఈవ్వదలం చుట వివాహప్రయత్నము కౌశాంబీలో వివాహము ఈ విషయములచే లంబకము పరిసమాప్తి అగును. ఇందు ఉదయనుడు ఉన్మాదివలె కనవడును. కానీ ఆ విషయ మిచ్చట సంక్షేపముగా ప్రదర్శింప బడినది.

## లావణక లంబకము

ఈ లంబకమున ఉదయనుడు స్త్రీ సుఖము చే మృగయా వినోదముచే కాలము గడుపును. అందువలన అతని అమాత్యులు ఇతడు రాజ్యవిస్తరణ చేయడని తలంచి దుఃఖితులైరి. రాజ్యవిస్తరణ

కొఱకు దిగ్విజయ ప్రయత్నోత్సుకులైరి. దిగ్విజయముకొఱకు సైన్య బలవృద్ధికొఱకు ప్రద్యోత పుత్రికయైన పద్మావతితో ఉదయనునకు వివాహము జరిపించుట మంచిదని తలంచి వాసవదత్తను ఓదార్చి పద్మావతీ ఉదయనుల వివాహ కార్యమును జరిపించిరి. ఇట్లు వివాహ సంబంధముచే సైన్యబల సమృద్ధిచే సముద్ర పూర్వదిశనుండి మొదలుకొని దండయాత్రను ఆరంభించిరి. ఉదయనుడు భారత దేశమునందంతటను పరిభ్రమించి కౌశాంబికి చేరుకొనెను. పద్మావతీ సంబంధ విషయములతో వ్యాప్తమైన ఈ అంబకము మూలకథకు అధిక సంక్షేపమువలె నున్నది. ఇందు ఉపకథలను ప్రవేశపెట్ట వచ్చును. చారిత్రక దృష్ట్యా ఉదయనుని విజయమే ఇచ్చట ప్రధానమైనది. బ్రహ్మదత్తుని పరాజయము తప్ప ఇతర పరాజిత రాజులు, విజేతల పరాక్రమ కృత్యములు ఇచ్చట వర్ణింపబడలేదు. ఉదయనుడు కాశికి వెళ్ళి అచ్చటనుండి దక్షిణాభిముఖుడై పిమ్మట పశ్చిమ దిగ్విభాగమును జయించి సింధూదేశమును ఆక్రమించెను మ్లెచ్ఛతురుష్క, పారశీక హూణ జాతీయులు ఉదయనునిచే పరాజితులైరి. ఇతడు ప్రాచీన, పౌరాణిక పాలకులవలె మహమ్మదీయ, తురుష్క, పర్షియా, హూణ జాతీయులతో యుద్ధము చేసెను. కానీ హూణులు 5వ శతాబ్దమున రెండవభాగమువరకు చరిత్రలో కనపడరు యవన శాఖతోకూడా ఉదయనుడు యుద్ధము చేసియుండును. సోమ దేవునిచే నిర్దేశింపబడిన ప్రజలు పశ్చిమోత్తర, పశ్చిమ, దిగ్భగము లకు సంబంధించినవారై యుండవచ్చును. దేశప్రదక్షిణము చేసిన వానివలె ఉదయనుడు దిగ్విజయ యాత్ర చేసెను. మధ్య భారత దేశము దక్షిణమార్గములో నిర్దేశింపబడినది. పిమ్మట ఇతడు అలకా నగరమున ప్రవేశించెను. విమానమును కాని మంత్రప్రభావోపేతము

మైన పాదుకలనుగానీ ఇతడు వుపయోగింపలేదు. అలకానగరము కుబేర పట్టణము. అతడు దానినెట్లు చేరెనో నిర్దేశింపబడలేదు. అనేక వుపకథలలో ఈ లంబకమున మంత్రప్రభావముచే వాయుమార్గమున వెళ్లిన వ్యక్తులు నిర్దేశింపబడిరి. ఈ లంబకముననే మంత్రప్రభావ వాయుమార్గయానము ఎందులకు ప్రవేశపెట్టబడినదో కారణముచెప్ప జాలము. ప్రాచీన సంప్రదాయము ననుసరించి మూలబృహత్కథలో వుదయనుడు అలకానగరమునకు వాయుమార్గమున విమానముద్వారా వెళ్లియుండవచ్చును. ఇతడు మరణించుటకు పూర్వము కౌశాంబి సహితనమైన తన రాజ్యము నంతటినీ గోపాలునకు సమర్పించెను. ఈ గ్రంథమున ఈ లంబకమున కాశ్మీరదేశ ప్రకాశకులచే అతిశ్రద ప్రదర్శింపబడినది.

4. నరవాహనదత్త జననము :

ఈ లంబకమున పూర్వలంబకము ననుసరించి కథాక్రమము ముందుకు సాగును. వాసవదత్త గర్భమును ధరించి గర్భదోహద పూరణముకొఱకు విమానసంచారము చేయును. గర్భఫలముగా నర వాహనదత్తుడు జన్మించెను. పూర్వలంబకములందువలె యిచ్చటకూడా వుపకథలు అధికభాగము వ్యాపించియున్నవి.

5. చతుర్దారికా లంబకము :

రెండు,మూడు,నాలుగు లంబకములు వుదయుని కథాచరిత్రతో వ్యాప్తములైనవి. ఇచ్చట ఆ కథకు విచ్ఛేదముకలుగుచున్నది, నర వాహనదత్తుడు భావి విద్యాధర చక్రవర్తి అని ప్రకటింపబడెను విద్యాధర రాజకుమారుడైన శక్తివేగుడు విద్యాధర వదవిఎట్లు

ఈ లంబకమున కథైక్యము కనబడుచున్నది. గుణాఢ్య బృహత్కథలో ఈ కథ ఉన్నదో లేదో, తెలియదు. నరవాహన దత్తుని కొన్ని వీర కృత్యములు ఇచ్చట ప్రక్షిప్తములయినవో అను విషయమును నిర్ణయింపలేము. ఈ లంబకవిషయములు పూర్వకథా సంబంధ రహితమును. ఈ లంబకములోని కథలలోకూడా పూర్వాపర సంబంధములేదు అందువలన మూలకథకు విచ్ఛేదము కలగకుండా ఎచ్చటోఒకచోట ఈ సంక్షిప్త కథా సంఘటనలను పెట్టవచ్చును.

6. మదనమంజుకా లంబము :

నరవాహనదత్తుడు స్వయముగా తాను విద్యాధర చక్రవర్తి పదవిన పొందిన కథను సప్తఋషులచే వారి భార్యలచే ప్రశ్నింపబడి వారికి నివేదించును. తన కథను తానే చెప్పుట యిచ్చట విశేషము. ఈ విషయము గ్రంథారంభముననే నుండదగినది. కాశ్మీరకవియైన సోమదేవుడు సంప్రదాయ పాలన కొఱకు నరవాహనదత్తుడు స్వీయ కథను చెప్పెనని ఈ ప్రసిద్ధ విషయమును సూచించుటకు లంబకారంభమున ఈ విషయమును ప్రవేశపెట్టి యుండవచ్చును. ఏసందర్భమున నరవాహనదత్తుడు స్వీయకథను (మహర్షులకు) పురుషులకు నివేదించెనో అను విషయము ఈ లంబకమునలేదు. 16వ లంబకమున నరవాహనదత్తునకు ఋషులతో సమాగమము అచ్చట వారి ప్రశ్నలకు సమాధానముగా స్వీయ కథాకథనమును అంశములు వివరముగా నిర్దేశింపబడినది.

ఈ లంబకమున నరవాహనదత్తుడు ఉదయనుడు మరణించిన పిమ్మట కశ్యప ఆశ్రమమున వర్షాకాలమున తనమామతో గోపాలకునితో గడుపును. ఋషి సమావేశమున వారిచే ప్రశ్నింపబడి వారికి

తన వీరకృత్యములను నివేదించెను. నరవాహనదత్తుడు ఇచ్చటనుండి ఆరవ లంబకము వరకు తనొక్కడే కథను చెప్పెను. 16వ లంబకము 6వ లంబకమునకు పూర్వమే ఉండదగినది. ఈ విషయమే అనుచితమై శ్రేశకారిగా ఉన్నది. ఇచ్చట సోమదేవుడు మూలగ్రంథము ననుసరించుటచే అనాదృతుడు. కాశ్మీరదేశ సంకలన కర్తలు ఉద్దేశ్యపూర్వకముగా కథాక్రమమునకు పరిణామము చేసిరి, వారు అసంపూర్ణ గ్రంథములను లేదా రెండువిధములైన కథాక్రమ గ్రంథములను ఉపయోగించి యుండవచ్చును. లేదా వారు సవీన విషయముల నన్నింటిని ప్రక్షేపించుటకు అట్టి కథాక్రమము ననుసరించియుందురు. కథాక్రమ పరిణామమునకు కారణమేదియైననూ కావచ్చును. కాశ్మీర దేశీయ గ్రంథ ప్రకాశకులచే ఉపయోగింపబడిన కథాక్రమము గుణాఢ్య బృహత్కథా కార్యక్రమమును అనుసరింపలేదు.

ఈ లంబకముయొక్క ప్రాథమిక విభాగము బౌద్ధరాజైన కళింగదత్తుని యొక్క అతని పుత్రికయైన కళింగసేన కథతో నిర్మింపబడినది. బౌద్ధమత మూలకముగా యుండనేక ఉపకథలు ప్రవేశపెట్టబడినవి. పిమ్మట కళింగసేన కథ ఒక్కటియే ప్రాముఖ్యము వహించును. ఈమె తన సఖియైన సోమప్రభ సహాయముచే ఉదయనుని దర్శించెను. ఉదయనుడు వెంటనే ఆమె ప్రేమపాశములో పడెను.

ఇట్టి విశ్వాసపాత్రుడయిన అమాత్యుడు యౌగంధరాయణుడు ఉద్దేశించిన కళింగసేనల వివాహము రాజనీతి పరిస్థితులననుసరించి అభిలషణీయము కాదని నిశ్చయించి కళింగసేన అపవిత్రురాలని అసత్యమును నిరూపించి ఉదయనుని తద్విరక్తునిచేసెను. ఆమె యందు అనురాగముగల మదనవేగునితో ఆమెకు సమాగమము ఏర్పడుటచే ఒక పుత్రిక జన్మించెను. పత్యమునకు ఆమెకు పుత్రుడే

జనించెను. కాని శివుని ఆజ్ఞను అనుసరించి పుత్రుని మార్చి రతి దివ్యావతారిణీ అయిన పుత్రికయే జన్మకాలమున్న తల్లికడ ఉంచబడినది. మదనమంజుక అను పేరుగల ఆమె నరవాహనదత్తునకు వాగ్దానము చేయబడిన పత్ని. ఈ విషయములన్నియు విశదముగా నిచ్చట చెప్పబడినవి. పిమ్మట మదన మంజుకయొక్క ద్వాదశ వర్ష పర్యంత కాల విషయములు అధికముగా సంక్షేపింపబడినవి. నరవాహనదత్తుడు దత్తుడుకూడా యువకుడగును. కళింగసేనా విషయమే ఈ లంబకమున అధికముగా వ్యాప్తమైయున్నది. కాని లంబకము మదన మంజుకా లంబకమై వ్యవహృతమైనది. మూల గుణాఢ్య కథలో మదన మంజుకా విషయమే ఈ లంబకమున అధికముగా వ్యాప్తమై యుండవచ్చును.

సుదీర్ఘ విషయములు కూడా ఒకే వాక్యమున కాశ్మీరదేశీయ కథా ప్రకాశకులచే సంక్షేపించి చెప్పబడినవి. నరవాహనదత్తుడు సర్వ పూజకొరకు నాగవనమునకు వెళ్లును. ఇచ్చట నాగవనమునకు వెళ్ళుటకు మరియొక ప్రయోజనమేదియు ప్రదర్శింపబడలేదు. మూలబృహత్కథలో నరవాహనదత్తుని సాహస వీరకృత్యములయొక్క ఒకటి యిచ్చట యున్ననూ ఈ గ్రంథమున పరిహరింపబడినది. ఈ లంబకము ప్రథమభాగమున మూర్ఖత్వముచే అనేక విషయ పరిణామములు చేయబడినవి. కళింగదత్తుడు మహాబలోపేతుడయ్యున్ననూ మదనవేగుని నుండి తన పుత్రికను రక్షించుటకు ఉద్యమిన కళింగసేనలకు యౌగంధరాయణుడు చేయు వివాహప్రతిరోధమును నివారించుటకు ప్రయత్నము ఎందుకు చేయలేదో అను అంశమునకు సమాధానము కథానరిత్సాగరమున లేదు. మూలబృహత్కథలో దీనికి కారణముండవచ్చును.

ఇట్లు నిశిత పరిశీలనము వలన అనేకవిధములుగా కథాసంక్షేపమువేయ బడినట్లు తెలియుచున్నది,

7. రత్నప్రభా లంబకము :-

ఇందలి మొదటి భాగమున విద్యాధరియైన రత్నప్రభతో నరవాహనదత్తునకు జరిగిన వివాహము వర్ణింపబడినది. అందువలన లంబకమునకు రత్నప్రభా లంబకమని వ్యవహారము. నరవాహన దత్తుడు వివాహము కొరకు స్వర్గమునకు తీసికొని పోబడును. భూలోక మునుండి స్వర్గలోకమునకు వెళ్ళుట యిది ప్రథమము. పూర్వలంబ కాంత కథాసమాప్తికి ఈ లంబక ప్రథమ భాగమందలి నరవాహన దత్తునియొక్క వీర కృత్యమునకు సంబంధమే లేదు. కర్పూరికా రాజ కుమారి కొరకు నరవాహనదత్తుడు సాహసాన్వేషణము చేయును. ఈ విషయము రత్నప్రభా విషయముకంటె మిక్కిలి ప్రధానమయినది అందువలన లంబకనామముకూడా కర్పూరికా లంబకమని పెట్టినచో బాగుండెడిది. అందువలన మూల బృహత్కథలో రత్నప్రభ అనెడి పేరుతో కర్పూరికఅనెడి భిన్న లంబకములు ఉండి యుండవచ్చును.

8. సూర్యప్రభా లంబకము: ఐదవలంబకమువలె దీనినికూడా ప్రత్యేక కథారూపముగా ఎచ్చటోఒకచోట ప్రవేశపెట్టియుండవచ్చును బౌద్ధమత, పౌరాణికగాథారూపముతో, హిందూమత విశ్వాస రూపముతో ఇందు మహోన్నత ఉ.హాతీత భావములు కనబడుచున్నవి.

9. అలంకారవతీ లంబకము :-

ఇందలి మొదటి భాగము లంబకము పేరుతో వ్యవహరింప బడు విద్యాధరియైన అలంకారవతితో నరవాహనదత్తుని వివాహమును వర్ణించును. అష్టమ లంబకముతో ఈ లంబకమునకు సంబంధములేదు అందువలన ఎచ్చటైనను ఈ వివాహ భాగమును ప్రవేశపెట్టవచ్చును

ఇందలి రెండవభాగము అతిశ్రద్ధాజనకమైనది. ఇందు నరవాహన దత్తుడు శ్వేతద్వీపమున నున్న విష్ణువు కడకు వెళ్ళుట, నారదుడు శ్వేతద్వీపమునకు వెళ్ళుటను అనుసరించుచున్నది. మహాభారతమున కథాసరిత్సాగరమున శ్వేతద్వీప గమనము ఒక మూలకథాసంఘటన మూలకమని "లకోటే" పేర్కొనెను. బృహత్కథనుండి మహాభారతము గాని మహాభారతమునుండి బృహత్కథగాని శ్వేత ద్వీప గమన సంఘటనను గ్రహించి యుండవచ్చును. లేదా బాక్ట్రియాదేశమున క్రైస్తవ జాతి కడకు వెళ్ళు యాత్రిక కథనుండి శ్వేతద్వీప గమన కథ రెండుచోట్లా స్వీకరింపబడి యుండవచ్చునని "లకోటే" అభిప్రాయము.

## 10 శక్తియశోలంబకము

9వ లంబకమునకు దీనికి సంబంధములేదు స్త్రీ చాంచల్యకథా బాహుళ్యానంతరము నరవాహనదత్తునకు శక్తియశ అనుపేరుగల విద్యాధర కన్యతో వివాహము జరుగును. వివాహ ముహూర్తము ఒక మాస పర్యంతము నిరీక్షణీయముగా ఉండెను. అపుడు ఆ కాలమును గడుపుటకు చెప్పబడిన పంచతంత్రాది అనేక కథలు ఇచ్చట చక్కగా నివేశింపబడినవి.

## 11 వేలానామక ఏకాదశలంబకము

నరవాహనదత్తునియొక్క పైశాఖగమనము, జయేంద్రసేనతో అతని వివాహమును ఇచ్చట వర్ణింపబడినవి. వైశ్యపత్నియైన వేలా అను ఆమె పేరుతో ఈలంబకము వ్యవహరింపబడుచున్నది. ఈ లంబకము అతిహ్రాసమగుటకు, కథా విచ్ఛేదమునకు కారణము తెలియ

కున్నది. ఉద్దేశపూర్వకముగా రాబోవు లంబకముల సుదీర్ఘవ్యాప్తి కొఱకు ఈ లంబకము సంక్షేపింపబడినదని ఊహింపవచ్చును.

## 12 శశాంకవతీ లంబకము

ఈ లంబకము అక్రమముగా ఇచ్చట నివేశింపబడినది. ఎందు వలననగా నరవాహనదత్తుడు మదనమంజుకా విరహితుడయ్యెనని అవిరళముగా, అవిచ్ఛేదముగా చెప్పబడినది. ఈమె విషయము ఏ మాత్రముకూడా ఇచ్చట సూచింపబడలేదు. లంబకారంభమున లలిత లోచన అదృశ్యమయ్యెనని తెలుసుకొనుచున్నాము. పిమ్మట లంబ కము అదృష్ట మదనమంజుకా రహస్యమును ఏ మాత్రము పరి ష్కరింపలేదు.

## 13 మదిరావతీ లంబకము

పూర్వలంబక కథకు అవిచ్ఛేదరూపకముగా ఈ అల్పలంబకము కలదు. మదనమంజుకయే అదృశ్య మయ్యెనని, లలితలోచన కాదని నరవాహనదత్తుడు శోకమగ్నుడయ్యెను. కానీ పిమ్మట లలితలోచన కూడా అదృశ్యురాలయ్యెను. కానీ నరవాహనదత్తుడు లలితలోచన కనబడకుండుటచే విచారింపలేదు.

ఇందు నరవాహనదత్తుడు ఇరువురు బ్రాహ్మణుల కడకువెళ్ళెను వారు తమ క్లేశానుభావములను వాటినుండి గట్టెక్కిన విధానమును తెలిపి మదనమంజుకాన్వేషణకొఱకు అతనిచే ప్రోత్సహించిరి. మొదట బ్రాహ్మణకథయందు నాయిక నామముచే ఈ లంబకము వ్యవహరింప బడుచున్నది. తత్కథా నంతరము నరవాహనదత్తుని అమాత్యులు లలితలోచనా ప్రసక్తినికూడా విస్మరించి కౌశాంబికి వెళ్ళుదురు. మదన

మంజుకా విషయము ఏ మాత్రముకూడా ఇచ్చట సూచింపబడలేదు.

## 14 పంచవామకమైన చతుర్దశలంబకము

లంబకారంభమున బహుకాలంనుండి అదృష్టగా నున్న మదన మంజుక ప్రత్యక్షమై మరలా అంతర్ధానమగును. అందువలన మరలా ఆమె కొఱకు దుఃఖితుడగు నరవాహనదత్తుని అన్వేషణా ప్రయత్నము కూడా విఫలమయ్యెను, వేగవతి నరవాహనదత్తుని పరిణయమాడుటకు మదనమంజుకా రూపమును ధరించెను. ఇరువురి పరిణయమైన పిమ్మట నరవాహనదత్తుడు వేగవతి నిజస్వరూపమును తెలుసుకొనెను వేగవతి మదనమంజుకను నరవాహనదత్తునకు వెదకి సమర్పింపగల నని వాగ్దానము చేసెను. కానీ విద్యాధరుడైన మానసవేగుడు తన సోదరియైన వేగవతిని మరియొక ప్రదేశమునకు తీసికొని వెళ్ళెను. వేగవతియు నరవాహనదత్తుని ఆషాఢ పర్వతమునకు తీసికొనివెళ్లెను. అందువలన మానసవేగుడు వారిని సంహరించుటలో విఫలుడయ్యెను మంత్రశక్తి సహాయముచే వేగవతి విజయమును పొందెను. ఆమె నరవాహనదత్తుని రక్షించుటకు గంధర్వనగరమున నిర్జలకూపములో నుంచెను. ఇట్లు రక్షింపబడిన నరవాహనదత్తుడు వీణావాద్య నైపుణ్య ముచే రాజపుత్రికయైన గంధర్వదత్తను పరిణయమాడెను. మదన మంజుకను విస్మరించి గంధర్వదత్తతో స్వర్గసుఖముతో వైవాహిక జీవనకాలమును గడపెను. పిమ్మట ఒకానొక విద్యాధరి నరవాహన దత్తుని శ్రావస్తి నగరమునకు తీసికొని వెళ్ళి తన పుత్రికయైన అజినా వతితో పాణిగ్రహనము చేయించెను. పిమ్మట ఉద్యానవనమునగల నరవాహనదతుని ప్రసేనజిత్తను రాజు సమీపించి తన పుత్రికయైన భగీరథయశను ఇచ్చి వివాహము చేసెను.

ప్రభావతి అనుపేరుగల విద్యాధరి నరవాహనదత్తుని శయ్యా గృహమునకు వెళ్లి అతనిని ఆకాశమార్గముద్వారా మదనమంజుకా సన్నిధికి తీసికొని వెళ్ళెను. మార్గమాధ్యమున అగ్ని ప్రదక్షిణము చేసి అతని పత్ని అయ్యెను. నరవాహనదత్తుడు ప్రభావతీ వేషమును ధరించి ఆమె సహాయముచే మదనమంజుక కడకు వెళ్ళెను. మానస వేగుడు ఈ రహస్యమును తెలుసుకొనెను. విద్యాధర న్యాయస్థానమున నరవాహనదత్తుడు నిర్దోషి అని నిర్ణయింపబడెను. దానిచే అసంతృప్తుడైన మానసవేగుడు నరవాహనదత్తునితో యుద్ధము చేయదలచెను నరవాహనదత్తుడు ప్రభావతివలన అదృశ్యుడయ్యెను. కాని మదన మంజుక మానసవేగుని బంధనములోనే యుండెను. ప్రభావతీ నర వాహనదత్తుల యోగజీవితము గడుచుచుండగా అజీనావతి తనతల్లితో కలిసి అచ్చటికి వచ్చి నరవాహనదత్తుని పరిణయమాడెను. పిమ్మట అతడు అజీనావతి, ప్రభావతులతో కలిసి కౌశాంబికి వెళ్లి వేగవతీ గంధర్వదత్తాది భార్యలను పొందెను. పిమ్మట నరవాహనదత్తుడు శివుని వలన అష్టసిద్ధులను పొందవలెనని నిర్ణయింపబడెను. ఆ ప్రయత్న మున ఐదు మంది విద్యాధర కన్యలు నరవాహనదత్తుని ఒకేసారి పరిణయమాడిరి. ఈ పద్య విద్యాధర సంఘటనను ఆధారముగాగొని లంబకము పేరుకూడా అన్వర్థముగా పంచ అని పెట్టబడినది. పిమ్మట ఒక వివాహమైన తర్వాత గొప్ప యుద్ధ మేర్పడెను. చక్రవర్తి ధర్మముగా నరవాహనదత్తుడు సప్త రత్నములను పొందవలెను. అతడు మాయాశక్తిమంత్రములు గల చందర వృక్షమును స్వాయ త్తము చేసుకొనెను. రత్నప్రాప్తి వృత్తాంతము పంచదశలంబకము వర్ణింపదగియుండుటచే ఇచ్చట స్వీకరింపబడలేదు. ఈబంబకము

సంక్షిప్తముగా చేయబడిన 164, 165, 166 ఉపకథలు తప్ప సమగ్రముగా ప్రధాన కథావర్ణనకే ఉపయోగింపడినది. ఇందనేక ప్రధాన విషయములు కలవు. మొదట వివాహము లందు పరంపరగా వర్ణింపబడినవి. నవ వివాహములకు మదనమంజుకయొక్క అదృశ్యతయే కారణము. ఈగ్రంథము సాహస ప్రయత్నములచే వివాహచక్రమును వర్ణించెను. ఈ వివాహములలో నరవాహనదత్తుని పంచ విద్యాధర కన్యలతో వివాహమును తులనాత్మకముగా పరిశీలించినచో అప్రధానమని చెప్పవచ్చును. అయినప్పటికిని వారి నామముతోనే లంబకము కూడా వ్యవహరింపబడినది. వాస్తవికముగా ఈలంబకముకూడా వ్యవహరింపబడినది వాస్తవికముగా ఈ లంబకమునగల యితర వివాహములలో ఒక్కొక్క వివాహమునకు ఒక లంబకము అవశ్యకము. కానీ ఆ వివాహముల నన్నింటిని సంక్షేపించి ఒకే లంబకమున వర్ణించి కేవలము పంచ విద్యాధరీ వివాహకారణమువలన ఈలంబకమునకు పంచ లంబకమని పేరు పెట్టుట గొప్పదోషమని చెప్పవచ్చును.

ఇట్టి దోషములు గ్రంథమున అనేకములు కలవు. సప్తమ, నవమ, దశమ లంబకములు అట్టి దోషములకు ఉదాహరణములు. బృహత్కథా శ్లోక సంగ్రహమును పరిశీలించినచో యిందలి అనౌచిత్య దోషములు(దోషములు) సత్యమని నిర్ధారింపవచ్చును. బృహత్కథా శ్లోక సంగ్రహమున ఒక్కొక్క వివాహము ప్రత్యేక భాగమున కథాసరిత్సాగరమునందు కంటె విశదముగా వర్ణింపబడినది. కథాసరిత్సాగర ఆధారము ననుసరించి 14వ లంబకముకంటె పూర్వమే ఈలంబకము ఉండవలెను. 13వ లంబకము 12వ లంబకము తర్వాత కథా పూర్వకథను అనుసరించి చక్కగా వినివేశింపబడినది. అట్లు కానిచో మదనమంజుకయొక్క అదృశ్యతా కారణముచే నిర్మింపబడిన ద్వాద

త్రయోదశ లంబక సంఘటనలే ఉండెడివి. మదన మంజుక కొరకు అన్వేషించుట అన్వేషణ ఫలముగా నరవాహనదత్తునకు జరిగిన వివాహములు సాహసకార్యములు ఉండెడివి కావు.

15. మహాభిషేక లంబకము :-

ఈ లంబకము అను సంధాన లంబకము. నరవాహనదత్తుడు సప్త రత్నములను పొంది తన అంతిమ విజయ యాత్రను ప్రారంభించి చివరి శత్రువైన మందరవేగుని జయించెను. పిమ్మట తన విద్యాధర రాజ్యమును స్థిరపరచుటకు ప్రయత్నించును. పూర్వ లంబకము నందువలె ఇచ్చటకూడా మరలా 5 మంది విద్యాధర కన్యలను పరిణయమాడి వృషభ పర్వతనమున చక్రవర్తి సింహాసన ఆరోహణోత్సవమున నిమగ్నుడగును. విద్యాధర చక్రవర్తి అగును. అతని ఇరువదినాలుగు మంది భార్యలలో మదన మంజుకయే కిరీటిధారిణియైన పట్టమహిషి అగును. వాసవదత్త - పద్మావతి - ఉదయనులు కూడా ఇతని ఆహ్వానము పురస్కరించుకొని పుత్రోత్సవమును చూచుటకు వచ్చిరి సర్వ సంతోషముచే ఉత్సవము పరిసమాప్తము కాగా లంబకయు సమాప్తమగును. ఇంతవరకు కథా సర్వస్వమును ఊహింపవచ్చును. కాని మరలా మూ లంబకములడు వర్ణ్య విషయము వైశిష్ట్యముగా కినబడుచున్నది.

16. సురతమంజరీ నామక షోడశ లంబకము :-

కొన్ని సంవత్సరములు గడచిన పిమ్మట ఒకానొక రాత్రి నరవాహనదత్తుడు దుష్ట స్వప్నమునుచూచి ప్రజ్ఞప్తి విద్యను ఆహ్వానించి స్వప్న ఫలమును ప్రశ్నించెను. ఉదయనుడు అతని భార్యలు అమాత్యులు స్వర్గస్తులైరి. గోపాలకుడు నాలకునకు రాజ్య భారమును

సమర్పించి నీలపర్వతమున కశ్యపాశ్రమ వాసులతో సన్యాస జీవితమును గడుపుచున్నాడని ప్రజ్ఞప్తి విద్య కౌశాంబీ వృత్తాంతమును నివేదించెను. అపుడు నరవాహనదత్తుడు తనమామగారిని దకూ నిశ్చయింపక వర్షాకాలమున అచ్చటనే కాలము గడిపెను.

పిమ్మట ద్యూతకుడు సురతమంజరిని బలముతో స్వాయత్తము చేసుకొనుటకు ప్రయత్నించెను. ఆమె పేరు తోడనే లంబకమునకు సురతమంజరీ లంబకమని వ్యవహార మేర్పడెను. న్యాయ విచారణమున పాలకుడు అతని అమాత్యులు ఆవశ్యకమైరి. వారినాహ్వానింపగా ద్యూతకుడు ప్రాణములతో బయటపడెను. పిమ్మట లంబకమున చివరి భాగమున తారావలోకకథ వర్ణింపబడినది. దీనిచే పూర్వకథకు ఎట్టి సంబంధము లేదు. ఈ కథ తర్వాతకూడా నరవాహనదత్తుడు నీల పర్వతముననే ఋషులతో నుండెను. ఆ సమయమున నరవాహనదత్తుడు తాను ఇరువది నాలుగు కన్యలను వివాహమాడిన విధమును, విద్యాధరి చక్రవర్తియైన విధమునకు సంబంధించిన వీర సాహసకథను చెప్పుమని ఋషులచే ప్రశ్నింపడెను. ఇందలి 61, 62 భాగములు 6వ లంబకము కంటె ముందుంచినచో కథాక్రమ పాలనముచే సర్వము సముచితముగా నుండి యుండెడిది.

17. పద్మావతీ లంబకము :-

ఇందు మదనమంజుకా విరహబాధ ఎట్లు సహింపబడినదని ఋషులు నరవాహనదత్తుని ప్రశ్నించిరి. ముక్తాఫల పద్మావతీ కథా ప్రవేశము కొరకు మాత్రమే ప్రశ్నింపబడిన ప్రశ్న ఇది. వీరికథతో లంబకము సమాప్తమగును, ఈ విషయము పదునాలగవ లంబకముననే వర్ణింపదగినది. అందువలన ఈలంబకము అక్రమ బద్ధతిలోనే వినివేశింపబడినదని చెప్పవచ్చును.

18. విషమశీలము :-

సోమదేవుడు కాశ్మీర దేశీయ గ్రంథ ప్రకాశకులు కూడా అనుబంధముగా చివర ఈ లంబకమును ప్రవేశపెట్టిరి. బుద్ధకాలమునుండి విక్రమాదిత్య కంటె నవీన కథానాయకుని అట్టివానిని ప్రజలు విన లేదు అందువలన ఈ కథా పరిచయము కొరకు విషమశీల లంబకము వినివేశింపబడినది. సంప్రదాయ పాలన కొరకు ఈ లంబకమునకు మూలకథా సంబంధము కల్పింపబడినది. 15 వ లంబకము తర్వాత కథా సమాప్తి విధావ్రకమము హేతువాద పోషకుడయిన వాని కెవని కైననూ అసమీచీనముగా, అహేతుకముగా, నిష్ప్రయోజన ఘటిత ముగా కనబడును.

### లంబక సంక్షేప విమర్శనము

1) కథా పీఠము - సంపూర్ణ గుణాఢకథావ్యాప్తము
2) కథాముఖ లంబకము - ఉదయన జన్మ మొదలుకొని
3) లావణక లంబకము - నరవాహనదత్త జన్మ వరకు
4) నరవాహనదత్త జననలంబకము అవిచ్ఛిన్న సంఘటనావర్ణనము
5) చతుర్దారికా లంబకము - విద్యాధర కథా ప్రధాన కథా సంబంధ రహిత మగుటచే దీని నెచ్చట నైననూ ప్రవేశ పెట్టవచ్చును.

6. మదనమంజుకా లంబకము :- సంబంధరహితమైన నవీనారంభము ఋషి సంఘటనచే 16వ లంబక ప్రథముభాగానంతరము దీనిని ప్రవేశ పెట్టవచ్చును.

7. రత్నప్రభా లంబకము :- మొదట ప్రణయకథా విషయద్వయ ముగా నుండి పిమ్మట భిన్న భాగముగా మార్పుచెందినది.

8) సూర్యప్రభా లంబకము — పంచమ లంబకమునందువలె విద్యాధరా కథా సంబంధ రహితమగుటచే ఎచ్చట నైననూ ప్రవేశపెట్టదగినది.

9) అలంకారవతీ లంబకము — ఇందు రెండు భిన్న ప్రధాన భాగములు పరస్పర సంబంధ రహితములు.

10) శక్తియశో లంబకము — సంబంధరహిత వివాహము అనేక ఉపకథా ప్రవేశముకొఱకు మాత్రమే ఉపయోగింపబడినది

11) వేలాలంబకము — అతిసంశయ ప్రద వివాహము అతిస్వల్ప పరిణామముతో కూడి యున్నది.

12) శశాంకవతీ లంబకము — ఇది అక్రమస్థలమున వినివేశింప బడినదని చెప్పవచ్చును.

13) మదిరావతీ లంబకము — నరవాహనదత్తుని ప్రధానపత్ని అదృశ్యమగును. అవాంతర కథలతో సంబంధములేకుండా ముందుకు వెళ్ళు మదనమంజుక ఈలంబకమునకూడా అధృశ్యము గానే కనబడుచున్నది.

14) పంచమలంబకము — మదనమంజుక అదృశ్యమగు టకు గల కారణము బహిర్గతము కావింపబడెను, నాయకుడు అనేక కన్యలను వివాహ [illegible]

| | |
|---|---|
| 15) మహాభిషేక లంబకము | పూర్వ లంబక కథా విషయము నకు అవిచ్ఛిన్న పూర్వగామి నాయకుడు విద్యాధర చక్రవర్తి అగును. ప్రధాన కథ సమాప్త మగును. |
| 16) సురతమంజరి లంబకము | సంబంధరహితమగు మరియొక లంకకము. దీని ప్రధానభాగం ఆరవ లంబక విషయమును విశదముగా చెప్పుటకు ఉప కరించును. అందువలన తత్పూర్వ భాగముగా వినివేశింపవచ్చును. రెండవభాగము దేనితోడను సంబంధములేనిది యగుటచే ఎచ్చటనైననూ దీనిని ప్రవేశ పెట్టవచ్చును. |
| 17) పద్మావతీ లంబకము | దీనికెచ్చటకూడా స్థానములేదు. (చతుర్దశ లంబక కాలమున చెప్పబడినది.) |
| 18) విషమశీల లంబకము | దీనికికూడా కథాభాగమున ఎచ్చటనూ స్థానములేదు. (చతు ర్దశ లంబక చెప్పబడినది.) అయి నప్పటికినీ దీనినెవ్విధముగను సమర్ధింపలేము. మూల బృహ త్కథలో ఈ లంబకము ఉండక పోవచ్చును. |

## షష్ఠ ప్రకరణము

### 6.1 బృహత్కథా శ్లోక సంగ్రహ - బృహత్కథా మంజరి కథాసరిత్సాగర సూక్తులు - ఒక పరిశీలనము : సూక్తివైచిత్రి-భాషా సంప్రదాయసూక్తులు

కవులు వివరణముచేగూడ వివరించుటకు సాధ్యముకాని సత్యమును సంక్షిప్తముగా సారవంతముగా లోకోక్తులచేచెప్పుదురు. సత్య ప్రకటన మిందు ఆలంకారికతవలెనే వ్యక్తమగును. మానవానుభవజాతమైన సర్వసాధారణ విషయము లోకోక్తులచే ప్రకాశింప జేయబడును.

ఐరోపా దేశమున "అరిస్టాటిల్" మొట్టమొదట లోకోక్తులను సంకలితము చేసెను. పిమ్మట లాటిన్ భాషలోని లోకోక్తులు క్రమముగా ఐరోపా భాష లన్నింటిలో వ్యాపించి అభివృద్ధి పొందెను. రష్యా దేశమున, స్పెయిన్ దేశమున లోకోక్తులు అధికముగా గలవు. భారత దేశమున బ్రాహ్మణ సాహిత్యమున 'సూక్తి' అనుపదము సుభాషిత పర్యాయ వాచకముగా ప్రయోగింపబడుచున్నది. రామాయణ, మహా భారతములందు అసంఖ్యాక సుభాషితములు కలవు. భర్తృహరి, చాణక్యాదులు బహుసూక్తులకు మూలపురుషులు సూక్తి - చాటూక్తి - లోకోక్తి - సుభాషిత - లోకప్రవాదాభాణకపదములు సంస్కృతమున పర్యాయార్థకములు. సూక్తిసంబద్ధమైన కథలనేకములు వేదకాలమున తత్పూర్వ కాలమునకూడ ఉండెను.

సుభాషిత ప్రశంస : సుభాషితములనుగూర్చి మహనీయుల మహితోక్తులు.

> సంసార కటు వృక్షస్యద్వేఫలేహ్య మృతోపమే,
> సుభాషిత రసాస్వాదః సంగతిస్సు జనైస్సహ

కటు సంసారములో సుభాషిత రసాస్వాదము అమృతోపమ మైనది.

భాషా సుముఖ్యా మధురా దివ్యా గీర్వాణ భారతీ।
తస్మాద్ధి కావ్యం మధురం తస్మాదపి సుభాషితమ్॥

భాషలలో దివ్య గీర్వాణ భారతి మధురమైనది. అందులో కావ్యము మధురమైనది. కావ్యమున కంటె సుభాషితము మధుర మైనది.

పృథివ్యాం త్రీణి రత్నాని జలమన్నం సుభాషితమ్,
మూఢైః పాషాణ ఖండేషు రత్నసంజ్ఞా విధీయతే॥

లోకమున జలము, అన్నము, సుభాషితములు అను మూడే మూఢులు పాషాణ ఖండములను రత్నము లనుచున్నారు.

ధర్మో యశో నయో దాక్ష్యం మనోహరి సుభాషితమ్,
ఇత్యాది గుణ రత్నానాం సంగ్రహీ నావసీదతి॥

ధర్మము, యశస్సు, నీతి, దక్షత, మనోహర సుభాషితము అను గుణ రత్నములు నశింపవు.

ద్రాక్షామ్లాన ముఖీజాతా శర్కరా చాశ్మతాంగతా।
సుభాషిత రసస్యాగ్రే సుధాభీతం దివంగతా॥

సుభాషిత రసము ముందట ద్రాక్ష వాడిపోయెను. శర్కర పాషాణత్వమును పొందెను. అమృతము భయపడి స్వర్గమునకు వెళ్ళెను.

అకలిత శబ్దాలంకృతి రనుకూలా స్ఖలిత పద నివేశాపి,
అభిసారికేవ రమయతి సూక్తిః సోత్కర్ష శృంగారా॥

శబ్దాలంకారము లేకున్నను పదస్ఖాలిత్యమున్నను స్ఫోటతర్ష శృంగా రాన్వితమైన సూక్తి అభిసారికవలె రమింపజేయును.

ఆస్వాదిత దయితా ధర సుధారసస్యేవ సూక్తయో మధురాః

ప్రియురాలి అధర సుధారసమువలె సూక్తులు మధురమైనవి.

"జాడ్యం నిహంతి రుచి మేతి కరోతి తృప్తిం నూనంసుభాషిత రసోన్య రసాతిశాయీ" - సుభాషితరసము అన్యరసాతిశాయియై జాడ్య మును పోగొట్టును. అభిరుచి కల్గించును. తృప్తిని పొందించును.

"ఖిన్నం చాపి సుభాషితేన రమతే స్వీయం మనః సర్వదా శృత్వాన్యస్య సుభాషితం ఖలు పునః శ్రోతుం పునర్వాంఛతి" ఖిన్న మైన మనస్సుకూడ సుభాషితముచే రమించును. ఇతరుల సుభాషిత మును విని మరల వినుటకు మనస్సు అభిలషించును అని పైవిధముగా సుభాషితోక్తులు మహనీయులచే ప్రశంసింపబడినవి.

కథాసాహిత్యమున సూక్తి వైచిత్రి :-

సూక్తులు దేశ, కాల, వ్యక్తి, కుల, మత, జాతి, భేదముచే అనేకవిధములుగా విభజింపబడుచున్నవి. ప్రధానముగా లౌకిక, ఆధ్యా త్మిక భేదముచే సూక్తులు రెండు విధములు. లౌకిక న్యాయ, లౌకిక రూఢి, జనప్రవాద పరములు లౌకికములు. పరమాత్మ సంబంద్ధములు లేదా పరలోక సంబద్ధములైన సూక్తులు ఆధ్యాత్మికములు. సాధారణ ముగా సూక్తులు నీతి, ధర్మబోధకములుగా ఉండును. విశ్వశ్రేయో దాయకములుగా ఉండును. విశ్వ శ్రేయోదాయక పురుషార్థ సంపా నము కథా కావ్య లక్ష్యము. "విశ్వశ్రేయః కావ్యమ్" అని కావ్య లక్షణము. నీతి బోధ కథలచే సులభముగా జరుగును. మానవులకు

హిత ప్రవృత్తి కనథాతా శ్రవణముద్వారా చక్కగా జరుగును. కథా సాహిత్యమున ప్రతికథయు ఒకానొక నీతిని బోధించును. వినోదబహుళ కథలుఅభినవచేలేదాలక్షణచేత్యోదావ్యంజనచే నీతినిబోధించును.వైదిక,బౌద్ధ జైన, చార్వాక, మత సాహిత్యమున ఇట్లే సర్వమత దేశసాహిత్యము అందు ప్రత్యక్షముగా లేదా పరోక్షముగా నీతిబోధ కనబడుచున్నది. దేశ భేదమును బట్టి నీతి భేదము ఏర్పడును. ఒకదేశము నందలి నీతి మరియొక దేశమున నీతి కాకపోవచ్చును. అట్లే కాల భేదమును బట్టి కూడ నీతి భేదిల్లును. ఇట్టి నీతులను రీతులుకూడ అని అందురు సార్వకాలీన, సార్వజనీన నీతులు ఉత్తమోత్తమములు, వీటినే లోకోక్తులను, సుభాషితములని, లోకప్రవాదములని, రూఢివాక్యములని వ్యవహరించుచున్నారు. కావ్యములు కాంతా సమ్మితములగుటచే కథాకథన ద్వారా పైన పేర్కొన్న భిన్న భిన్న నీతులను బోధించుచున్నవి. సద్యః పర నిర్వృతి కావ్యములకు పరమలక్ష్యమైననూ నీతి బావ్యకావ్యము లోక నిందాపాత్రమై సమాజ నాశకరమగును

ఇట్టి అభిప్రాయమును మనస్సున ఉంచుకొనియే నీతివాక్య దార్థ్య సంపాదనమునకు భిన్న భిన్నము అయిన ఉదాహరణ కథలు కవులచే తమ కావ్యములందు సృష్టింపబడినవి. కథా కావ్యములలో కథలందు సందర్భమును బట్టి పాత్రముఖమునగాని, కవి ముఖమున గాని సూక్తి సుధా బిందువులు చెప్పబడు చున్నవి ఈ సూక్తులు వ్యాఖ్యాన అనపేక్షకములై సుఖావబోధకములుగా నున్నవి.

బృహత్కథానువాద గ్రంధత్రయము నందలి లోకోక్తులు

సూక్తులు :- పైశాచి బృహత్కథకు గల సంస్కృతానువాద గ్రంధత్రయమున సార్వ కాలీనములు, తత్కాలీనములు అయిన

భిన్న భిన్న లోకోక్తులు, సూక్తులు, ధర్మములు కలవు. భిన్న జాతీయుల స్వభావములు లోకోక్తులచే ప్రకాశింప చేయబడుచున్నవి.

లోక సూక్తులచే ప్రధానముగా బృహత్కథానువాద సంస్కృత కావ్యములలో ప్రతిపాదింపబడిన విషయములు కొన్ని పతి వ్రతా స్వభావమును, క్రూరస్వభావమును, తపఃప్రభావమును కృతఘ్న స్వభావమును, అవినయ స్వభావమును, సదసజ్జన స్వభావమును, రాజ సేవక స్వభావమును, శరీరస్వభావమును, లక్ష్మీ స్వభావమును, ద్వి జాతి స్వభావమును, ఈర్ష్యా స్వభావమును, ధర్మస్వభావమును, శీల స్వభావమును, బంధు యోగస్వభావమును, అనిత్య స్వభావమును జ్ఞాన, మోక్ష స్వభావమును, ప్రకాశింపజేయుచున్నవి.

కొన్ని సూక్తులు స్వర్గ స్వభావమును, మూర్ఖ స్వభావమును, వేద జడ స్వభావమును పరమేశ్వరానుగ్రహ స్వభావమును, మహో త్సుల స్వభావమును, అవజ్ఞా స్వభావమును సర్వేశ్వర స్వభావమును సంయోగ వియోగ స్వభావమును, ఉపస్వభావమును, సామ, దాన భేద, దండోపాయాది రాజనీతి స్వభావమును, సచివాయుక్త రాజస్వభా వమును విశ్వాస సత్వ మహత్స్వభావమును, యశో మహత్వమును పరోపకార మహత్వమును స్నేహనిరోధప్రవృత్తి స్వభావమును, కన్యా స్వభావమును, భవితవ్యతా స్వభావమును, మహాపురుష స్వభా మును, ప్రకాశింప జేయుచున్నవి.

మరికొన్ని సూక్తులు బ్రాహ్మణ స్వభావమును, మృత్యుభీతి స్వభావమును, శాప ప్రభావమును, శుభాశుభ కర్మ స్వభావమును, సంకల్ప ప్రభావమును, బాల్య స్వభావమును, చతుర్విధ పురుషార్థ మును, క్షమాస్వభావమును, కుపుత్ర స్వభావమును, కుటిల శ్వశ్రూ స్వభావమును, విధి స్వభావమును, దివ్యస్వభావమును, వాంఛాస్వభా

వము నుసువత్నీ స్వభావము నుమహర్షిస్వభావమును,భోగాశా స్వభావ మును,ఔచిత్యనీతిస్వభావమును,కాల ప్రభావమును,మంత్ర ప్రభావము సత్యవచః ప్రభావమును, సాహస స్వభావమును,లోక స్వభావమును, దరిద్రావస్థ స్వభావమును ప్రయత్నశీల స్వభావమును, శూరస్వభావ మును, అహంకారీ స్వభావమును, దాంపత్య పుణ్య పాప సమానుభవ స్వభావమును. ప్రభు అనుగ్రహ ప్రభావమును, స్వామి భక్తి ప్రభావమును సేవాఫల స్వభావమును, భోగ స్వభావమును, పరోపకార ప్రభావమును, ద్యూతకళా స్వభావమును, క్రూర రాజ స్వభావమును మంత్రత్రాణ ప్రాముఖ్యమును ప్రకాశింప జేయుచున్నవి.

మరికొన్ని సూక్తులు సేవాస్వభావమును, హితద్వేషి స్వభావమును, మైత్రి స్వభావమును, సంతుష్ట స్వభావమును, శత్రుస్వభావమును, చౌర్యస్వభావమును ఇంద్రజాల తుల్య స్త్రీ స్వభావమును స్త్రీ విశ్వాస పరిహరణ ప్రాముఖ్యము, సంసార స్వభావమును, భీరు స్వభావమును, రాజధర్మ స్వభావమును, రాజ్య స్వభావమును పితృ భక్తి ఫల స్వభావమును, అసన్మయిత్రీ స్వభావమును, గృహిణీ ప్రాముఖ్యమును శరీర ప్రాముఖ్యమును, పరిభవ స్వభావమును, కన్యా ప్రియ వర సౌందర్య ప్రాముఖ్యమును, అధర్మాచరణ ఫల స్వభావమును. రాగాంధ స్వభావమును, స్త్రీ ప్రణయఖండన దుష్ప్రహత్వ స్వభావమును, సిద్ధిస్వభావమును సత్సంతతి స్వభావమును మొదలగు వాటిని ప్రతిపాదించుచున్నవి.

—

కథాసరిత్సాగరము నందుకంటె బృహత్కథామంజరి సూక్తులచే
ప్రతిపాదింపబడిన కొన్ని భిన్న విషయములు:

దుర్నీతి, విన్యాసము, మిత్రద్రోహము, మానినీ స్వభావము, వినయస్వభావము, విద్యా స్వభావము, మంత్రి ప్రాముఖ్యము బహు నాయక స్థానస్వభావము, శివభక్తి ప్రాముఖ్యము, స్వజన ప్రార్థన సాధుస్వభావము, నిష్కర్మఫలము, దుష్కర్మఫలము, ఉత్సాహస్వభావము, ధూర్తభిక్షుస్వభావము, మృగయాస్వభావము, అహింస, క్షమా స్వభావము, రాజ్యకులస్వభావము చిత్తస్వభావము, ధ్యానప్రభావము మన్మథజ్వరప్రభావము, గురుభక్తి, పండితస్వభావము, వాణిజ్యస్వభావము, లజ్జాస్వభావము, పుత్ర జన్మ ప్రాముఖ్యము, ఖేచర స్వభావమును, తృష్ణా స్వభావము మొదలగునవి.

కథాసరిత్సాగరము నందుకంటె బృహత్కథా శ్లోక సంగ్రహమునందలి సూక్తులచే ప్రతిపాదింపబడిన కొన్ని భిన్న విషయములు:

శాస్త్ర విద్యాప్రాప్తి స్వభావము, గర్భదోహదప్రాముఖ్యము ఆశీస్స్వభావము, యాత్రాస్వభావము, దేశకాలద్యనుగుణ ఔచిత్యాచరణము, నాగరికత, మిత్రస్వభావము, కుపిత పత్నీ స్వభావము, నిద్రాప్రాముఖ్యము, పితృపుత్ర సంబంధము, యజ్ఞయాజక ప్రాధాన్యము, సహజకర్మ ప్రాముఖ్యము, ఔచిత్య దానప్రాముఖ్యము మాతృ బాంధవ ప్రాముఖ్యము, సూతుల బంధన స్వీకరణ నింద, ఆరాధన ఫలము, అనుజీవి స్వభావము, దేవపితృ బ్రాహ్మణ తర్పణ స్వభావము ప్రేతవన స్వభావము, ప్రత్యక్ష ప్రాముఖ్యము, భార్యాజ్ఞాతి గృహవాస నింద, దుర్భగ స్వభావము, పరబుద్ధి నింద, సద్బంధుపరిశంస

శరణాగత రక్షణ, ప్రాముఖ్యము, గుణప్రశంస, నిర్మాణస్వభావము, దైవశక్తి, పురుషాకారశక్తి, గృహస్థధర్మము తీర్థయాత్రా ప్రాముఖ్యము, ప్రవజితమిత్రలాభ ప్రాముఖ్యము, సుఖానుభవప్రాముఖ్యము అర్హత ధర్మప్రభావము, అసుఖావహ సత్యవాక్యనింద, సర్వజ్ఞ చక్రవర్తిత్వము, దివ్యదృష్టిత్వము, వివాహాంత మంగళప్రశంస, కర్తవ్య ప్రశంస మొదలగునవి.

ఈ సూక్తులన్నింటివే తత్కాల కర్మసిద్ధాంతవిధి, బౌద్ధధర్మ సద్గుణములు, ధర్మాచరణము, సుఖానుభవము, ప్రేమ, వేశ్యావృత్తి పాతివ్రత్యము, రాజనీతి, వాణిజ్యవృత్తి, దివ్య తాంత్రిక శక్తులు మొదలగు వాటియొక్క ప్రాముఖ్యమును తెలుసుకొన గలుగుచున్నాము.

| కథాసరిత్సాగరము | | బృహత్కథా మంజరి | |
|---|---|---|---|
| లంబకముల వరుస | సూక్తి సంఖ్య | లంబకముల వరుస | సూక్తి సంఖ్య |
| 1 | 38 | 1 | 12 |
| 2 | 18 | 2 | 28 |
| 3 | 20 | 3 | 36 |
| 4 | 16 | 4 | 10 |
| 5 | 17 | 5 | 13 |
| 6 | 88 | 6 | 9 |
| 7 | 91 | 7 | 77 |
| 8 | 8 | 8 | - |
| 9 | 50 | 9 | 129 |
| 10 | 124 | 10 | 11 |

| లంబకముల వరుస | సూక్తి సంఖ్య | లంబకముల వరుస | సూక్తి సంఖ్య |
|---|---|---|---|
| 11 | — | 11 | 5 |
| 12 | 140 | 12 | 3 |
| 13 | 6 | 13 | 19 |
| 14 | 16 | 14 | 31 |
| 15 | 4 | 15 | 14 |
| 16 | 13 | 16 | 67 |
| 17 | 10 | 17 | 2 |
| 18 | 10 | 18 | 47 |

బృహత్కథా శ్లోక సంగ్రహము

| సర్గ సంఖ్య | సూక్తి సంఖ్య | సర్గ సంఖ్య | సూక్తి సంఖ్య |
|---|---|---|---|
| 1 | 1 | 6 | — |
| 2 | 3 | 7 | 4 |
| 3 | 2 | 8 | — |
| 4 | 3 | 9 | 3 |
| 5 | 6 | 10 | 31 |
| 11 | 7 | 20 | 22 |
| 12 | 5 | 21 | 26 |
| 13 | 1 | 22 | 29 |
| 14 | 4 | 23 | 21 |
| 15 | 8 | 24 | 4 |
| 16 | 6 | 25 | 10 |
| 17 | 9 | 26 | 9 |
| 18 | 27 | 27 | 10 |
| 19 | 11 | 28 | 4 |

కథాసరిత్సాగరమున పదునెనిమిది లంబకములలోను రమారమి 669 సుభాషితములు (సూక్తులు) కలవు. బృహత్కథామంజరిలో రమారమి 513 సుభాషితములు (సూక్తులు) కలవు. బృహత్కథా శ్లోక సంగ్రహములో 282 సుభాషితములు (సూక్తులు) కలవు. అందలి సూక్తులన్నియు సర్వజన మనోరంజకములై అమృతాస్వాదానుభవ

మును కలిగించుచున్నవి. స్థాలీపులాక న్యాయమున పరిశీలనార్థము కొన్ని సూక్తులందు ప్రదర్శింపబడుచున్నవి.

కథా సరిత్సాగరము :-

"కోహి విత్తం రహస్యం వా స్త్రీషు శక్నోతి గూహితమ్" 1-1-52

2. అకాండో పనతా కం న లక్ష్మీర్వ్యామోహయేత్ 1-5-3
3. తత్వజ్ఞేన కృతావజ్ఞః కో నామాంతర్న తప్యతే 1-8-17
4. పాపం పాపాంత రాక్షేపి క్రూరం హి క్రూర కర్మణామ్ 2-2-63
5. ఆపది స్ఫురతి ప్రజ్ఞా యస్య ధీరః స ఏవహి 2-4-41
6. సర్వం హి సాధయ స్తీహ ద్విజాః శ్రౌతేన కర్మణా 2-5-56

బృహత్కథా మంజరి సూక్తులు :

1. నహి నిర్వహణం యాన్తి ప్రభూణా మాశ్రితే రుషః 1-1-62
2. కం న నాభినవా లక్ష్మీః స్త్రీవ విమోహయేత్ 1-2-43
3. నహి మిత్రద్రుహః పరం శామ్యేత్ జన్మ శతైరపి 1-2-198
4. సౌభాగ్య మత్తా మానిన్యో నసహంతే చధీరణామ్ 2-1-33
5. అభ్యాస రహితా విద్యా నిరుపయోగా నృపశ్రియః
   వేష యోషశ్చ రాగిణ్యో హాస్యాయతన మంగనే 2-2-89
6. అసమ్మానితః కోపంయాతి బాలాపి భోజనే 2-2-267

బృహత్కథా శ్లోక శ్లోక సంగ్రహ సూక్తులు :

1. అనిష్ట మపి వక్తవ్యం స్వనుష్ఠాన ప్రతిక్రియం
   దుష్కర ప్రతికారేతు యుక్త మిత్థ ముదాసితమ్ 2-53
2. నోన్మత్త వాక్యాని గృహ్యన్తే పటు బుద్ధిః 2-62
3. చిత్తాపహారిణీ యాత్రా హర్య చిత్తాచ బాలతా।
   చిత్త విద్యాచ విద్యేతి దుర్ఘట త్రిక సంగమః 7-59
4. పరచిత్తాను వృత్తిశ్చ స్వచిత్తస్యచ నిగ్రహః
   యేయం నాగరకై రుక్తా సా నాగరకతా మతా 9-34
5. సాపరాధోపి దూతః సమ్మాన మర్హతి 11-49
6. న యుక్తం సుఖ సుప్తస్య శత్రోరపి విబోధనమ్ 13-41

## 8.2 కథాసరిత్సాగర - బృహత్కథా శ్లోక సంగ్రహ - బృహత్కథా మంజరీ కావ్యములలో రసాలంకార పోషణ

**అలంకారములు :**

"అలంకరోతి ఇత్యలంకారః" హారాదులు శరీరము నలంకరింప జేసినట్లు కావ్యమున ఉపమాద్యలంకారములు కావ్యము నలంకరింప జేయును. ఇవి కవితా కామినీ శోభాతిశయ హేతువులు. కావ్యము రస రీతి గుణాలంకార సహితమై యుండవలెను. కావ్య శరీరమున రసము ఆత్మ వంటిది. ఇది కావ్య శోభా హేతువు. విశ్వనాథుడు "వాక్యం రసాత్మకం కావ్యమని" కావ్యమున రస ప్రాధాన్యతను విశదీకరించెను. "నహి రసా దృతే కశ్చిదర్థః ప్రవర్తతే" (నాట్యశాస్త్రము) నీరసమైన కావ్యము శోభింపదు. ఆత్మకు ధర్మ, శౌర్య దానాదులవలె కావ్యమున ఓజః ప్రసాదాది గుణములు రస ధర్మములు. వైదర్భ్యాది రీతులు శరీరావయములవంటివి విద్యానాథుడు శబ్దార్థములు కావ్యమూర్తులు ఇవి రసధర్మములు. రసమును అభివ్యక్తము చేయు వ్యంగమే కావ్య జీవితమని చెప్పెను. శబ్దార్థాలంకార చమత్కృతిచే కావకశోభవృద్ధి పొందును. "గుణాలంకార రహితా విధవేవ సరస్వతీ" గుణాలంకార పాతమైన కవిత విధవ వంటిది.

"ఉప కుర్వంతి తం సంతేః యేఽంగ ద్వారేణ సంశ్రితాః।
హారాది వదలంకారాస్తేఽను ప్రాసోపమాదయః॥" కావ్యకోశం

కావున ఔచిత్యమునుబట్టి కవులు గుణరీత్యాలంకారములలు యథోచితముగా వినియోగింపవలెను.

### అలంకార వర్గీకరణము

1. సాదృశ్య గర్భాలంకారములు 2 విరోధ గర్భాలంకారములు

3 శృంఖలా బంధములు 4 అరన్యాయ మూలకములు 5 వాక్యన్యాయ మూలకములు 6 లోకన్యాయ మూలకములు, 7 గూఢార్థ ప్రతీతి మూలకములు అని అలంకారములను 7 వర్గములుగా రుయ్యకుడు విభజించెను.

అద్భుత రస ప్రధాన కావ్యములో ఉపమాలంకారములు ప్రధానములని (నాట్యశాస్త్ర నష్టభావ ప్రకాశకా వ్యాఖ్య) పేర్కొన బడెను.

1) సాదృశ్య గర్భాలంకారములు 1) భేదాభేద ప్రధానములు 2) అభేద ప్రదాన 3)గమ్యౌపమ్యాశ్రయములు అని మూడు విధములు అభేద ప్రధానాలంకారములలో ఆరోప మూలకములు, అధ్యవసాయ మూలకములు అని రెండు విధములు.

2) భేదాభేద ప్రదానములు–ఉపమ, ఉపమేయోపమ, అనన్వయము, స్మరణము.

2) ఆరోపమూలక అభేద ప్రదానములు–రూపకము,పరిణామము సందేహము, భ్రాంతిమత్, ఉల్లేఖ, అపహ్నుతి.

3) అధ్యవసాయమూలక అభేద ప్రదానములు – ఉత్ప్రేక్ష, అతిశయోక్తి.

4) గమ్యౌపమ్యాశ్రయములు : తుల్యయోగిత, దీపకము, ప్రతివస్తూపమ, దృష్టాంతము, నిదర్శనము, వ్యతిరేకము, సహోక్తి వినోక్తి, సమాసోక్తి, పరికరము, పరికరాంకురము, శ్లేష, అప్రస్తుత ప్రశంస, అర్థాంతరన్యాసము, పర్యాయోక్తి, వ్యాజస్తుతి, ఆక్షేపము.

2) విరోధ గర్భాలంకారములు : విరోధము, విభావన, విశే

షోక్తి, అతిశయోక్తి, అసంగతి, విషమము, సమము, విచిత్రము, అధికము. అన్యోన్యము, విశేషము, వ్యాఘాతము.

3) శృంఖలాబంధములు : కారణమాల, ఏకావళి, మాలాదీపకము, సారము.

4) తర్కన్యాయమూలకములు : కావ్యలింగము, అనుమానం

5) వాక్యన్యాయ మూలకములు : యథాసంఖ్యము, పర్యాయము, పరివృత్తి, పరిసంఖ్య, అర్థాపత్తి, వికల్పము, సముచ్చయము, సమాధి.

6) లోకన్యాయ మూలకములు : ప్రత్యనీకము, ప్రతీపము, మీలితము, సామాన్యము, తద్గుణము, అతద్గుణము, ఉత్తరాలంకారం.

7) గూఢార్థ ప్రతీతి మూలకములు : సూక్ష్మ, వ్యాజోక్తి, వక్రోక్తి, స్వభావోక్తి, భావికము, సంసృష్టి, సంకరం.

సోమదేవుని అలంకార ప్రయోగము

అలంకారములలో ఉత్ప్రేక్షాలంకారము సోమదేవునకు చాలా అభీష్టమైనది. ఉత్ప్రేక్షలో ప్రత్యక్షముగా అనుభవించు భావమునకు యదార్థత్వమును తీసికొని వచ్చి పురాణ, ఇతిహాసిక కథాప్రసంగ గర్భితముగా వర్ణించుటలో గొప్ప ఉత్కర్ష సంపాదింపబడినది. ఉదా॥ మదిరావతీ లంబకమున తరుఖండ వర్ణనమును పరిశీలింపుడు.

తస్య దక్షిణతో గత్వా తరుఖండం వ్యలోకయం।
సధూమ మివ తాపిచ్ఛైః సాంగారమివ కింశుకైః 1.-1-90
సజ్వాల మివ చోత్ఫుల్ల లోహితా శోక వల్లిభిః।
హరనేత్రానల ప్లుష్టం దేహం రతిపతే రివ॥ 13.1-91

తరుకండము తాపిచ్ఛములతో ధూమసహితమువలె కింశుకము లతో అంగార సహితమువలె వికసిత లోహిత అశోకలతలచే జ్వాలా సహితమువలె హరనేత్రాన లదగ్ధమగు మన్మథుని దేహమువలె ఉత్ప్రేక్షింపబడెను.

ఇట్లే శశాంకవతీ లంబకమున అమరదత్త రాజుయొక్క వార్ధక్యా గమన వర్ణనమున ప్రదర్శింపబడిన ఉత్ప్రేక్షాలంకార చాతుర్యము మహోత్కృష్టమైనది.

కాలేఽథ యాత్యమరదత్త నృపస్య తస్య
స్వైరం జరా శ్రవణ మూలముపాజగామ।
భుక్తాః శ్రియః పరిణతం వయసా్యశమస్య
నన్వేషకాల ఇతివక్తు మివాంగ భూతా॥ 12-36-224

సంపదలన్నీ అనుభవింపబడినవి. వయస్సు పరిణమించినది. ఇది శమమునకు కాలం అని చెప్పుటకేమో అన్నట్లు అంగభూతమై జర అమరదత్త నృపతి శ్రవణమూలమును స్వేచ్ఛగా చేరెను.

కథాసరిత్సాగరమున ఉత్ప్రేక్షేతరములైన అనేకాలంకారములు మహాచాతుర్యముచే కవిచే ప్రయోగింపబడినవి. కుమారోద్భవ ప్రసంగము పందలి అర్థాంతరన్యాసమును పరిశీలింపుడు.

కోపేషు వ్యలసన్నిపీత మధువోయేకైరవాణాం చిరం
లబ్ధాభ్యంతర సుస్థితా వికసతామిందు ప్రభాసంగమే।
తే సంకోచముపా గతేషు విగలచ్ఛ్రీకేషు తేష్వన్యతో
భృంగాః పశ్యకుమార యాంతి మలినాః కస్యస్థిరాహ్య పది॥
12-36-214

ఇందు సూర్యోదయమున కైరవములలో వికాస సంపదనశించి పోవుచుండగా తుమ్మెదలు మధువులు గ్రోలినపై మరియొక చోటుకి వెళ్ళుచున్నవను విశేషార్థముచే ఆ పురుషులుఆపత్కాలమున ఎవ్వరి వద్దనూ స్థిరముగా నుండరు అను సామాన్యార్థము సమర్థింపబడెను.

ఇట్లే గ్రంథారంభమందలి ప్రార్థనా శ్లోకము నందలి అలంకార మును పరిశీలింపుడు.

శ్రియం దిశతు వః శంభోః శ్యామః కంఠో మనోభువా
అంకస్థ పార్వతీ దృష్టి పాశైరివ వివేష్టితః।
సంధ్యా నృత్తోత్సవే తారాః కరేణోద్ధూయ విఘ్నజిత్
సీత్కార సీకరై రన్యాః కల్పయన్నివ పాతువః॥

ఇందలి ఉత్ప్రేక్షాలంకారములు కవి చమత్కార వైశిష్ట్యము నకు నిదర్శనములు మన్మథునివలన ఒడియందున్న పార్వతీ దృష్టి పాశరములచే చుట్టబడెనో అనునట్లున్న ఈశ్వరుని శ్యామ కంఠము మీకు సంపదల నిచ్చుగాక. సంధ్యాకాల నృత్తోత్సవమున గగన తారలను తొండముతో తొలగించి ఆ స్థానమున సీత్కారపు సీకరము లచే ఇతర తారలను కల్పించుచున్నట్లున్న వినాయకుడు మిమ్ము కాపాడుగాక.

ఈ క్రింది శ్లోకములందలి అలంకార ప్రయోగ వైచిత్రిని పరి శీలింపుడు. శూరసేనుని మృత్యువు అతి కారుణ్యజనకమైనది. రాజ పుత్రుడు అధిక పత్నీ ప్రేమ కలవాడుగా నుండెను. కాని రాజాహ్వాన మతనికి మాననీయముగా నుండెను. అందువలన నతడు రాజాస్థానము నకు వెళ్ళెను. అతని పత్ని సుషేణ అతని వాక్యము ననుసరించి

అగమనముకొఱకు ప్రతీక్షించుచుండెను. కాని అతడు రాలేదు, ప్రేమ దావాగ్నిచే భస్మీభూతమైన ఆమె శరీరమునుండి ప్రాణములు వెళ్ళి పోయెను. పిమ్మట రాజు కడనుండి వచ్చిన రాజపుత్రుడు మరణించిన సుషేణను దర్శించెను.

తత్రాపశ్యత్ గత ప్రాణాం ప్రియాం తాం కృతమండనామ్
లతా ముత్ఫుల్ల కుసుమాం వాతేనోన్మీలతా మివ,
దృష్ట్వైవ విహ్వలస్యైతాః కుర్వతోంగే వినిర్యయుః
ప్రలాపైః సహ తస్యాపి ప్రాణాః విరహిణః క్షణాత్॥

సుషేణుడు వికసించిన లతాపుష్పము వాయువుచే నిర్మూలింప బడినట్లు అలంకరింపబడిన ప్రాణములను వదలిన ప్రియురాలిని దర్శించెను. దర్శించిన వెంటనే విహ్వలత్వమును పొందిన అతనిదేహం నుండి విరహముచే వెలువడిన ప్రలాపములతోపాటు క్షణములో ప్రాణములుకూడ వెడలిపోయెను. సముజ్జ్వల గ్రీష్మ ఋతువర్ణన మును పరిశీలింపుడు.

“భ్రామ్య తశ్చ జగామాస్య భీమో గ్రీష్మర్తు కేసరీ।
ప్రచండాదిత్య వదనో దీప్తవద్రశ్మి కేసరః॥
ప్రియా విరహ సంతప్త పాంథ నిశ్వాస మారుతేః।
న్యస్తోష్మణ ఇవాత్యుష్ణావాన్తిస్మ చ సమీరణాః॥
శుష్య ద్విదీర్ణ పంకాశ్చ హృదయైః స్ఫుటితైరివ,
జలాశయాద దృశిరే ధర్మలుప్తాంబు సంపదః॥
చీరీ చీత్కార ముఖ రాస్తాపమ్లాన దలాధరాః।
మధుశ్రీ విరహోన్మాదగ్లేష్వరు దన్నివ పాదపాః॥”

ఈ గ్రీష్మర్తు వర్ణనమున రూపక ఉపమాన ఉత్ప్రేక్షాలంకారములు హృదయంగమముగా నున్నవి. భయంకరమైన గ్రీష్మర్తు సింహము, ప్రచండ సూర్యవదనము కలదై ప్రకాశించు సూర్య కిరణము లనెడి కేసరములు కలదై పరిభ్రమించెను. సమీరణములు ప్రియా విరహముచే సంతాపమును పొందిన బాటసారుల నిట్టూర్పులచే వేడి చేయబడినట్లునవై మహోష్ణముతో వీచుచుండెను. ఎండుటచే చీలిన బురదగలిగియుండుటచే హృదయములు పగిలినట్లున్నవై ధర్మముచే లోపించిన జల సంపద కలవిగా జలాశయములు కనబడుచున్నవి. వృక్షములు మధుశ్రీ విరహ అక్ష్మిచే మార్గములందు చీరి చీత్కార శబ్దముఃకలవై తాపముచే వాడిపోవు వక్త్రాధరములు కలవై విలపించుచున్నట్లుండెను.

క్షేమేంద్రుని బృహత్కథామంజరిలోని అలంకార ప్రయోగ చాతురిని పరిశీలింపుడు.

"సరస్వతీ విభ్రమదర్పణానాం సూక్తామృతక్షీరమహోదధీనాం
సన్మాన సోల్లాససుధాకరాణాం కవీశ్వరాణాం జయతి ప్రకర్ష":
1-1-2

కవీశ్వరులు సరస్వతీ విభ్రమమునకు దర్పణము వంటివారు. సూక్తామృతమునకు క్షీరసాగరము వంటివారు. సన్మానసోల్లాసమునకు సుధాకరుని వంటివారు అని క్షేమేంద్రుడు సత్కవులను ప్రశంసించెను ఇందలి రూపకాలంకారము హృదయాహ్లాదకరముగా నున్నది.

చతుర్థ లంబకారంభమునందలి శివ ప్రార్థనా శ్లోకాలంకార చమత్కృతిని పరిశీలింపుడు.

లలాట లోచనం పాయాత్ ప్రదీప్తం త్రిపుర ద్విషః
కుమార రక్షాసిందూరం వితరన్ కిరణైరివ॥ 4-1-1

కిరణములచే కుమారస్వామిని రక్షించుటలో సిందూరమువలె నున్న ఈశ్వరుని ప్రదీప్తలలాట లోచనము మిమ్ములను కాపాడుగాక

చతుర్థారికా లంబకములోని ప్రార్థనా శ్లోకాలంకార చమత్కృతి నైపుణ్యమును పరిశీలింపుడు.

"త్వదంగ ముదంచ దిందు శకలంవేల్లత్కపాలాకులమ్
పాయాద్వః శ్వసదంగ దోరు భుజగం చండీపతే స్తాండవం
యస్యోద్భ్రాంత భుజ పరిబంధవలనావాతోత్ప లత్సాగర
స్ఫారంభః పటలైః పురం పటమివాసక్తం సమాతన్వత॥"

ఏ చండీపతి ఏ తాండవముచే పైకి త్రిప్పు భుజపరిబంధ వల యాకార వాయువుచేపైకిలేచిన సముద్రజలపటలముచే పురమంతయు శ్వేత వస్త్రముచే కప్పబడినట్లున్నదో ఒప్పిదమైన చంద్ర శకలము గల వ్యాకులములగు కపాలములుగల చలించు ఊరు భుజములుగల చండీపతి తాండవము మిమ్ములను కాపాడుగాక. ఈక్రింది ఉప మాలంకారమును పరిశీలింపుడు.

"కీర్తయః కృత్యతేనేవ వ్యసనేనేవ బుద్ధయః
సహసైవ వినశ్యన్తి దుర్నయేన నృపశ్రియః" 3-1-6

ఇందలి ఔపమ్యము ఔచిత్యాన్వితమై కాళిదాసును స్మరింప జేయుచున్నది.

క్రింది శ్లోకములోని రూపకాలంకార ప్రయోగ వైచిత్రి అత్య ద్భుతమైనది.

భ్రూలేఖా ధనురాతనం విచలితో లీలా కటాక్షః శరో
హాసస్త త్సిత పుంఖ పక్ష రచనా మౌర్వీచ పక్ష ఛవిః,
క్రేంకారః కంవంచ మాశ్రయివచో యస్యేత్థమాసూత్ర్యతే
జైవం తంత్ర మనోరతం యువతభుః కామాయ తస్మై నమః॥
7-1-1

ఆనతమైన ధనసు, భ్రూలేఖ. శరము లీదా కటాక్షము, సిత పుంఖ పక్ష రచన హాసము, పక్షకాంతి మౌర్వి, పంచమ స్వరాన్విత వాక్కులు క్రేంకారము, ఇట్లెలప్పుడు యువతులచే కామునకు జీవ తంత్రము సూచింపబడుచున్నది. ఏకామునకు సూచింపబడుచున్నదో అట్టికామునకు నమస్కారము. ఇందలి రూపలంకార ప్రయోగవైచిత్రి అత్యద్భుతము.

బుధస్వామి బృహత్కథా శ్లోక సంగ్రహములో అలంకారములు :

బృహత్కథా శ్లోక సంగ్రహములో బుధస్వామి ఈ క్రింది అలంకారములను ముఖ్యముగా వాడుకొనెను. ఉపమ, రూపకము అర్థాంతరన్యాసము, అపహ్నుతి, సమాధి, సందేహము, విరోధాభాస, లోకోక్తి, స్వభావోక్తి, స్మృతి, ప్రతివస్తూపమ, దృష్టాంతము కావ్య లింగము, సంభావన, అన్యోక్తి, అసంగతి, అర్థాపత్తి.

బుధస్వామి సహజ భావములతోడనే అలంకారములలో చమత్కృతిని ప్రదర్శించెను. అలంకారములు ఇతని లోకజ్ఞతను శాస్త్రీయ జ్ఞానమును, రసదృష్టిని చక్కగా వ్యక్తము చేయుచూ కవి కల్పనా పటిమకు నిదర్శకములుగా నున్నవి. ఈ క్రింది అలంకారములను పరిశీలింపుడు.

స్వామినీ స్వామి సంబంధాత్ సామీ వార్థతి వందనామ్।
చంద్రా సన్నైర్హి నక్షత్రైః లోకః కార్యాణి కార్యతే॥
(అర్థాంతరన్యాసము) 11-15-6

నక్షత్రములు చంద్ర సన్నిహితములగుటచే లోకము తన కార్యము నిర్వర్తించుకొనుచున్నది. ఈ విశేషముచే స్వామిని స్వామి సంబంధముచే వందనార్హ అనెడి సామాన్యార్థము సమర్థింపబడు చున్నది.

### అర్థాంతరన్యాసము

అవశ్యంతు కళాజ్ఞానం ఖ్యాపనీయం కళావిదా।
అప్రకాశం హి విజ్ఞానం కృపణార్థ గిరర్థకమ్॥ 23-45

సర్వో హి వినియోగార్థం అర్థః సర్వేణ సృజ్యతే।
ఘటయిత్వా ఘటః కేన లోష్ఠేన శకలీకృతః॥ 24-5

లోకమున ప్రతిపదార్థము వినియోగముకొఱకే సృష్టింపబడినది కులాలుడు కుండను తయారు చేసి తానే లోష్ఠముతో పగులగొట్టడు.

### విరోధాభాసాలంకారము

వినీతాపి ప్రగల్భేవ స్థవిరేవ తరుణ్యపి।
మితవాగపి వాచాలా వ్యాఖ్యాతవ్యాహి తన్మతిః॥ 7-9

ఇందలి విరోధాభాసాలంకారము మనోహరముగా నున్నది.

### లోకోక్త్యలంకారము

యదేవ ఉచ్యతే లోకే సర్వథా న తదన్యథా।
అశేషోపాయ దుస్సాధ్యో మిత్రం శత్రుర్మహా నితి॥ 10-21

ఉల్లేఖాలంకారము.

"పుత్రజన్మ నరేంద్రస్య జగతః స్సు జన్మ చ।
శంకా జన్మ చ శత్రూణాం సమంసమ భవత్రయమ్॥" 24-5

ఒకే నరవాహన జన్మ రాజుకు ఉత్సవముగా, జగత్తుకు సుకజన్మగా శత్రువులకు శంకా జన్మగా అయ్యెనని కవి చమత్కారముగా వర్ణించెను.

రసపోషణ

"విభావై రను భావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమాన స్వాదుత్వం స్థాయీ భావో రసః స్మృతః"

విభావాను భావ, సాత్త్విక వ్యభిచారి భావములచే స్వాదుత్వమును పొందిన స్థాయీ భావమే రసము. "రస్యతే ఆస్వాద్యతే ఇతి రసః" రసింపబడునది (అస్వాదింపబడునది) రసము. వివిధ వ్యంజనముల సంయోగమువలన రసములు నిష్పన్నమగునట్లు నానావిధములగు భావముల సంయోగమువలన రసము నిష్పన్నమగును.

"లోకోత్తర చమత్కార ప్రాణః కైశ్చిత్ ప్రమాతృభిః
స్వాకార వదభిన్న త్వేనాయ్యయ మాస్వాద్యతే రసః"

చమత్కారము చిత్త విస్తార రూపము, విస్మయాపర పర్యాయము ధర్మదత్తుడు తన గ్రంథమున—

"రసే సారశ్చమత్కారః సర్వత్రాప్యను భూయతే।
తచ్చమత్కార సారత్వే సర్వత్రావ్యద్భుతో రసః॥"

అందువలన శ్రీమన్నారాయణ పాదులు కావ్యములం అద్భుత రసమునే రసమనిరి.

నిర్వహణ సంధిలోని 14 ముఖ్య అంగములలో ఉపగూహన మొకటి. అద్భుత ప్రాప్తియే ఉపగూహనము. ఉదా॥ వేణీసంహారం యుధిష్టిరుడు–దేవీ నభస్తల చారులైన సిద్ధజనులచే నీ మూర్ధజ సంహారము అభినందింపబడినది అనువాక్యములోని అద్భుత ప్రాప్తియే ఉపగూహనము.

"సధ్యాభవశ్చ ద్విభావావేః ద్వయోరేకస్యవా భవేత్।
ఝటిత్యన్య సమాక్షేపో తదాదోషో న విద్యతే॥"

అని శాస్త్రకారులు చెప్పుటచే బృహత్కథలో ప్రధానమైన అద్భుతరసమునకు, అప్రధానములైన ఇతర రసములకు విభావాది భావ చతుష్టయమున ఏదియో ఒకటిగాని, రెండుగాని, మూడుగాని భావములు లోపించుట రససిద్ధికి భంగముకాదు.

కథా కావ్యములందు అద్భుతరసము ప్రధానము. దీనికి శృంగార రసము పోషకము. అద్భుతము విస్మయమనెడి స్థాయీ భావమునుండి జనించును. దివ్యజన దర్శనము, ఈప్సిత మనోరథం సిద్ధించుట, ఉద్యానవనములకు దేవాలయములకు వెళ్ళుట సభా – విమాన–మాయా ఇంద్రజాలాదులను సందర్శించుట మొదలగు వాని వలన అద్భుతరసము ఉత్పన్నమగును. విప్పారిన కన్నులు, రెప్ప పాటులేని చూపు, రోమాంచము, అశ్రుపాతము, స్వేదము, హర్షము సాధువాదము, అధికదానము, హాహాకారము, బాహువులను, వదనము లను, అంగుళులను, వస్త్రములను ఆడించుట మొదలగు అనుభావము లచే అద్భుత రసము నభియింపవలెను. స్తంభము, అశ్రువు, స్వేదం గద్గదము, రోమాంచము, ఆవేగము సంభ్రమము, ప్రహర్షము, చపలత, ఉన్మాదము, ధృతి, జడత ప్రళయము మొదలగునవి ఇందు వ్యభిచారి భావములు.

అతిశయార్థ యుక్తములైన వాక్యములు, ప్రశస్త కర్మాత్మకమైన శిల్పములు, అత్యుత్కృష్టము లయిన రూపములును అద్భుత రసమునకు విభావములు. నర్మము గ్రహణము, శరీరమును సంతోషముతో ఉద్ధృతముగా కంపింపజేయుట హాహాకారము, సాధువాదము, వేపథువు. గద్గదవచనము, స్వేదము మొదలగు వానిచే అద్భుత రసము నభినయింపవలెను.

సోమదేవ, క్షేమేంద్ర, బుధస్వాములు, తమ కథా కావ్యములలో అన్య కావ్య సామగ్రి ప్రయోగమందువలె రస ప్రయోగమున గూడ అద్భుత బుద్ధిచాతుర్యమును ప్రదర్శించిరి. కథాకావ్యము లన్నింటిలో అద్భుతరసమే ప్రధానము. ఆ లక్షణము ననుసరించి అద్భుత రసమును చక్కగా పోషించిరి కథా వైచిత్రిచే అద్భుతరసమునకు ఉత్కర్షవిర్పడినట్లేరసరాజమైన శృంగారరసమునకుగూడ తగిన ప్రాముఖ్యము ఇవ్వబడినది. అద్భుతరసమునకుశృంగారరసము పోషకమగుటచే శృంగారరసము ఇందుచక్కగా పరిపుష్టినొందినది.సంయోగములు తారతమ్యమున్ననూ విప్రలంభ రసమునకు అధిక్యము స్పష్టవియోగముగాకనబడును. "యూనో స్సంయోగ జాద్భావాత్ విప్రయోగోతిరిచ్యతే" అని పూర్వాచారులుపేర్కొన లక్షణమిందు సంగతమైనది. కథానాయకుడైన నరవాహనదత్తుని విరహదశను గూర్చి దిఙ్మాత్రోదాహరణము మదిరావతీ లంబకమున :-

బిభేద తస్య హృదురప్యావ - తద్భిః శిలీముఖైః ।
స్మర చాపలతే వాత్ర హృదయం చూతమంజరీ॥ 13-1-6
కర్ణౌ మధుర మప్యస్య దునోతిస్మ చ దుస్సహమ్।
మార నిర్వర్త్యనా వాక్యకటు కోకిల కూజితమ్॥ 13-1-7

పుష్పరేణు పిశంగశ్చ మదనాగ్ని రివా పతన్।
విదదాహ తమంగేషు శీతోపి మలయానలహః॥ 13-1-8
తతోలికుల ఝుంకార ముఖరై స్త్రయిః సకాననైః।
నిష్కాస్య మాన ఇవ తం ప్రదేశం శనకైర్జహౌ॥ 13-1-9

నరవాహనదత్తుని హృదయము స్మరచాపలతా చూతమంజరి వలె మృదువైన దయిననూ శిలీముఃకములచే విదీర్ణమయినట్లు విదీర్ణ మయ్యెను.

కోకిలగానము మధురమైననూ మన్మధ నిర్ధ్రత్యనా వాక్య కటుత్వముచే దుస్సహమై కర్ణపీడా జనకముగా నుండెను.

మలయ మారుతము శీతలమయిననూ పుష్పపరాగపిశంగము కలదై మదనాగ్నివలె మీద పడుచూ అంగములను దహింప జేయుచుండెను. అప్పుడు నరవాహనదత్తుడు తుమ్మెదల ఝుంకార శబ్దము గల కాననములచే వెడలగొట్టబడుచున్న వానివలె ఆ ప్రదేశమును మెల్లగా వదలివెళ్లెను.

"శ్రియం దిశతు వః.........వేష్టితః" అను ప్రార్థనా శ్లోకమున శృంగార రసము కలదు.

"ఇదం గురు గిరింద్రజా.........భువి ప్రసాదిన తే" అను ప్రార్థనా శ్లోకమున కూడ అద్భుత, శృంగార, భక్తి రసములు కలవు.

బ్రాహ్మణ పుత్రుని విరహ వ్యధా వర్ణనమున:

చంద్రోగ్ని విష మాహారో గీతాని శ్రుతి సూచయః।
ఉద్యానం బంధనం పౌష్ప మాలా దిగ్ధా శరావలీ।
జ్వాలితాంగార వర్షంచ చందనాద్యను లేపనమ్॥ 13-1-75

విరహపీడితుడైన నాకు జీవనము కంటె మరణమే మేలు. చంద్రుడు నాకు అగ్ని, ఆహారము, విషము, మధుర గానములు కర్ణములలో గ్రుచ్చబడు సూదులు, ఉద్యానము, బంధనము, పుష్పమాలలు పొడవబడు బాణములు. చందనాద్యను లేపనము జ్వలించు అగ్ని నిప్పుల వర్షము. నావంటి వియోగులకు జీవితముపై అనురాగమెట్లుండును.

విప్రలంభ శృంగారము యొక్క దశదశలలో విరహవ్యధచే వియోగి మరణించుట దశమావస్థ. ఈ దశమావస్థ కొన్ని కావ్య ప్రబంధములలోనే వర్ణింపబడినది. ఉదా॥ కాదంబరిలో మహాశ్వేత ప్రసంగమున విరహ పీడచే పుండరీకుడు మరణించెను. అట్లే ఈకథా సరిత్సాగరమున సురతమంజరీ లంబకమున సుషేణా ప్రసంగమున మొదట విరహపీడితురాలయిన సుషేణ మరణించుట వర్ణింపబడినది. ఆలస్యముగా వచ్చిన సూరసేనుని కవి ఇట్లు వర్ణించెను.

తత్రా పశ్యద్గత ప్రాణాం ప్రియాంతం కృతమండనామ్।
లతా ముత్ఫుల్ల కుసుమాం వాతే నోన్మీలితా మివ॥ 16-1-43

వికసించిన పుష్పములు కల లత వాయువుచే వినాశముచేయబడినట్లు అలంకరించుకొన్న ప్రాణములను సదలిన ప్రేయసిని సూరసేనుడు దర్శించెను. ఇందలి విరహ వర్ణనాశైలి అపూర్వమైనది. సోమదేవు డిట్లే వరనా సందర్భములందు మనోహర విద్యాధర హర్మ్యములు సురాసుర భవనములను అతిశయించినవని అద్భుతముగా వర్ణించెను. ఇందలి పావన తపోవన భూములు దీప్తాగ్నులు. పక్షి గానము, హృదయహారి, వాయువులు, మృదు స్పర్శములు, అపానభూములు ప్రసంభాలావ మధురములు, మధుపాన రక్త యువతీ యువకుల

ముఖములు బాలాతప రక్త సరోజములు ఇత్యాది చమత్కార వర్ణనలచే సోమదేవుడు వర్ణనాశైలిలో కూడ అద్భుత రసమును పోషించెను.

కథా సరిత్సాగరము నందలి బేతాళకథలు సాహసాద్భుత కథలతో కూడి పాఠకులకు కుతూహలమును కలిగింపజేయుచున్నవి. కథా కౌశలమున కివి నిదర్శనములు. అద్భుత రసపోషణమునకు చక్కటి ఉదాహరణములు. భేతాళ కథలలో ప్రతికథ ప్రహేళిక వంటిదై ఒక చిక్కు ప్రశ్నతో సమాప్తమగును.

త్రివిక్రమ సేనుడను రాజువద్దకు ఒకయోగి వచ్చి ఒకపండు నిచ్చును. ఆ పండులో మణి ఉన్నదని తనకు సిద్ధి లభించవలెనన్నచో భేతాళ సహాయము కావలెనని భేతాళుని స్మశానము నుండి తీసుకొని రాగల పరాక్రమ సాహసములు రాజులో నున్నవని భేతాళుని తన కప్పగించినచో మణులను రాజు కిచ్చెదనని యోగి చెప్పును. విక్రమ సేనుడు అర్ధరాత్రి స్మశానభూమికి వెళ్ళి భేతాళుని మోసుకొని వచ్చు చుండగా బేతాళుడు చిక్కు ప్రశ్నకు జవాబు చెప్పుమని జవాబులు తెలిసి చెప్పకున్నచో శిరస్సునూరు వ్రక్కలు కాగలదని హెచ్చరించును ఒకరాత్రి బేతాళుడు చిక్కుప్రశ్నలకు సంబంధించిన 25 కథలనుచెప్పును త్రివిక్రమసేనుడు 24 కథలకు సమాధానము చెప్పలేకపోయెను. బేతాళుడు త్రివిక్రమ సేనుడి వలన లోక కళ్యాణము జరుగవలెనని తలంచి ఇట్లు చెప్పెను. యోగి నిన్ను బలి ఇచ్చి విద్యాధర పదవిని పొంద దలంచెను. సాష్టాంగ ప్రణామము చేయుమన్నపుడు సాష్టాంగప్రణామము చేయు విధానము నాకు తెలియదని చెప్పుము, అప్పుడు యోగి సాష్టాంగ ప్రణామము చేయునపుడు అతని శిరస్సును ఖండించుమని చెప్పగా త్రివిక్రమసేను డట్లెచేసెను బేతాళకథలలో 24 వ కథలో అడవిలో ఎవరో తెలియని ఇద్దరు స్త్రీల అడుగు జాడలను చండసింహుడు అతని కుమారుడు చూచిరి.

అందులో చిన్న పాదముద్రలుగల స్త్రీని కుమారుడు, పెద్ద పాద ముద్రలుగల స్త్రీని తండ్రి వివాహము చేసుకొనవలెనని తలంచిరి. పిమ్మట వారిని కలిసికొని తమ నగరమునకు తీసుకొని వెళ్ళిరి. పెద్ద పాదముద్రలుగల స్త్రీ కుమార్తె, చిన్నపాదములుగల స్త్రీ తల్లిగా నుండెను. వారు విధించుకొన్న షరతు ప్రకారము కుమార్తెను తండ్రి తల్లిని కుమారుడు వివాహము చేసుకొనిరి. వారికి పుత్రపౌత్రాది సంతానము కలిగెను. కుమారునివలన, తండ్రివలన కలిగిన సంతానం ఉభయ పక్షములవారు ఒకరికొకరు ఏమగుదురని బేతాళుడు ప్రశ్నింపగా త్రివిక్రమసేనుడు ఈ చిక్కు ప్రశ్నలకు సమాధానము చెప్ప జాలకపోయెను.

8వ బేతాళ కథలో ప్రసేనజిత్తను రాజు ముగ్గురు బ్రాహ్మణులకు భోజనశయ్యాతిథ్యములను కల్పించగా వారిలో "భోజనచంగుడు" శ్మశాన భూమిలో పండిన ధాన్యపు భోజనమని భోజనమును సహింపలేదనెను. "నారీచంగుడు" పడకగదిలో నారకన్యను చూచి మూర్ఛపోయి మేకపాలతో పెరిగినకన్య ఈమె అని తిరస్కరించెను. "తూలికా శయ్యా మందిరములో 7 దూది పరుపుల క్రిందనున్న వెంట్రుక నొప్పిగా ఉన్నదని రోదించి ఆ శయ్యను నిరాకరించెను. వారి సూక్ష్మజ్ఞానముచే రాజు ఆశ్చర్యచకితుడై ముగ్గురి బ్రాహ్మణులకు మూడు లక్షల బంగారు నాణెముల నిచ్చి పంపెను.

శశాంకవతీ లంబకములో శంఖదత్త కథలో శంఖదత్తుని గంగా ప్రవాహములో తిమింగలము మ్రింగెను. శంఖదత్తుడు దానికడుపులో ప్రవేశించి ఆకలి బాధకు తట్టుకొనలేక దాని మాంసమును కత్తితో కోసి తిని కాలము గడుపుచుండెను. ఒకనాడు తిమింగలము నదీ

తీరమునకు వచ్చి తీర వాసులచే సంహరింపబడగా బయటికి వచ్చి తన మిత్రులను కలిసికొనెను. తిమింగళ భక్షితుడై శంఖదత్తుడు ప్రాణములతో బయటపడుట సాహసాద్భుత కథ. ఇది అద్భుత రస పోషణకు చక్కటి ఉదాహరణము.

కథాపీఠములో చంద్రస్వామి కథను పరిశీలింపుడు. చంద్ర స్వామి అను బ్రాహ్మణుడు కార్యార్థము గ్రామాంతరమునకు వెళ్ళెను అతని భార్య మహా సుందరాంగి. ఒక కాపాలికుడు భిక్షార్థము ఆమె ఇంటికి వచ్చి ఆమె సౌందర్యమునకు ముగ్ధుడై ఏదో మంత్రమును మంత్రించి వెళ్ళిపోయెను. తత్ప్రభావముచే ఆమె మరణించెను. బంధువులు ఆమె చితిపై స్మశానమున నివ్వంటించిరి. అంతలో భర్త గ్రామాంతరము నుండి తిరిగి వచ్చి విషయము తెలిసికొని స్మశానము నకు వెళ్ళెను. అపుడు కాపాలికుడు భుజముమీద మంచము కోడు ఆడించుచూ చితిపై బూడిద చల్లగా అగ్ని ఆరిపోయెను. వెంటనే చంద్రస్వామి భార్య బ్రతికి మంత్రప్రభావముచే కాపాలికుని వెంట పోవుచుండెను. ఆ కాపాలికుడు ఒక గుహలో ప్రవేశించి మంచపు కోడుమ ఒక ప్రక్కన పెట్టెను. అతనిని వెంబడించి రహస్యముగా వెళ్లిన చంద్రస్వామి మంచము కోడును కాపాలికునకు తెలియకుండా గ్రహించి గంగలో పారవైచి కాపాలికునితో పోరాడి భార్యను తిరిగి స్వగృహమునకు తీసుకొని వచ్చెను. మరణించిన భార్యను చంద్ర స్వామి తన యుక్తిచే పునరుజ్జివితురాలుని చేసికొనెను. అద్భుతరస పోషకమైన కథ ఇది. 2-124 కథాపీఠములో 124వ తరంగములోని కథ ఇది.)

ఒక నగరంలో బోధి సత్వాంశతో జన్మించిన వర్తకపుత్రుడు

మాతృహీనుడనేవాడు ఉండెడివాడు. అతడు భార్యాసహితముగా అరణ్యమున వెళ్ళుచూ దప్పికతో నున్న భార్యకు దాహము తీర్చుటకు సమీపమునగల నదికి వెళ్ళెను, జలప్రవాహములో కాళ్ళుచేతులు తెగిన మనుష్యుని మొండెము కొట్టుకుపోవుచుండెను. ఆ మొండెము ప్రాణములో నున్నదై రక్షింపుమని మొరపెట్టుకొనెను. మాతృహీనుడు అతనిని గట్టుకు లాగెను. అతడు తన శత్రువులు తన అంగములను నరికి నదిలో పడవైచిరని చెప్పెను, పిమ్మట మాతృహీనుడు నదిలో వెళ్లి స్నానము చేయుచుండెను. ఒకనాడు మాతృహీనుడు కందమూలఫలములకై వెళ్ళగా భార్య సమయముకొఱకు కనిపెట్టి గాయములు మానిన మొండెముగల పురుషునితో రతిక్రీడసలిపెను. వారిద్దరికీ ఇట్లు స్నేహమేర్పడగా మాతృహీనుని భార్య తన భర్తను చంపదలచుకొని తనకు మాంద్యవ్యాధి వచ్చినదని నటించి ఒక నదిలోని లోయలో నున్న లతను చూపి ఆ మహౌషధినేను జీవింపగలనని కొండదేవత నా కలలో కనబడి అట్లు చెప్పెనదని విన్నవించెను. మాతృహీనుడు ఒక తాటికి గడ్డిచుట్టి చెట్టుకు వ్రేలాడగట్టి దానిని గట్టిగా పట్టుకొని మూలికకోసం లోయలో దిగెను. వెంటనే భార్య తాడు విప్పి వదలివేసెను. బోధిసత్త్వుడు నదిలో చాలాదూరం కొట్టుకొనిపోయి ఒక నగరము దగ్గఱ గట్టెక్కి స్త్రీ మాయకు దుఃఖించి వృక్షమూలమున నిద్రించుచుండెను. అప్పుడే ఆ నగరాధ్యక్షుడు మరణించియుండెను. క్రొత్తగా రాజును ఎన్నుకొనుటకు దేశాచారం ప్రకారం ఒక ఏనుగును ఊరంతా త్రిప్పుదురు. ఆ ఏనుగు తొండంతో ఎవరిని నెత్తిమీద ఎక్కించుకొనునో అతడే రాజగుదు. భద్రగజము మాతృహీనుని తొండముతో తనమీద ఎక్కించుకొనగా ఆ పురప్రజలు అతనికి పట్టాభిషేకము గావించిరి. అతని భార్య తన భర్త నదిలో

పడి మరణించెనని భ్రమపడి జారుని మొండెమును వీపుపై పెట్టుకొని తిరుగుచూ నేను సాధ్వినని, నా పతి పాదములను శత్రువులు నరికిరని భిక్షమెత్తి జీవించుచూ గ్రామగ్రామమును తిరుగుచూ తనభర్త మాతృహీనుడు రాజుగా నున్న నగరమునకు వచ్చెను. ఆమెకు భర్త రాజైనది తెలియదు. పురప్రజలందరూ ఆమె మహాసాధ్వి అని అంగవిహీనుడైన భర్తను సేవించుచున్నదని నిత్యముపొగడుచుండిరి రాజు అది విని ఆ స్థానమునకు ఆమెను రప్పించి పురప్రజలు చెప్పబడు పతివ్రతపు నీవేనా అని ప్రశ్నింపగా ఆమె నేనేనని చెప్పెను. రాజు మహాక్రోధముతో భర్తను సెలయేటిలో పడవేసితివి. జారుని మొండెమును మోయుచున్నావు. అనిచెప్పి తనకు ద్రోహముచేసిన భార్య ముక్కు, చెవులు కోయించి జారుని మొండెముతోపాటు దేశాంతరమునకు వెడలగొట్టెను. అద్భుతావహమైన ఈ కథను గోముఖుడు నరవాహనదత్తునకు వినిపించెను. ఇట్లు కథాసరిత్సాగరమునందలి వేశ్యల కథలు చిత్రవిచిత్రములై ఆశ్చర్యమును కల్గించుచున్నవి. (తరంగము—45)

## చంద్రశ్రీ కథ

కులస్త్రీలుకూడ గడీకలవలె విశ్వాసరహితలుగా నుందురు. బలవర్మ అనువర్తకునకు చంద్రశ్రీ అనే భార్య ఉండెడిది. ఆమె శీలహరుడు అను సుందరాంగుడైన వర్తకపుత్రుని భవన గవాక్షము నుండి చూచి అతనిని కామించి తన దూతికద్వారా రహస్యముగా తన భవనమునకు రప్పించుకొని అతనితో క్రీడించుచుండెను. భర్తకు ఆ విషయము తెలియదు. కొన్నాళ్లకు దాహ జ్వరముతో భర్తచావు

బ్రతుకులో నుండెను. అట్టి పరిస్థితిలో కూడ ఆమె వైశ్య పుత్రునితో క్రీడించుచుండెను. అకస్మాత్తుగా భర్త మరణించగా చంద్రశ్రీ కాముకుని ఇల్లు వదలి స్వగృహమునకు వచ్చి ఆమె దుర్గుణములు తెలిసిన బంధుజనాలు అసహ్యించుకొన్ననూ ఏడ్చి అగ్నిగుండముపైబడి సహగమనము చేసెను. స్త్రీల చిత్తవృత్తిని గమనించుట అసాధ్యము అని వసంతకుడు ఈ అద్భుత రసావహమైన కథను గోముఖునితో చెప్పెను కథాపీఠములోని పాటలీపుత్రకథ, ఉపకోశకథ, కథాముఖములోని లోహజంఘుకథ, దేవస్మితకథ, లావణక లంబకములోని హాలభూతి కథ, సుందోపసుందకథ, సూర్యప్రభ లంబకములోని మూర్ఖకథ, శశాంకవతీ లంబకములోని శ్రీదర్శనకథ, శక్తియశో లంబకములోని మూషిక కథ చోరకథ అనేక మూర్ఖ కథ మొదలగు కథలు అద్భుత రస పోషణకు చక్కటి ఉదాహరణలు.

ఇందలి కథానాయకుడైన నరవాహనదత్తుడు మదనమంజుకను పరిణయమాడెను. ఆమెను మానసవేగుడు హరించును. నరవాహనదత్తుడు మదనమంజుకాన్వేషణ ప్రయత్నములో అనేక ధైర్యసాహసములను ప్రదర్శించి మార్గ మధ్యమున సౌందర్యోత్కృష్టలైన అనేకమంది విద్యాధర కన్యలను వివాహమాడెను. నరవాహనదత్తునకు ఏర్పడిన విద్యాధర కన్యాసమాగము శృంగార రస పరిపుష్టికి తోడ్పడి తన్మాత్ర రసమయిన అద్భుతరస ప్రతీతికి పోషకముగా నున్నది. నరవాహనదత్తుడు మదనమంజుకాన్వేష ప్రయత్నములోనే అనేకమంది శత్రువులను పరాజితులనుచేసి తన మహా వీరత్వమును ప్రదర్శించెను ఇతడు శత్రువులతో గావించిన యుద్ధములు, సాహసకృత్యములు వీర రసపోషణకు ఉదాహరణములు. కథా సరిత్సాగరము నందలి అనేక మూర్ఖకథలు హాస్యరస పోషకములు. ఇట్లు హాస్య, శృంగార, వీరాది

రసములు ప్రధానరసమై అద్భుత రసమునకు పోషకములుగా వర్ణింపబడినవి. ఇట్లు సోమదేవుడు కథాసరిత్సాగరమున ప్రధాన రస పోషణలో తన కల్పనా చాతుర్యమును ప్రకటించి సిద్ధహస్తుడయ్యెను.

—....—

బృహత్కథా మంజరిలో రసపోషణ

1. "ఉమా ప్రణామ సంక్రాంత చరణాలక్తకః శశీ।
సంధ్యారుణ ఇవా భాతి యస్య పాయాత్సవః శివః"

గ్రంథారంభము నందలి ఈ ప్రార్థనా శ్లోకములో శృంగార భక్తి, అద్భుతరసములు పోషింపబడినవి.

2. "హర్షాన్మే త్వన్ముఖాంభోజ భృంగాలీ త్వయి సాత్వకా।
దృష్టిః పపాత లావణ్య కల్లోలాకులితా ధరమ్॥
అను శ్లోకమున పార్వతినిగూర్చి ఈశ్వరోక్తిలో శృంగార రసము కలదు.

3. బృహత్కథా మంజరి యందలి కథలన్నియు అద్భుత రస ప్రధానములే. కథాలక్షణము అద్భుత రస ప్రతిపాదికత్వము ఇందు కథామధ్యము నందలి రసాంతరములు అంగములై అద్భుత రసపోషకములుగా నున్నవి.

ఈ గ్రంథమున అనన్యాకర్షితమైన, దివ్య మానవ సంబద్ధమైన, చిత్ర విచిత్రములచే వివిధాశ్చర్య జనకమయిన సప్తవిద్యాధర చక్రవర్తుల కథను పార్వతికి భగవంతుడయిన నీలకంఠుడు చెప్పుచూ ఈ కథచే నిర్భరానంద సంపదలు మనః పద్మమున స్థిరముగా నుండగలవని పేర్కొనెను.

బృహత్కథా శ్లోకసంగ్రహమున ఉజ్జయిని వర్ణనతోనే గ్రంథము అరంభింపబడెను. బృహత్కథ అమృతకథ అని చెప్పబడుటచే పార్వతీ ప్రీతికొరకు పరమేశ్వరుడు ప్రణయముతో అద్భుత అనన్యా కర్ణిత చిత్రవిచిత్ర విద్యాధర చక్రవర్తుల కథలను శ్రవణయముచే చెప్పుటచే ఇందు శృంగార, హాస్య, కరుణ, వీరాద్యంగ రసమునకు పోషకముగా నున్నవి.

బృహత్కథా మంజరిలో ఒకటవ లంబకమున విద్యాధర కథా శ్రవణముచే పుష్పదంతునకు శాపము అతని కొరకు విజ్ఞప్తిని చేసిన మాల్యవంతునకు శాపము వరరుచి గుణాఢ్యులనెడి పేరుతో వారు భూలోకమున జన్మించుట విద్యాధర కథలను వరరుచి నుండి కాణభూతి, కాణభూతి నుండి గుణాఢ్యుడు విని ముప్వరూ శాప విముక్తులగుట వర్ణింపబడినది అందువలన ఈకథలు చిత్రరస నిర్భరములు, విస్మృత అమర కథలనీ కవియే చెప్పుటచే అతిలోక విషయ వర్ణనచే కథా పీఠ లంబకము అద్భుత రస ప్రధానమని తెలియుచున్నది.

కథాముఖము అను పేరుగల రెండవలంబకమున చండ మహాసేన ఉదయనుల మధ్య యుద్ధము వర్ణింపబడుటచే, వీర రసము పోషింపబడినది. చండ మహాసేన పుత్రికయైన వాసవదత్తతో సమాగమము వారికి కౌశాంబి నగరములో వివాహము. లంబకారంభమున గల ప్రార్థనా శ్లోకమున శృంగార రసము కలదు.

గౌరీ నవ పరిష్వంగే విభోః స్వేదాంబు పాతువః
నేత్రాగ్ని భీత్యాకామేన వారుణాస్త్ర మివాహితమ్॥

వాసవదత్త కొరకు వసంతకుడు హాస్యపై చిత్ర్య సరసమైన లోహ జంఘ కథను చెప్పుటచే హాస్యరసము పోషింపబడెను. పాటలీ పుత్ర కథలో శృంగార రసము యోగనంద మత్స్యహాస కథలో, ఉప కోశాఖ్యాయికలో, యోగనంద పుత్రశావ మోక్షకథలో, గుణాఢ్యకథలో ఆదిత్యవర్మ కథలో అద్భుత రసము పోషింపబడినది.

ఇతి మధు మధురాణి వత్సరాజశ్చరణ గతః కుపితాను
నా ధనాని ।
సతత ముదయన శ్చకార దేవ్యా వివిధ వసంత కౌశలాని
కామీ॥
రససా మదిరా రసైక సక్తా కలవీణా రవరాగిణీ శృతిశ్చ ।
దయితా ముఖ నీశ్చలా చ దృష్టిః సుఖి నస్తస్య
సదా బభూవ రాజ్ఞః ॥

ద్వితీయ లంబకారంభము నందలి ఈ శ్లోకమున శృంగార రసము అద్భుతముగా పరిపోషింపబడినది.

లావణక లంబకము :-

ఆశ్లిష్య మానః ప్రియయా శంకరోపి యదాజ్ఞయా ।
ఉత్కంపతే సభువనం జయత్యసమ సాయకః ॥

అను శ్లోకమున శృంగార రసము పరిపోషింపబడినది. ఈ శ్లోకము వలననే భావి - ఉదయన పద్మావతీ వివాహము సూచింపబడినది.

కిం జీవితే నమే కార్యం భర్తృ దుఃఖ ప్రదాయినా ।
ఇతివాసవ దత్తాచ జగాద రుదతీ ముహుః ॥

అను శ్లోకముచే విప్రలంభ కరుణరసము వ్యక్తమగుచున్నది. వాసవదత్త దగ్ధ అయ్యెననెడి కూటప్రవగారమున ఉదయనుడు పద్మావతిని వివాహమాడిన పిమ్మట వాసవదత్తను బహిర్గతము గావించుట అనుఘట్టమున అద్భుతరసము వ్యక్తమగుచున్నది. జీమూతవాహన కథలో దయా, వీర, శృంగార రసములు, సింహ పరాక్రమ కథలో అద్భుతరసము వ్యక్తమగుచున్నది.

చతుర్దారికాలంబకము

ఈ లంబకమున విద్యాధర శక్తివేగకథను తద్వివాహాదులను వర్ణించుటచే అద్భుతరసములు చక్కగా పోషింపబడినవి.

సూర్యప్రభా లంబకము

ఇందు విద్యాధరుల యుద్ధవర్ణనలో వీరరసము విద్యాధరుడైన సూర్యప్రభుని వర్ణించుటచే అద్భుతరసము వ్యక్తమగుచున్నది.

మదనమంజుకా లాభము

ఇందు తత్నదత్త, విప్ర, చండాలశిష్య, విక్రమసింహకథలలో క్షమావదాన కథలలో అద్భుతరసము, వైరాగ్యవధాన కథలో శాంత రసము, మదనమంజుకోద్వాహ కథలో, కళింగసేన మందరవేగసమాగమములో శృంగారరసములు వ్యక్తమగుచున్నవి.

వేలాలంబకము

నందన పుత్రికయైన వేలతో నరవాహనదత్తుని వివాహము వర్ణింపబడుటచే శృంగార రసమిందు పోషింపబడినది.

శశాంకవతీ లంబకము

లలితలోచనా నరవాహనదత్తుల సమాగమ వర్ణనచే శృంగార

రసము, మృగాంకదత్త శశాంకవతీ ప్రాప్తి వర్ణనచే శృంగారాద్భుత ములు, ప్రద్యుమ్నకృత భగవతీ స్తోత్రముచే భక్తిరసము, ఏక బేతాళ కథలలో భయానక, వీరాద్భుత రసములు పోషింపబడినవి.

విషమశీల లంబకము

ఈలంబకమువ వీర, అద్భుతరస పోషకములైన విక్రమాదిత్య కథలు వర్ణింపబడినవి.

మదిరావతీ లంబకము

ఇందు మదిరావతీ ప్రాప్తి వర్ణనచే శృంగార రసము పోషింప బడినది.

పద్మావతీ లంబకము

అకడు విద్యాధరేంద్రుడైన ముక్తకేతువునతో పద్మావతీ సమాగమమువర్ణింపబడుటచే శృంగార, అద్భుతరసములు పోషింపబడినవి.

పంచనామక లంబకము

ఇందు నరవాహనదత్తునకు గంధర్వదత్తతో, ప్రభావతితో, అజినావతితో, సులోచనతో మందరవేగ సోదరియైన సుందరితో ఆమె సఖీమణులైన కళికా-విద్యుత్ఫుల్ల-ఇందువదన-వర మతంగినీ - పద్మప్రభలతో సమాగమము వర్ణింపబడుటచే శృంగారరసము పోషింప బడినది. నరవాహనదత్తుడు యుద్ధములో మానసవేగాదులను వధించుటచే వీరరసము పోషింపబడినది. ఇందలి శృంగార విరోధి రసములన్నియు అద్భుత రసపోషకములు.

రత్నప్రభా లంబకము

ఇందు రత్నప్రభతో, కర్పూరమంజరితో నరవాహనదత్తుని

సమాగమ వివాహములు వర్ణింపబడుటచే శృంగార రసము పోషింప బడినది.

### అలంకారవతీ లంబకము

ఇందు అలంకారవతీ, నరవాహనదత్తుల సమాగమ వివాహవర్ణన లచే శృంగారరసము పోషిచివబడినది.

### శక్తియశో లంబకము

ఇందు శక్తియశతో నరవాహనదత్తుని సమాగమముచే శృంగార రసము వర్ణింపబడినది. మకరందికా, సోమప్రభల (కాదంబరీ,చంద్రాపీడుల) మనోరథప్రభా, రశ్మిమంతుల (మహాశ్వేత, పుండరీకుల) వివాహ వర్ణనచే శృంగారరసము పోషింపబడినది. గోముఖ ప్రోక్త కథలలో అద్భుతరసము పోషింపబడినది.

### మహాభిషేక లంబకము

ఇందు నరవాహనదత్తుడు మందరదేవిని ఆమె సఖులైన పల్గురు కన్యలను పొంది వివాహమాడుటచే శృంగారరసము పోషింపబడినది సముద్రమునుండి అప్సరసలు తెచ్చిన క్షీరత్నకుంభజలముచే నర వాహనదత్తుడు సర్వ విద్యాధరప్రణతుడై సర్వవిద్యాధర పదవి యందభిషిక్తుడై రత్నసింహాసనము నధిష్టించెనని వర్ణింపబడుటచే అద్భుతరసముకవ్యక్తమగుచున్నది.

### సురతమంజరీ లంబకము

గోపాలపుత్రుడైన అవంతివర్ధనునకు సురతమంజరితో సమాగమము వర్ణింపబడుటచే ఈ లంబకమున శృంగారాద్భుత రసము లభివ్యక్తము లగుచున్నవి.

## సప్తమ ప్రకరణము

### 7. ప్రపంచ సాహిత్యముపై బృహత్కథా ప్రభావము :

1. బృహత్కథ భారతదేశములోని ప్రాకృత, హిందీ, తమిళ, ఆంధ్ర మొదలగు ప్రాంతీయ భాషలలోనికేగాక, ప్రపంచములోని పర్షియన్, చైనా, టిబెట్, జపాన్, ఆంగ్లము, జర్మనీ, రష్యన్ మొదలగు భాషలలోనికి అనువదింపబడినది. 2వ శతాబ్దములో పెరుంగదై పేరుతో తమిళభాషలోని వాసుదేవ హిండి అనుపేరుతో ప్రాకృత భాషలోనికి అనువదింపబడినది. *C.H. Tawnay* మొదలగు వారు కథాసరిత్సారమును ఆంగ్లములోనికి అనువదించిరి. వేదము వేంకటరాయశాస్త్రి, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, కృత్తివాసతీర్థులు, విద్వాన్ విశ్వం మొదలగువారు ఆంధ్రములోని కనువదించిరి.

2. బృహత్కథా సంస్కృతానువాదమైన కథాసరిత్సాగరము నందలి కథలను ప్రపంచ కథాసాహిత్య తులనాత్మక పరిశీలనము వలన ఈ క్రింది విధముగా విభజింపవచ్చును.

1. ఆసియా, ఐరోపా, ఆర్య ప్రజల సాంప్రదాయానుగుణంగా నున్న ఆర్య కథలు.

2. పశ్చిమాసియా దేశములో Semantic ప్రజలలో సమాన సాంప్రదాయములతో నున్న Semantic వర్గమునకు చెందినకథలు

3. Mangolian ప్రజల ఆచారసంప్రదాయములకు సమానంగా నున్న ఆసియా వర్గ కథలు.

4. ద్రావిడ కోలారియన్ జాతుల సంప్రదాయములతో సమానముగా నున్న ఆర్యేతర భారతీయ వర్గ కథలు.

౫. నిశ్చితాధారము వలన ప్రపంచము నందంతటా సమానంగా వ్యాపించిన సర్వసాధారణ వర్గ కథలు.

౬. "పాటలీపుత్ర, గుణాఢ్య మలయవాన్" ఇత్యాది పదములాధారముగా సాహిత్య పరిశోధన ద్వారా నిర్ణయింపబడిన భారతీయ వర్గ ఆర్యకథలు.

౭. బృహత్కథలోని పంచతంత్ర కథలు, భేతాళ పంచవింశతి కథలు, శుకసప్తతి కథలు. బౌద్ధ జాతకములలోనికి, ప్రపంచములోని అనేక విదేశభాషలలోనికి వ్యాపించినవి. బేతాళ పంచ వింశతి కథలు భారతదేశ భాషలలోనికే గాక ఇంగ్లీషు, జర్మనీ, ఇటాలియన్ మొదలైన ఐరోపా బాషలలోనికి అనువదింపబడినవి. కథా సరిత్సాగరములోని విక్రమార్కకథ పర్షియన్, మంగోలియన్, సియామిస్ భాషలలోనికి అనువదింప బడినవి. ఇందలి శుకసప్తతి వంటికథలు, 14-వ శతాబ్దములో పర్షియన్ భాషలోనికి "తుతినామ" అనుపేరుతో అనువదింపబడినవి. ఈ కథలే అరేబియన్ భాషలో ప్రవేశించి 1001 రాత్రుల కథలు సింధుబాద్ కథలుగా రూపొందింపబడినవి. కథాసరిత్సాగరములోని పంచతంత్రి కథలు పహ్లవి, సిరియస్, అరబిక్. మలయానుండి ఐస్లాండ్ వరకు, ఆసియా. ఆఫ్రికా, యూరప్ ఖండాలలో వ్యాపించినవి వ్యక్తులపేర్లలో మార్పుచెంది ఆయా దేశప్రాంతములలోనికి వ్యాపించినవి ఉదాహరణకు ఇంగ్లండులోని "ఉత్తరవేల్స్" ప్రాంతములోని "బెడ్‌గెలర్ట్" అను గ్రామమునకు "విలియమ్స్పెన్సర్" ఒకసారి వెళ్ళి ఆ గ్రామ సౌందర్యమునకు ముగ్ధుడై ఆగ్రామ నామమును గ్రామస్థులను ప్రశ్నింపగా వారు యిట్లు చెప్పిరి.

ఆ గ్రామములో పూర్వము "లెవలీన్" అను పేరుగల వ్యక్తి ఉండేవాడు. అతని దగ్గర గెలర్ట్ అను పేరుగల శునకముండెడిది. ఒక

దినమతడు వేటకు అరణ్యమునకు పోయి తిరిగి వచ్చుచుండగా మార్గ మధ్యములో రక్తపిక్తమైన మూతితోనున్న కుక్క గెలర్టుకు ఎదురైంది. లెవలీన్ ఇంటికి పరుగెత్తుకొనిపోయి తన శిశువు పడక శూన్యముగా రక్తపు మరకలతో నుండుట చూచి శిశువును కుక్కే చంపినదని తలంచి అతడు కత్తితో ఆ కుక్కను సంహరించును. కానీ తరువాత శిశువు క్షేమముగా సమీపముగా ఆడుకొనుట, సమీపమున తోడేలు ఒకటి రక్తములో మునిగియుండుటచూచి "లెవలీన్" జరిగినదంతయూ అర్థము చేసుకొని తన పొరపాటు పనికి చాలా దుఃఖించి ఆ శునక స్మృతి చిహ్నముగా సమాధిని కట్టించెను ఆ గెలర్టు సమాధి ఉన్న చోటుకావున ఆగ్రామమునకు "బెడ్ గెలసుర్టు" అ పేరు వచ్చినదట. తన శునకమును చంపినట్లు చింతించుచున్నాను అనెడి సామెత వేల్స్ భాషలో కలదట. వాస్తవ సంఘటనగా చెప్పబడి ఈ వృత్తాంతము పంచతంత్రములోని నకుల కథకు రూపాంతరము అని Winternitz అభిప్రాయము. ఈ విధముగా ఎన్నో పంచతంత్ర కథలు నమ్మరానంతంగా ప్రపంచ దేశ సాహిత్య జీవితములో భాగముగా. మారినవి కథాసరిత్సాగరములోని పంచతంత్రము ప్రపంచములోని 50 భాషలలోనికి అనువదింపబడినదని "Hertel" పేర్కొనెను. ఇది క్రీ॥శ॥ 531-579 లో పహ్లవీభాషలోనికి క్రీ॥శ॥ 570 లో సిరియస్ భాషలోనికి క్రీ॥శ॥ 750 లో అరబిక్ భాషలోనికి క్రీ॥శ॥ 11-వ శతాబ్దములో లాటిన్ భాషలోనికి, 12 వ శతాబ్దములో హిబ్రూ భాషలోనికి 17-వ శతాబ్దములో జర్మనీ భాషలోనికి అనువదింపబడినది. జర్మన్‌దేశ జానపద సాహిత్యకథలలో కథాసరిత్సాగర పంచతంత్ర ప్రభావము అత్యధికముగా కనబడును. తర్వాత ఈ పంచ తంత్రము డేనిష్ ఇస్లాండిక్ భాషలోనికి అనువదింపబడినవి. జర్మన్ అనువాదాల ఆధారంగా 1493 లో స్పానిష్ భాషలోనికి క్రీ॥ శ॥ 1548 లో స్పానిష్‌నుండి

ఇటలీ భాషలోనికి క్రీ॥ శ॥ 1556లో ఫ్రెంచ్ భాషలోనికి అనువదింప బడినవి. క్రీ॥ శ॥ 16 వ శతాబ్దములో తోమస్ నార్తు ఆంగ్లములోని అనువదించెను. దక్షిణభారతదేశ పంచతంత్ర ప్రతి మరియు అరబిక్ అనువాద ఆధారముగా మలయన్ భాషలోనికి ఈ కథలు అనువదింప బడినవి సియామీస్ కథలలో పంచతంత్ర కథలతోపాటు చంపభేతాళ వింశతి కథ కూడ చేరినది. క్రీ॥ శ॥ 1142 లో "అన్వారి సుహాయలి" అను పేరుతో పర్షియన్ భాషలోనికి పంచతంత్ర కథలు అనువదింప బడినవి. ఈ పర్షియన్ అనువాదము మరలా టర్కీ భాషలోనికి క్రీ॥ శ॥ 15 వ శతాబ్దములో అనువదింప బడినవి. టర్కీ భాషలో "ఉమాయూన్‌నామ" అని దీనిపేరు.. ఈ టర్కీ అనువాదమే మరలా ఫ్రెంచి' జర్మన్, డచ్, హంగేరియన్, మళయాళము, మొదలయిన భాషలలో కలదు ఇట్లు పంచతంత్ర కథలు ఒక్కొక్క భాషలో భిన్నభిన్న స్రోతస్సుల నుండి భిన్నభిన్న అనువాదాలు చేయబడినవి. వివిధ భాషలలో మొత్తము పంచతంత్ర కథలకు 200 వరకూ రూపాంతరములు కలవు. ఇట్లు పంచతంత్ర కథలు ఆసియా, ఐరోపా, ఆఫ్రికా ఖండములలో వ్యాపించినవి, ఇవి కేవలము సాహిత్యము వరకే పరిమితము కాక సామాన్య ప్రజలలోనికి ప్రవేశించి ప్రాంతీయ రూపమును పొందినవి. ఆఫ్రికన్ జాతులలోకూడ ఈ కథలు వ్యాపించినవి వ్యాపార సంబంధమువలన ఈ కథలు అచ్చటికి వ్యాపించి యుండవచ్చును. గ్రీకు భాషలో అతి ప్రాచీనమైన "ఈసఫ్ కథలలో పంచతంత్రకథలు పశ్చిమ ఆశియానుండి మధ్య యుగములలో ఐరోపాలో వ్యాపించి ఆయా సాహిత్యములపై ఉన్నత ప్రభావమును చూపినవి "బొకాసియో త్రపరోలా" "చాసర్" "లపాస్టైన్" మొదలగు కవులకథా

గ్రంథములపై పంచతంత్రకథల ప్రభావము స్పష్టముగా కనబడు చున్నది. జర్మన్ భాషలలోని "గ్రిమ్" సోదరులు సేకరించిన బాల కథలలో కూడ పంచతంత్ర ప్రభావము కనబడుచున్నది. ఈకథలు వర్తకుల, యాత్రికుల రాజకీయ సంబంధ బాంధవ్యములతో వ్యాపించినపుడు కథా స్వరూపములో దేశ జాతి భేదములను బట్టి మార్పుపొందినవి. ఆధునిక కాలములోని జంతువుల పాత్రలు కల కామిక్స్ కథలకు "వాల్ట్‌డిస్నీ" బొమ్మల చలన చిత్రములకు పంచతంత్రకథలే పరోక్షముగా అపరోక్షకముగా ప్రేరకములు.

కథా సరిత్సాగరములో పంచతంత్ర సమాన కథలు Kolila wa Dimma, S'yntipas Barlaam and Josaprat అను గ్రంథములలో కలవు. కథాసరిత్సాగరమున సోమదేవుడు అనేక శతాబ్దములకు పూర్వమే నున్న జాతక కథలను చేర్చెను. పంచతంత్ర సమాన కథలు ఈజిప్టు, పాలస్తీనా దేశములలో విస్తృతముగా కలవు. 10వ శతాబ్దమునకు పూర్వమే భారతదేశము నుండి ఐరోపాది దేశములలో పంచతంత్ర కథలు వ్యాపించెను. రష్యా దేశమున కూడ అట్టి కథలు కలవు.

పంచ తంతత్రకథలు గ్రీకుదేశములో పుట్టి భారతదేశములో వ్యాపించినవని "వోటోకెల్లర్" "బెయిన్‌ఫేన్" అను వారి అభిప్రాయము ఈ అభిప్రాయము పూర్ణ సత్యముకాదు. అనేక కథలు భారతదేశములోనేపుట్టి ప్రపంచసాహిత్యములో వ్యాప్తిచెందినవని "హెర్టెల్‌వాగ్నెర్" అను విమర్శకులు కూడ అంగీకరించిరి. ఈ కథలలో అనేకము భారతదేశమున పుట్టినవి. క్రీ. పూ. 6వ శతాబ్దము నాటికే జంతువుల పాత్రలు గల నీతి కథలు భారతదేశములో కనబడుచున్నవి.

గ్రీకు, భారతదేశ ప్రజల మధ్య వైజ్ఞానిక ఆదాన ప్రదానములు జరిగిన కాలములో అలెగ్జాండర్ దండయాత్రకు పూర్వమే కథాసరిత్సాగరమునందలి పంచతంత్ర నీతికథలు అటునుండి ఇటు, ఇటు నుండి అటు వ్యాపించినవి. భారతదేశములో పుట్టిన కథాసరిత్సాగర కథ ఆధారముగా గ్రీసు మొదలైన దేశములలో కొన్ని కథలు పుట్టి అచ్చటనుండి ప్రపంచ వ్యాప్తమై యుండును. ప్రపంచములోని అనేక జానపద సాహిత్య కథలకు భారతదేశ బృహత్కథలలోని కథలే మూలముగా కనబడుచున్నవి కాని అవి అనేక పరిణామములతో వ్యాపించి తచ్ఛాయలతో మాత్రమే కనబడుచున్నవి. ఆఫ్రికాదేశములోని ఆదిమ జాతులలోకూడ జానపద కథలలో పంచతంత్ర కథాచ్ఛాయగల కథలు, ధర్మనీతి, భౌతిక వ్యవహార జ్ఞాన బోధకముగా కనబడుచున్నవి.

కథాసరిత్సాగరమున పేర్కొనబడిన సతీసహగమనాచారము ఇండో జర్మనీ ఆచారము. రాబోవు జన్మ ప్రస్తుతజన్మకు ప్రతిరూపమే మరణించిన వ్యక్తికి ప్రియమైన దానిని సన్నిహితముగా అతని సౌకర్యముకొఱకు ఉంచుట మంచిదనెడి విశ్వాసముతో ఈ ఆచారము ప్రవేశపెట్టబడినట్లు వదంతి. ఐరోపా దేశము నందంతటా ఈ ఆచారం కలదు. స్వీడన్ నుండి నల్లసముద్రమువరకు ఈ ఆచారము వ్యాపించి వది "స్లావాని లార్డ్స్"లో కూడ (ఈ) అనేక సంవత్సరములకు పూర్వమే ఈ ఆచారమున్నట్లు తెలియుచున్నది. గ్రీసు, ఈజిప్టు, చైనా, బాలి "జావల్స్ ల్యాండ్స్"లలో కూడ ఈ ఆచారము ప్రాచీన కాలమునందే కలదు. అక్బరు ఈ వివక్షతను అణచివేయుటకు ప్రయత్నించెను.

పర్షియన్ సాహిత్యములోని కథాసరిత్సాగరమునందలి పంచ తంత్ర కథలు "ఫాబ్లెస్ ఆఫ్ బిద్‌పాల్" అనే కథలకు ప్రత్యేకించి "కహిలావ-దిమ్న ఆఫ్ ఇబ్ను, ఐ ముకోఫా" కథలకు సమానమైనవి· "కలీల - వా - దిమ్న" పంచతంత్రములోని 1) సింహవృషభ కథ 2) అంగుళీయక కపోత కథ, 3) కాకిగ్రద్ద కథ, 4) తాబేలు కోతికథ 5) సన్యాసి మార్జాలకథ అను నీ కథలు పర్షియా భాషలోని "కలీల-వా-దిమ్న" కథలతో ఇంచుమించు సమానముగా నున్నవి. "కలీల-వా-దిమ్న" ప్రపంచములోని అనేక భాషలలోనికి అనువదింపబడినది. పంచతంత్ర కథలను పర్షియా, అరేబియా అనువాదములతో పోల్చి చూచినచో అనేక నవీన విషయములు వ్యక్తము కాగలవు. ఆ కథ లన్నింటికీ భారతదేశమే మూలమని చెప్పజాలము.

బృహత్కథ యందుపయోగింపబడిన పైశాచీ భాషమధ్య భారత వింధ్య పర్వత ప్రాంతభాష లేదా ఉత్తర పంజాబి భాష. ఇదిఅనార్య భాష యగుటచే అనేక అనార్య సంప్రదాయములను గుణాఢ్యుడు కథాసరిత్సాగరమున ప్రవేశపెట్టెను. ఈ అనార్య సంప్రదాయములు కథాసరిత్సాగర కథలనుండి ప్రపంచ జానపదసాహిత్యములో ఐరోపా ఆఫ్రికా, ఆసియా ఖండములలో ప్రవేశించినవి. ఇట్లె కథాసరిత్సాగర కాలమునాటికి ఎన్నో వేల సంవత్సరముల పూర్వము ప్రపంచ భారత దేశములమధ్య జరిగిన వ్యాపారయాత్రా సంబంధమూలముగా వైదేశిక జానపద కథా సాహిత్య సంప్రదాయాచారములు భారతదేశ మున ప్రవేశించియుండుటచే అనేక వైదేశిక సంప్రదాయములు కూడ కథాసరిత్సాగరమున కనబడుచున్నవి. కథాసరిత్సాగర రచనా కాలమున నున్న రాజకీయ అసంతృప్తి కుట్రలు రక్తపాతము నిరాశా

నిగ్రహాలు ప్రపంచమున తూర్పుదేశ ప్రాంతములలోకూడ వ్యాపమై యుండెను. మత ప్రభావము ప్రబలముగా నున్న కాలమది. కావున తత్ప్రభావము కథాసరిత్సాగర కథలనుండి ప్రపంచకథలలోవ్యాప్తి చెందినవి. కథాసరిత్సాగర కర్త సోమదేవుడు బ్రాహ్మణుడగుటచే ఆర్య బ్రాహ్మణ సంప్రదాయ స్వరూపము కథాసరిత్సాగర కథలలో మిక్కుటముగా కనబడుచున్నది. సోమదేవుడు కథాసరిత్సాగర కథలకే ఆర్య సాంప్రదాయానుగుణముగా దైవోత్పత్తిని మూలముగా పేర్కొనెను. మొత్తముమీద ఆర్య అనార్య సాంప్రదాయముగల భారతదేశ జానపద కథలను సోమదేవుడు సేకరించి గుణాఢ్య బృహత్కథ ఆధారముగా కథాసరిత్సాగరమనుపేరుతో వాటికి గ్రంథరూపమునిచ్చెను ఆర్య అనార్య సంప్రదాయము గురుశిష్య సంబంధము వలె కథాసరిత్సాగరమున కలిసిపోయినవి. ద్రావిడులు, కొలారియన్‌లు సోమదేవునకు 3000 సంవత్సరాల పూర్వమే భిన్న సంస్కృతి కలవారై యాత్రిలద్వారా వారి మతమును, జానపద సాహిత్యమును భారత దేశమున ఆర్యజాతులలో ప్రపంచములోని అనేక వైదేశిక జానపద సాహిత్యములో ప్రవేశింపజేసిరి. కావున నేడు పశ్చిమ ఆసియా లేదా ఐరోపా లేదా భారతదేశములో లేదా ఆఫ్రికా, అమెరికా, పసిఫిక్ ద్వీపములలో ఏనాడో ఏర్పడిన మౌళిక సాంప్రదాయస్వరూపములు కథాసరిత్సాగరమున ఎన్నియో కనబడుచున్నవి. ఒకే కథ సయాం ఇండోనేషియా, పర్షియా, ఐరోపా, ఆఫ్రికా, భారతదేశములలో కన బడుటచే అది ఏదో ఒకదేశమునుండి ఇతర దేశములకు వ్యాపించి యుండవచ్చును. ఇట్లు నాగరికతా సంప్రదాయములు భారతీయ ప్రజల వైదేశికయాత్రలవలన ప్రపంచము నందంతటా వ్యాపించి యున్నవి. ఉదాహరణకు క్రైస్తవమతవ్యాప్తివలనకూడ కొన్నిమతా

చారములు, సాంప్రదాయములు భారతదేశమున ప్రతిప్రాచీనకాలము నవే ప్రవేశించి భారతీయ కథలలో చోటు చేసుకున్నాయి.

బృహత్కథలోని అనేక ఆచారములకు సంబంధించిన కథలు ప్రపంచ జానపద సాహిత్యములో కనబడుచున్నవి. ఉదాహరణము నకు కొన్ని పద్ధతులను పరిశీలింపుడు.

## వేశ్యావృత్తి కథలు

Richard Carne Temple అభిప్రాయమునుబట్టి కథా సరిత్సాగరమునందు వర్ణింపబడిన వేశ్యలలో కొందరు పవిత్రశీలసంపద కలవారు కలరు. కొందరు అమితమైన స్వేచ్ఛా ప్రవృత్తితో సమాజమును కలుషితము గావించినవారు కలరు. ప్రపంచము నందంతటా వేశ్యావృత్తి ఆచారము ఒకవిధముగా లేదు. ఈ వ్యవస్థ ప్రపంచ దేశములలో భిన్న భిన్న పరిస్థితులపై ఆధారపడి ఏర్పడియున్నది. అనేకదేశములలో విలాస ప్రవృత్తి నైతిక నియమోల్లంఘన, మత దృక్పథము దీనికి మూలకారణముగా కనబడుచున్నది. సమాజము లోని ఆర్థిక పరిస్థితికూడ దీనిపై ఆధారపడియున్నది. కథాసరిత్సాగరమునందలి వేశ్యాప్రవృత్తికి సంబంధించిన కథలు ఐరోపా, ఆఫ్రికా ఖండ జానపద కథలలో అనేకము కనబడుచున్నవి.

## గాంధర్వ వివాహము

Richard Carne Temple అభిప్రాయమునుబట్టి వివాహ పద్ధతులలో గాంధర్వ వివాహము గుర్తింపబడిన ప్రశస్తమైనదికాదు. కథాసరిత్సాగరములో వర్ణింపబడిన గాంధర్వ వివాహము రాజుల విదేశీయాత్రా సంపర్కరమువలన విదేశీవ్యాపారమువలన మొట్ట మొదట భారతదేశమున ప్రవేశపెట్టబడి యుండవచ్చును.

1) కీర్తిసేన నాగరాజుతో - శృతార్థ బ్రాహ్మణ స్త్రీ వివాహము.

2) దేవదత్త బ్రాహ్మణునితో - ప్రతిష్ఠానగర సుశర్మ రాజ పుత్రిక వివాహము.

3) పాటలీపుత్ర శ్రీదత్త మాలన బ్రాహ్మణునితో సుందరి శబర కన్యా వివాహము.

ఉదాహరణమునకు పైన పేర్కొనబడిన గాంధర్వ వివాహములు ఆర్య, అనార్యుల కలయికచే భిన్న జాతీయులలో ఏర్పడినవి. ఇవి అనార్య సంప్రదాయ మూలములు.

కథాసరిత్సాగరములోని పాటలీపుత్ర కథలో పాటలీ పుత్రుని వివాహమాడుట అనార్య సంప్రదాయము. ఐరోపా దేశములో దీనికి సమానమైన కథలు కలవు. రహస్యముగా కలుసుకొని వివాహమాడ దలంచిన యువతీ యువకులకు ఎట్టిటి గుర్తులుంచు కథాసరిత్సాగర కథలోని ఆచారము అండమాన్ దీవులలో కలదు. రాత్రి యువతి పెట్టిన గుర్తులు ప్రొద్దువ కనబడినచో వారి పెద్దలు వారికి వివాహము చేయుదురట.

కపాలా మాలాధరణము

కథాసరిత్సాగర కథలో శివుడు కపాల మాలాధారి యగుటచే దక్షయజ్ఞమున కాహ్వానింపబడినట్లు పార్వతితో చెప్పెను. కపాల మాలాధరణము అనార్య సంప్రదాయము. శివుడు అనార్య దైవము. వ్యాధిగ్రస్తులైన బంధువుల కపాలములను ధరించు ఆచారము అండమాన్ జాతులలో కలదు. ఎ.పి. బ్రౌన్స్ అండమాన్ ఐలాండ్స్ ప్లాట్ నెం. 18"లో ఒక బాలిక తన సోదరి కపాలమును ధరించినట్లు వర్ణింప

బడినది. అండమాన్ జాతీయులలో గతించిన వారి కపాలమును బంధువులు ధరించుట, గతించిన ప్రమాదములు వంటి ప్రమాదాలు వచ్చినచో వాటినుండి రక్షించుకొనుటకు స్మృత్యర్థ సూచకమని చెప్పు ఆచారము కలదు. ప్రపంచ సాహిత్యముపై కథాసరిత్సాగర ప్రభావ మున కిదియొక నిదర్శనము.

## యంత్ర గజములో యుద్ధయోధుల నుంచుట

చంపమహాసేనుడు యంత్ర గజములను నిర్మించి అందులో యుద్ధయోధులను నింపి ఉదయనుని బంధించుటకు వింధ్య పర్వత ప్రాంతములో వదలిపెట్టెను. ఈజిప్టు దేశములో ఈ సంప్రదాయము కలదు. ఆలీబాబా '40 దొంగల కథల్లోకూడ ఇట్టి ఉదాహరణములు కలవు. బర్మాదేశములోకూడ కలదు. శత్రువులను బంధించుటకు పై విధముగా ప్రయోగముచేయుదురు. ప్రపంచమున తూర్పుదేశముల నుండి పశ్చిమ దేశములవరకు విదేశ వ్యాపారము గొప్పగా జరుగు చుండెడిది. తత్ఫలితముగా యంత్రగజములో యోధులను రహస్య ముగా పెట్టి శత్రువులను బంధించు పద్ధతి అనార్య సంప్రదాయ మూలముగా ఏర్పడినది.

## పరకాయ ప్రవేశము

కథాసరిత్సాగరమున ఇంద్రదత్తుడు ఆత్మ మరణించిన నందుని దేహములో ప్రవేశించెను. వ్యాడి, ఇంద్రదత్తుడు వదలిన దేహమును దేవాలయమున కాపాడుచుండెను. పిమ్మట ఇంద్రదత్తుని దేహము నందమంత్రి కాల్చివేయించెను. ఒక ఆత్మ దేహమును వదలి మరి యొక దేహములో ప్రవేశించి స్వప్రయోజనమును సాధించుకొనుట

ఆర్య సంప్రదాయమని కాని, అనార్యసంప్రదాయమని కాని నిశ్చ యించి చెప్పజాలము. ప్రేతాత్మల సంచార వర్ణన ఆసియా, ఐరోపా ఖండములలోని అనేక జానపద కథలలో కలదు.

## సంకేతబాష

శ్రీ అను రాజపుత్రిక దేవదత్తునకు సమాగమ సంకేతమును తెలియజేయును. ఆమె తన దంతముల కడ పుష్పమును చూపించి పుష్పమును క్రింద పడవైచెను. దీనివలన ఆతడు పుష్పదంత అను దేవాలయమునకు వెళ్లి ఆమెకొఱకు నిరీక్షింపవలెనని సూచింపబడినది ఈ సంకేతబాష ఆర్య సంప్రదాయమని కాని, అనార్యసంప్రదాయ మని గాని నిశ్చయించి చెప్పజాలము. గ్రీసు, పర్షియన్ జానపద కథలలో తచ్ఛాయగల కథలు కలవు.

## గరుడపక్షి

దైవశక్తిగల గరుత్మంతుడను పక్షి దాని సాహసకృత్యముల ప్రదర్శన ఆర్య సాంప్రదాయమునకు చెందిననూ భారతదేశములో దీని పుట్టుక ఎప్పుడేర్పడినదో చెప్పజాలము. నాయకుని వీరకృత్యము లను మహోన్నత వ్యక్తిత్వముగా ఆరోపించి వర్ణించు సంప్రదా యముకూడ కేవల ఆర్య సంప్రదాయముగా చెప్పజాలము. అట్టి పద్ధతి ప్రపంచము నందంతటా కలదు.

## గర్భిణీ స్త్రీ దోహదపూరణము

గర్భిణి స్త్రీ దోహదపూరణ ఆచారము ప్రపంచవ్యాప్తమైనది ఇది భారతదేశమున జన్మించి ఇతర దేశములలో వ్యాప్తమైనదని కావున భారతదేశమే ఈ ఆచారమునకు మూలమని చెప్పజాలము.

కథాసరిత్సాగరములోని గర్భిణీ దోహదపూరణము హిందు మతంలో సర్వసాధారణము. ఉన్నత స్త్రీలు గర్భిణిగా నున్నప్పుడ తమకు కలుగబోవు సంతానమునుగూర్చి గొప్ప భావనను కలి( ఉందురు. తదనుగుణముగా వారికి కోరికలు ఏర్పడును. అప్పుడ ఏర్పడిన వాంఛలను తప్పక పూరించు ఆచారము కలదు. జైనమ( ములోకూడ ఇట్టి ఆచారముకలదు. ఈ చర్య తూర్పుదేశములనుం( పశ్చిమ దేశములకు వ్యాప్తి చెందినది.

మాయా వస్తువులు (మాయాపాదుకలు)

పాటలీపుత్ర కథలో పుత్రికుడు పాటలీని మాయాపాదుక సహాయముచే ఎత్తుకొనిపోయెను. "మాయాపాదుకలు, వాయువుల నెగరుశక్తి, ప్రాయునది యథార్థమగు శక్తి" ఈ విషయము( తూర్పుదేశమునుండి పశ్చిమదేశమునకు వెళ్ళియుండవచ్చును. కా భిన్నరూపములో పశ్చిమదేశములలో ఇట్టి వర్ణన కలదు. కాపు ఇది ఆర్యసంప్రదాయమనికాని, అనార్యసంప్రదాయమని కాని చెప జాలము. ఇట్టి సంఘటనలు "గ్రిమ్స్ ఫెయిరి టాల్స్"లో కూడ క బడుచున్నవి. బాబిలోనియా షుల్తాన్ కుమార్తెను ఎత్తుకొనిపో( నేపాల్ నగరమును కనుగొనెను. ఈ మాయావస్తువులను సంపా( చుట పశ్చిమ దేశీయ కథంలో కలదు. దీనిని తూర్పు దేశీయు గ్రహించిరి. స్వతంత్రముగా తూర్పు పశ్చిమ దేశములలో భావనలు బయలుదేరి ఉండవచ్చును.

వలలో వేసుకొనుట : కథాసరిత్సాగరమున దేవస్మిత, సిద్ధి శక్తిమతి కథలలో పైపద్ధతి కనబడుచున్నది. ఈ పద్ధతి ఆసియ

ఐరోపా దేశము నందంతటా ప్రాచీనకాలముననే వ్యాపించియున్నది. దీనికి కథాసరిత్సాగరమే మూలము. కథాసరిత్సాగర కాలమునకంటె ముందే అతిప్రాచీన కాలమున ఈ చర్య భారతదేశమున ఏర్పడి యుండవచ్చును.

మత్స్యహాస్యము, అర్ధాయుస్సు నిచ్చుట సంహరణార్థము లేఖ. కథాసరిత్సాగరములో ఒకటవలంబక వరరుచి కథలోని మత్స్యహాస్యకథ. రెండవ లంబకములో రురు కథలో అర్ధాయుస్సు నిచ్చు వృత్తాంతం, ఒకటవ లంబకములో శివశర్మ కథలో సంహరణార్థము లేఖ వృత్తాంతము, అను నీ వృత్తాంతములకు సమానములైన వృత్తాంతములు ఐరోపాదేశమునందంతట వ్యాపించియున్నవి. కావున నివి భారత దేశజన్యములని చెప్పజాలము.

బాలవినష్టక కథ

రెండవలంబకములో కథాసరిత్సాగరములో రుద్రశర్మపుత్రుడు తనను చక్కగా పోషించని తల్లిని, తన తండ్రితో తనకు రెండవ తండ్రి కలడని చెప్పి భయపెట్టి తనను చక్కగా ఆదరించునట్లు చేసికొనుట.

కథాసరిత్సాగరములోని బాలవినష్టక కథలవంటి కథలు అనేక జైన గ్రంథములలో కలవు.

కల్పవృక్ష వృత్తాంతము

రూపిణిక కథ - లంబకము రెండు. ఇట్టి కథలు తూర్పు ఐరోపా దేశము నందంతటా వ్యాపించియున్నవి. ప్రాగ్దేశ మతాచారములలో క్రైస్తవ మతములో కూడ కల్పవృక్ష ప్రస్తావన కలదు. (అరేబియన్ నైట్స్ వాల్యూం-5 పుట-237).

## పుత్రోత్పత్తి కొఱకు పుత్రుని సంహరించుట

దేవస్మిత కథలో ఒకరాజు ఒక బ్రాహ్మణుని ఉపదేశమును విని పుత్రోత్పత్తి కొరకు తన పుత్రుని సంహరించెను. పుత్రప్రాప్తి కొఱకు ఇతరుల పుత్రులనుకూడ సంహరించు ఆచారము కలదు. పున్నామ నరకమునుండి వంశ ప్రతిష్ఠ కొరకు పుత్ర సంతతికొరకు హిందూ సంప్రదాయమునుబట్టి అత్యవసరమగుటచే ఈ ఆచారమునకు భారతీయ హిందూమతమే మూలము.

## బేతాళములు

బృహత్కథలో బేతాళములు ఒక విశిష్టస్థానము నాక్రమించె. రెండవ లంబకములో మహాకాలనివాసమైన ఉజ్జయినీ నగరమునకు యౌగంధరాయణుడు వింధ్య పర్వత మార్గముగుండా ప్రయాణము సాగించెను. ఉజ్జయినీ ప్రాంతము బేతాళ నివాస ప్రాంతము.

బేతాళులనుగూర్చిన భారతీయ భావనలు పిశాచదాసులకు సన్నిహితముగా నున్నవి. ఈ భావనలు దక్షిణ రష్యా నుండి తూర్పు, పశ్చిమదేశములలోనికి, భారతదేశములోనికి ప్రవేశించినవని ఆధునిక పరిశోధనలవలన తెలియ వచ్చుచున్నది. దాస వృత్తికి సంబంధించిన భారతీయ-రష్యా జాతి మూఢాచారములను ఈ సందర్భముగ పరిశీలించినచో పై విషయము సత్యదూరముకాదని చెప్పవచ్చును.

## నిశాచర మానవవాతీతశక్తి

భూతవర్మ అను రాక్షసుడు తమకు రాత్రి కాలముననే అతీతశక్తి యుండునని ఈశ్వర, బ్రహ్మ సంభాషణద్వారా తన విషయము తెలిసినదని చెప్పినట్లు కాణభూతి గుణాఢ్యునకు చెప్పెను. ఈ కథ

హిందూమూలముగా కనబడును. కాని ఈ విషయమునకు ఐరోపా దేశము మూలము. కాని కేవల ఆసియా ఖండముకాని, భారతదేశము కాని మూలముకాదు. ప్రాచీన ఈజిప్టు చైనాలో రాక్షస కథలు అనేకములు కలవు.

అంజన లేపనము

సౌందర్య దృష్టితో, ఔషధ దృష్టితో అంజన లేపనాచారము భారతదేశము నందంతట కలదు. ప్రపంచములో భిన్న భిన్న జాతులలో ఈ ఆచారము భిన్న భిన్న రీతులలో కలదు. మహమ్మదీయులలో పురుషులుకూడ భిన్న వర్ణములో అంజనమును ధరించు ఆచారము కలదు.

కథాసరిత్సాగరములో ఉదయనుడు స్త్రీ లోలుడై పరిపాలటి బాధ్యతలను విస్మరించును. ఉజ్జయినీ పాలకుడైన ఆదిత్యసేనుడను రాజు స్త్రీలోలుడై పరిపాలనబాధ్యతను విస్మరించును. వీరిఆమాత్యులు పరిపాలన బాధ్యతను స్వీకరించి రాజును రక్షించుదురు. విదేశిక కథలలోకూడ ఇట్టి ఉదాహరణలుకలవు. 7వ శతాబ్దములో ప్రజాపరిపాలన బాధ్యతలను విస్మరించిన జయ సింగ్ బాధ్యతను సంస్మరింపజేసి అమాత్యుడు మరల బాధ్యతాయుతుని గావించెను.

అవిశ్వాస భార్యా నాసికాకర్తనము

దేవదాస కథలో దేవదాసు తన క్రూర భార్య నాసికను కత్తరించెను. రామాయణమున లక్ష్మణుడు శూర్పణఖ ముక్కుచెవులు కోయుట ఈ సందర్భమున సంస్మరింపదగినది. భారతదేశమున ఈ ఆచారము పౌరాణీకకాలమునుండి ప్రసిద్ధమైనది. ఇట్టి కథలు ఐరోపా

ఖండములో, అరేబియన్ జానపద కథలలోకూడ కలవు.

**జన్మస్థలమున దుష్టశక్తుల నణచుటకు లోహపదార్థముల నుంచుట :**

వాసవదత్త గర్భిణీగా నున్నప్పుడు వాసగృహకవాటమున బాణము లుంచబడెను. ఈ పద్ధతి భారతదేశము నందంతట కలదు.

కాంచనపుర కథలో శక్తిదేవుడు మత్స్యముచే మ్రింగబడి మరల ఆ మత్స్యమును ఖండించుటచే ప్రాణములతో బయటపడును. ఈ కథకు భాగవతపురాణములోని క్రింది రతీ మన్మథులకథకు సామ్యమున్నది. రతీదేవి మాయావతిగా జన్మించి శంబరుని పత్నికాగా శంబరుడు ప్రద్యుమ్నుని పట్టుకొనగా పిమ్మట నారద వచనము వలన ప్రద్యుమ్నుడు మాయావతి రతీకాములని తెలుసుకొని వారు శంబరుని సంహరించి తమ తల్లిదండ్రులను చేరిరి.

## విషకన్యా వృత్తాంతము

చాణక్యుడు రాక్షసునిచే పంపబడిన విషకన్య నుండి చంద్రగుప్తుని కాపాడెను. విషకన్యా శరీరముపై ప్రాలిన దోమలవంటి సూక్ష్మక్రిములు ఆమె రక్తమునుపీల్చిన వెంటనే మరణించిన సంగతి చాణక్యుడు ప్రత్యక్షముగా గమనించి చంద్రగుప్తునకు ఆమెతో సమాగమము ఏర్పడకుండా కాపాడెను

7వ శతాబ్దమున విశాఖదత్తుడు రచించిన ముద్రారాక్షస
ఈ విషకన్యా ప్రయోగ వృత్తాంతము కలదు. కథా
హ్మదత్తుని మంత్రియైన యోగకరండకుడు
డెత్తి వచ్చినపుడు మార్గమధ్యమున ఉద
విషకన్యా ప్రయోగము చేసి యోగరిధ

రాయణుని ప్రయత్నము వలన నిష్ఫలుడయ్యెను. విషప్రయోగ వృత్తాంతములు సంస్కృత సాహిత్యములో చాలా స్వల్పము. శత్రువులను సంహరించుటకు విషప్రయోగము గావించుట నైతిక విరుద్ధమైననూ మనస్మృతిలో అది పేర్కొనబడినది. క్రీ. శ. మధ్యయుగములో విషప్రయోగము లోవలన శత్రువులను సంహరించిన వృత్తాంతము లనేకము కలవు. జలములో విషప్రయోగము కూడ అట్టిపద్ధతికి చెందినదె. ఆస్ట్రేలియా, ఆఫ్రికా, బ్రెజిల్, జర్మన్, అరేబియా, సిరియా తూర్పు ఐరోపా మొదలగు, దెశములలో కూడ విషప్రయోగ వృత్తాంతము ప్రాచీన కాలముననే పేర్కొనబడినది.

అరిస్టాటల్ అలెగ్జాండరుకు పంపిన లేఖలలో భారతీయుల విషకన్యా ప్రయోగమునుగూర్చి అలెగ్జాండరును హెచ్చరించియున్నాడు. విషకన్యా దృష్టిపాతము, విషకన్యాశ్వాసపాతము శత్రువులపై ప్రయోగింపబడిన వృత్తాంతములు, విషకన్యా సంయోగమును కలిగించి శత్రువులను సంహరించిన వృత్తాంతములు అనేకదేశములలో కలవు క్రీ. శ. పూర్వమే భారతదెశమున విషకన్యాప్రయోగ వృత్తాంతము కనబడుచున్నది.

విషపూరితములైన సర్పముల స్వభావమును గమనించి భారతీయులు సాహిత్యములో అనుభవమయిన విషకన్యా ప్రయోగ వృత్తాంతము చేర్చియుందురు. కాని వాస్తవమునకు విషకన్యా జనన వర్ణనములు మిథ్యా కల్పనలని మాత్రము చెప్పవచ్చును

కథా సరిత్సాగరమున పేర్కొన్న ఊర్వశీ పురూరవ వృత్తాంతము మొట్టమొదట ఋగ్వేదముననే పేర్కొనబడినది. కాళిదాసు ఊర్వశీ పురూరవకథను విక్రమోర్వశీయము అను నాటకముగా రచించెను. మహాభారతములోని విష్ణు పురాణము లోకూడ వీరి వృత్తాంతము

కలదు. దేవ వేశ్య మానవుని ప్రేమించు వృత్తాంతము గ్రీకు దేశ కథలలోకూడ కనబడుచున్నది. The Golden Bough IV 15th Volume దీనికి సమానమైన కథ కలదు. The Dying God (130-131 పేజీలు)

శ్వేత ఛత్ర ధారణము :

శ్వేత ఛత్రము రాజుల పరిపాలనాధికార చిహ్నము. భారత దేశమున క్షత్రియులందరూ దీనిని ఉపయోగించిరి. ఇది దేవతోత్స వములలో కూడ ఉపయోగింపబడెను. బుద్ధ విగ్రహంపై కూడ ఛత్రి మున్నట్లు చెక్కబడినట్లు శిల్పములు కలవు, చక్రవర్తిత్వమున కిది చిహ్నము. ఈజిప్టు, బర్మా, ఐరోపా. బాబిలోనియా, చైనా మొదలగు దేశములలో ప్రాచీన కాలముననే దీనిప్రసక్తి కలదు.

ఘట కర్పర కథ :

శక్తి యుశో లంబకములోని 8 వ తరంగములోని తరంగము 146 వ ఘట కర్పర కథ, Herodotus లోని phampsinitas అను ప్రసిద్ధ కథతో సమానమైనది. ఘట కర్పర కథలోని చోరులు వారిని ప్రేమించిన కులటయైన రాజపుత్రిక కథ యిందు వర్ణింపబడినది. కర్ప రుడు రాజుచే సంహరింపబడిన పిమ్మట ఘటుడు తాను పన్నిన ఉపా యములలో విజయవంతుడయ్యెను. కాని చివర రాజపుత్రికచే వంచితు డయ్యెను. కులటా స్త్రీల విచిత్ర స్వేచ్ఛాచరణమునకు భోగ లిప్సకు ఈ కథ ప్రతీక. ఈ కథలోని రెండవభాగము కాశ్మీర ప్రాంత ప్రసిద్ధ కథలు మూలముగా గలది. Herodatus కథా గ్రంథము కూడ Egypts దేశ మూలమయినది. Herodatus కథలో సోమదేవుని ఘట కర్పర కథలో క్రింది విషయములు సమానములు.

1. చోరద్వయము
2. అందులో ఒకడు పట్టుబడుట
3. కర్పూర మృత దేహమును చూచుట కెవరయినా వచ్చుదురని రాజభటులు పరీక్షించుచుండుట.
4. రాజ ప్రయత్నములు వ్యర్థమగుట.
5. రాజు బహుమతిని ప్రకటించుట.

రాజ పుత్రిక చోరుని ప్రేమించుట సంస్కృతసాహిత్యములో నూతనముకాదు. ఈ సంఘటన కథాసరిత్సాగరములో రెండు సందర్భములలో కలదు.

పంచవింశతి బేతాళ కథలు దక్షిణ రష్యా, మధ్య ఐరోపా దేశములలోని బేతాళ కథలను పోలియున్నవి.

The Adventures of Hatimtai పర్షియా భాషలో నుండి అనువదింపబడిన ఈ గ్రంథము కొన్ని బేతాళ కథలను పోలి యున్నది కథాసరిత్సాగరమునందు కల్పవృక్షసంబంధకథలు,రాజుల అమాత్యుల, ద్యూతకారుల, కార్మికుల, దేవతల, నాయకుల, భిక్షకుల, క్షురకుల, విద్యాధరుల, రాక్షసుల, నాగలోక దేవతల, కిన్నెరులకథలు, ఆశ్రమములు, నగరములు, స్వర్గము,ఎడారిప్రాంతము, అంతఃపురము తపస్సులు, గజ అశ్వకథలు విషకన్యా వృత్తాంత వర్ణనలు, పై గ్రంథ ములోని కథలతో పోలియున్నది. పర్షియన్, అరబిక్ భాషలోని Fables of Bibpai కథలుకూడ బేతాళ పంచ వింశతి మొదలగు అనేక కథాసరిత్సాగర కథలను పోలియున్నది.

బేతాళకథలు :

భేతాళ ప్రశ్నలకు విక్రమార్కుని సమాధాన కథలుఆధునిక సాహిత్యములోని Frank stocktons the Lady of the Tyger

కథలను పోలియున్నవి, జంతుకథలు విశేషించి బౌద్ధమత నీతికథలను పోలియున్నవి బౌద్ధమత సిద్ధాంతమునకు సంబంధించిన చాయలు బేతాళకథలలో స్పష్టముగా కనబడుచున్నవి. వర్ణమునకు, పాతివ్రత్యమునకు, బలికి, యజ్ఞ యాగములకు సంబంధించిన కథలలోకూడ బౌద్ధమత ప్రభావము కనబడును, విభిన్నమత సంబంధమైన ఈ ఆచారముల మూల స్వరూపములను తెలుసుకొనుటకు అమూల్య పరిశోధన అవసరము. అందలి భారతీయ భావనలు ఆదర్శములు. Yemin Arabs of Hatimtai భావనలకు, ఆదర్శములకు సమానముగా నున్నవి. ఈ కథలలో తపశ్చర్య మాయాశక్తి సాధనకు, ద్యూతము వినాశమునకు నిదర్శనములుగా ప్రదర్శింపబడినవి. బాధ్యతారహిత ప్రభువుల పాలనలో జీవిత హైన్యగతి వర్ణింపబడినది. ఒకానొక కథలో చోరుడు న్యాయనిర్ణేతగా నియమింపబడెను. మరణకాలమున దర్శింపబడిన లేదా ఆలోచింపబడిన సంఘటనయే రాబోవు జన్మ స్వరూప నిర్ణయించును, అనెడి ప్రబోధముకూడకలదు. శశాంకవతీ లంబకములో పుష్కరాక్ష వినయవతుల పూర్వజన్మ సాహస కృత్యకథలో ఈ వృత్తాంతము కలదు. ఈ బేతాళ కథలు 17 వ శతాబ్దములోని Le Grand Cyre and other t dious శృంగారకథలను పోలియున్నవి. శాప ప్రభావములు, తపోవంతుని శక్తులు భవిష్యత్తునుగూర్చి చెప్పబడు స్వప్నములు మొదలగునవి. చైనా దేశీయ జానపద కథలను పోలియున్నవి.

బేతాళ కథలలో కొన్ని బౌద్ధ శైవ మత ప్రభావోపేతముగానున్నవి. కొన్నిచోట్ల జైనమత ప్రభావము కనబడుచున్నది. విక్రమార్కుడు కూడ ప్రాచీన జైన మతాచారమునకు సంబంధించినవాడే. విక్రమసేననికుమారుడే త్రివిక్రమసేనుడు. విక్రమ లేదా విక్రమాదిత్య

సామపద్ధతి జైనాచారము. విక్రమశకముకూడ 58 లేదా 57 బి. సి. నుండి అరంభమైనది. మహావీరుడు 5 లేదా 6 శతాబ్దములమధ్యకాలం వకు చెందినవాడు. ఒక సన్యాసి తాంత్రిక శక్తులను పొందుటకు రాజ సహాయమును సంపాదించును, రాజును బలి ఇచ్చి అతడు విద్యాధర చక్రవర్తి కాదలంచెను. త్రివిక్రమసేనుడు నిర్భయముగా సన్యాసికి సహాయము చేయదలంచి చెట్టుకు వ్రేలాడు మృతశరీరమును వృక్షం నుండి మోసుకొని రాలంచెను. ఆ మృత శరీరము బేతాళునిచే ఆవే శింపబడినదని తెలుసుకొనెను ఆ బేతాళుడు 24 కథలను చెప్పి అందు లోని చిక్కుప్రశ్నలకు సమాధానము చెప్పవలసినదిగా త్రివిక్రమ సేనుని ప్రశ్నించగా చివర ప్రశ్నకుతప్ప మిగతా ప్రశ్నలన్నింటికి సమాధానము త్రివిక్రమసేనుడు చెప్పెను. విక్రమ చరితములోకూడ ఈ బేతాళ పంచవింశతి కథలు కలవు.

తమిళానువాదములో ఇంద్ర నారద సంవాదముతో ఈ కథలు ఆరంభమగును. అరేబియన్ నైట్స్‌లోకూడ ఇట్టికథలు కలవు. Vol-1 186-194 Burtow) టిబెట్, మంగోలియన్ కథలలోకూడ ఈ కథా ఛాయలు కలవు.

బేతాళ కథలలోని మెయినాస్ కథ, టర్కిస్‌లో "తుతీనామహ్" కథలలోకూడ కలదు.

బేతాళ కథలలోని శుక కథ తమిళ అనువాదములో కొంచెము భిన్నముగా నున్నది. అందులో నిజమైన చోరుడులేడు.

ప్రాక్ దేశ జానపద సాహిత్యమును పశ్చిమదేశ జానపద సాహిత్యమును సంపూర్ణముగా అధ్యయనము చేసి తులనాత్మకముగా

కథాసరిత్సాగర కథలను పరిశీలించినచో వాటి మూలస్వరూపము, వాటి వ్యాప్తిని గురించిన సంపూర్ణ వివరములు తెలియగలవు. ఉదాహరణకు బేతాళ కథలోనున్న మత సాంప్రదాయములు, వైజ్ఞానిక విషయములు, పశ్చిమదేశ పర్షియన్, జర్మన్, రష్యన్ జానపద సాహిత్యములో తులనాత్మకముగా పరిశీలించినచో దృగ్గోచరమగుచున్నవి.

## అప్సర స్త్రీ వృత్తాంతము

కథాసరిత్సాగరమున మరుభూతి ఒక ఆశ్రమమువద్ద నదిలో స్నానమాడ వచ్చిన అప్సర స్త్రీలను దర్శించెను. ఆశ్రమవాసి ప్రబోధముచే నదీతీరముపై నుంచబడిన ఒకానొక స్త్రీ వస్త్రమును దాచెను. అప్పుడాశ్రమవాసి నరవాహనదత్తునకు సంబంధించిన సమాచారమును తెలియజేసినచో వస్త్రములను తిరిగి ఇచ్చెదనని చెప్పెను. ఆ అంగీకారముచే ఆమెకు వస్త్రముల నిచ్చెను. పిమ్మట ఆమె ఆశ్రమవాసికి భార్యయై పుత్రుని ప్రసవించెను. ఆమె అచటనుండి అదృశ్యమై వెళ్ళుచూ తనతో మరల కలియవలెనన్నచో ఆ పుత్రుని పచనముచేసి భక్షింపవలెనని చెప్పెను. ఆ ఆశ్రమవాసి అట్లు చేయుటవలన ఆకాశములో ఎగురగల శక్తిని సంపాదించి మరల ఆ అప్సరసతో కలిసెను. ఇది సంక్షిప్త కథ.

వస్త్రాపహరణ, ఛాయా కథలు యూరోపు జానపదసాహిత్యములో అతి ప్రసిద్ధములైనవి.

భాగవతములోని కృష్ణ బాల్య కథలు దీనికి మూలములు. Egyptian Pipyri కథలు అనేక కథాసరిత్సాగర కథలను పోలియున్నవి.

కథాసరిత్సాగరములోని పంచతంత్ర బేతాళ పంచవింశతి శుకసప్తతి మొదలగు అనేక కథలు వాటి ఛాయలు స్వల్పపరిణామములతో ప్రపంచ కథా సాహిత్యములో వ్యాపించియున్నవి. అనేకఆర్య అనార్య భారతీయ సంప్రదాయములు, పద్ధతులు ఇంచుమించు సమానముగా ఐరోపా, ఆసియా, ఆఫ్రికా ఖండములలో అచ్చటచ్చట జానపద కథాసాహిత్యములో కనబడుచున్నవి. కావున ప్రపంచకథా సాహిత్యముపై బృహత్కథా ప్రభావము అపారముగా కనబడుచున్న దని నిస్సంశయముగా చెప్పవచ్చును.

## అష్టమ ప్రకరణము

## ఉపసంహారము

బృహత్కథానువాద విధానమున కథాసరిత్సాగరములో సోమదేవుడు, కథామంజరిలో క్షేమేంద్రుడు, శ్లోకసంగ్రహములో బుధస్వామి కథాకావ్యమున కుండవలసిన ప్రధాన లక్షణములవన్నింటిని ప్రదర్శించి ఉత్తమోత్తమ కథాకావ్య నిర్మాతలుగా విశ్వవిఖ్యాతి గడించిరి. కథా నిర్మాణమున ప్రధానముగా పాటింపవలసిన ముఖ, ప్రతిముఖ, గర్భ, అవమర్శ, నిర్వహణ సంధులను పాటించిరి. బీజ బిందు పతాక ప్రకరీ కార్యములు, ఆరంభ యత్న ప్రాప్త్యాశానియతాప్తి ఫలాగమములు వీరి కథాకావ్యములలో చక్కగా అన్వయించినవి "తదదోషౌ సగుణౌ సాలంకారౌ" అను కావ్యలక్షణానుగుణముగా శ్లేష, ప్రాసాదము, సమత, మాధుర్యము, అర్థశక్తి, ఉదారత్వము ఓజస్సు, సమాధి అనెడు దశకావ్య గుణములు కావ్యత్రయములలో సందర్భానుగుణముగా చక్కగా ప్రదర్శింపబడినవి.

"అనౌచిత్యా దృతే నాన్యద్ రస భంగస్య కారణమ్" అని పేర్కొనబడుటవలన సాధ్యమైనంతవఱకు ప్రధాన కథకు విచ్ఛేదము కలుగకుండ రసాలంకార పోషణలో వర్ణనలలో, ఛందః ప్రయోగంలో భాషాశైలీ ప్రయోగములో ముఫ్వురు కవులు ఔచిత్యమును పాటించిరి. సముచితస్థానములలో కైశికి, ఆరభటి, సాత్వతీ, భారతీ వృత్తులను వైదర్భి, గౌడీ, పాంచాలీప్రవృత్తులను స్వకావ్యములలో నిపుణముగా ప్రదర్శించిరి.

కథాకావ్యము సర్వజన సులభ గమ్యముగా నుండవలెననెడు లక్షణానుగుణముగా సోమదేవ, క్షేమేంద్ర బుధస్వాములు ప్రచురముగా అనుష్టుప్ ఛందస్సులో ద్రాక్షాపాకములో కథాశైలిని పదిపించిరి. "ధర్మార్థ కామ మోక్షేషు వైచక్షణ్యం కళాసుచ। కరోతి కీర్తిం ప్రీతిం చ సాధుకావ్య నిషేవణమ్" "విశ్వశ్రేయః కావ్యమ్" అను లక్షణానుగుణముగా విశ్వశ్రేయోదాయకములైన ధర్మార్థకామ మోక్ష పురుషార్థ ప్రతిపాదకములైన మనోరంజక కథలు అద్భుతముగా కావ్యత్రయములో వర్ణింపబడినవి. "జీవితం వ్యంగ్యవైభవమ్" అను లక్షణానుగుణముగా వ్యంగ్య పద్ధతిలో కాంతాసమ్మితముగా ఉపదేశించు పద్ధతిలో కావ్యత్రియములో సచ్ఛీల, దుశ్శీల కథలు అనేకములు వర్ణింపబడి పతితలను సన్మార్గగాములను గావించుచున్నవి.

బృహత్కథలోని కథలు శివప్రోక్తములని చెప్పబడుటచే కథలకు దివ్యత్వము సిద్ధించి దివ్యకథలుగా ప్రసిద్ధికెక్కినవి. అనేక విద్యాధర కథలలో వారి అద్భుత శౌర్యపరాక్రమము లిందు వర్ణింపబడినవి. అనేక భారతీయ హిందూధర్మములు ఈ కావ్యములలో కథారూపములో వర్ణింపబడినవి. కథలు అన్నింటిలో భావసౌకుమార్యము చక్కగా కనబడుచున్నది,

కథా కావ్యములో నత్యావశ్యకమైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల సామాజిక జీవనము చక్కగా కావ్యత్రయములో చిత్రీకరింపబడినది. భిన్న భిన్న మనస్తత్వములు గల స్త్రీ చరిత్ర కథలు కథాసరిత్సాగర, కథా మంజరులలో వర్ణింపబడుటచే నీ గ్రంథములు స్త్రీ చరిత్ర కోశములని చెప్పవచ్చును. హాస్యరస ప్రధానములయిన అనేక మూర్ఖ కథలు యిందు కలవు. ఇందు వర్ణింపబడిన చోరుల, ద్యూతకారుల కథలు నాటి సామాజిక స్వేచ్ఛాచారమునకు నిదర్శనములు. కథా సరిత్సాగర కథా మంజరులలో వర్ణింపబడిన రాష్ట్రపాలనలో రాజుల బాధ్యతా రాహిత్య మెక్కువగా కనపడును. అమాత్యులు ముఖ్యముగా రాష్ట్ర పరిపాలనా కార్యమును నిర్వహించుచున్నట్లు తెలియుచున్నది.

సోమదేవ, క్షేమేంద్ర, బుధస్వాములు ముువ్వురు కథా కావ్యములు సూక్తి నీతిబోధకములుగా నుండవలెనను లక్షణానుగుణముగా అనేక నీతి బోధక కథలను వర్ణించి సారాంశముగా నందలి నీతి సూక్తి వాక్యములను ప్రదర్శించిరి.

కథా సరిత్సాగరములో రమారమి 663 సూక్తులు, కథామంజరిలో 513 సూక్తులు, శ్లోక సంగ్రహములో 282 సూక్తులు కలవు. ఈ సిద్ధాంత వ్యాసములో స్థాలీ పులాకన్యాయముతో అందలి కొన్ని కొన్ని సూక్తులు ప్రదర్శించబడినవి. మత ధర్మనీతులు, వర్ణాశ్రమ ధర్మ నీతులు, రాజనీతులు, ఆధ్యాత్మిక, లౌకిక, సామాజిక నీతులు. వేశ్యా, పతివ్రతా నీతులిందు ప్రధానముగా వర్ణింపబడినవి

కథా సరిత్సాగరములో కథా మంజరిలో శైవ మత ప్రభావ మధికముగా కనబడును. శైవులు శివునకు సర్వాధికృత నావిష్క

లంచి యున్నారు. శైవ మహాత్మ్య కథలు ఇందు అధికముగా కనబడు చున్నవి. విష్ణు, బ్రహ్మలు కూడ శివునిపూజించి అభీష్టవరమును సంపాదించి నట్లిందు వర్ణింపబడిరి.

కథాసరిత్సాగరములో వర్ణింపబడిన రామకథ, వాల్మీకి రామ కథ కంటె భిన్నమైయున్నది. వాల్మీకాశ్రమవాసులు శీత శీలమును శంకించి టిటిభ మనెడు "శీలపరీక్షా సరస్సు"లో పరీక్ష కొరకు శీతను ప్రవేశింపుమని చెప్పుట, భూదేవి ఆమె సౌశీల్యమును గూర్చి చెప్పుట, పిమ్మట శ్రీరాముని వారు శపింప బూనుట అను సంఘటనలు యిందు క్రొత్తగా కనబడుచున్నవి.

కథా సరిత్సాగరము ననుసరించి రాజేరాజ్యమునకు మూలము "మహతీ దేవత్వా హ్యేషా నరరూపేణ తిష్ఠతి" అను వాక్య మిందులకు నిదర్శనము. రాజు ఆత్మ విజయుడై యుండవలెను. నాటి రాజులు అమాత్య నిరయము ననుసరించి సచివాయత్త సిద్ధులై రాజ్యపాలనము రాజ్యపాలనము చేయుచుండిరి. యౌగంధరాయణాది అమాత్యోపదేశ ముల ననుసరించిన ఉదయనాదులందులకు నిదర్శనము. యుద్ధ ములో కూటనీతి ప్రయోగింపబడుచుండెడిది బ్రహ్మదత్తుడు వత్సరాజు పక్షముపై ప్రయోగించిన విషకన్యా ప్రయోగాదు లిందులకు నిదర్శ నము. ఆర్థిక జీవనములో ధర్మానుసరణము ప్రధానముగా వర్ణింప బడినది. "ధర్మమూలాహి సంపదః" "ధర్మార్జితా లక్ష్మీః అ వంపత్య నపాయినీ" మొదలగు వాక్యము లిందులకు ఉదాహరణములు. వైశ్యులు వ్యవసాయమును, వాణిజ్యమును వృత్తి ధర్మముగా నిర్వ హించుచుండిరి. చోరాదులు దుర్నీతిచే ధనము నార్జించుచుండిరి. ఆర్థిక సంపన్నత కొరకు వైశ్యులు విదేశ సముద్రయాత్రకు ప్రాముఖ్యము

నిచ్చుచుండిరి. ఆర్య అనార్య సంపర్క జన్యములయిన శాకాహార, మాంసాహార భోజనములు రెండు కథాసరిత్సాగర కథామంజరిలో వర్ణింప బడినవి. స్త్రీలుకూడ మద్యమును సేవించుచుండిరి. తాంబూల చర్వణము సర్వ సాధారణముగా నుండెను.

సామాజిక జీవనములో సదాచార పాలనకు గౌరవమున్ననూ విలాస సుఖజీవనాభిలాషచ్చ సహజములో పెరిగి ప్రాచీన విలువలపై తీవ్ర విద్రోహభావ మేర్పడియుండెను. బ్రాహ్మణులు కూడ ద్యూతములో పాల్గొనుచుండిరి.

వర్ణ వ్యవస్థ :

వృత్తిని బట్టి జాతి ఏర్పడెను. బ్రాహ్మణులకు సమాజములో పూజ్య స్థానముండెను. "దేవద్విజ సపర్యా కామధేనుర్మతా సతామ్" అనునది యిందులకు ఉదాహరణము.

పూర్వ స్మృతి గ్రంథములందువలెనే కథాసరిత్సాగర, కథా మంజరి, శ్లోక సంగ్రహములలో సమాజములో శూద్రులకు హీనస్థాన మివ్వబడినది. "అగ్నిదత్తుని కుమారుడవై యుండి శూద్రునివలె ఆచ రించుచున్నావు." అను వాక్యము యిందులకు ఉదాహరణము. చండా నగర గ్రామములకు దూరముగా నివసించుచు సమాజ బహిష్కార ములో నుండిరి. చండాల కన్యక మనోహారిణియైనచో ఉన్నతవర్ణస్థులు కూడ ఆకృష్టులగుచుండిరి. సురత మంజరి వృత్తాంతము యిందులకు నిదర్శనము.

గృహస్థాశ్రమము సర్వోత్తమాశ్రమముగా మూడు కథా కావ్యములలో వర్ణింపబడెను.

వివాహమునకు పుత్ర సంతతికి ప్రాముఖ్య మివ్వబడెను. కథాసరిత్సాగరములో పుత్ర హీనుదయినందులకు ధనదత్తుడు చింతిల్లెను. గాంధర్వ విధిచే వివాహమయిననూ వైదిక పద్ధతిచే మరల వివాహము జరిపించుపద్ధతి యుండెను. చండ మహాసేనుడు జరిపించిన వాసవదత్తా వివాహము యిందులకు నిదర్శనము.

కథా సరిత్సాగరమున, కథామంజరిలో కౌశాంబి, ఉజ్జయిని పాటలీపుత్రము, అయోధ్య మధుర, ప్రతిష్ఠానము మొదలగు ప్రసిద్ధ నగరములు. ఉత్తర, దక్షిణ భారతదేశములో అనేక గ్రామములు ' ద్వీపములు, నదులు, పర్వత, వనప్రదేశములు మనోహరముగా వర్ణింపబడినవి.

సాధారణముగా కావ్యత్రయములో స్త్రీలపై హీనభావముండెడిది. "న పునః స్త్రీషు విశ్వాసోమతి మంత్రాద్య గోచరః" మొదలగు వాక్యము లిందుల కుదాహరణములు. వేశ్యాప్రవృత్తి అనింద్యముగా నుండెను. సహగమనాచారము పాటింపబడుచుండెను.

కథాసరిత్సాగర, కథా మంజరికాల సంస్కృతి చాలా విశిష్టమయినది. తత్కాల విశ్వాసములు స్వచ్ఛ హైందవభావ నిలయములుగా నుండెను. సమాజమున నాలుగు వర్ణముల వారుండిరి. బ్రాహ్మణులు కూడ మల్లయుద్ధములో పాల్గొనుచుండిరి. కాయస్థులు అక్రమ ధనార్జన పరులుగా నుండిరి.

వర్ణాంతర వివాహములలో బ్రాహ్మణ, క్షత్రియ వివాహములు వైశ్య - క్షత్రియ వివాహములు ప్రచురముగా జరుగుచుండెను. ఉన్నత వర్ణస్థులు శూద్రులను వివాహమాడు సందర్భములు విరళముగా వర్ణించబడినవి.

## విద్యాశిక్షణా పద్ధతి

ఆ కాలమున విద్యాభ్యాసముకొఱకు సుదూర ప్రాంతములకు కూడ వెళ్ళుచుండిరి. అధ్యయనము, అధ్యాపనము బ్రాహ్మణాధీనం లోనే యుండెను. గురుకులాశ్రమ విద్యావ్యవస్థ కొనసాగుచుండెను. దేవదత్తుడు విద్యాధ్యయనముకొఱకు పాటలీపుత్రమునకు వెళ్ళి వేద కుంభుడను బ్రాహ్మణునివద్ద విద్య నభ్యసించెను.

సన్మానరూపములో గురువులకు అగ్రహారములు ఇచ్చుచుండిరి. వలభి, తక్షశిల, వారణాశి, పాటలీపుత్రములు ప్రముఖ విద్యా కేంద్రములుగా నుండెను. వేదాధ్యయనకు ప్రధానస్థాన మివ్వ బడెను. పిమ్మట శస్త్రవిద్య మొదలగు విద్యలకు స్థానమివ్వబడెను. భిక్షాటనము బ్రహ్మచారుల దైనిక కర్తవ్యముగా నుండెడిది వీణా వాదనలో, నృత్య గీతములలో, చిత్రకళలలో స్త్రీలు నిపుణులుగా నుండిరి.

కథాసరిత్సాగర, కథామంజరి, శ్లోక సంగ్రహ కాలధర్మము మహత్త్వపూర్ణమైనది. నాడు వైదిక ధర్మము పునరుద్ధరింపబడు చుండెను బౌద్ధధర్మము నిమ్న వర్గీయ జనులకు మాత్రమే ప్రియ ముగా నుండెను. పుళింద, శబర కిరాతాదులకు ప్రత్యేక సంస్కృతి యుండెను. ఆర్య, అనార్య సంస్కృతి సమ్మిళితమై ఆర్యేతర దేవతలు కూడ వైదిక దేవతా పంక్తిలో పరిగణింపబడిరి. పుత్రకుని పాటలీ సంబంధము ఆర్యేతర సంస్కృతి మూలము.

కథా కావ్యమున పోషింపదగిన అద్భుతరసము కావ్యత్రయ ములో అనేక హాస్య శృంగార మిశ్రిత చిత్రవిచిత్ర అద్భుత కథల

ద్వారా చక్కగా పోషింపబడినది. ఇట్లే ఉపమరూపక ఉత్ప్రేక్షా తిశయోక్త్యలంకారములు మూడు కథా కావ్యములలో ఔచిత్యముగా సముచిత వర్ణనలలో సముచితముగా ప్రదర్శింపబడినవి.

పతివ్రతయైన గృహిణికూడ అగ్నికార్యము చేయుచుండెను. బ్రాహ్మణులకు విలక్షణ స్మరణ శక్తియుండెను. కాశ్మీర వాసియైన క్షేమేంద్రుడు విష్ణుస్తుతి పరక దశావతార గ్రంథమును రచించుటచే వైష్ణవమతముకూడ ప్రచారములో నుండెడిదని తెలియుచున్నది. సూర్య గణేశ కార్తికేయ పూజాస్తుతులు ప్రవర్తిల్లుచుండెడివి. బౌద్ధ ధర్మము క్షీణదశలో నున్నను బుద్ధునిపై ఆదర భావముండెడిది.

### కథావస్తువు, నాయకుడు, రసాలంకారములు

బృహత్కథా వస్తువులో ప్రధాన నాయకుడు కుబేర వరప్రసాదమున జన్మించిన నరవాహనదత్తుడు. నాయిక మదనమంజుక. నరవాహనదత్తుడు మహాకులీనత, ఔజ్జ్వల్యము, మహాభాగ్యము ఔదార్యములనెడు గుణ సంపదతో ధీరోదాత్త నాయిక లక్షణాన్వితుడై యున్నాడు. మదన మంజుకాన్వేషణలో నితడు అనేక విద్యాధర స్త్రీలను వివాహమాడి వారిద్వారా అనేక శక్తులను గౌరిముండ మానస వేగాది శత్రువులను సంహరించి అనేక అద్భుత సాహస కృత్యములను గావించి విద్యాధరచక్రవర్తి అయ్యెను. నాయకునకు మదన మంజుకా సమాగమము, ప్రతిపక్షమునకు చెందిన మానసవేగ ప్రయత్నముచే మదనమంజుకా వియోగము, మరలా వేగవతీ మొదలగు విద్యాధర కన్యల సహాయముచే మదనమంజుకా పునస్సమాగమము జరిగెనది. మదనమంజుక నాయకునితో పునస్సమా

గమమునకు సచ్ఛీలములతో నుండుటచే ఈ కథ వాల్మీకి రామాయణ కథను పోలియున్నది.

కవిత్రయ శైలి

సోమదేవుని కవితాశైలి ద్రాక్షాపాకములో అమృతాస్వాదము వలె నుండును. వినోద, చమత్కార జనకములో, వర్ణనా శిష్టులో సూక్తి ప్రయోగములో, మానవ స్వభావ చిత్రణములో, వాక్య ప్రయోగములో సోమదేవుడు మహాకవి కోటిలో చేరియున్నాడు. ఇతడు కాశ్మీరదేశ సంస్కృతిని కవితాశైలిలో ప్రదర్శించెను.

వ్యాసదాస బిరుదాంకితుడైన క్షేమేంద్రుని శైలి పౌరాణిక, సరసత్వ లాలిత్య గుంఫితము. ఇతని కవితాకామినీ సౌందర్యము గణ్యము. కథా విషయ సంక్షేపములో ఉపదేశ పరధార్మిక వ్రిష్టిబద్ధ కవితా రచనలో అగ్రగణ్యుడు ఇతడు. క్షేమేంద్రుడు బహుముఖ ప్రతిభాశాలి బహుముఖ ప్రజ్ఞాశాలి. యదార్థజీవనకవి. శేష్ఠాచార్యుడు ప్రథమగణ్యుడితడు. "కాశ్మీర ప్రాంతీయుడగుటచే ఇతని కావ్యములో గూడ కాశ్మీరదేశ సంస్కృతి మిక్కుటముగా ప్రతిబింబించుచున్నది.

నేపాల దేశీయుడైన బుధస్వామి నేపాలీ దేశసంస్కృతిని శ్లోక సంగ్రహములో ప్రదర్శించెను. ఇతని కవితాశైలిలో రసమయుత, హాస్యప్రియుత, మానవజీవిత సర్వస్వ చిత్రణ ప్రధానముగా కనబడును. ఇతని కవిత్వము మృదుమధుర శైలిలో అనర్గలధారాన్వితమై శ్రవణపేయముగా నుండును. బుధస్వామి కూడ సంస్కృత కథా సాహిత్య కవులలో సుప్రసిద్ధ కవివర్గములో ప్రఖ్యాతికెక్కియున్నాడు. ఇతని హాస్య సరస శృంగార ప్రియుత శ్లోక సంగ్రహములో చక్కగా నభివ్యక్తమగుచున్నది.

కథాసరిత్సాగరమును, కథామంజరిని, శ్లో॥ సంగ్రహమును ప్రపంచ కథాసాహిత్యములో తులనాత్మకముగా పరిశీలించినచో కథా నిర్మాణములో, కథలలో, ఆచార సాంప్రదాయములో రాజనీతిక, అర్థిక సామాజిక, మత, ఆధ్యాత్మిక, సాంస్కృతిక రంగములలో అనేకనవీన విషయములు సామ్యదృక్పథముతో బహిర్గతము కాగలవు. వైదేశిక వ్యాపారయాత్రా జనసంపర్కమువలన భారత, భారతీయేతర ఆచార సాంప్రదాయ సంస్కృతులు సమ్మిశితములై ప్రపంచమందంతట వ్యాపించియున్నవి. కథాసరిత్సాగరములోని పంచతంత్ర బేతాళ, పంచవింశత్యాది కథల ప్రపంచవ్యాప్తియే దీనికి ప్రముఖోదాహరణము. కావున నిట్టితులనాత్మక పరిశోధనలు మున్ముందు బృహత్కథపై తదనువాదములపై కొనసాగవలసియున్నది.

—o—

—: ఉపయుక్త గ్రంథసూచి :—

ఆంగ్ల గ్రంథములు


1 A Short History of Sanskrit Literature — By Ramachandra Iyyer

2 An Introduction to Metaphysics Heneree bergsa

3 Art is experience — John Duce Ee

4 Aristotles theory of Poetry and fine arts — Anu & Bucherson

5 American critical essays 20th Century

6 An outline of Indian folklore —Durgabhagavathi

7 Creative intention art and poetry -Jack Maritha

8 Contemparary indian literature S.H. Vātsyayan

9 Educational in ancient india -A.S. Altekar, 1934

10 English novel Walter Allen

11 History of sanskrit literature Mac donel

12 History of indian literature Winternitz

13 History of sanskrit literature Keith

14 " S.K.De Edited by S.N. Dusguptha 1947

15 Folklore research in India Sankersen Guptha

16 Introduction to Bruhatkatha sloka sangraha — By Felixlocate
Paris - imprimerienationale : erneet leroux
editor Rue Bhaparte, 1.6

17 Illusion and reality -Christopher Cavdwell

18 Indian kāvya literature -A.K Warder Vol-II

19 Principles of literature criticism By
E-A. Richardson & H- Weelie

20 Some principles of fiction - Robert Lidel

21 Studies in indian culture -Caudwell

2. Studies in the geography of By
ancient India D.C. Sirlar, Motilāl Benarsi das

23 Studies in Gunādhya -S.N. Prasad
Chowkamba-Varanasi-1977

24 Bauhatkathā slokasangraha By
A study Prof. V.S. Agarawala
edited by Dr P.K. Agarawala 1974

25 The kāvya-portions in the katha literature
an analysis Indwik Sternbach
Meharchand, Lachmandas-Delhi

26 The psychological Novel Leonaed

27 The novel and the ready Keitherin leacer

28 The structure of novel Edwin Muir

29 The novel and the people Rolph fox

30 The novel of the modern world David Daiches

31 The history of the english novel Ernest A Baker

32 The poetic process George

33 The nature of experience Sursola Bren

34 The psychology of society-Marin Jinswary Liveis

35 The poetic image — Sycal Deye

36 The technic of the modern english novel — By S Chatcpadhyaka

37 The use of imagination — Williamwass

38 The ocean of story — N M Penzer (10 Vol) Motilal Banarsidas Delhi

హిందీ గ్రంథములు

1) కథాసరిత్సాగర్ — ఏక్ సాంస్కృతిక అధ్యయన్
డా॥ వాచస్పతి ద్వివేది
ఎడిటర్-కరుణా త్రిపాఠి
చౌఖాంబా ఎడిషన్-వారాణాశి

2) కథాసరిత్సాగర్ — డా॥ అగర్వాల్
చౌఖాంబా ఎడిషన్-వారాణాశి

3) కథాసరిత్సాగర్
తథా భా· తీయసంస్కృతి — ఎస్.ఎన్. ప్రసాద్
చౌఖాంబా ఎడిషన్-వారాణాశి

4) క్షేమేంద్ర ఔర్ ఉన్‌కా సమీక్ష సిద్ధాంత — డా॥ శివశేఖర్ మిశ్ర సంస్కృత విభాగ్-లక్నో యూనివర్సిటీ

5) కహానీ — మంత్లీ జర్నల్

6) భారత్ సాంజకీకా సమీక్షాత్మన్ పరిశీలన్ — దేవశర్మ వేదలంకార్

7) బృహత్కథ — నీలమ్ అగ్రవాల్ ఫస్ట్ ఎడిషన్
పబ్లిషర్ కితాబ్‌మహల్ ప్రవేట్ లి.

| | |
|---|---|
| | రిజిష్టర్డ్ ఆఫీసు 56-ఎ<br>జీరో రోడ్-ఇలహాబాద్ |
| 8) సంస్కృత్ సాహిత్యకా<br>ఇతిహాస్ | బలదేవ్ ఉపాధ్యాయ్<br>వారణాసి-1968 |
| 9) సంస్కృత్ సాహిత్యకా<br>సంక్షిప్త్ ఇతిహాస్ | వాచస్పతి గైరోలా<br>చౌకాంబా-వారణాసి-1967 |
| 10) సంస్కృత్ సాహిత్యకా<br>ఆలోచనాత్మక్ ఇతిహాస్ | డా॥ బాబూరావ్ త్రిపాఠి<br>వినోద్ పుస్తక్‌మందిర్ ఆగ్రా 1873 |
| 11) నయీ కహానియా | మంత్లి జర్నల్ |